శ్రీరామచన్ద్రపరబ్రహ్మణే నమః

# శ్రీమద్రామాయణము

## వచనము

## అరణ్యకాండము.

దేవరాజసుధీప్రణీతము.



మద్రాసు.

ఆనందముద్రాయంత్రాలయమునందు

ముద్రితము.

ఆర్. వేంకటేశ్వర్ అండ్ కంపెనీవారిచే ప్రకటితము.

1911.

[*All Rights Reserved.*]

# ఉపోద్ఘాతము.



బాలకాండమున రామునియందు లక్ష్మణునికిఁ గలభక్తియు, సీతకుఁ గల ప్రేమయును సామాన్యాకారమున సంగ్రహముగాఁ జెప్పఁబడినవి. అయోధ్యాకాండమున, సమస్త రాజభోగములను దిగవిడిచి రామునిని మహారణ్యములకుఁగూడ వెంబడించుటచే, లక్ష్మణుని భక్తియు సీత ప్రేమయు, అతిశయించినవిగా, విశేషాకారమున విస్తరింపఁబడినవి. ఈకాండమున రామలక్ష్మణులు కబంధుని బాహువులం జిక్కినప్పుడు లక్ష్మణుఁడు 'మాంచ భూత బలిం దత్వా పలాయస్వ యథాసుఖమ్' 'నన్నీ బూతమునకు బలిగానిచ్చి నీవు సుఖముగాఁ బాఱిపొమ్ము' అని తనప్రాణములనేని యిచ్చి రాముని రక్షింపఁజూచుటచే, అతని కన్నయందలి భక్త్యతిశయము, అసమానమని తెలుపఁబడినది. సీతతో రావణుఁడు 'అఙ్గుళ్యాన సమోరామో మమ యుద్ధే స మానుషః। తవ భాగ్యేన సంప్రాప్తం భజస్వ వరవర్ణిని' అని రాముఁడు యుద్ధమునందు తనవ్రేలికిని సాటిగాఁడని తన్ను వర్ణించి చెప్పఁగా, ఆయమ 'క్రుద్ధా సంరక్తలోచనా। అబ్రవీత్పరుషం వాక్యం రహితే రాక్షసాధిపమ్' అని యెట్టివారికిని మనోవికారమును బుట్టించునట్టియేకాంతమున రావణునట్టివాఁడు వరించియు మనస్సు గలంగక వానిని గడ్డిపరకగా నెంచినది గాన యాయమకు రామునియందుఁ గలప్రేమాతిశయమును అసమానమని తేటపఱుపఁబడినది.

ఇందు, రావణుఁడు సీత నపహరించుట ముఖ్యవిషయము. ఇందులకు రాముఁడు రాక్షసులతోఁ బెట్టుకొన్నవిరోధమే మూలము. ఈవిరోధము ప్రసక్తించుటకై రాముఁడు రాక్షసులున్నప్రదేశమునకుఁ బోక యావశ్యకము. కావుననే మహర్షులు 'ఆనీతస్త్వ మిమం దేశ ముపాయేన మహర్షిభిః। ఏషాం వధార్థం క్రూరాణాం రక్షసాం పాపకర్మణామ్' 30 సర్గ. అని యాయాయాశ్రమములను జూపు నెపమున రామునిని లంకకు ద్వారమువంటి జనస్థానమునకుఁ దెచ్చిరి. అచట శూర్పణఖరాఁగా దాని ముక్కు సెవులు గోయుటవలన పయి నెత్తివచ్చినఖరాదులకు వధమును గావించి, దన్మూలమున రావణునికి వైరమును గలిగించి, దానంజేసి సీతాపహరణము నిష్పన్నము సేయఁబడినది. ఇదియే యవతారప్రయోజన మైనదేవతాసంరక్షణమునకు సాధన మగుసమస్తరాక్షసనాశనమునకు సన్నికృష్టకారణము.

మఱియు నిందు, రాముని శిష్టసంరక్షణవ్రతము స్ఫుటము. సీతారాముల విప్రలంభశృంగారమును సొంపుగా నుండును. జటాయు వృత్తాంతమువలన స్వామికైంకర్యపరాయణత్వమువలనియుత్యుత్తమఫలము, శబరివలన గురుశుశ్రూషవలని ప్రభావము మొదలగు విశేషములును దెలియఁబడుచున్నవి. టి. దే.

శ్రీరామచన్ద్రపరబ్రహ్మణే నమః.

# విషయసూచిక

# విషయసూచిక.

## విషయసూచిక.





# పటముల పట్టిక.



శ్రీరామచన్ద్రపరబ్రహ్మణే నమః.

# శ్రీమద్రామాయణము

## ఆరణ్యకాండము



ముఁడు *మహాధీరుఁడును మఱి దేనికిని మార్కొనరానివాఁడును గావున నితరులకుఁ దేఱి చూడ నలవి గానిమహారణ్య మగుదండకారణ్యమును బ్రవేశించి, అందుఁ గలతాపసులయాశ్రమసమూహములను గాంచినవాఁడయ్యె. అందు యాగార్థము తేఁబడిన దర్భలును, ఆఱఁగట్టఁబడినవల్కలములును అంతటను గనుపట్టుచుండెను. మఱియు నందు తపోవేదాధ్యయనాదులవలనఁ బుట్టిన తేజోవిశేషంపుసొంపు అంతటను పెంపారుచుండుటవలన, అది ఆకాశమునడుమ మిక్కిలి మిఱుమిట్లు గొన జ్వలించుచున్న సూర్యమండలమునలె రక్షోసురాదులకుఁ దేఱిచూడను రాని దై ప్రకాశించుచుండెను. అందు జాతివైరములు గలుగవు గావున సకలప్రాణులకు నది ఆశ్రయింపఁ దగినదిగానుండెను; రాక్షసభీతు లైనవారికిని వాసయోగ్యముగా నుండెను. అందు ముంగిళ్లు ఎప్పుడును జక్కఁగా నలుకఁబడి వన్నె గులుకుచుండెను. మృగములనేకము లందు నెరసి బెరసి యుండెను. పక్షిసమూహములును అంతటఁ గనుపట్టుచుండెను. అందు ప్రదేశములు మిగులరమణీయములు గా నుండును గావున నప్సరసలు గుంపులు గుంపులుగా వచ్చి నిచ్చలు నచ్చట నర్తనము సేయుచు దానిని బూజించు చుందురు. అందు విశాలములయినయగ్నిహోత్రగృహములును, స్రు

* వాల్మీకి, పూర్వకాండమున జగజ్జన్మాదికారణుఁడును వేదాంతవేద్యుఁడు నగుపరబ్రహ్మము సకలావిద్యానిరాసకత్వమును, నిత్యానందపరిపూర్ణత్వమును, నిఖిలాంతర్యామిత్వమును, నిరతిశయౌజ్జ్వల్యత్వమును, నిరుపమధర్మప్రవర్తకత్వమును మొదలైనకల్యాణగుణసమూహమును వర్ణించి యిప్పుడు సజ్జనసంరక్షణరూప మగుధర్మవిశేషమును జెప్ప నరణ్యకాండము నారంభించుచున్నాఁడు. లేక, పూర్వకాండమున పితృవచనపరిపాలన మనుధర్మము సజ్జనులవశ్యము ననుష్ఠింపవలయునని ముఖ్యముగా తెలుపఁబడినది. పిదప సజ్జనసంరక్షణరూపధర్మమును దెలుప నీకాండ మారంభింపఁబడెననియు గ్రాహ్యము.

కు మొదలయినయాగోపకరణములును, కృష్ణాజినములును, పఱచుకొనుటకు దర్భలును, సమిధలును, జలకలశములును, ఫలమూలములును, మిక్కిలి యొప్పుచుండెను. మంచిఫలములు గలిగి పవిత్రము లగుగొప్పయడవివృక్షము లందు మెండుకొనియుండెను. భూతబలి మొదలైనబలులచేతను వైశ్వదేవము మొదలైన హోమములచేతను అది పూజితమై, పవిత్రమై, వేదపారాయణధ్వనులు ఘోరు కొన, దేవతార్చనకుం దేఁబడినయడవిపువ్వులు అంతటను నివ్వటిల్ల, తామరలు గల కొలఁకులతోఁగూడి బెడఁగారుచుండెను. అందు ఫలమూలాహారులై, జితేంద్రియులునై నారచీరలును కృష్ణాజినములను దాల్చుచు, సూర్యునికిని అగ్నికిని సాటి వచ్చుచున్న వృద్ధులగుమునులు అంతటను గా వుండిరి. మఱి యామునులకుఁ బూజనీయులై పవిత్రులును నియతాహారులు నగుమహర్షులు నందు శోభిలు చుండిరి. ఇట్లు బ్రహ్మలోకమునకు సాటి యని పొగడ్తకెక్కి, కర్మకాలములందు వేదమంత్ర ఘోషములు సెలంగుచుండ, బ్రహ్మజ్ఞానులును మహాభాగ్యవంతులును నగుబ్రాహ్మణులు సొంపు గూర్ప పెంపారు చున్నయాఋష్యాశ్రమసమూహమును మహాతేజం డగు నాశ్రీమంతుండు రాముఁడు గాంచి వింటిమోపు దించి యయ్యాశ్రమంబుల కెదురువోయెను. * ఆమహర్షులు దివ్యజ్ఞానసంపన్నులును అలౌకికవిషయముల నేని సాక్షాత్కరింప సమర్థులును నగుదురు గావున, రామునియవతారరహస్యజ్ఞానము గలవారు గావునను, రాముఁడు నారాయణావతారం బనియు సీతాలక్ష్మణులు మహాత్ములనియు నెఱుఁగుటంజేసి మిక్కిలి ప్రీతి గలిగి రామునిని లక్ష్మణునిని కీర్తిమతి యగు సీతను జూచి ప్రీతి మీఱ నెదుర్కొనిచనిరి. † ధార్మికులును దృఢవ్రతులు నగున

---

*ఇందులకు 'దివ్యజ్ఞానోపపన్నాస్తేరామం దృష్ట్వా మహర్షయః।అభ్యగచ్ఛం స్తథాప్రీతా వైదేహీంచ యశస్వినీమ్' అని మూలము. (దివ్యజ్ఞానోపపన్నాః) లోకవిలక్షణమైన జ్ఞానముగలవారు-అనఁగా రాముఁడు రావణవధార్థము అవతరించినవిష్ణుఁడు, సీత లక్ష్మి,లక్ష్మణుఁడు అతనియంశము,అనుజ్ఞానము గలవారు,(మహత్ ఋషయః) అలౌకికతత్త్వములను సాక్షాత్కరింప సమర్థులు. కావున నే వారు (ప్రీతాః) ప్రీతిరూపమైనభక్తి గలవారై, (అభ్యగచ్ఛన్) రామున కెదురుచనిరి.

† 'తేతం సోమ మివోద్యన్తం దృష్ట్వా వైధర్మచారిణః।లక్ష్మణంచైవ దృష్ట్వాతు వైదేహీంచ యశస్వినీం । మఙ్గళాని ప్రయుఞ్జానాః ప్రత్యగృహ్ణన్ దృఢవ్రతాః।' అని మూలము. విశేషార్థము:-(తే) త్రికాలజ్ఞులయిన ఆమునులు,(తం) రాక్షసుల నడఁచుటకై యవతరించినయారాముని,(ఉద్యన్తం సోమ మివస్థితం) చీకటిని పోఁగొట్టుటకై పొడుచుచున్న చంద్రునివలె నున్నవానిని-లేక (ఉద్యన్తం సోమ మివ)ప్రథమనాఁడు క్రొత్తఁగా పొడసూపుచున్న చందురునివలె అర్చింపఁదగినవానిని-లేక వనసమూహపుటొంపములోపల వర్తించుటచే మేఘములు గప్పినచందురునివలె నున్నవానిని, (ధర్మచారిణః)ధర్మముల నాచరించునామునులు, (దృష్ట్వా)చూచి-తా మాచరించుచున్న ధర్మమున కారాధ్యుఁడైనవానిని ప్రత్యక్షముగాఁగని-లేక యింతకు మునుపు ధర్మబలమునఁ జూచుచుండిరనియు నిపుడు కన్నులార సందర్శించువారైరనియు నర్థము,(తథాలక్ష్మణంచ వైదేహీంచ దృష్ట్వా) అట్లె లక్ష్మణుని సీతను జూచి, (మఙ్గ

మ్మహర్షులు ఉదయించు చున్నచందురునివలె నున్నరాముని లక్ష్మణుని యశస్స్వి ని యైనసీతాదేవిని జూచి వారలకు మంగళాశాసనములు గావించుచు రాఁబట్టుకొనిరి.'*వనవాసులు రాముని మేనికట్టుదిట్టమును,మొత్తమునకుఁ దళుకొత్తుచున్న కాంతి సొంపును మెత్తందనమును,తగినసింగారంపుపెంపును,తమ ముఖభావంబులం దాశ్చర్య మచ్చుపడఁ జూచిరి.†ఇంతేకాక యౌవనచారులందఱును సీతను, లక్ష్మణుని,రాము

---

ళాని ప్రయుఞ్జానాః)తా మపేక్షించినరక్షణమును ప్రార్థించుటకుముందే మంగళాశాసనములు సేయువారై-లేక రాముని సౌందర్యసౌకుమార్యాదులను జూచి రాక్షసులు మిక్కిలి యున్నయావనమున వాని కేమిగలుగునోయని వ్యాకులతపడి యతనివిరోధులెల్లఁ దూలునట్లు ఆశీర్వచనములు చెప్పుచు,(దృఢవ్రతాః) అతఁడే తమకు రక్షకుఁడనునియమమును గట్టిగాఁబూనినవారై, (ప్రత్యగృహ్ణన్) రాఁబట్టుకొనిరి. ఎదుర్కొని పండ్లు మొదలైనవి యిచ్చి యుపచరించి రనుట-గోవిందరాజులు.

లేక:—(తే)ఆఋషులు, (మఙ్గళాని ప్రయుఞ్జానాః) 'మంగళములగుఁగాక' అని ఆశీర్వచనములు సేయుచు, (ఉద్యన్తం సోమమివ) ఉదయించుచున్నచంద్రునివలె సకలజగత్తులకును ఆనందకరుఁడైన (తం) ఆరామునే, (ప్రత్యగృహ్ణన్) తమయిష్టదైవతముగా స్వీకరించిరి- మహేశ్వరతీర్థులు.

లేక:—ఆఋషులు,(ఉద్యన్తంసోమమివ) ఉదయించుచున్నచందురునివలె కన్నులపండువైనవానిని, ఇచట సోమశబ్దమునుబట్టి 'తస్మాత్సోమ రాజానో బ్రాహ్మణాః' 'కాఁబట్టి సోముఁడు బ్రాహ్మణులకు రాజు' అనుశ్రుతిచొప్పున ఆబ్రాహ్మణులు తమకులరక్షకుం డగుసోమునివలె తమకు రక్షకుండును ధర్మచారియునగు రాముని జూచి లక్ష్మణునిని జూచి,(యశస్వినీం) పాతివ్రత్యయశస్సుగలదైన-లేక రాక్షసకులసంహారమునకు తాను హేతువగుటచే కీర్తిగాంచినదైన-సీతనుజూచి ఆశీర్వాదములను జేసిరని యర్థము. వారు వీరిని ఇట్టివారినిగా కనుఁగొనుటంబట్టియే మీఁద రాముని తమ్ము రక్షించునట్లు ప్రార్థించుట పొసఁగుచున్నది. తిలకము.

*ఇందులకు 'రూపసంహననం లక్ష్మీంసౌకుమార్యం సువేషతాం' అనిమూలము.(రూపం) అనఁగా అఙ్గాన్యభూషితాన్యేవ ప్రేక్షణీయై ర్విభూషణైః । యేన భూషితవ ద్భాతి తద్రూపమితి కథ్యతే 'భూషణములచే నలంకరింపఁబడకయే, అలంకరింపఁబడినదానివలె ప్రకాశించునది రూపమనఁబడును అనెడిరూపమును, (సంహననం) సౌందర్యమును-'అంగప్రత్యంగకానాం యః సన్నివేశో యథోచితః। సుశ్లిష్టసంధిబంధః స్యాత్తత్సౌన్దర్యమిహోచ్యతే' అంగములును ఉపాంగములును ఒకటొకటి తగునట్లుగా అమర్పుగలిగి, ఒకటితోనొకటి గుత్తముగా జతపడియుండుట సౌందర్యమనఁబడును. (లక్ష్మీః) కాంతియు-లావణ్యమనుట 'ముక్తాఫలేషు ఛాయాయా స్తరళత్వమివాన్తరా । ప్రతిభాతియదఙ్గేషు లావణ్యం తదిహోచ్యతే' 'ముత్తెములందు తళతళలాడుచున్నకాంతివలె అవయవములందు ప్రకాశించుకాంతి లావణ్యమనఁబడును', (సౌకుమార్యం) పూవు వికసించునట్లు కోమలముగానుండుట. (సువేషతాం) తగిన శృంగారము గలిగియుండుట.

† ఇందులకు 'వైదేహీం లక్ష్మణం రామం నేత్రై రనిమిషైరివ । ఆశ్చర్యభూతాన్ దదృశు స్సర్వే తే వనచారిణః' అని మూలము.'ఆశ్చర్యభూతాః' అని మహేశ్వరతీర్థపాఠము. వనమందు చరించుపశుపక్షిమృగాదులన్నియును ఆశ్చర్యముగొని రామాదులనుజూచినవనియర్థము. బ్రహ్మాదులకు గోచరింపని భగవంతుఁడురాముఁడు సీతాలక్ష్మణసహితుఁడై పంగువు (ఈఁచఁబోయినకాలివాని)మీఁద గంగాప్రవాహమన్నట్లు మాముందట పొడసూపెనుగదాయని సకలజగన్మోహనమైనరాముని దివ్యమంగళవిగ్రహమును దర్శించుటవలని యానందము ఎడతెగకుండ వలయునని ఱెప్పలు నల్లార్పక మృగాదులు కూడ ఆశ్చర్యభూతములై చూచిన వని భావము. మహేశ్వరతీర్థులు.

ని జూచి యింతవఱ కెన్నఁడును తా మట్టివారిని జూచినది లేదు గాన మిక్కిలి యాశ్చర్యపడి ఱెప్పపాటులేనివారివలె కన్నులంతయు నెడ తెగక విచ్చి వారిని జూచిరి. ఆయాశ్రమమండలమున మహాభాగు లైనయామునులు సకలభూతహితపరాయణుఁడగు రాముఁడు అతిథియై రాఁగా నతనిని తమతమపర్ణశాలలకుఁ గొనిపోయి నిలుపుకొనిరి. అగ్నివలె వెలుంగుచున్న మహాభాగులు ధర్మచారు లగునామునులు రాముని న్యాయముచొప్పున కుశలప్రశ్నాదు లడిగి యర్ఘ్యాదులకై, జలమును దెచ్చిరి. *ఆధర్మవిదులు మహాత్ముఁడగు రామునకు వనమునందుఁ గలిగినపుష్పములను ఫలములను మూలములను తమయాశ్రమమును 'ఇవన్నియు నీసొంతమే. ఇచ్చచొప్పున వినియోగించుకొనుము' అని నివేదించి చేతులు మోడ్చి యతనితో "మహాయశుండ వగు నీవు వర్ణాశ్రమధర్మపాలకుండవుగాన ఆర్తులైనయీమునిజనులకందఱకిని శరణ్యుఁడవు. దేవతగాఁ దలఁచి యర్చింపఁదగినవాఁడవు. రాజుగా నెన్ని గౌరవింపనుందగినవాఁడవు. ఏలనఁగా †రాజు దుష్టనిగ్రహకర్త. రాజు గురుండు. 'నా కిట్టిపూజ్యత్వ మెట్లు' అందువా? రాఘవా! ‡రాజు భూలోకమున దేవేంద్రునినాలవభాగంబునను తక్కినదిక్పాలురయంశంబులనునైనవాఁడై ప్రజలనురక్షించును కాఁబట్టి యతఁడు శ్రేష్ఠములైనభోగములను అనుభవించుచున్నాఁడు; లోకనమస్కృతుం డగుచున్నాఁడు;

*ఇందులకు 'మూలం పుష్పం ఫలం వన్య మాశ్రమంచ మహాత్మనః। నివేదయిత్వా ధర్మజ్ఞాస్తతః ప్రాంజలయో౽బ్రువన్' అని మూలము. విశేషార్థము:—(ధర్మజ్ఞాః) ధర్మమును దెలిసినవారు-శేషియందు-స్వామియెడల ననుట, శేషవృత్తిరూపమైన-సొమ్మువలె ఇష్టవినియోగపాత్రమైయుండుట యనెడి-ధర్మమును తెలిసినవారనుట - గోవిందరాజులు. (ప్రాంజలయః) ఇతఁడే ఆదిపురుషుఁ డనునిశ్చయబుద్ధిచేత భక్తిరసముప్పతిల్లఁగా బద్ధాంజలులై రనిభావము. మహేశ్వరతీర్థులు.

†రాజు, దుష్టనిగ్రహకర్తయగుటచే మాన్యుఁడనియు గురుఁడగుటచే పూజ్యుఁడనియు-గోవిందరాజులు. భగవదవతారరూపుఁడగుటచే గురుండని-మహేశ్వరతీర్థులు.

‡దిక్పాలురు నలువురిలో ఒక్కొక్కరినుండియు నాలవపాలు రాజునందు తగిలియుండు ననున్యాయమిట అనుసంధింపవలయును. ఇచట 'ఇంద్రస్యైవ చతుర్భాగః ప్రజా రక్షతి రాఘవ!' అని మూలము. యథార్థమునకు ఇంద్రశబ్దము పరమాత్మపరమైనది 'ఇది పరమైశ్వర్యే' అనుధాతువునుబట్టి పరమైశ్వర్యవంతునికి వాచకమగు ఇంద్రశబ్దము భగవంతునియందు ముఖ్యవృత్తము గావునను 'ఇంద్రో మాయాభిః పురురూప ఈయతే' అని శ్రుతియు ఇంద్రశబ్దమును పరమాత్మపరముగా ప్రయోగించుటవలనను పరమాత్మయే యర్థము కాఁదగును. కనుక (ఇంద్రస్య చతుర్భాగః) పరమాత్మయొక్క యవతారభూతములైన వ్యక్తులు నాలుగింటిలో ఒకవ్యక్తియైననీవు, (భోగాంభుఙ్క్తే) భోగముల ననుభవించుచున్నావని యర్థము. పూర్వోత్తరశ్లోకములకును ఈయర్థమే అనుగుణముగానున్నది. ఎట్లనఁగా ఋషులు పరమాత్మునిగా తలఁపక మఱొకరినిగా గ్రహించియుండిరేని యప్పుడు అంజలి సేసియుండరు; ఆశ్రమమును అప్పగింపరు; ఇఁక ముందు నీబిడ్డలమనియు చెప్పుకొనరు దీనింబట్టి ఇంద్రశబ్దము కేవలము పరమాత్మపరమే యగుట పూర్వోత్తరములకు ఉపపన్నముగానున్నది. గోవిందరాజులు.

*ఇట్లు ఆర్తులైన మేమందఱము నీదేశమున నుండువారము గావున నీకు మమ్ము ర
వలసియున్నది. పట్టణముననున్నను వనముననున్నను జనాధిపుఁడవైననీవే    రా

టీక:—'ఇంద్రస్యచతుర్భాగః' అనుటకు 'నీనియమమునకు లోనయిన యింద్రునియొక్క నాలవయంశమైన రాజుగూడ ప్రజలను ధర్మమున రక్షించుచున్నాఁడు- అట్లు రక్షించుటనుబట్టి మేలయిన భోగముల ననుభవించుచున్నాఁడు; లోకనమస్కృతుఁడు నగుచున్నాఁడు. ఇట్టిరాజునకే యింత ప్రభావముగలదేని, సకలజగద్రక్షణముకొఱకు నవతరించినయీశ్వరుండవగునీకు ధర్మపరిపాలకత్వము శరణ్యత్వము మొదలైనవి గలవని చెప్పవలయునా' యని భావము. మహేశ్వరతీర్థులు.

* ఇందులకు 'తే వయం భవతా రక్ష్యా భవద్విషయవాసినః । నగరస్థో వనస్థో వా త్వం నో రాజా జనేశ్వరః' అని మూలము. విశేషార్థము:-మమ్ము నీవురక్షించుటకు నీదేశమున మేముండుటయె యుపాయములేని కారణమనుచున్నారు. (తేవయం) ఆర్తులైన మేము, (భవతా) ఆర్తులను రక్షింప దీక్షఁబూనిన నీచేత, (రక్ష్యాః) రక్షింపఁబడఁదగినవారము. మాయుపాసనబలమునుబట్టి నీకు రక్ష్యులము గాము. (భవద్విషయవాసినః) నీదేశమునందు వసించువారమగుటయే నీకు రక్ష్యులమగుటకు హేతువుగాని మఱొకటిగాదు. ఉపాసనాదులందు ప్రమాదము కలుగవచ్చును. నీదేశమున వసించుటయందు ప్రమాదముకలుగదు. కనుక భవద్దేశవాసిత్వమే నిష్ప్రమాదమైన హేతువగునుక నిట్టిహేతువును బట్టి మమ్మురక్షింపఁదగుననుట. 'అట్లేకానిందు మేము రక్షణము నేయుప్రదేశమున నుండునప్పుడు రక్షించెదను' అని రాముఁడనుననితలఁచి చెప్పుచున్నారు:-(నగరస్థోవా) నగరమందు-అనఁగా సింహాసనమందు ఉండిననుగాని (వనస్థోవా) అడవియందు. అనఁగా సింహాసనమందు లేకున్ననుగాని, (త్వం) స్వతస్సిద్ధసర్వశక్తియు నిరుపాధికసర్వశేషియునగు నీవు, (నః) మాకు, (రాజా) రక్షకుఁడవు. ఏలనఁగా (జనేశ్వరః) నిరుపాధికముగా సకలమైనవారికిని శేషివి. గోవిందరాజులు.

టీక:—(తే) పూర్వోక్తప్రకారమున ఆత్మాత్మీయభరములను, అనఁగా తమ్మును తమసొమ్మయినవానిని-రామునియందు సమర్పించినట్టివారును, (వయం) ఉపాయశూన్యులై అపాయములు మిక్కిలి కలిగియుండుట మొదలగులక్షణములు గలవారమును అగు మేము, (భవతా) నిరుపాధికలోకశరణ్యుఁడవగు నీచేత, (రక్ష్యాః) రక్షింపఁబడఁదగినవారము. 'నేను నిరుపాధికసర్వశరణ్యుఁడనుగావున మిత్రోదాసీనశత్రువులనుగూడ రక్షింపవలసినవాఁడను' అని అతిప్రసంగము గలుగఁగా పరిహరించుచున్నారు:—(భవద్విషయవాసినః) నీదేశమునందు వసించియుండువారము కాఁబట్టి మేము నీకు రక్ష్యులమనుట. సాకేతమునందు పుట్టినచరాచరజంతువు దేనికిఁగాని ప్రపత్తి నపేక్షింపకయే రక్షణము కలుగునట్లు, రామదేశవాసులగు మాకును ప్రపత్తి యక్కఱలేక మీదేశమందుండుమాత్రముచేతనే రక్షణము కలుగవలయునని భావము. ఇచట 'విషయవాసినః' అనుటంబట్టి ప్రపత్తి నపేక్షింపకయే రక్షణము కలుగవలయునని యొకపక్షము. పూర్వోత్తరశ్లోకములంబట్టి ఆత్మాత్మీయభరసమర్పణము చేసియుండుటవలన ప్రపత్తిమూలముగానే రక్షణముగలుగవలయునని మఱియొకపక్షము. మొదట ఆత్మాత్మీయరక్షాభరమును సమర్పించుటచేతనే ప్రయోజనము (అనఁగా రక్షణము) సిద్ధింపఁగా విషయవాసిత్వమును జెప్పుట వ్యర్థమేకదాయని శంకింపరాదు. రక్షకుఁడు చూచుచుండఁగా వతినిసన్నిధానముననే రక్ష్యమునకు నాశముగలుగుట మిక్కిలియు దోషముగావున ఎక్కడనోకాక నీదేశమునందే నీకమలముందే రక్ష్యులమైన మాకు నాశము గలుగుట నీకు మిక్కిలి దోషావహమనిచెప్పుటకే విషయవాసిత్వము చెప్పఁబడినది గావున వ్యర్థముగాదు. మఱియు విషయవాసిత్వము నిరపేక్షసాధనమే యగునని నిర్బంధమున్నను అది కేవల

జవు. రాజా! 'మీరు మీతపఃప్రభావమున రక్షించుకొనరాదా' యందువేని *మేము జితేంద్రియులము గావున మాకుఁ గోపము గలుగదు. మఱియు తపోనాశము గలుగునను భయమునఁ గోపమును అడఁగంద్రొక్కియున్నవారము. కనుక కోపమున శాపము పెట్టి దండము సేయుట దిగవిడిచినవారము. తపము సేయుచుండువారము. నీబిడ్డలవంటివారము గావున నీవు మమ్మెప్పుడును తప్పక రక్షింపుచుండవలయును" అనిరి. ఆమహర్షులిట్లు చెప్పి వన్యము లగుపుష్పములచేతను ఫలములచేతను మూలములచేతను మఱియును సంకల్పసిద్ధము లైనతక్కినవివిధాహారములచేతను రామునిని లక్ష్మణునిని బూజించిరి. అట్లే తపస్సిద్ధులును అగ్నిహోత్రసమానులును శాస్త్రోక్తాచారసంపన్నులు నైనయితరమహర్షులును న్యాయముచొప్పున ప్రభుం డగురాముని స్తోత్రాదులం బూజించినవారైరి. ఇది ప్రథమసర్గము.

మోక్షవిషయమునందే నిరపేక్షసాధనముగాని మోక్షవ్యతిరిక్తమైన రక్షణమందు అది ఉపాయమగుట వలన విరోధ మేమియు లేదు. ఏలన నిచట మహర్షులు ఉపాయము ననుష్ఠించుట మోక్షము నపేక్షించికాదు; దుష్టరాక్షసనిరసనము నపేక్షించియే. కాన మోక్షమునకుఁ గాక యిట్టిరక్షణమునకై విషయవాసిత్వమునుగూడ చెప్పుట వ్యర్థము గానేరదు. (నగరస్థో వనస్థోవా) తక్కిన మూర్ధాభిషిక్తులు బుద్ధిబలమునను స్థానబలమునను, చతురంగబలమునను, తమరాజ్యమును మాత్రము రక్షింప సమర్థులగుదురు. సకలలోకరక్షణధురంధరుఁడును, అసహాయశూరుఁడునగు నీకో నగరవాసముచే బలమెచ్చెడినా? వనవాసముచే అది తగ్గునా? స్వాభావికనిత్యనిరతిశయశక్తిసంపన్నుఁడ వగు నిన్ను కీడ్పఱుచునది ఏదియులేదనియర్థము. సోపాధికుఁడైన శేషికే దేశవిశేషాదిసంబంధము కావలయును. నిరుపాధికశేషియగు నీకో యిట్టి సంబంధ మక్కఱలేదు. కాన యెచ్చటనుండినను గాని మమ్ము నీవు రక్షింపవలసినదే యని రాజశబ్దార్థము.

*ఇందులకు మూలము 'న్యస్తదణ్డావయం రాజన్ జితక్రోధా జితేన్ద్రియాః। రక్షితవ్యాస్త్వయా శశ్వద్గర్భభూతా స్తపోధనాః' (న్యస్తదణ్డాః) త్యజించిన దండముగలవారు - శపముచే నిగ్రహము సేయనివారు, దీనికి హేతువు-(జితక్రోధాః) తపస్సునశించునని క్రోధమును వదలినవారు, ఇందులకు హేతువు, (జితేంద్రియాః) ఇంద్రియజయముచే కామాదులందు సంగములేనందున తన్మూలమైనకోపమును లేనివారనుట-మాకు సామర్థ్యముండియు స్వరూపవిరుద్ధము గావున మారక్షణము మేమే చేసికొనరాదనిభావము. (త్వయా రక్షితవ్యాః) నీవుతప్ప మఱియొకరు మాకు శరణముగానేరరనుట, (గర్భభూతాః) బిడ్డలతో సాటియైనవారము- దీనిచే అనన్యార్హశేషత్వము చెప్పఁబడినది. (శశ్వత్) ఎప్పుడును అట్టివారమనుట, ఇది రక్షితవ్యశబ్దముతోను గర్భభూతశబ్దముతోను అన్వయించుచున్నదిగావున మా అనన్యార్హశేషత్వమును అనన్యశరణ్యత్వమును ఒకప్పుడు వచ్చునవి గావు, ఎప్పుడును స్వాభావికములైయుండునవే యనుట. అయినను సాధనములేక ఊరక రక్షించుటవలన అందఱిని రక్షింపవలసివచ్చునే యని అతిప్రసంగము కలుగఁగా చెప్పుచున్నారు. (తపోధనాః) 'తస్మాన్న్యాసమేషాం తపసామతిరిక్తమాహుః' అన్నట్లుతపస్సు అనఁగా న్యాసముగనుక మేము ప్రపత్తియె ధనముగాఁ గలవారమనుట- మేముచేయుప్రపత్తిని నిమిత్తముగాఁగొని మమ్మురక్షింపుమనుట. ఇచట రక్షణమనఁగా మోక్షమునొసఁగుటయె. ఖరాదులనుండి రక్షించుట శరభంగాశ్రమవాసు లగు మునులే చెప్పఁగలరు. ఈమునులో మోక్షైకపరాయణులు గావున మోక్షప్రాపణమే వీరికి రక్షణము.

విరాధుని జూచుట; విరాధుఁడు సీతను బట్టికొనుట; విరాధునికిని రామలక్ష్మణులకును సంభాషణము.

రాముఁ డంత నామునులవలన నాతిథ్యమును బడసి సూర్యోదయము కాఁగానే కాల్యకరణీయములఁ దీర్చికొని వారినందఱిని వీడ్కొని యడవినే చొచ్చి పోయెను. ఆయరణ్యమునడుమ నానావిధము లయినమృగములు నెరసియుండెను. పెద్దపులులును తోఁడేళ్లును అందందు కనుపట్టుచుండెను. అందలివృక్షములును లతలును గుల్మములును చెల్లచెదరై కొలఁకులు చూడ నసహ్యములై యుండెను. నానావిధముల గుపక్షులు లచట భయమున కూఁతలిడక నిశ్చలములుగా నుండెను. ఈలపురుగులు కీయని కూయుచుండెను. లక్ష్మణుఁడు వెంటనంటి రా రాముఁడు పోవుచు నిట్టివనమధ్యమును గాంచెను. రాముఁడట్లు సీతాలక్ష్మణసహితుఁడై పోవుచు, భయంకరమృగములు గలయాయరణ్యమునందు పర్వతశిఖరమువలె పొడవుగా చూపట్టుచు పెనుధ్వని చేయుచున్నయొక రాక్షసునిఁ జూచెను. వాఁడు మిక్కిలి లోఁతయినకన్నులును పెద్దనోరును, వెడలు పయినకాయమును హెచ్చుతగ్గులుగా నుండుకడుపును గలిగియుండెను. వాని యొడలంతయు రక్తమాంసములంటియుండుటచే మిక్కిలి రోఁతఁ బుట్టించుచుండెను. వాఁ డొకటి కొకటి యెచ్చుతక్కువలుగా నున్నయవయవములతోఁ గూడి మిక్కిలిపొడవైన రూపున వికారవేషముతో భయంకరముగాఁ గనఁబడుచుండెను. మఱియు నెత్తుటను నంజుళ్లను దోఁగిన పులితోలును దాల్చి సకలభూతభయంకరముగా నోరు దెఱచుకొని యమునివలె చూపట్టుచుండెను. మూఁడుసింహములను నాలుగుపెద్దపులులను, రెండుతోఁడేళ్లను, పదిజింకలను, క్రొవ్వు గ్రమ్మి కొమ్ములతోఁ గూడి యున్నగొప్పయేనుఁగుతల యొకటియును, వాఁ డినుపశూలమునఁ గ్రుచ్చి పట్టుకొని మిక్కిలి బిగ్గఱఁగా నఱచుచుండెను. వాఁడు రామునిని లక్ష్మణునిని సీతనుం జూచి మిక్కిలి క్రుద్ధుఁడై సంహారకాలమున యముఁడు ప్రజలపయికి వచ్చునట్లు వారలపయికి నురవడించెను. వాఁడు భూమినంతయుఁ గదల్చునట్లు భయంకరధ్వని గావించి *సీత నెత్తి చంకనిడికొని యావలికిం బోయి రామలక్ష్మణులనుజూచి,

* విరాధుఁడు సీతను పట్టుకొనుట తనపాపములను పరిహరించుకొనుటకే కాని భార్యయనుబుద్ధిచేఁ గాదు. కావున నెస్కాందము: 'సోఽపి తాం జానకీం దృష్ట్వా శీఘ్రం సంజాతవిక్రమః। ఇయం పరామహాశక్తిస్సేయం స్వర్గస్యకారణం। అస్యావిబోధో మోక్షేపి కారణం బంధనేపిచ। తస్మాదిమాం భజిష్యామి దిష్ట్యా ప్రాప్తం హిదర్శనమ్। ఇతిదర్శనమాత్రేణ విముక్తాఘౌఘపంజరః। భక్తియుక్తో జహారైనాం సీతాం చైతన్యరూపిణీమ్' "వాఁడును సీతనుజూచి వేగ పరాక్రమించి 'ఈయమ పరమహాశక్తి. ఈమె స్వర్గప్రాప్తికి కారణము. ఈమెబోధము మోక్షమునకును బంధమునకును గారణము. కాన యీమెను సేవించెదను. దైవికముగా ఈమెదర్శనము ప్రాప్తించినది' అనిదర్శనమాత్రమున గూఁడువలె తన్ను బంధించియుండిన పాపసమూహ మెల్ల వీడినవాఁడై భక్తితోడ చైతన్యరూపిణియగు నాసీతనుబట్టుకొనెను" అని యున్నది.

'మీరు జడలును నారచీరలను దాల్చి యొక స్త్రీని వెంటఁ బెట్టుకొని వింటిని బాణములను కత్తులను దాల్చి మీయాయుస్సు తీఱుటవలన నీదండకారణ్యములోనికి వచ్చితిరి. నాచేతఁ జిక్కి మీయుసుఱు దక్కదు. మీరు ఋషులే! మఱి స్త్రీతో నెట్లు గాఁవున్నారు ? మునివేషము వేసికొని, మునివృత్తికి విరుద్ధముగా విల్లు మొదలైనవి దాల్చి, యధర్మము నాచరించుచున్న పాపులరు మీ రెవ్వరు? నేను విరాధుఁడను పేరు గలరాక్షసుఁడను. నేనాయుధములను బట్టి ఋషులం జంపి వారిమాంసంబును దినుచు నెప్పుడును ఈఘోరరానివనమునఁ దిరుగుచుందును. మంచిపిఱుఁదులు గలయీపడఁతి నాకుభార్య కాఁగలదు. యుద్ధమున పాపాత్ములగుమీరక్తమును బట్టి త్రావెదను' అనెను. దురాత్ముఁడగు విరాధుఁడు దుష్టముగా నిట్లుపలికిన యాకావరంపుమాటలను విని జనకరాజకుమారి సీత మిక్కిలి తొట్రుపడుచు భయమున వెనుగాలికి నరఁటిచెట్టువలె గడగడవడంకెను. రాముఁడు విరాధునిచంకం జిక్కియున్న శుభాత్మురాలిని సీతను జూచి, నోరెండ, లక్ష్మణునిం జూచి 'సౌమ్యా! జనకమహారాజుకడుపునం బుట్టి మంచియాచారవతియై మిక్కిలియుగోముగాఁ బెరిఁగినయీరాజకుమారి, పాతివ్రత్యమున మిక్కిలికీర్తి గాంచినయీసీత, నన్ను చేపట్టినయిల్లాలు, విరాధునిచంకం జిక్కియున్నది చూడుము. *లక్ష్మణా! కైక మనవిషయమై యేమియభిప్రాయము గలిగియుండినదో, మఱి వరములనెడి నెపమున దేనిని ప్రియపడి యడిగినదో, అదియంతయు నిపుడే శీఘ్రముగానే యాకె కొనఁగూడినది. ఎవ్వతి, దవ్వులచూపుగలదై తనకొడుకునకై రాజ్యమువచ్చుటతో తృప్తినొందదయ్యెనో, యట్లు దానితో తృప్తినొందక సర్వభూతహితుం డగునన్ను అడవికిని బంపినదో, అట్టినానడిమితల్లి †కైకకోర్కి యీనాఁటికి నిపుడే ఫలించినది. లక్ష్మణా! నాకు సీతను పరపురుషుఁడు

*'కైక తనకొడుకునకు రాజ్యమునుమాత్రమే కోరినదేని దానినే యడిగియుండునుగాని, నావనవాసమును అడుగదు. అయితే నావనవాసమును అడుగుటంబట్టి నాకుఁదోఁచుచున్న దేమనఁగా:-ఆయమ, దూరదృష్టిగలదై తనకొడుకునకు, రాజ్యములభించియు అది నేనుండువఱకు నిష్కంటకముగానుండదని యెంచి యందులకై నన్ను అడవికిఁ బంపునట్లును, నేనడవికిఁ బోఁగా సీతనన్ను విడువక వెంబడించుననియు, సీతను రాక్షసాదులు అడవిలో అపహరించుకొనిపోఁగా నేను మిక్కిలివ్యసనముపాలై చెడుదుననియు తదప తనకొడుకునకు రాజ్యము నేనులేనందున నిష్కంటకమగుననియు, ముందుగా నేయాలోచించుకొని యిట్లు నన్నడవిపాలుసేసినది. ఆమెయభిప్రాయముచొప్పుననే సీతయు నపహరింపఁబడినది' అని రాముని యాశయము.

† భరతుఁడును కైకయును అరణ్యమునకువచ్చి రాముని తమనేరమును మన్నింప వేఁడుకొనుటంబట్టి యింతకుఁ బూర్వము వారుచేసినది అజ్ఞానమువలన నని తెలియుచుండఁగా మరల రామలక్ష్మణులు వారిని రాజ్యము నపహరించినవారని చెప్పఁదగునో? యని యడుగవచ్చును. వెనుక కైకేయి అట్లు అడుగుకొన్నను మొదట అపహరించుటనే చింతించినట్టిది గావునను అట్లే తప్పక జరిగినదిగావునను, ఇప్పటిదుఃఖకాలమున రామలక్ష్మణులు వారిని తమరాజ్యము నపహరించిరి యట్లే తలఁచిరిగాన దోషములేదు,

తాఁకుటవలనం గలుగునంత దుఃఖము పితృవియోగమునఁగాని నారాజ్యము పోవుట వలనఁగాని కలుగలేదు' అనెను. ఇట్లు రాముఁడు దుఃఖితుండై కన్నీళ్లం దొప్పఁదోఁగుచుఁ జెప్పఁగా లక్ష్మణుఁ డతనిశోకమును జూచి క్రుద్ధుఁడై మంత్రమూలమున కట్టుపడిన సర్పమువలె నిట్టూర్పులు విడుచుచు రామునితో *'కాకుత్స్థా! నీవు సమస్తలోకములకును నాథుండవు; దేవేంద్రునకు సరివచ్చువాఁడవు; మఱి చెప్పినపని సేయుటకు నేనును సన్నిధానముననే యున్నాఁడను. ఇట్లుండఁగా నీవిట్లు అనాథునివలె పరితపించెద వేల? ఇపుడు క్రుద్ధుండ నయిన నేను బాణమున నీరాక్షసుని విరాధునిఁ జంపి వీనిరక్తమును భూమి త్రావునట్లు సేసెదను. రాజ్యమును గోరినభరతునిపై నాకుఁ గలిగిన కోపమంతయు, ఇంద్రుఁడు పర్వతముపై వజ్రాయుధమును ప్రయోగించునట్లు, విరాధునిపయి విడిచెదను. నేను నాబుజముల బలముకొలఁదిని వేగముగా నారి దివిచి యేసినమహాబాణము వీని విశాలంపు ఱొమ్మునఁబడి యుచ్చికొని దేహమునుండి ప్రాణమును వెడలఁబుచ్చఁగా వీఁడును గిఱగిఱం దిరిగి నేలంబడుఁగాక' యనెను. ఇది రెండవసర్గము.

---

### (విరాధునితో యుద్ధము. విరాధుఁడు రామలక్ష్మణుల నెత్తికొనిపోవుట.)

శ్రీమంతుఁ డాలక్ష్మణుఁ డిట్లు చెప్పి యారాక్షసునిజూచి నవ్వుచున్నట్లే 'ఓరీ! ఈయడవిలో హాయిగాఁ దిరుగుచున్నావే! నీవెవ్వఁడవు' అనియడిగెను. అంత విరాధుఁడు వనమంతయు ప్రతిధ్వని గావించునట్లు బిగ్గఱగా 'మీసంగతి నే నడుగుచున్నానే! చెప్పుఁడు. మీరెవరు? ఎక్కడికిఁబోవుచున్నారు?' అని యడిగెను. అంత నత్యంతతేజుఁ డగురాముఁడు, స్వాభావికముగా మొగము కొఱకొఱ మండుచుండు నారాక్షసుఁడు తన్నట్లడుగుటం జూచి తన యిక్ష్వాకువంశమును తండ్రియాజ్ఞయు వనమునకు వచ్చుటయు మొదలగునవి చెప్పువాఁడై 'మేము క్షత్రియులము, సదాచా

---

మఱియు 'వ్యసనకాలమందైనను సజ్జనులు పరదోషములనెత్తి చెప్పరు. రాముని ప్రకృతికిని అట్లు చెప్పుట విరుద్ధము. కోపసమయములందే లోపలిభావము బయలుపడుటంబట్టి రాముఁ డిట్లు చెప్పినందున లోపల నతఁడు దోషములను పట్టువాఁడనియు బయటికి అట్టివాఁడుగానట్లు నటించుచున్నాఁ డనియుఁ జెప్పవచ్చునుగదా' యనవచ్చును. అయినను వ్యసనకాలమందు లోకులకు ఇది చెప్పఁదగును తగదు అను వివేకము కలుగదని తెలుపుటకై రాముఁ డిట్లు చేసినాఁడని తెలియునది.

* ఇందులకు 'అనాథ ఇవభూతానాం నాథస్త్వం వాసవోపమః' అని మూలము. దీనికి తత్వార్థ మెట్లనఁగా:—(సర్వభూతానాం) సర్వలోకములకు నాథుఁడవు. (వాసవోపమః) వాసవునకు ఉపమానమైనవాఁడవు, ఇట్టి నీవు (అనాథఇవ) నాథుఁడుగానట్లు, ఏలపరితపించెదవని యంతరార్థము. ఈతత్వార్థమునే విశ్వామిత్రుఁడు 'అహం వేద్మి మహాత్మానమ్' అనియు పరశురాముఁడు 'త్వయాత్రైలోక్యనాథేన యదహం విముఖీకృతః' అనియుఁ జెప్పిరి. కాన యిచటను అట్లే గ్రాహ్యము.

రసంపన్నులము, అడవినినుండువారము. ఇఁక నీసంగతిని దెలియఁగోరెదము. నీవెవ్వఁడవు? ఈదండకారణ్యమునఁ దిరుగుచున్నావే' అని యడిగెను. విరాధుండును సత్యపరాక్రముఁ డగురామునిఁ జూచి 'రాజా! రామా! నాసంగతిని చెప్పెదను వినుము నేను జయునికొడుకను. నాతల్లిపేరు శతహ్రద. నన్ను భూమియందు రాక్షసులందఱును *విరాధుం డనిపిలుతురు. మఱియు నేను తపముగావించి బ్రహ్మప్రసాదము వడసితిని. దానివలన నన్ను శస్త్రమునఁ జంప నలవిగాదు; మఱి ఛేదింపను దరముగాదు; ఛేదింపను శక్యము గానేరదు. మీరు ఈస్త్రీయాశవదలుకొని దీనిని విడిచి, వచ్చిన దారినె వేగ పాఱి పొండు. మంచిపడఁతి దొరకుటంబట్టి మీప్రాణములను గొనక విడిచెదను' అనెను. రాముఁడు కోపమున గన్నులు మిక్కిలియు నెఱ్ఱఁబాఱ వికృతాకారుఁడును పాపచిత్తుఁడు నగురాక్షసునిఁ జూచి 'ఓరీ నీచా! ఇసీ! అతి నీచమైన పనికిఁ దలపెట్టితివే! నీవు నీమరణమును నిజముగా వెదకుచున్నావు. అట్లే యుద్ధమున నీకోర్కి ఫలించును. నిలువు. నాబారిఁ బడి ప్రాణములతోఁ బోలేవు' అనెను. అంత రాముఁడు వింట నారిం గూర్చి మిక్కిలి వాఁడిబాణములను అతివేగమున సంధించి రాక్షసునిపైఁ బ్రయోగించెను. అతఁడట్లు వింటి నెక్కుపెట్టి గరుడునివలెను వాయువువలెను మహావేగమునఁ బఱచునట్టి బంగారుపింజబాణముల నేడు ప్రయోగించెను. నెమిలిఱెక్కలు గట్టంబడి నిప్పువలెఁ దుఱకించునాబాణములు విరాధుని దేహమును దూసికొని నెత్తురు వెడలకమునుపే యుచ్చి వచ్చుటచే కొంత నెత్తుటఁ దోఁగి నేలంబడినవి. ఆరాక్షసుఁడు ఆబాణము లుచ్చి పోవఁగా నొచ్చి మిక్కిలి కుపితుఁడై సీతను గ్రిందనుంచి శూలము నెత్తుకొని రామలక్ష్మణులపైకి పాఱుతెంచెను. వాఁడు మిక్కిలి బిగ్గఱగా నార్చుచు నింద్రధ్వజమువలె మిక్కిలి పొడవయినశూలమును బట్టికొని నోరు దెఱచుకొని యున్నయమునివలె నపుడు చూచువారికి విలసిల్లుచుండెను. అంత నాయన్నదమ్ములిరువుఱును ఆవిరాధుఁడు సీతనువిడిచివచ్చుటవలన వానిపయిని యథేష్టముగా బాణములువేయ వీలుపడుటచే మునుపటివానికంటె మిక్కిలి వెలుఁగుచున్నబాణములను † ప్రళయకాలంబున భూతసంహారము సేయు యమునివలెనున్నయారాక్షసునిపై వర్షముగాఁ గురియించిరి. మహారౌద్రుఁడయినయారాక్షసుఁడు 'వీరలు నాకెంతమాత్రము' అని నవ్వి నిట్టనిలువున నావులించుచు నొడలు విఱుచుకొనెను. అట్లు విఱుచుకొనునపుడు వాని దేహమునఁ గొంత నాటియున్నబాణ

---

* 'విరాధుఁడు.' అనఁగా విగత+ఆరాధనుఁడు-దురారాధ్యుఁడనుట. ఈపేరు వానితలిదండ్రులు గాదు, వానికి సజాతీయులైనరాక్షసులు పెట్టిరని తెలియునది.

† దీనికి 'కాలాన్తక యమోపమే' అనిమూలము. 'కాలుఁడు అంతకుఁడు యముఁడు అని మారణాధికారులు ముగ్గురు. అందు కాలుఁడు జీవితవిచ్ఛేదమును, అంతకుఁడు ప్రాణాపహారమును, యముఁడు పుణ్యాపుణ్యవివేకమును సేయు నధికారములు గలవారుగా భేదము తెలియునది' అని మహేశ్వరతీర్థులు.



573 రామలక్ష్మణులు విరాధుని వధించుట.

ములు వేగవంతములయ్యెను వానిదేహమునుండి వీడిపడినవి. ఆరాక్షసుఁడు తనపదు దానముక్కలిమివలన ప్రాణవాయువులను హృదయమునం దొక్కటిగా కూర్చుకొని బలముగలిగి శూలము నెత్తుకొని రామలక్ష్మణులపైకి నుఱికెను. రాముఁడు శస్త్రధారులకు శిరోమణి. కాఁబట్టి యాకాశమునందలి అగ్నివలె వెలుఁగుచు వజ్రాయుధమును బోలి వచ్చు రాముని బాణములచే నాశూలవ తుండెములై, వజ్రాయుధముచే నఱుకఁబడిన మేరుపర్వతపు శిలాతలమువలె విరాధుని హస్తమునుండి నేలంబడెను. విరాధుఁడు వేగముగా పైకి పాఱు తెంచుచుండుటఁ జూచి యారామలక్ష్మణులు కృష్ణసర్పములవలె నున్నత ఖూని వానిని బిట్టుగా ప్రహరించిరి. రౌద్రాకారుఁ డై

అట్టుమీఁదు మిక్కిలి చావఁగొట్టఁబడినను విడువనివాఁడై, పురుషసింహులగుటం బట్టి ంపనుగూడ నలవి గానియారామలక్ష్మణులనుబట్టి బాహువులతోఁ గౌఁగిలించుకొని యెత్తుకొని పోవంగోరెను. వాఁడు మఱియొక వనమునకు తమ్ముఁగొనిపోవ నున్నయభిప్రాయమును రాముఁడెఱిఁగి లక్ష్మణునిజూచి 'ఇంతకు నూరకుండుము. ఈరాక్షసుఁడు మనకుఁ బోవలసిన యీమార్గమున నే మనలను లెస్సగా మోచికొనిపోవుంగాక. లేక లక్ష్మణా! వీఁడు కోరినదారి నే మోచికొని పోవుఁగాక. ఏలన మన మడవినడుమ పోవఁగోరుచున్నారము. దారియేదో మనకుఁ దెలియదు. ఈరాక్షసుఁడు పోవునదే మనకును పోవలసినదారి యగును జుమా' అనెను. అంత నారాక్షసుఁడు తన బలవీర్యమున మహాబలులైనయాయిరువురిని, వారొప్పుకొనియుండుటంబట్టి, బిడ్డలం బోలె నెత్తి తనమూఁపులపై నుంచుకొనెను. రాక్షసుండావిరాధుఁడు రామలక్ష్మణుల నిరువురను మూఁపులపై నిడికొని భయంకరముగా నార్చుచు దానుద్దేశించిన యడవినిగూర్చి పోయెను. మహామేఘమువలె దట్టముగాఁ గారుకొనుచు, నానావిధములైనగొప్పవృక్షములతోఁగూడి పలుదెఱఁగులైనవందలకొలఁది పక్షులచే వింత గొలుపుచు, నక్కలు పెద్దపులులు మొదలగు క్రూరమృగములును నెరసి బెరసియున్న మహారణ్యమును విరాధుఁడు ప్రవేశించినవాఁడయ్యెను. ఇది మూఁడవసర్గము.

---

రోదనమునుజూచి రామలక్ష్మణులు వేగమున విరాధుని
బాహులను ఖండించుట. విరాధుని పూర్వజన్మవృత్తాం
తము. వాఁడు శరభంగాశ్రమమును దెలిపి
స్వర్గమునొందుట.

సీత, యారాక్షసుఁడు రామలక్ష్మణులను గొనిపోవుచుండుటఁ జూచెను. చూచి చెలువంపుబుజములు గలయాచెలువ మిక్కిలి దుఃఖితయై చేతులు పిసికికొనుచు బిగ్గఱగా 'దశరథకుమారుఁ డీరాముఁడు సత్యవంతుఁడే! సదాచారసంపన్నుఁడే! మంచిబుద్ధి గలవాఁడే! ఇట్టిమహనీయునిని లక్ష్మణునితోఁగూడ భయంకరాకారుఁ డగురాక్షసుఁ

డు, అయ్యో! దైవమా! పట్టుకొనిపోవుచున్నాఁడే! ఓ రాక్షసోత్తమా! నన్ను తోడేళ్లును పెద్దపులులును జిఱుతపులులును భక్షించును. అవి యేల తినవలయును. నీ కిదిగో మ్రొక్కెద. రామలక్ష్మణులను విడిచి నన్నుఁ బట్టికొని పొమ్ము' అని విలపించెను. వీరులగు రామలక్ష్మణులు సీత యట్లు పలవించి చెప్పుట విని యా దురాత్ముని జంపుటకు త్వరపడిరి. * బెడిమం డైనయా విరాధుని యెడమచేతిని లక్ష్మణుఁడు ఖండించెను. రాముఁ డా రాక్షసుని కుడిచేతిని బలిమితోఁ దుండించెను. మేఘమువలెఁ గారుకొనుచున్న యా రాక్షసుఁడు చేతులు విఱిగి భయపడి, వజ్రాయుధముచేత ఖండింపఁ బడిన కొండవలె గొబ్బున నేలం బడెను. అంత వారిద్దఱును వానిని నేలం బడవైచి పిడికిళ్లను మోఁకాళ్లను అడుగులను ఎత్తియెత్తి వానిని బలుమాఱు గొట్టుచు బిసికి ముద్ద గావించిరి. ఆ రాక్షసుఁడును పెక్కుబాణములు గ్రుచ్చంబడియు, వారిద్దఱి కత్తులవాట్లచే దేహమెల్ల గంట్లుపడియు, మఱియు భూమిపయిని పలువిధముల నజ్జుగుజ్జుగాఁ ద్రొక్కంబడియు, మరణము నొందఁడయ్యె. రాముఁ డెంతటి భయములు వచ్చినను వానిని బోఁగొట్టి యభయ మొసఁగునట్టివాఁడు. కావున యా శ్రీమంతుఁడు పర్వతాకారుఁ డగు విరాధుని శస్త్రాదులచేఁ జంపుట కలవిగాదని లెస్సగాఁ దెలిసికొని లక్ష్మణునిఁ జూచి 'పురుషతిలకా! ఈ రాక్షసుఁడు తపస్సు చేసియున్నవాఁడు. దానిం బట్టి వీనిని యుద్ధమున నాయుధముచేఁ జంప నలవిగాకున్నది. కాఁబట్టి వీనిని నేలం బాఁతిపెట్టుదము' అనెను. విరాధుఁడు రాముఁడు చెప్పినది విని పురుషోత్తముం డగు నా కాకుత్స్థునిం జూచి సవినయముగా 'పురుషసింహమా! ఇంద్రునితోడిసాటి యైన మేటిబలము గలనీవు నన్ను వధించితివి. నే నింతకుమునుపు అజ్ఞానమువలన నీవు సాక్షాత్పురుషోత్తముఁడ వని యెఱుఁగనయితిని. తండ్రీ! కౌసల్యాదేవి కడుపున మేలుగాఁ బుట్టిన రాముఁడ వని నా కిపుడు తెలిసినది. † మహాభాగ్యవతి యగు సీతాదేవిస్వరూపమును మహాయశుం డైన లక్ష్మణుని తత్త్వమును దెలియవచ్చినవి. నే నింతవఱ కిది తెలియకుండుటకుఁ గారణము వినుము. నేను తుంబురుఁ డను గంధర్వుఁడను. కుబేరుని శాపమున నే నిట్లు భయంకర మైన రాక్షసదేహమును బొందితిని. అనఘా! నేను తొల్లి రంభం దగిలి, తగు నవసరమున కుబేరునికిఁ గొలువు సేయకుండఁగా మా స్వామి యగు నతఁడు మిక్కిలి కోపించినవాఁడై రాక్షసుండవు గమ్మని పలికెను.

---

* విరాధుని పట్టుకొన్నపుడుగాని కబంధునిబట్టుకొన్నపుడుగాని లక్ష్మణుఁడు ఎడమచేతిని రాముఁడు కుడిచేతిని ఖండించుట ఒక్కవిధముగానే చూపట్టుచున్నది. ఇందులకు కారణ మేమనఁగా లక్ష్మణుఁ డెప్పుడును రాముని కుడిప్రక్కనే యుండును. కనుక విరాధాదులు రాముని కుడిచేతిని లక్ష్మణుని ఎడమచేతిని బట్టుకొనఁగా వారిద్దఱును తమతమ ప్రక్క చేతులను ఖండించువారైరని తెలియునది.

† నీవు సాక్షాత్పురుషోత్తముఁడవనియు కౌసల్యకడుపున రాముఁ డైయవతరించితివనియు మహాభాగ యగు లక్ష్మియే సీతయనియు నీయంశమై నిన్ననువర్తించుటవలన మిక్కిలి పొగడ్తకెక్కినయతఁడు లక్ష్మణుఁడనియు నెఱిఁగితిననుట.

మఱియు నేను బ్రసన్నునిగాఁజేయఁగా నామహాయశుఁడు నన్నుఁజూచి 'దశరథకుమారుఁ డగురాముఁడు నిన్నెపుడు యుద్ధమున వధించునో యపుడు నీవు నీ యెప్పటి రూపునొంది స్వర్గము నొందఁగలవు' అని చెప్పెను. పరంతపా ! నీ యనుగ్రహము వలన నే నతిభయంకర మైనయీశాపమునుండి విడివడితిని. ఇఁక నా లోకమునకుఁ బని వినియెదను. మీకు శుభంబగుఁగాక. తండ్రీ ! ఇచ్చటికి ఒకటిన్నరయామడ దూరమున ధర్మాత్ముఁడును మహాతపస్సంపన్నుఁడును సూర్యసదృశ తేజుఁడు నగుశరభంగుఁ డనుమహాముని నివసించుచున్నాఁడు. నీవు శీఘ్రముగా నాతనియొద్దికిఁ బొమ్ము. * ఆయన నీకు మేలుగావించును, రామా ! నన్ను పల్లముద్రవ్వి పూడ్చి పిమ్మట సేమముగాఁ బొమ్ము. ప్రాణములు విడిచినరాక్షసులకు నిట్లు భూమియందుఁ బూడ్వఁబడుట యనాదిగా వచ్చుచున్నధర్మము.'ఏరాక్షసులకళేబరములు భూమియందుఁ బూడ్వఁబడునో వారలకు శాశ్వతలోకములు కలుగును' అని చెప్పెను. మహాబలుఁ డైనవిరాధుఁడు బాణపీడితుఁ డై రామునిఁజూచి యిట్లు చెప్పి యంత దేహమును విడిచి స్వర్గమునింపుమించుగా నొందినంతవాఁడయ్యెను రాముఁడు విరాధుని మాటవిని లక్ష్మణునిజూచి 'లక్ష్మణా ! పెద్ద యేనుగునకుంబోలె భయంకరకర్ముఁ డైనయీరాక్షసునకు నీవనమునఁ బెద్దపల్లమొకటిద్రవ్వుము' అనెను. ఇట్లావీర్యవంతుఁడు పెద్దపల్లమును ద్రవ్వుమని లక్ష్మణునకుఁజెప్పి విరాధునిఁ గదలనీయక కంఠమునం గాలిచే నదిమిపట్టి నిలుచుండియుండెను. అంత లక్ష్మణుఁడును మీటయినపాఱచిప్పనుగొని మహాకాయుఁ డగువిరాధుని పార్శ్వభాగమునందు పెద్ద బిలమును ద్రవ్వెను. అంత రాముఁడు వానికంఠమునఁ ద్రొక్కిపెట్టినకాలు దీసికొనఁగా మిగుల భయంకరశబ్దమున నఱచుచు మేకులవంటిచెవులును,బెడిదంపుధ్వనియుఁ గలవిరాధుని నాబిలంబునఁ బడవైచిరి. అతివేగపరాక్రము లై యుద్ధంబున వెనుదీయకుండు రామలక్ష్మణు లిరువురును సంతోషంబునొంది భయంకరుం డగునారాక్షసుని, యుద్ధంబున జయించి వాఁడు బిగ్గఱ నఱచుచుండఁగా బిలంబున నెత్తి పడవైచిరి. ఆరామలక్ష్మణులు కార్యంబులందు మిక్కిలియు నిపుణు లగుపురుషశిఖామణులు గావున నావిరాధుఁడు కేవలుఁడుగాక మహాసురుం డై యెట్టి వారియాయుధమునకు నోర్వరానివాఁడగుటం జూచి యిదియె వానివధోపాయమని నిశ్చయించి వానిని బిలంబునఁబూడ్చి ప్రాణంబులకుఁ బాపిరి. వనచారి యగురాముఁడు బలాత్కారమునఁ దన్నుఁ జంపఁగోరి బిలమునఁ బూడ్చుతనమరణోపాయమును జేయఁ బూనఁగాఁ జూచి విరాధుఁడు తానే 'ఁదనకాయుధమువలనఁ జావు కలుగదనియు దన్నుఁ బూడ్చిపెట్టవలయుననియు రామునకుఁ దెలిపెను. రాముఁడును అట్లు విరా

* ఇందులకు 'స తే శ్రేయో విధాస్యతి' అనిమూలము:—(సః) అతఁడు (తే=త్వత్తః) నీవలన, (శ్రేయః) బ్రహ్మలోకప్రాప్తి యనెడిశ్రేయస్సును, (విధాస్యతి) పోషింపఁగలఁడు-పడయఁగలఁడు అని యర్థాంతరము. గోవిందరాజులు.

ధుఁడు చెప్పినమాటనువినియే వానిని బలిమినిఁ బూడ్పఁదలంపుగొనెను. రాముఁడు బలాత్కారమున నారాక్షసుని బిలమునఁ బూడ్చునపుడు వాఁడడవియంతయు మిక్కిలి మాఱుమ్రోఁగునట్లు అఱచెను. రామలక్ష్మణు లిట్లు విరాధుని భూబిలమునఁ బావవైచి పులకితశరీరు లయి యమ్మహావనమున నెంతమాత్రమును భయములేక యానందముననుండి యారాక్షసుని కళేబరమును రాళ్లచేతఁ గప్పిపుచ్చిరి. అంత బంగారు చే వింతగులుకుచు రంగారు విండ్లం దాలిచి యాయిరువురును రాక్షసునిజంపి సీతం జేకొని మిక్కిలి సంతుష్టులై యమ్మహావనమునందు, ఆకాశమునందు చంద్రసూర్యులచందమున, విహరించుచుండిరి. ఇది నాలుగవసర్గము.

శరభంగాశ్రమమునకుఁ బోవుట. శరభంగుఁడు రాముని
బూజించి సుతీక్ష్ణాశ్రమమునకు మార్గముఁజెప్పి రామ
సన్నిధి నగ్నిప్రవేశము సేసి పరమపదము
నొందుట.

రాముఁడు పరాక్రమశాలి గావున భయంకరబలుఁ డయినవిరాధునిఁ జంపి యంత సీతను గాఁగిలించి మంచిమాటలం దేర్చి తేజమున రాజిలు చున్నతమ్మునిని లక్ష్మణుని జూచి 'ఈ యడవి మిక్కిలి చొరరానిది. మఱియు విశ్రమించుటకుఁ దగనిది. మనమడవిలో నుండి మెదిగినవారముగాము. కాన యిందుండక శీఘ్రముగా శరభంగమహామునియొద్దకుఁ బోవుదము' అనెను. అంత దేవతలతోడి సాటి యగుమహత్త్వముగలిగి తపమువలన పరబ్రహ్మసాక్షాత్కారము నొందినయాశరభంగమహామునియాశ్రమముంగూర్చి రాముఁడు పోయెను. రాముఁడు శరభంగుని సమీపమున మిక్కిలి ప్రకాశించుచున్నదేహముతో సూర్యాగ్నులవలెఁ దేజరిల్లుచు మిక్కిలి యాశ్చర్యమును గొలుపుచున్నయొక గొప్పవస్తువుం జూచెను. అంత రాముఁడు తాను సమీపించి వచ్చుటంబట్టి, రథమునుదిగి భూమిని ముట్టక దేసతలుబలసి వెంటరా శరభంగుని సమీపమున నున్న దేవేంద్రునిఁ గాంచెను. ఆయింద్రుఁడు మిక్కిలియు కాంతి దళుకొత్తుచున్నయాభరణములఁ దాల్చి దేదీప్యమానుఁడై యచ్ఛంపు మఱుఁగువస్త్రములను గట్టియుండెను. అతనిని బోలునట్టిమహాత్ములు పెక్కండ్రు అతనిని బూజించుచుండిరి. ఆయాశ్రమమునకు సమీపమున నాకాశంబునఁ బచ్చని గుఱ్ఱములుపూన్పఁబడి పట్టపగలింటిసూర్యునివలె ధగధగ మెఱయుచున్నయింద్రుని రథమును గాంచెను. తెల్లనిమబ్బువలె మిక్కిలి కాంతిదళుకొత్తుచు, చంద్రమండలమువలె గుండ్రనై యింపుగులుకుచు, వింత లగుపూలదండలు ప్రేలంగట్టఁబడియున్న యింద్రుని శ్వేతచ్ఛత్రమును గాంచెను. బంగారుకాఁడలు గలిగి గొప్పవిలువతోఁగూడినమిక్కిలిమేలయిన వింజామరలను నుత్తమస్త్రీ లాయింద్రునిశిరముపైని వీచుచునుండిరి. గంధర్వులును సిద్ధులును దేవతలును బరమర్షులును ఆకాశమున



576 సీతారామలక్ష్మణులు శరభంగాశ్రమమునకు వచ్చుట. శరభంగుడు స్వర్గమునకరుగుట.

నున్న దేవేంద్రుని వేదవాక్యములఁ బ్రస్తుతించిరి. అంత నింద్రుఁడు శరభంగ మహామునితో మాటాడుచుండఁగా రాముఁడు దేవేంద్రునిఁగాంచి లక్ష్మణున కాయింద్రుని రథమును చేతఁ జూపుచు 'లక్ష్మణా! ఆకాశంబున మిక్కిలి మెఱుఁగులు దుఱఁగలించుచు, సిరిపెంపునింపుచు, పట్టపగలింట వెలుఁగుచున్నసూర్యునివలె మిఱుమిట్లు గొలుపుచు వింతగొలుపుచున్నరథమును జూచుము.మున్ను మనము యాగకర్తలు భక్తియుక్తముగా నింద్రునిగుఱ్ఱములను బిలువఁగా వానిని వినియున్నాము.ఇవిగో!ఆదివ్యాశ్వములే ఆకాశమున వచ్చియున్నవి;నిజము. కుండలాలంకృతులై యౌవనమున నివ్వటిలుచు,మిక్కిలి విశాలము లైనవక్షములుగలిగి, యినుపగుదియలవంటి బుజములుమీఱి, ఎఱ్ఱనివలువలుగట్టి, పెద్దపులులంబోలె తారసింపరా కున్నయీపురుషశ్రేష్ఠులు రథముచుట్టును ఒక్కొక్కదిక్కున నూర్గురేసిగా నిలుచున్నారే! వీరందఱును దేవతలు. వీరి కందఱికిని వక్షస్థలముపై నిప్పువలె ధగధగమెఱయుహారములుగలవు. చూడుము. లక్ష్మణా! వీరందఱును ఇరువదియైదు వత్సరముల వయసు గలిగి యున్నారు. దేవతల కెప్పటికిని యీ యిరువదియైదు సంవత్సరములవయసే యుండును. ఈ పురుషలలాములు వస్త్రాభరణాదులచేతను నిట్టినయస్సుచేతనుఁ గన్నులపండువుగాఁ బొడసూపునట్లే దేవత లెల్లను గనుపట్టుదురు.లక్ష్మణా! నీ విచ్చటనే సీతతోఁగూడ కొంత సేపుండుము. నేను బోయి కాంతి దళుకొత్తుచున్నయితం డెవ్వఁడో స్పష్టముగాఁ దెలిసికొని వచ్చెదను.' అని తన్ను విడనాడక వెంటవచ్చుచున్నలక్ష్మణునితో మరల నిచటనేయుండు మనిచెప్పి తాను శరభంగమునియాశ్రమమునకుఁ బోయెను. అంత దేవేంద్రుఁడు రాముఁడు వచ్చుటం గాంచి, శరభంగమహాముని సమీపమునకుఁబోయి యతనితో నేకాంతమున "ఇదిగో రాముఁడు వచ్చుచున్నాఁడు. ఇతఁడు నాతో మాటలాడుటకు మునుపే, మాటలాడక యేయుండి తానుపట్టిన నియమమును నడపి కార్యమును సాధింపవలయును. 'మాటలాడకున్నను నిన్నతఁడు చూడనైనను రాదా'యందువేని,యతఁడు ప్రతిజ్ఞ తీర్చుకొన్నపిదప నన్నుఁ జూడవచ్చును. 'నీవైనను నతనిఁ జూడరాదా'యందువా? * ఇతఁడు రావణునిజయించి దేవతలకార్యము సాధించినపిదప శీఘ్రముగానే చూడఁగలను. ఇతఁడు ఇతరుల కెంతమాత్రము నలవి కాని గొప్పకార్యమునొకటిచేయవలసి యున్నదిగదా. దాని నొడఁగూర్చి పిదప నన్నుఁ జూచుట మంచిది" అనెను. ఇట్లు శత్రువుల సహించునాయింద్రుఁడు ముని వేషమునన్నరాముని బహుమానించి శరభంగుని బూజించి వీడ్కొని గుఱ్ఱములం బూన్చినరథము నెక్కి స్వర్గలోకమునకుఁ బోయెను. దేవేంద్రుఁడు పోఁగానే రాముఁడు తన బలఁగ మయినసీతాలక్ష్మణులతోడ శరభంగమహామునియొద్దకుఁబోయెను. అప్పుడా

* దేవేంద్రుఁడు 'తనతో రాముఁడు మాటాడుటవలనఁగాని అతనిని తానుజూచుటవలనఁగాని అతనిదేవత్వము బయలుపడును. అతఁడు మనుష్యవేషమున నే గొప్పకార్యముచేయవలసియున్నది.అతని దేవత్వము బయలుపడునట్లు నేను మాటాడను జూడను రాదు' అన్నాఁడు.

ముని యగ్నిప్రవేశార్థము అగ్నినుపాసించుచుండెను. రాముఁడును సీతాలక్ష్మణులును ఆమహాముని పాదములను బట్టుకొని నమస్కరించి యతండు గూర్చుండ ననుజ్ఞయొసఁగి యాసనమిచ్చి సత్కరింపఁగా తారు గూర్చుండిరి. అంత రాముఁ డమ్మునినిజూచి దేవేంద్రుఁడు వచ్చి పోయినవిషయమునడిగెను. శరభంగుఁ డావిషయమంతయు రామునకుఁ జెప్పువాఁడై 'రామా! వరప్రదుఁ డైనయీదేవేంద్రుఁడు నేను గావించిన యుగ్రతపస్సుచే నాకు ప్రాప్తమై, యాత్మవిదులకు బొంద నలవిగాని బ్రహ్మలోకమునకు నన్నుఁదోడ్కొని పోవఁగోరుచున్నాఁడు. పురుషలలామా! నీవిచట దాపుననే యున్నావని తెలిసి ప్రియాతిథి వగునిన్నుఁ జూడక పోఁగూడదని* బ్రహ్మలోకమునకుఁ బోకున్నాను. పురుషసింహా! నీవు ధార్మికుఁడవు, సత్యసంకల్పుఁడవు, ఇట్టి నిన్నుఁజూచి యటుపిమ్మట దేవసేవిత మగు బ్రహ్మలోకమునకుఁ బోవనున్నాను. † పురుష

*మూలములు. ఇట 'బ్రహ్మలోకం న గచ్ఛామి' 'గమిష్యామి త్రిదివం దేవసేవితమ్' అని నీ దర్శనమునుబట్టి బ్రహ్మలోకమునొల్లను, (దేవసేవితం) 'యత్రపూర్వేసాధ్యాః సన్తిదేవాః' అని వేదశబ్దవాచ్యులైననిత్యసూరులు సేవించుచుండెడు, (త్రిదివమ్) త్రిపాద్విభూతియుక్తమైన పరమపదమునే, (త్వయాసమాగమ్య) నీతోడిసమాగమముచే-నీకటాక్షమునకు పాత్రుఁడనై పొందెదను, అనిభావము స్ఫురించుచున్నది: గోవిందరాజులు. 'సత్యసిరతిశయనిర్మలానందస్వరూపుఁడును, భక్తజనపారిజాతుఁడు నగు నిన్ను దర్శనము సేయు నానందమును విడిచితి నేని యంతకంటెను భోగ్యమైనవస్తువు బ్రహ్మలోకమందు నాకేదియులేదు. పూర్వము దేహాంతరములచే బ్రహ్మలోకము ననుభవించియున్నాను. అట్లు అది యనుభవింపఁబడినదే యైనను, అందు నిన్నుదర్శించు నానందముకంటె భోగ్యమైనదేదియు లేకుండినను నాప్రారబ్ధకర్మవశమున నచటికి పోవుచున్నాను. ఏమిసేయుదును' అని మహేశ్వరతీర్థులు.

† ముని 'నీకటాక్షమువలన బ్రహ్మలోకమును విడిచి త్రిదివమును అనఁగా పరమపదమును బొందెద' ననఁగా రాముఁడు 'క్రమముగా పరమపదమును బొందుదువుగాక. ఇప్పుడార్జించిన కర్మఫలములను-అనఁగా వానివలనఁ గలుగు స్వర్గాదిలోకములను-అనుభవింపు'మనఁగా ముని 'నేనార్జించినకర్మముల నన్నిటిని నీకే యర్పించెద'నని చెప్పినాఁడని తెలియునది. కర్మములను భగవంతుని కర్పించుటయనఁగా కర్మముల ఫలమందు సంగమువదలి వానికి తాను కర్తయనుటను వదలి భగవంతునికి కైంకర్యమాత్రముగా వానిని అనుష్ఠించుటయేయగునని తెలియునది. ఇట బ్రహ్మలోక స్వర్గలోక భోగప్రదేశములను ప్రతిగ్రహింపుమనుటచే కర్మఫలములను సర్వేశ్వరుఁ డగుభగవంతునియం దర్పించుటయగుచున్నది. వానిని ఆ సర్వేశ్వరుఁడు 'అహమేవా హరిష్యామి'. 'నేను అవశ్యము గయికొనెదను.' అని స్వీకరించుట తెలియునది. ఇది అంతరార్థము. ప్రాతీతికార్థ మెట్లనఁగా:- రాముఁడతిథియై వచ్చుటచే ముని తానార్జించిన లోకములను గొనుమని అతిథి సత్కారము చేసినాఁడని తెలియునది:-గోవిందరాజులు. ముని రామునికి లోకముల నొసఁగుటచే అతిథి సత్కారము గావించినాఁడనియు రాముఁడు 'రాజులకు ప్రతిగ్రహము గూడదు గావున నీవిచ్చునది నేను బుచ్చుకొనరాదు 'అహమేవా హరిష్యామి' నేనే వానిని సాధించి గయికొనెదను. నీవు నాకు వసతియైన స్థలముమాత్రమే చూపఁగోరుచున్నా'నని చెప్పెననియు గ్రాహ్యము. మహేశ్వరతీర్థులు. 'అహమేవాహరిష్యామి' అనుటకు నేనే నీకు సంపాదించుచున్నాను-అనఁగా 'లభతేచ తతః కామాన్ మయైవవిహితాన్' అనుగీతచొప్పున భగవంతుఁడు తానైయిచ్చుకోరికలనే భక్తులొల్లుదురు గావున ఆలోకములను నేనే నీకు ఇచ్చుచున్నానని రాముఁడు చెప్పెను. తనిశ్లోకి.

తిలకా! నేను బ్రహ్మలోకమునను స్వర్గలోకమునను అక్షయము లయినమంచి భోగప్రదేశముల నార్జించియున్నాను. వాని నన్నింటిని నీకర్పించెద. ప్రతిగ్రహింపుము'అనెను.సకలశాస్త్రకోవిదుఁడును పురుషతిలకుఁడు నగురాముఁడు శరభంగమునియట్లు చెప్పినమాటవిని యాతనితో మహామునీ! నీవు నా కర్పించినలోకముల నన్నిటిని నేను తప్పక స్వీకరించెదను.నాకీ డవియందు నీవు చూపుచోటునే వాసస్థానముగాఁ జేసికొనఁ గోరుచున్నా'ననెను. మహాప్రాజ్ఞుఁడైన శరభంగుఁడు రాముఁ డిట్లుచెప్పుట విని యతనితో 'రామా! ఈ వనమందు సమీపముననే ధర్మబుద్ధియు మహాప్రభావుఁడు నయినసుతీక్ష్ణుం డనుమహర్షి గలఁడు. అతఁడు నీకు మేలుగావించును. నీవు సుతీక్ష్ణమునియొద్దకుఁ బొమ్ము. ఆయన నీకు ఈ వనస్థలమున రమణీయమును పరిశుద్ధము నయినప్రదేశమును వాసస్థానముగా నేర్పఱచును. ఇదిగో ! *మందాకినీనది. తూర్పుదిక్కుగా ప్రవహించుదీనికి ఎదురుకొని పడమటిదిక్కుగాఁ బోవుమార్గమునఁ బొమ్ము. ఆ మార్గమునఁ గొన్నియెడల నదికి సమీపముగాను గొన్నిచోట్ల నదికి దూరముగాను పోదువు. ఈ యేటిలో దట్టంపుఁబువ్వుతంపరలు తెప్పలవలె తేలుచున్నది. నాయనా! పురుషసింహమా! ఇదిగోమార్గము. కొంతనిలిచి నన్నుఁజూచుచుండుము. పాము కుబుసమును విడుచునట్లు నే నీ జీర్ణదేహమును విడిచెదను.' అనెను. మహాతేజుఁ డగునాముని బ్రహ్మమేధమంత్రవిదుఁడుగావున నగ్నిని పరిస్తరణాదులచే చక్కఁగా నలంకరించి బ్రహ్మమేధ మంత్రములను జపించుచు నాజ్యము వేల్చి యా యగ్నిహోత్రమును బ్రవేశించెను. అంత నా యగ్నిహోత్రమున మహాత్ముఁ డయినయాముని వెండ్రుకలును, జీర్ణించిన చర్మమును, అస్థులును నెత్తురుతోడి మాంసమును దగ్ధమయ్యెను.దానిఁజూచి మహాధీరుఁ డగురాముఁడును, సీతయు లక్ష్మణుఁడును, పరమాశ్చర్యమునొందిరి. అంత నాశరభంగుఁడు అగ్నివలె వెలుఁగుచు ముప్పదియేండ్లు గలకుమారుఁడై యా యగ్నిచయమునుండి లేచి మిక్కిలియుఁ బ్రకాశించెను.† ఆ మహాముని ఆహితాగ్నులు వడయులోకములను మహాత్ములగుఋషులు పొందులోకములను అతిక్రమించి బ్రహ్మలోకమునకుఁ బోయెను. పుణ్యకర్ముఁడును బ్రాహ్మణశ్రేష్ఠుఁడు నగునామహాముని యా బ్రహ్మలోకమున సపరివారుం డగుబ్రహ్మదేవునిఁ జూచెను. బ్రహ్మదేవుఁడును అమ్మునినిజూచి సంతోషించి స్వాగతమడిగెను. ఇది యైదవసర్గము.

* 'మందాకినీనది' యనఁగా మందాకినివలె పవిత్రమైనయొకనది. దీనివలన ఋషులు పుణ్యనదు లనన్నిటిని గంగానదియని వ్యవహరించుచుండినట్లు తెలియుచున్నది. కావుననే చిత్రకూటమందలి నదికిఁగూడ మందాకిని యనుపేరు గలిగె నని తెలియునది.

† ఇట దేవయానమార్గమున బ్రహ్మలోకమును బొందుట తెలియునది.

### శరభంగాశ్రమమునఁ గలమునిజనులు రామునిశరణుఁజొచ్చి రాక్షసోపద్రవమును జెప్పుట. రాముఁడు వారలకు రాక్షసులను వధించునట్లు ప్రతిజ్ఞ సేయుట.

శరభంగుఁడు దివంగతుఁ డయినపిదప నందలి మునులందఱును ఒక్కటిగాఁ గూడి తేజమున రాజిలుచున్న రామునొద్దకువచ్చిరి. వారెవ్వరన, బ్రహ్మనఖములవలనఁ బుట్టినవైఖానసు లనుఋషులును బ్రహ్మరోమముల జన్మించినట్టి వాలఖిల్యులనువారును, దేహములోపలిభాగమునంతయు నీటిచేఁ గడుగుకొను ఋషులును, చంద్రసూర్యకిరణములఁ ద్రాగి యుబుసుపుచ్చువారును, దేహమంతయు రాళ్లచేఁగొట్టుకొనువారలును, ఆకులు దినియుండువారలును, వడ్లు మొదలగుధాన్యములను దంచుటకు మాఱుగా దంతములచేతనే నమిలి పొట్టునువిడిచి గింజలనుమాత్రము దినువారలును, గొంతుబంటి నీళ్లనుండి తపము సేయువారును, దేహమునందే ఱొమ్ముమీఁదఁగాని, భుజముమీఁదఁగాని తలయుంచుకొని నిదురించువారును, నిదురింపకయే యుండువారును, శీతకాలమున బయలనుండి తపముసేయువారును, జలమాత్రాహారులును, వాయుమాత్రాహారులును, పట్టులేక యాకాశముననుండువారును, నేలపయిఁ బరుండువారును, వ్రతార్థము నిత్యోపవాసము లుండి సర్వాహారముల వర్జించినవారును, జితేంద్రియులును, ఎప్పుడును తడిబట్టలను గట్టుకొనియుండువారును, వివిధ మంత్రజపములను జేయువారును, స్వాధ్యాయపరాయణులును, గ్రీష్మకాలమునఁ బంచాగ్నిమధ్యమున నుండి తపముగావించువారునై, యిట్లందఱును మంచిబ్రహ్మతేజస్సుగలిగి యోగపరిపాకమునొంది, యేకాగ్రచిత్తు లగుమునులందఱును, శరభంగునాశ్రమమునకు వచ్చి రాముని సందర్శించిరి. *ధర్మజ్ఞు లయినయామహర్షులు పరమధర్మవిదుండును మహాధనుర్ధరుఁడు నగురామునికడకుం బోయి యెచ్చరికమీఱ నతనితో "మహారథా! ఇంద్రుఁడు దేవతలకు ప్రధానుఁడగునట్లే నీవు ఇక్ష్వాకు కులీనుల

* మునులు రాక్షసపీడితులై తమకు మఱియొకగతినిగానక జగద్రక్షణమునకై యవతరించిన రాముని సర్వలోకశరణ్యుఁడని నిశ్చయించి తమ్మురక్షించుటకై జాలిఁబుట్టించు నీ వాక్యముల నతనికి విన్నవించుకొనుచున్నారు:—ఇందులకు మూలము 'త్వమిక్ష్వాకుకులస్యాస్య పృథివ్యాశ్చమహారథ। ప్రధానశ్చాసి నాథశ్చ దేవానాం మఘవానివ॥ విశ్రుతస్త్రిషులోకేషు యశసావిక్రమేణచ । పితృభక్తిశ్చ సత్యంచ త్వయిధర్మశ్చ పుష్కలః' ఇందులకుమీఁది యర్థము ప్రాతీతికము. వాస్తవార్థ మెట్లనఁగా- దేవతలకు దేవేంద్రుఁడువలె 'నీవు ఇక్ష్వాకుకులమాత్రమునకు ప్రధానుఁడవా! పృథివీమాత్రమునకే నాథుఁడవా? కాదు' అని కాకువు తెలియునది. నీవు, జగత్తునంతయు ధరించుటకును పోషించుటకును కర్తవు గావుననే మితిలేని కీర్తిచేతను పరాక్రమముచేతను ముల్లోకములందును—అనఁగా సర్వలోకములందును-ప్రసిద్ధుఁడైనవాఁడవు; సకలలోకాధీశ్వరుఁడవు. 'ఇట్టి నీవు క్షత్రియరూపమున నవతరించితివి గావున లోకముల కాయాధర్మములనుగఱపుటకై పితృవచనపరిపాలకత్వము సత్యవచనత్వము ధర్మమును మీఁదు మిక్కిలి యై నీయందుఁ గనుపట్టుచున్నవి' అని భావము. మహేశ్వరతీర్థులు.

కుఁ బ్రధానుండవు. మఱిభూమండలమున కంతయునాథుఁడవు. నీవు శరభంగు ననుగ్రహించిన కీర్తిచేతను విరాధుని నిరసించిన పరాక్రమముచేతను ముల్లోకములయందును ప్రసిద్ధుఁడవు. తండ్రియె మరల రాజ్యము గైకొమ్మనిచెప్పినను దానిని బరిత్యజించితివి కావున నీయందు పితృభక్తిమిక్కిలియుఁ బుష్కలమైనది. భరతుఁడే రాజ్యమునుగొమ్మని ప్రార్థించినను ప్రతిజ్ఞనుదప్పవైతివి.గావున నీయందలిసత్యమును మిక్కిలియైనది. మఱియాశ్రితరక్షణ మనెడిధర్మమునుదప్పక శరభంగు ననుగ్రహించితివి. కాన నీయందు ధర్మమును బరిపూర్ణమైయున్నది. నాథా! నీవుమహాత్ముఁడవు, శరణాగతరక్షణధర్మమును తెలిసినవాఁడవు, తెలియుటేకాక యట్టిధర్మము ననుష్ఠించుటయందు నిరతుఁడవు. ఇట్లు శరణ్యుఁడ వయిననిన్నుఁ జేరి యాచనగా నొకింత విన్నవించుకొనెదము.*నీకడకు వచ్చి శరణుఁజొచ్చుటయే కార్యసిద్ధికిఁ జాలునుగాన విశేషించి నిన్నడుగుకొన నక్కఱలేదు.అయినను ఆర్తి మిక్కుటమగుటచే నిలువఁజాలకయొకటి విన్నవించుకొనుచున్నా మంతేకాన దానిని క్షమింపవలయును. తండ్రీ! †ఏరాజు ఆఱవభాగము పన్నుదీసికొని ప్రజలను కొడుకులంబోలె రక్షింపకుండునో,యారాజునకు మిక్కిలియు గొప్పయధర్మముగలుగును. ఏరాజు యత్నపరుఁడై యెప్పుడును ఎచ్చరికగలిగి తనదేశమందలిప్రజలనెల్లను దనప్రాణములవలెను ప్రాణములకన్నఁ బ్రియులగుతనకొడుకులవలెను, ఎల్లప్పుడు నరసి రక్షించుచుండునో యారాజు బహుకాలముగానెడతెగక సాఁగుచుండునట్టి కీర్తినిబొందును;అంతమున బ్రహ్మలోకమునుబొంది యందును బ్రహ్మచేతఁ బూజితుండునై ప్రకాశించును,'పన్నిచ్చుప్రజలనే రాజు రక్షింపవలయునుగాని పన్నియ్యలేనిమునులను రక్షింపవలయు నెట్లు?'అందువా? ఋషి ఫలమూలము లాహారముగాఁగలిగి యాచరించుమహాధర్మంబులోఁగూడ, ధర్మమునఁ బ్రజల రక్షించునట్టిరాజునకు ‡నాలవభాగముగలదు. కావున నామునులనుగూడ ర

---

* దీనిచే 'చేతనుఁడు భగవంతుని ఉపాయముగా అధ్యవసింపవలయు నింతేకాని ప్రార్థనముసేయరాదు. అదాటున నట్లుచేసినను క్షమించునట్లు చేసికొనవలయును' అని తెలియునది.

† ఇందు రాముఁడు తమ్ము రక్షించుట స్వభావసిద్ధమైనదని తెలుపుచును లోకమున రాజులు రక్షించుట అట్లు స్వాభావికముకాక యొక కారణమునుబట్టి కలుగునదని తెలుపుచున్నారు. గోవిందరాజులు:—'రాముఁడు జగత్తునెల్ల రక్షించుటకే యవతరించినవాఁడు గావున మనలనుగూడ రక్షించునని తెలిసియు ఆర్త్యతిశయమువలన లోకరీతి ననుసరించి రాజధర్మమును విజ్ఞాపించి యాధర్మమును బట్టి తమ్మురక్షించుమని వేఁడుచున్నారు;--మహేశ్వరతీర్థులు.

‡ కొన్నిచోట్ల ధర్మమునందాఱవపాలు చెప్పఁబడియున్నది. ఇటనాలవపాలు చెప్పఁబడినది. ఇంకొకచోట రెండవపాలు చెప్పఁబడుచున్నది ఇది యెట్లు చెల్లునన్నచో ఉపవసించి భిక్షాపరులయిన జనులాచరించు ధర్మములో ఆఱవపాలును, రాజుచే పరిపాలితమైన దేశమునఁబుట్టిన ఫలములను భుజించువారి ధర్మమునందు నాలవపాలును,ఆరాజు నన్నపానములచే నొడలు పెంచినవారిధర్మమునుండి రెండవపాలును, రాజును జెందునని తెలియును.'యస్యాన్నపాన పుష్టాంగం కురుతే ధర్మసంచయం। అ

క్షింపనేవలయు. రామా! *ఈవానప్రస్థులు పెద్దగుంపులుగొని వచ్చియున్నారు చూడుము. వీరిలో నించుమించుగా నందఱును బ్రాహ్మణులే. వీరికినాథుఁడవై నీవుండియు ననాథులుంబోలె దెప్పరముగా రాక్షసులచే వధింపఁబడుచున్నారే! అటురమ్ము, ఆత్మధ్యాననిష్ఠులైన మునులు వనమున రాక్షసులచే నానావిధంబులఁ జంపఁబడ వారి దేహములు పడియున్నవి చూడుము. వారు పంపానదీతీరవాసులను మందాకినీ తీరమందలి వారును చిత్రకూటమునఁ గాపున్నవారును నగుఋషుల నందఱిని దెప్పరముగా హింసించుచున్నారు. ఇట్లడవియందు రాక్షసు లతిభయంకర కార్యములవలన తాపసులను ఘోరముగా హింసించి తూలఁ బుచ్చుచుండుట మాకు సహింపరాకున్నది. రామా! †ఆకారణమునుబట్టి మేము రక్షణార్థముగా సర్వశరణ్యుఁడవయిన నిన్ను శర

న్నప్రదాతుస్త స్యార్థం కర్తుశ్చార్థం నసంశయః' అని అరాజాన్నమున పుష్టులగు వారిధర్మమునం దర్థభాగము రాజునకుఁ జెల్లుట తెలియునది.

*ఇందులకు 'సోఽయం బ్రాహ్మణభూయిష్ఠో వానప్రస్థగణో మహాన్। త్వన్నాథోఽనాథవద్రామ రాక్షసైర్వధ్యతే భృశమ్' అని మూలము. ఇంతవఱకు ధర్మార్థము ప్రజలను రక్షించు రాజులకుఁ గలుగు ఫలములను జెప్పి యిపుడు ధర్మముకొఱకై యట్లు రాముఁడు రక్షించుటలేదు గనుక శరణాగతియే యతఁడు రక్షించుట కుపాయమని చెప్పుచున్నారు:-(సోఽయం) అయిది-ఈకనఁబడుచున్నట్టి, (వానప్రస్థగణో మహాన్) గొప్పవానప్రస్థ సమూహము, (బ్రాహ్మణభూయిష్ఠః) బ్రాహ్మణులు మిక్కిలి గలిగియుండునది-క్షత్రియ వైశ్యులకుఁగూడ వానప్రస్థాశ్రమముగలదు గావుననిందట్టి వారొకకొంద ఱేకాని తక్కినవారెల్ల కేవలబ్రాహ్మణులేయని యర్థము. లేక 'బ్రాహ్మణ' శబ్దమునకు బ్రహ్మవిదుఁడని యర్థముగలదు గనుక బ్రాహ్మణత్వాదిపరమైకాంతధర్మనిష్ఠుఁడనియు నర్థము గ్రాహ్యము. కాఁబట్టియె (త్వన్నాథః)నీవే వారికి నాథుఁడవు నిన్నొక్కనినే తమకు నాథునిగాఁగలవారు. దీనివలన అనన్యశేషత్వము చెప్పఁబడినది. వాఁడొకఁడే నాథుఁడై యేలుకొనఁదగియుండుటచే అనన్యసాధనత్వమును అనన్యభోగ్యత్వమును జెప్పఁబడినవి. కావుననే వారు నిరతిశయ మహిమగలవారనుట వ్యంజితము. ఇట్టివారుగానుండియు, (అనాథవదయం వధ్యతే) దిక్కులేనివారువలె చంపఁబడుచున్నారే-మాపరాధము మానాథుఁడవైన నీకుఁ జూడఁదగదని భావము.

†ఇందులకు 'తతస్త్వాంశరణార్థంచ శరణ్యం త్వాముపస్థితాః। పరిపాలయనో రామవధ్యమానాన్నిశాచరైః' అనిమూలము. ఇందులకు విశేషార్థము:-(తతః)కాఁబట్టి,(శరణ్యం)ఇచట ఉపపదములేనందున సర్వలోకశరణ్యుఁడని తెలియుచున్నది. దానింబట్టి యట్టిశరణ్యత్వమున కుపయుక్తములైన స్వామిత్వాదిగుణములును పూర్వఖండమైన నారాయణపదముచే ప్రతిపాదితములైనవి యిట చెప్పఁబడుచున్నవి. (శరణార్థం) ఉపాయాంతర స్థానమందు నివేశింపఁజేయుటకు,(సముపాగతాః) విశ్వాసముమొదలైన యంగములతోనెల్ల రక్షాభరసమర్పణము చేసితిమి-విశ్వాసాదులుగలిగి మమ్మురక్షించుభారము నీకప్పగించి వైచితిమనుట, (నః పరిపాలయ) మమ్ముఁ గాపాడుము, అని రక్షకునిగావరించుట. ఇట ఉత్తరార్థముచేత అనిష్టనివృత్తి రూపఫలప్రార్థనము తీర్పఁబడినది.

ఇందు 'పరాత్వత్తో గతిర్వీర పృథివ్యాం నోపపద్యతే। పరిపాలయనస్సర్వాన్ రాక్షసేభ్యో నృపాత్మజ' అనిమూలము. ఇట ఉత్తరఖండము వివరింపఁబడుచున్నది:—(పరాత్వత్తో గతిః) నీకంటె వేఱయిన యుపాయము, (పృథివ్యాం) భూమియందు-ఇది యుపలక్షణార్థము గనుక సర్వలోకములందని యు

ణుఁజొచ్చితిమి. రాక్షసులచే చంపఁబడు చున్నమమ్మురక్షింపుము. వీరా! రాజకుమారా! నీకంటెను మాకు వేఱుగతి భూతలంబునందెచ్చటను గలుగదు. ఈరాక్షసుల నుండి తొలఁగించి మమ్ముందఱిని రక్షింపుమా"యనిరి. ఆధార్మికుఁడును మహాతపస్సంపన్నులగునాఋషులుచెప్పినమాటవిని వారి నందఱిని జూచి *"మీరు నావిషయమై యిట్లు చెప్పఁదగదు. నన్ను మీర లాజ్ఞాపింపవలయునుగాని ప్రార్థింపరాదు. మిమ్ము రాక్షసులనుండి రక్షించుట నాసొంత ప్రయోజనమే. కాన నాసొంత ప్రయోజనమునుబట్టియె యడవిప్రవేశింపవలసి వచ్చినది. ప్రవేశింపకాననైతిని 'పితృవాక్యపరిపాలనమునకై వచ్చితి'నందురా నేనుదైవికముగా†పితృవాక్యమును పాలింపవలసిరాఁగా ఆనెపమున మీకార్యము నొనఁగూర్చుటకై నాయిచ్చను వనమునకు వచ్చినవాఁడనైతిని. నేను నాయిచ్చను మీకార్యమునెఱవేర్చుకొఱకే యిచ్చటికివచ్చినాను. కా

---

ర్థము. అనఁగా నిట 'నాన్యః పన్థా అయనాయ విద్యతే' అని శ్రుత్యర్థము మనసున నుంచుకొని పరిమిత ఫలత్వము మొదలైన బహుదోషములచే ఇతరోపాయములు దూషితములై యుండుటవలన సిద్ధోపాయమైన నీకంటెను (పరాగతిః) వేఱుఉపాయము, (న ఉపపద్యతే) దొరకదనుట, (పరిపాలయనః సర్వాన్) మమ్ము నెల్లఁ గాపాడుమనుటచే తమ్మును తమతోఁ జేరినవానిని అన్నిటిని ఒక్కటిగా సంగ్రహించి రక్షింపుమన్న మాట, (రాక్షసేభ్యః) రాక్షసులవలననుండి,యనుటచే సర్వానిష్టములవలననుండియును రక్షింపుమనుట గ్రాహ్యము.

*ఇందులకు 'నైవమర్హథ మాం వక్తు మాజ్ఞాప్యోహం తపస్వినాం। కేవలేనాత్మకార్యేణ ప్రవేష్టవ్యం మయావనం' అనిమూలము. (తపస్వినాం) మిక్కిలి తపస్సంపన్నులైన ఋషులకు,(ఆజ్ఞాప్యోహం) నేను ఆజ్ఞాపింపఁదగిన వాఁడను-నేను మీరాజ్ఞ సేయుటకుఁ దగిన విధేయుఁడనేకాన యిట్లు వన్నడుగుకొననేల యనుటచే సౌలభ్యము వ్యంజితమగుచున్నది. (కేవలేన ఆత్మకార్యేణ)కేవలము సొంతప్రయోజనముచేతనే-రాక్షసులు మీకు చేయుచున్న యావిప్రకారమును నిరాకరించుటకే యనుట. శేషభూతులను రక్షించుట శేషియొక్క ప్రయోజనమే యగునుగావున ఆశ్రితుల రక్షించుట తనసొంత ప్రయోజనమే యగునని చెప్పికొన్నాఁడు. రాక్షసులనుండి మిమ్ము రక్షించుట నాసొంత ప్రయోజనమైయుండఁగా నన్నిట్లుబతిమాలుకొననేల యనిభావము(వనం ప్రవేష్టవ్యం) వనమును ప్రవేశించితిననుట-పితృవచనపాలనము కేవలవ్యాజమే కాని వాస్తవము మీకార్యమును దీర్చుటకేవచ్చితిని కనుక కర్మవశమున వచ్చినవాఁడనుగానని యాశయము. గోవిందరాజులు.

† 'పితృవచనపరిపాలనము నేయునాసొంతప్రయోజనమునుబట్టియే యడవికి రావలసియుండినది. వచ్చినందులకు దైవికముగా రాక్షసులనుండి మిమ్మురక్షించునట్టి ఫలమును నాకొనఁగూడినది. నేను తండ్రియాజ్ఞను గావించుటకై వనంబునుఁ జొచ్చితిని. మీకార్యములనొడఁగూర్చుటకును నిటవచ్చితిని' అని ప్రాతీతికార్థము. వాస్తవార్థ మెట్లనఁగా:—నేను భక్తపరాధీనుఁడనుగావున తపస్వులయాజ్ఞకు లోనైనవాఁడను. మఱియు కేవలము నాసొంతకార్యమునకై యడవినిజొచ్చితినో! కాదు. రాక్షసులుమీకు నేయు విప్రకారమును నిరాకరించుటకేవచ్చితిని. పితృవాక్యపాలనార్థము వచ్చితినని శంకింపవలదు. అదివ్యాజమాత్రమే యగును. నేను మీకార్యము నొనఁగూర్ప నాయిచ్చను వచ్చితి నేకాని కర్మవశమున రాలేదు' అని మహేశ్వరతీర్థులు.

వున నే నీవనమందుండుటవలన మహాఫలము గలుగును. ఆఫలము మఱేమిగాదు. నేను తపస్వులకుఁ బగవారుగా నుండు రాక్షసులనందఱిని యుద్ధమున వధింపఁ గోరుచున్నాను. తపోధనులైన ఋషులందఱును నావీర్యమును, నాతమ్మునిపరాక్రమమును జూతురుగాక, యనెను. ఇట్లు రాముఁడు పరాక్రమవంతుఁడును ధర్మమునందు నిశ్చలమనస్కుండునగుటవలనను తపోధనులకుఁ బూజనీయుం బై నయాచారమును గలవాఁడగుటం జేసియు ఋషుల కభయ మొసఁగి లక్ష్మణునిగూడి సుతీక్ష్ణమహర్షిం గూర్చి పోయెను. ఇది యాఱవసర్గము.



రాముఁడు సుతీక్ష్ణాశ్రమమునకుఁ బోయి యాతనిని సందర్శించుట. సుతీక్ష్ణుఁడు మృగోపద్రవము సెప్పుట. రాముఁడు మృగవధమునకై ప్రతిజ్ఞ సేసి యా రాత్రి యాశ్రమమున వసించియుండుట.

పరంతపుఁడగు రాముఁడు సీతను లక్ష్మణునింగూడి యా వైఖానసాది బ్రాహ్మణులు వెంబడింప సుతీక్ష్ణమహర్షి యాశ్రమమునకుఁ బోయెను. రాముండట్లు దూరము చని మిక్కిలి *జలపూర్ణము లయిననదులను దాఁటి మహామేఘమువలె మిక్కిలిపొడవైనయొక పర్వతమును దానిం జేరినదై మబ్బువలెఁ గాఁబుకొనుచున్నయొక యరణ్యమును గాంచెను. అంత నిక్ష్వాకుకులతిలకు లగునా రామలక్ష్మణులు సీతాసహితులై నానావిధవృక్షసమూహములు నెరసి బెరసి యున్న యాయరణ్యమును బ్రవేశించిరి. రాముం డట్లు మిక్కిలియు పువ్వులును బండ్లును గలబహువృక్షములతోఁగూడి భయంకరముగా నున్న యాయడవిం జొచ్చి యచ్చట నొక యేకాంతభాగమున నారచీరలు వరుసగా కట్టఁబడి వన్నెగులుకుచుండు నొక యాశ్రమమును జూచెను. అచట రాముఁడు, మిక్కిలి తపస్సంపన్నుఁడైన సుతీక్ష్ణుఁ డనునొక తాపసుఁడు సుఖాసీనుఁడై యుండఁ జూచెను. ఆ తపసి సంస్కారము లేనందున దేహమునందు ముఱికియు నడవిని దిరుగాడుటచే దుమ్మునుగలిగి జడలుఁ దాల్చియుండెను. అతఁ డతివృద్ధుఁడుగాన కన్నులు తెలియనందున రాముండు న్యాయము చొప్పున నతనితో 'మహాత్మా! ధర్మజ్ఞుండవు, మహర్షివి, అమోఘతపః ప్రభావుఁడవు. నేను రాముఁడనువాఁడ. నిన్నుఁ జూడవచ్చితిని. ఇదె మ్రొక్కుచున్నాఁడను. మాఱు మ్రొక్కు' మనెను. అంత నామహర్షి, వీరుఁడును ధార్మికశిరోమణియు నగునా రాముని జూచి బారసాఁచి బిగ్గఁ గౌఁగిలించికొని యతనితో 'వీరాగ్రణీ! ధార్మికరత్నమా! రామా! నీకు స్వాగతము. నీవు వచ్చుటం జేసి

* ఇచట మందాకినినదియే బహుప్రదేశములందు మరలి మరలి వచ్చుటచే నదియే పెక్కునదులుగా చెప్పఁబడినదని తెలియునది.

యీ యాశ్రమ మిప్పుడు సనాథమయి వెలయుచున్నది. మహాయశా! *వీరుండవగు నీవువత్తువు. నిన్ను దర్శింపవలయు నని నీరాక నే యెదురుచూచుచున్నాఁడనుగాన భూతలమున దేహమునువిడిచి యిచటనుండి స్వర్గలోకమునకుఁ బోవకున్నాను. 'నారాక యెట్లు తెలియు' నందువా? నీవు చిత్రకూటమునకు వచ్చినదిమొదలుగా నీకు రాజ్యభ్రంశము గలిగినదని వినుచున్నాను. నేను స్వర్గమునకుఁ బోవుటకుఁ బ్రసక్తి వినుము. శరభంగమునికిఁగాను మహాదేవుఁడును దేవతాధీశ్వరుఁడు నగునింద్రుఁడు వచ్చినవాఁడై నన్నుఁజూడ నిచటికి వచ్చి నేను నా పుణ్యకర్మముచేత సమస్తలోకములను జయించితినని చెప్పిపోయెను. దేవర్షి సేవితములై తపమున మదార్జితములైన యాలోకములందు †నీవు నా ప్రసాదమున సీతను లక్ష్మణునింగూడి సుఖముగా విహరింపుము' అనియె. మహాత్ముఁడగురాముఁడు, కాశ్యపుఁడు బ్రహ్మదేవునితోఁ జెప్పినట్లు మహాతపశ్శాలియు సత్యవాదియు నగునామహర్షిం జూచి ‡'మహామునీ' నేనే నాయంతట లోకములను సంపాదించుకొనెదను. ఈయరణ్యమునందు మాకు వసతియగు వాసస్థానమును మాత్రము నీవు చెప్పఁగోరుచున్నాను. మహాత్ముఁడును గౌతమవంశ్యుఁడు నగుశరభంగుఁడు నీవు మహాత్ముఁడవనియు సమస్తభూతహితరతుఁడ వనియును జెప్పినాఁడు అనెను. లోకమునం బ్రసిద్ధిగాంచినయామహర్షి, రాముఁ డిట్లుచెప్పఁగా విని మిక్కిలియు హర్షమున మునిఁగి మధురవచనముల నతనితో 'రామా! ఈయాశ్రమమున ఋషులు పెక్కండ్రు మెలఁగుచుందురు. మఱి యిందు ఫలమూలములు ఎప్పుడును సమృద్ధముగానున్నవి; కాన యీయాశ్రమము గుణముగలది. ఇచ్చటనే వేడుకగా వసించియుండుము. మహాయశా! మృగములు మూఁకలుపెట్టి దేనికిని భయపడక యీ యాశ్రమమునకువచ్చి పలుగడల తిరుగాడుచు మిక్కిలి వింతలైన తమ రూపకాంతి గతివ్యాపారములచేత మాకాసలు గొలిపి మానసమాధిని చెఱిపి పోవుచు

*ఇందులకు 'ప్రతీక్షమాణస్త్వామేవ నారోహేఽహం మహాయశః। దేవలోక మితోవీర దేహంత్యక్త్వా మహీతలే' అనిమూలము, 'స్వర్గము మోక్షవిరోధిగావున నచటికిఁ బోవక నీరాక కెదురుచూచుచున్నాను' అని గోవిందరాజులు. స్వర్గము పరమపురుషార్థస్వరూప మగునీదర్శనమునకు అంతరాయముగాన నచటికిఁబోకున్నానని భావము. ఇచట వాస్తవార్థ మెట్లనఁగా: 'రావణవధార్థము రఘుకులముననవతరించితివి. నీకు రాజ్యభ్రంశమును గలిగినదని నీవు చిత్రకూటమునకు వచ్చినదాదిగావింటిని. కాఁబట్టి రావణవధార్థము నీవు ఈమార్గముగా నేవత్తువు అని నిన్నే యెదురుచూచుచు పరమపురుషార్థమైన నీదర్శనమునకు స్వర్గము అంతరాయముగనుక దేహమును విడిచి యచటికిఁబోకున్నాను.'' అని భావము—మహేశ్వరతీర్థులు.

† ఇందులకు 'మత్ప్రసాదాత్సభార్యస్త్వం విహరస్వయథాసుఖమ్' అనిమూలము (మత్ప్రసాదాత్) నాయందలి యనుగ్రహమువలన, నేనార్జించిన లోకములందు, (వి+హరస్వ) విశేషించి హరింపుము-ఆలోకములను స్వీకరింపుమని భగవంతునియందు తనకర్మఫలమును సమర్పించుబుద్ధితో ముని చెప్పెనని వాస్తవార్థము తెలియునది.

‡ ఇందులకు 'అహమేవాహరిష్యామి స్వయంలోకాన్ మహామునే' అని మూలము నీవు గడించినలోకములను నేను తప్పక స్వీకరించుచున్నాను 'అని భగవంతుని కర్మఫలస్వీకారము తెలియునది' గోవిందరాజులు.

న్నవి. ఇందు ఈ మృగములవలని బాధ యొకటితప్ప మఱి దోషము వేఱెద్దియు లేదని తెలియుము.' అనెను. ధీరుఁడైన యారాముఁడా ముని చెప్పినమాట విని విల్లెక్కుపెట్టి నారి దివియుచు 'మహాభాగా! నే నిచటనుంటినేని మృగములు రాఁగా నేను జూచినపుడు వాని నన్నింటిని పిడుగులవలె మెఱయుచు వాఁడి మొనలుగల నా బాణములచేఁ జంపెదను. అట్లు నీ యాశ్రమమృగములను జంపఁగా*నీకు విషాదము గలుగును. నేనపరాధము నీకుఁ జేసినవాఁడ నగుదును. అంతకన్న నాకుఁ గష్టమేమున్నది? కాన యీ యాశ్రమమునందు చాలకాలము, ఆ మృగములు కంటఁబడునంతవఱకు, నుండుట నా కిష్టము లేదు' అనెను. రాముం డిట్లా మునికిఁ జెప్పి యతఁ డనుజ్ఞ యియ్యఁగా సందెవార్చుటకు సరస్వతీరమునకుం బోయి సందె తీఱునఱకును నా తీరమున జపించుచుండి పిదప రమణీయమైన యా సుతీక్ష్ణాశ్రమమున ఆ రాత్రి సీతాలక్ష్మణులతోఁ గూడి వాసము గావించెను. అంత సంధ్యగడచి పోవఁగా రాత్రి యగుటఁ జూచి మహాత్ముండగు సుతీక్ష్ణమహాముని†పురుషలలాము లగు రామలక్ష్మణులను మిక్కిలియు సత్కరించి తాపసులు భుజించునట్టి మేలైన ఫలమూలాద్యాహారములను ఆ రాత్రికిఁ దగినట్టివానిని తానే తెచ్చి వారల కొసంగెను. ఇది యేడవసర్గము.

---- { సుతీక్ష్ణుని యనుజ్ఞచే రాముఁడు ఆశ్రమమండలమును జూచుటకై పయన మగుట.

రాముఁడును లక్ష్మణుఁడును సుతీక్ష్ణునిచేతఁ బూజితులై ఆ యాశ్రమమున నా రాత్రి యంతయుఁ గడపి తెల్లవాఱఁగా మేలుకొనిరి. రాముఁడు యుక్తకాలమున లేచి సీతం గూడి కలువతావులు గుబాళించుచుండు చల్లనినీట స్నానము గావించెను. లక్ష్మణుఁ డంతకుమును పే స్నానము సేసియుండెను. అంత ఋషులకు శరణ్యమైన యా యరణ్యమున పాపదూరులైన సీతారామలక్ష్మణులు, ప్రాతఃకాలమునఁ బ్రాప్తించిన యగ్నికార్యమును యథావిధిగఁ గావించి దేవతాపరిష్కృతుఁడైన నారాయణు నుపాసించి, ‡ సూర్యుఁ డుదయమగుచుండుటఁ జూచి సుతీక్ష్ణమహామునియొద్ద

---

*నీ యెదుటనే నీ యాశ్రమమృగములను జంపుట నీకు దుఃఖముగా నుండును నీ దుఃఖము నేను సహింపను. కాన మఱొకచోట నీకు మఱుఁగున వానిని జంపెదనని భావము. మఱొక ప్రదేశమునకుఁ బోయి మృగములను జంపెదననుట. రావణునితో మారీచుఁడు చెప్పినమాటలవలనఁ దెలియుచున్నది. గోవిందరాజులు.

† సీతకిచ్చుట చెప్పక పోయినను రాముఁడు భుజింపఁగా మిగిలినది సీత యాహారించెనని యూహ్యము.

‡ ఇచట సూర్యుఁ డుదయించుచుండుటను జెప్పుటచే హోమానంతరము సూర్యోపస్థానము చెప్పఁబడుటవలన ఉదయమునకుఁ బూర్వము చేయవలసిన హోమపక్షమును సూచితము గావున కాత్యాయనసూత్రక్రమమున రఘువంశపువారి యనుష్ఠానము ఉండెనని తెలియనగు.

కుఁబోయి మధురవచనముల 'మహాత్మా! పూజ్యుండవగునీచేత చక్కఁగా బూజలనుబొంది మేము రాత్రియంతయు సుఖముగానుంటిమి. చెప్పి పోవుటకు వచ్చినారము. మా వెంబడి వచ్చినమునులు మమ్ము తొందర పెట్టుచున్నారు. ఈ దండకారణ్యమున వసించినట్టిపుణ్యశీలు రగుఋషులయాశ్రమముల నన్నియుఁ జూడవలయునని మిక్కిలి తమకపడుచున్నారను. మేమును పరమధార్మికులును మహాతపస్సంపన్నులునై జితేంద్రియులై, యెనలేని యగ్నిహోత్రమువలె గుప్తమహత్త్వము గలిగియున్న యీమునీశ్వరులును నీ యనుమతిని గోరియున్నాము. దుష్కాలంబునఁ బుట్టి సాధుసహవాసము లేని ప్రభువు అన్యాయమున నైశ్వర్యమును సంపాదించి విఱ్ఱవీఁగు నట్లు సూర్యుండు మిక్కిలియు పొడిచి మిటమిటయెండ వేండ్రముగాఁ గాయగలఁడు. అంతకు మునుపే పోవఁగోరెదము' అనిచెప్పి రాముఁడును సీతయు లక్ష్మణుఁడును యామునిచరణములకు నమస్కరించిరి. ఆమునివరుఁడు తన యడుగుల నుముట్టి మ్రొక్కుచున్నయా రామలక్ష్మణులను లేవనెత్తి నెయ్యమొప్ప బిగియఁ గౌఁగిలించికొని 'రామా! లక్ష్మణునిని, తోడనీడవలె వెంబడించుచున్న యీసీతను గూడి పొమ్ము. *నీకు మార్గము నిరుపద్రవముగా నుండుఁగాక. వీరాగ్రణీ! తపమున నాత్మధ్యానపరిణతులై దండకారణ్యమున వసించు నీమహర్షుల రమణీయములైన యాశ్రమప్రదేశములను జూడుము. అందలివనములు మిక్కిలియు సమృద్ధముగా ఫలమూలములు గలిగి పుష్పించియుండును. వానియందు మిక్కిలి పొగడ్తగన్న మృగములు మూఁకలుగొని యుండును. పక్షిగణములు పరస్పర వైరములు లేక శాంతములై యుండును. మఱియందలి మడుఁగులను కొలఁకులను తామరతంపరలు పూచియుండును. జలములు తేటగానుండును. వానియందు నీరుకోళ్లు నెరసియుండును. చూడ్కులకు రమణీయములైన సెలయేళ్లును నెమిళ్ల కేకచే ధ్వనించుచుండు మనోహరములైన యరణ్యములును గలవు. వీనినెల్ల నీవు చూడఁగలవు. లక్ష్మణా! నీవునుగూడఁ బొమ్ము. రామా! నీవును బొమ్ము. నాయనా! మరలి యొకతూరి నాయాశ్రమమునకుఁ దప్పక రావలయును' అనెను. ముని యిట్లు చెప్పఁగా రాముఁడు వల్లెయని లక్ష్మణసహితుఁడై యామునికిఁ బ్రదక్షిణముగావించి పయనముగాఁ దొడఁగెను. † అంత సీత వాలుంగన్నులు వన్నెగులుక నాయన్నదమ్ముల కిద్దఱికిని మిక్కిలి మేలయినయమ్ములపొదులను, విండ్లను తళతళలాడు పిడులుగలకత్తులను జేతి

---

* దీనికి 'అరిష్టం గచ్ఛ పన్థానమ్' అని మూలము దీనిచే రావణవధమునకు సుతీక్ష్ణుఁ డనుజ్ఞ యిచ్చుట తెలియునది.

† దీనివలనఁ దోఁచునర్థమేమనఁగా:—ఆశ్రమములను బ్రవేశించునపుడు మనకాయుధములతో బనేమి యని తలఁచి సీత వానిని మునిగృహమునం దొకానొకచోట పెట్టియుండెను. కాని రాముఁడు 'అన్యాయమార్గమున' అని చెప్పినమాటలను సుతీక్ష్ణుఁడు 'మార్గము నిరుపద్రవమగుఁ'గాక అన్నమాటలను బట్టియు వారలయభిప్రాయము నెఱిఁగి తానే వానిని దెచ్చిమరల నిచ్చినదని తెలియుచున్నది.

యొకటి యిచ్చెను. రామలక్ష్మణు లిరువురును అమ్ములపొదులను మూఁపులఁ గట్టుకొని మెఱయుచున్న విండ్లనుచేతఁ బట్టికొని యాశ్రమమునుండి పోవఁ బయలువెడలిరి. శ్రీమంతులై సౌందర్యమున సొంపు పెంపారుచు నిజతేజంబులు ప్రజ్వరిల్ల, ధనుర్ధరులై యారామలక్ష్మణులును సీతతోఁగూడి పయనమైపోయిరి. ఇది యెనిమిదవసర్గము.

రాముఁడు మునిజనసమక్షమున సమస్తరాక్షసులను
వధింతు నన్న ప్రతిజ్ఞకు సీత భయపడి యతిప్రేమ
ముతో నిర్వైరు లగురాక్షసుల నెల్ల
* వధింపకుండ విన్నవించుకొనుట.

సుతీక్ష్ణమహాముని యనుజ్ఞఁ జెంది బయలుదేఱిన తన పెనిమిటిని రామునిం జూచి సీత మనస్సున కింపై †నెయ్యము గులుకుపలుకుల‡ 'నీ వనుష్ఠించెడి యీ ముని ధర్మము మిక్కిలియు గొప్పది. మిక్కిలి సూక్ష్మమయినమార్గమున విచారముసేసి దీనిని ధర్మకాములైనవారు సంపాదింతురు. ఆమార్గము మఱేదియుఁ గాదు. తన యిచ్చచేఁ గలుగునట్టి వ్యసనములను విడువవలయును. అట్టివ్యసనములను విడిచినవా

---

* సీత ఆయుధములను దాల్చి సన్నద్ధుఁడైనభర్తనుజూచి యతనితో 'నీవు ఆయుధధరుఁడవై రాక్షసులు మిక్కిలియుఁగలదేశమును బ్రవేశింతువేని యప్పుడు వారితోడ నీకు విరోధము గలుగును కనుక వారిని దలపడుటకై నీవు పోవఁగా మన కిద్దఱకిని వియోగము గలుగును. దానిచే నీకు మిక్కిలి క్లేశము గలుగును. కాఁబట్టి యాయుధముల నిచట నే పెట్టి మనము వనమునకుఁ బోవఁదగు'నని యీసర్గమునఁ జెప్పుట తెలియునది-గోవిందరాజులు- 'కేవలము పితృవాక్యమును పరిపాలింపవలసిన నాసొంత కార్యమును బట్టియే యడవిని బ్రవేశింపవలసియున్నది. దానిచే దైవికముగా రాక్షసులచే మీకుఁగలుగు విప్రకారములను బోఁగొట్టుటయు నాకగూడినది' యని మునులకు రాక్షసవధమును బ్రతిజ్ఞసేయుచున్న భర్తనుజూచి సీత అహింసయే పరమధర్మమనున్యాయమున పెనిమిటి హింసను విడుచునట్లుచేయుటకు లోకదృష్టాంతపూర్వకముగా నిసర్గమున బోధించుచున్నది. - మహేశ్వరతీర్థులు.

† ఇందులకు 'హృద్యయా స్నిగ్ధయా వాచా' అని మూలము, (స్నిగ్ధయా) స్నేహప్రవృత్తమైన, (వాచా) మాటచేతననుట, దీనివలన సీత చెప్పఁబోవునదంతయు రామునియందలి స్నేహమునుబట్టియే యని తెలియునది. రాముఁడు ఋషులకు ప్రతిజ్ఞచేసియుండుటయు రాముని ప్రతిజ్ఞ నిలుపశక్యముగానిదగుటయు సీత పలుమాఱు కనుంగొనియుండినదయ్యును రాక్షసులతోడ విరోధముగలిగినపుడు భర్తకు తన్నెడఁబాయుట మూలమున మహాక్లేశము గలుగునని ప్రేమాంధయై యట్లు చెప్పినదని తెలియునది.

‡ ఇట 'అయం ధర్మః సుసూక్ష్మేణ విధినా ప్రాప్యతే మహాన్ । నివృత్తేన తు శక్యోయం వ్యసనాత్కామజాదిహ॥'' అనిమూలము ఇందులకు 'యస్తుధర్మం తు' అనియు 'అధర్మం తు' అనియు పాఠాంతరములు 'అధర్మం తు' అనుపాఠమున (మహాన్) నీవుమహాత్ముఁడవయ్యును, (సుసూక్ష్మేణ విధినా) సూక్ష్మమార్గమున విచారింపఁగా, (అధర్మం ప్రాప్యతే) అధర్మమునే పొందుదువు. ఈయధర్మమును కామజవ్యసనములను విడిచినట్టివానికి, అనఁగా నీకే, పరిహరించుకొన శక్యమగును అనియర్థాంతరము.

నికి దీనిని సంపాదింప శక్యమగును. మిక్కిలియు కామజనితములైనయావ్యసనము లీలోకమునందు మూఁడేకలవు. అవి యేవనఁగా అన్నివ్యసనములకంటెను అబద్ధము చెప్పుట గొప్పవ్యసనము. పరదారగమనమును పగలేకయే హింససేయుట యను నీ రెండును దానికంటె గొప్పవి. రాఘవా! నీవింతవఱకెన్నఁడును అబద్ధమాఁడిన వాఁడవుకావు; ఇంక నాడఁబోవునదియు లేదు. అధర్మకరమైన పరదారాభిలాషము నీ కెక్కడిది? పురుషశ్రేష్ఠా! పరదారాభిలాషమాత్రము నీ కిప్పుడును లేదు; మఱి యింతకుముం దెప్పుడుగాని నీకుఁ గలిగినదిలేదు; ఇఁక మనస్సునందుఁగూడ నీ కదియే సుందరియందుఁగాని యెుకప్పుడును గలుగదు. వారియం దభిలాషయే లేకుండఁగా వారినిబొందుట యెక్కడిది? ఇట్లుండుటకుఁ గారణము లేకపోలేదు. రాజకుమారా! నీ వెప్పుడు స్వభార్యయందే యాసక్తిఁగలవాఁడవు; పరమధార్మికుఁడవు; సత్యసంధుఁడవు. కావుననే తండ్రియాజ్ఞను జవదాఁటక గావించితివి. సత్యసంధా! మహాధర్మాత్మా! శ్రీమంతా! లక్ష్మణాగ్రజ! వైరాగ్యమున లక్ష్మణునికన్న నధికుఁడవు. నీయందు ధర్మము నెలకొనియున్నది. సత్యమును నెలకొనియున్నది. వేయేల! ఐశ్వర్యవైరాగ్యాదు లన్నిగుణములును స్థిరముగా నెలకొనియున్నవి. మహాబాహూ!* అట్టి పరమధార్మికత్వము సత్యసంధత్వము మొదలైనగుణములన్నియును జితేంద్రియులం దుండును గాని మఱెవ్వరియందు నుండవని నేనెఱుంగుదును. నీవును జితేంద్రియుఁడ వనియు నెఱుఁగుదును. ఇందులకు శుభమైననీరూపమె ప్రమాణము. పగలేకయే పరులప్రాణములను హింసించుటయే రౌద్రమనెడి మహావ్యసనము. ఇట్టివ్యసనమును పామరులే యజ్ఞానమునఁ జేయుదురు. అది నీకిప్పుడు చేయఁ దటస్థించినది. అది యెట్లో చెప్పెద వినుము. వీరోత్తమా! నీవు దండకారణ్యమున వసించు ఋషులను రక్షించుటకుఁగాను రాక్షసులనెల్ల యుద్ధమున వధించునట్లు ప్రతిజ్ఞ గావించితివి. ఋషులప్రార్థనమునుబట్టియే కాక నియంతనే నీవిందులకొఱకై తమ్మునితోఁగూడ, విల్లును బాణములను దాల్చి దండక మనెడి యీయరణ్యమునకుఁ బయనమైవచ్చితివి. † అంత, నీ వట్లు

* ఇందులకు 'తచ్చసర్వం మహాబాహో శక్యం ధర్తుం జితేంద్రియైః। తవ వశ్యేంద్రియత్వంచ జానామి శుభదర్శన' అని మూలము 'బాహోశక్యం' అనుచో 'బాహో అశక్యమ్' అని ఛేదము. ఇతరులకు జితేంద్రియులైనవారికని ఈగుణములెల్ల తెలిసికొనుటకుఁగూడ నలవిగావు-ఇట్టివన్నియు నీకుఁగల వని నేనెఱుంగుదును. ఇట్టినీకు పూర్వోక్తములైన రెండువ్యసనములు కలుగుటయే సంభవింపదనిభావము.

† నీవో సత్యప్రతిజ్ఞుఁడవు; కావున రాక్షసులను జంపక విడువవు. పగలేకయే వారిని జంపను నొల్లవు. ప్రతిజ్ఞనుబట్టి చంపకుండరాదు; పగలేమినిబట్టి చంపరాదు. మఱి వారితో పగకలుగవలయు నేని యందులకు నేనే కారణమగుదును. అప్పుడు నీవు ఏకదారవ్రతుఁడవు గాన నన్నుఁ బాసియుండ నేరవు. ఇట్లు నీకుఁ గల సత్యప్రతిజ్ఞతకును ఏకపత్నీవ్రతమునకును నీవు పూనినరాక్షసవధము పొసఁగదే! కాఁబట్టి నీపూనిక యెట్లొనఁగూడును అని యాలోచించుచున్నదాననై నీకీసంకటములు వదలి యిఁక సుఖ మెట్లు కలుగును? దాని కేమి యుపాయము? అని చింతచే మనస్సుకలఁత నొందియున్నానని భావము.

పయనమై వచ్చుటం జూచి, సత్యప్రతిజ్ఞత యేకపత్నీవ్రతము మొదలైన నీసడవళ్లనుం జూచి నీకీసంకటములు వదలి సౌఖ్య మెట్లు గలుగును? అందులకై యిచట సాధనము లేమి? అని యాలోచించుచుండఁగా నా మనస్సు మిక్కిలియు చింతాకులమగుచున్నది సుమీ. వీరా! దండకారణ్యమునకుఁ బోవువిషయమున నాకిష్టము లేదు. అందులకుఁ గారణము చెప్పెద, వినుము. విల్లును బాణములను దాల్చి తమ్మునితోఁగూడి వనమునకు వచ్చిననీవు, వనమందు తిరుగు రాక్షసులను జూచినపుడు వారిపై నెల్ల బాణములు విడుతువే కదా. అగ్నికి సమీపమునఁ గట్టె లున్న యెడల దాని తేజస్సు బలిమి మఱియు నతిశయించును. క్షత్రియులకు సమీపమున ధనువున్న యెడల వారి తేజోబలమును మిక్కిలియు వర్ధిల్లును. ఇందుల కొక కథ వినుము. మహాబాహూ! తొల్లి మృగములును పక్షులును మిక్కిలి సొంపున మెలఁగుచుండు నొక పుణ్యవనమున సత్యవాదియు పరిశుద్ధుఁడు నగు నొక తపసియుండె నఁట. అంత నింద్రుఁ డా మునితపస్సును జెఱుపుటకే పూని యొకభటునివలె రూపు దాల్చి కత్తి చేతఁ బూని యతనియాశ్రమమునకు వచ్చెను. అట్లు వచ్చి యా యాశ్రమమున పవిత్ర మగు తపస్సు గావించుచున్న యా మహర్షికి వాఁడియైన యా మేటి ఖడ్గమును దాఁచినసొమ్ముగా నిచ్చిపోయెను. ఆమునివరుఁడు తనయొద్ద దాఁపఱికముగా నుంచినదానిని గాపాడుటయందే కన్ను గలవాఁడు గావున తనయందలి నమ్మకముతో నుంచిన యాకత్తిని పదిలముగాఁ జూచుకొనుచునే యడవిని దిరుగుచుండెను. అతఁడు తనయిల్లడను గాచుటయందే కన్నుఁగలవాఁడై ఫలమూలములను దెచ్చుకొనుటకు నెచ్చటికిఁ బోయినను ఆఖడ్గమును విడిచిపోవఁడు. ఆమహర్షి యి ట్లెల్లప్పుడును ఆయుధమును ధరించుచు రాఁగా నానాఁటికి క్రమముగా నతనికి తపస్సునందలి బుద్ధి మాని యాయుధధారులకుఁ గలుగు హింసారూప మైన రౌద్రబుద్ధి గలిగెను. అంత నాముని ఆయాయుధముతోడి సంబంధమువలన హింసాకర్మమందుఁ దగులుపడి యొడలు దెలియక యధర్మములఁ బీడితుఁడై తుదకు నరకము నొందెను. ఆయుధసాంగత్యమువలన పూర్వ మిట్టివృత్తాంతము జరిగిన దందురు. అగ్నిసంబంధ మెట్లో యట్లే ఆయుధసంబంధమును వికారహేతువని పెద్దలు చెప్పుదురు. నాకు నీయందుఁ గలనెయ్యమునను నీకు నాయందుఁ గలగారవమునను, నీకుఁ దెలిసిన విషయమునే తలపించుచున్నానింతే కాని నీకుఁ దెలియదని గఱప లేదు. నీవు దండకారణ్యమందలి రాక్షసులను పగలేక నిరపరాధముగా విలుదాల్చి జంపుబుద్ధి యెట్లుగాని పూన దగదు. వీరోత్తమా! అపరాధము లేక వ్యర్థముగాఁ బ్రాణులను జంపుట నే నొల్లను 'అట్లేని క్షత్రియునకు విల్లుపూనవలసిన యగత్యము లేకుండు'నందువా? అడవియందు మెలఁగు మునులు మొదలైనవారు పీడితులయి రేని వారలను బాధపెట్టువారి నదల్చి పాఱఁదోలి వారలను గాపాడుటయే వీరులయిన క్షత్రియులకు వింటితోఁ జేయవలసిన పనిగాని యాబాధకులనెల్లఁ బట్టి హింసించుటగాదు. 'అట్లు

గాపాడుటకైనను విల్లు వలదా' యందువేని యదిరాజ్యమును బాలించునప్పుడుగదా తగును. ఆయుధ మెక్కడ! అడవియెక్కడ! క్షత్రియధర్మమెక్కడ! తపమెక్కడ! ఇవన్నియు పరస్పరవిరుద్ధములు. కాఁబట్టి మనము దేశమునకుఁ దగినధర్మమునే పాటింపవలయు. ఈ యడవికి తపస్సేతగును; కావున దానినే చేయఁదగునుగాని యాయుధముగాని క్షత్రధర్మముగాని యిట దగవు. 'అప్పటికి స్వధర్మము తలక్రిందగుచున్నదే' యందువా? ఆర్యా! ఆయుధమును బట్టుట వలన బుద్ధికిఁ జెఱుపుఁగలుగును. కాన దానినివదలి తపముగావింపుము. వలయునేని మరలి యయోధ్యకుఁబోఁగా నచట క్షత్రియధర్మము నాచరింపనచ్చును. ఇట తపముమాత్రము చేయుటచే మఱియొక ఫలమునుగలదు. నీవిఁక నెప్పటికిని రాజ్యమే వలదని దిగవిడిచి నిరతము మునివైయుందువేని అత్తకైకకును మామగారు దశరథులకును, అక్షయ మగుసంతోషముగలుగును. నీ బుద్ధియు అకలుషముగానే యుండును. ధర్మమే సర్వశ్రేయములకు మూలము. ఎట్లన ధర్మమువలన ధనము గలుగును. ధర్మమువలన సుఖముగలుగును. వేయేల ధర్మమువలననే సర్వమును గలుగును. కాన యీప్రపంచమునకంతయు ధర్మమేసారము. ధర్మము నార్జించు విధమిది. నిపుణులైనవారు నానావిధప్రయత్నములు పడి చాంద్రాయణము మొదలైన యాయావ్రతములచేత దేహమును గృశింపఁజేసి, ధర్మమును బడసెదరు. ఎన్నటికిని సుఖము వలన సుఖము దొరకొనదు. సౌమ్యా! అట్లుగావున నిత్యమును తపోవనముననుండి నిర్మలమైన మతిగలిగి ధర్మము నాచరింపుము. ముల్లోకములందుఁ గల సమస్తమును నీకుఁ గలరూపునఁ దెలిసియున్నది. నీకుఁ దెలియని దొకటియు లేదు. ఆఁడుదానికిఁ గలచాపలమున నే నది నీకుఁ జెప్పిచూపితిని. కాని అన్నియు తెలిసిన నీకుఁగూడ ధర్మముపదేశింప నెవఁడు సమర్థుఁడు! నీవు నీబుద్ధినే కొని లక్ష్మణునితోఁగూడి చక్కఁగా నాలోచించి యేది యిష్టమో దానిని జేయుము. జాగు వలదు'' అని చెప్పెను. ఇది తొమ్మిదవసర్గము.



రాముఁడు సీతకు నార్తరక్షణము క్షత్రియధర్మమగుటచేతను దన్ను శరణుఁజొచ్చినవారివిరోధులే తనకును విరోధులగుటచేతను బ్రతిజ్ఞచొప్పున రాక్షసవధము అవశ్యము చేయవలయునని చెప్పుట.

*సీత భర్తయందలిప్రేమమువలన నిట్లుచెప్పినమాటనువినియు,రాముఁడుధర్మ

*సీత రాముఁడురాక్షసులను జంపుదునన్నప్రతిజ్ఞ తప్పఁడు. పగలేకనిరపరాధముగారాక్షసులను జంపఁడు. నన్నుఁబాసియే రాక్షసులను జంపవలెను. నన్నెడఁబాయుటకును ఓపఁడు. ఇట్లుప్రతిజ్ఞ తప్పనుగూడదు;ప్రతిజ్ఞతీర్చుటకునులేదు. నన్నెడఁబాయనోపఁడు; నన్నెడబాయకుండుటకును నరిపడ

మునెంతమాత్రము దప్పనివాఁడుగాన యాబిడను జూచి 'దేవీ! నీవు ధర్మజ్ఞురాలవు. అందును జనకరాజుకడుపునఁ బుట్టినదానవు. నీవు నాయందుఁగల స్నేహమునకుఁ దగినట్లు హితమగుమాటఁ జెప్పితివి. అట్టిమాటవలననే నీగొప్పకులమును బయలుపుచ్చితివి. 'నేను జెప్పినది హితమని యొప్పుకొందువేని యట్లేచేయు' మందువా? దేవీ! అందులకు నేనేమి చెప్పవలయును. ఆర్తులు గూయిడరాదని క్షత్రియులు విలుదాల్తురని నీవే చెప్పియున్నావే. సీతా! వాఁడి నియమములు గలిగి శరణ్యులై దండకారణ్యమందలిమునులు తామే నాయొద్దకువచ్చి నన్ను శరణుఁ జొచ్చినారు. ఆ మునులు ధర్మపరాయణులై యడవియందు ఫలమూలముల నాహారముగాఁ గొనుచునుండువారు. అట్లుండియు క్రూరకర్ములగు రాక్షసులకు భయపడి సుఖముఁ బడయకున్నారు. మాంసాహారులైనభయంకరులగురాక్షసు లడవియం దెల్లకాలము నానావిధవ్రతములు గావించుకొనుచుఁ గాలముపుచ్చుమునులనుబట్టి భక్షించుచున్నారు. దండకారణ్యమున వసించునాబ్రాహ్మణోత్తములు ఆమునులు అట్లు రాక్షసులు భక్షించుచుండఁగా సైఁపలేక నాయొద్దకువచ్చి 'మమ్ము అనుగ్రహింపుము' *అని వేఁడిరి. నేను వారలు చెప్పినమాటను విని వారలపాదములకు వందనముగావించుచు 'మీరలు నన్ను క్షమింపుఁడు. నేనే మీయొద్దకు వచ్చి సేవచేయవలసినవాఁడను. ఇట్టి మహనీయులగుమీరే నాయొద్దకువచ్చి యిట్లు వేఁడుచున్నారనుట నాకు మిక్కిలియు సిగ్గుగానున్నది. నేనేమిచేయవలయును చెప్పుఁడు' అని యాబ్రాహ్మణుల యెదుటనే యీమాట చెప్పితిని. అంత వారందఱును జేరి నన్నుఁ జూచి, 'రామా! దండకారణ్యమున కామరూపులగు రాక్షసు లనేకులువచ్చి మమ్ము మిక్కిలి నలుపుచున్నారు, మమ్ము ఆబాధలేకుండ రక్షింపుమా! అనఘా! రాక్షసుల నెదిరించుట యెంతమాత్రము మాకుఁ దరముగాదు. వారు మాంసాహారులు. మఱి హోమసమయములందును దర్శపౌర్ణమాసాదికాలములందును పాఱుతెంచి మమ్ము నిరసించెదరు. రాక్షసులచే నానావిధములుగఁ బీడింపఁబడుచు కనికరింపఁ దగియున్న ఋషులందఱును తమ్ముఁ గాచు దిక్కు వెదకుచున్నారు. అట్టి మాకు నీవే పరమగతివి, ఔను. మేము మాతపప్రభావముననే రాక్షసులను జంప శక్తులమే! అయినను చిరకాలము కష్టపడి సంపా

దు. ఇట్లు సంకటము గలిగినదే యని మనస్సు కలఁగి రాక్షసవధమునుండి రాముని మరల్పఁ జూచినది. కాని రాముఁడు సీతావిరహమునకోర్చియైనను సీతను బాయుటచేఁ గలిగిన వైరముచే రాక్షసులనుజంపి ప్రతిజ్ఞ దీర్చుకొనియే తీఱుదునని యిందుఁ జెప్పుచున్నాఁడు.

* ఆర్తులవిరోధులను కూరకదోలియే ఆర్తులను రక్షింపవలెనుగాని వారికివిరోధులైనను మనకునిరపరాధులైనవారిని జంపరాదని సీత చెప్పఁగా నిందు రాముఁడు ఋషులు తన్ను శరణుఁ జొచ్చుటచే తనకు ప్రాణభూతులైరి గావున వారికి అపరాధము గావించుట నాకుఁ గావించినదే యగును. కావున వారిని నేను జంపక విడువరాదని చెప్పినాఁడనుట యూహించునది.

దించిన తపస్సంతయుఁ దూలుచున్నదే! కాన యట్లు చేయకున్నాము. రాఘవా! తపస్సుచేయుట మిగులఁ గష్టము. దానికి నిత్యమును విఘ్నములు పెక్కు. కాఁబట్టి యింత కష్టపడి గడించినతపస్సును వెచ్చింపఁ జాలక రాక్షసులు పట్టి భక్షించుచున్నను వారలను శపింపకున్నారము. అట్లు గావున నీవును లక్ష్మణుఁడును దండకారణ్యవాసు లయినరాక్షసులచేఁ బీడితు లగుచున్నమమ్ము రక్షింపుఁడు. ఈయడవి యందు మాకు మీరేకదా దిక్కు. మీరు దక్క మఱెవ్వరున్నారు!' అనిరి. జానకీ! నే నాఋషులు చెప్పినది విని దండకారణ్యమున వారినందఱిని అన్నివిధములఁ బూర్ణముగా రక్షించెదనని ప్రతిజ్ఞ చేసితిని. నేను ప్రతిజ్ఞ చేసిన వెనుక నాబొందిని ప్రాణములుండఁగా మునులకుఁగాఁ జేసినయాప్రతిజ్ఞఁ దప్పఁజాలను. నాకు సత్యము సర్వకాలావస్థలయందును ప్రియమని నీకుఁ దెలియును గదా! * సీతా! నేను నాప్రాణమునైన విడుతును. ఇంతేల! నిన్నైనను లక్ష్మణునిఁగాని దిగవిడుతును. కాని యెవ్వరికేని ప్రతిజ్ఞ సేసితినేని దానినిమాత్రము విడువను. అందును విశేషించి బ్రాహ్మణులకుఁ జేసిన ప్రతిజ్ఞ నన్ననో యెంతమాత్రము విడువను. సీతా! అట్లుగావున ఋషులు నాతో చెప్పుకొనకపోయినను నే నవశ్యము వారిని పరిపాలింపవలసినదే. అట్లుండఁగా వారు నన్నుఁ బ్రార్థింపఁగా, నేను రక్షించునట్లు ప్రతిజ్ఞ చేసి యుండఁగా, నీకుఁ జెప్పవలయునా? అనఘాత్మురాలా! నాకు నీయందుఁ గలస్నేహమునను నీకు నా యందుఁ గల మంచి మనస్సువలనను, నీ వీమాటను జెప్పితివి. నాకు మిక్కిలియు సంతోషమైనది. ఎవరుగాని ప్రియుఁడైన వానికే హిత ముపదేశింతురుగాని అప్రియున కుపదేశింపరుగదా! నీవన్నమాట నీమనస్సునకును దగినది; నీకులమునకును అనురూపమైనది. నీవు నా ప్రాణములకంటె నెక్కుడైనదానవు. అయినను నే నే

---

*ఇందులకు 'అప్యహం జీవితం జహ్యాం త్వాం వా సీతే సలక్ష్మణామ్ । నతు ప్రతిజ్ఞాం సంశ్రుత్య బ్రాహ్మణేభ్యో విశేషతః' అని మూలము. (జీవితం) ప్రాణమును 'ఆత్మానం సర్వదా రక్షే ద్దారైరపి ధనైరపి' అనిధనముకంటెను దారకంటెను నెక్కుడైన ప్రాణమునైనను. (జహ్యాం) విడుతును, (సలక్ష్మణాం త్వాం) లక్ష్మణునితోఁగూడ నిన్నును-అనఁగా 'భ్రాతా స్వామూర్తిరాత్మనః' 'తోఁబుట్టువు తన మఱియొకరూపము' అనునట్టి తోఁబుట్టువైన లక్ష్మణుని 'అర్ధో వా ఏష ఆత్మనో యత్పత్నీ' అనునట్లు తనయందర్ధభాగమైన పత్నియగు నిన్నును విడుతును; కాని ఒకరికి చేసినప్రతిజ్ఞను ఎంతమాత్రము తప్పను. (బ్రాహ్మణేభ్యః) బ్రహ్మవిదులైనవారికి విశేషించి ప్రతిజ్ఞ తప్పను. గోవిందరాజులు- (అప్యహం జీవితం జహ్యాం) ప్రాణములనైనను విడుతును, (త్వాం వా) 'న జీవేయం క్షణమపి వినా తామసితేక్షణాం' 'ఆ నల్లనికన్నులదానిని విడిచి క్షణమైనను బ్రతుకనేరను' అనియు 'ప్రాణేభ్యోఽపి గరీయసీ' 'ప్రాణములకంటె నెక్కుడయినది' అనియు చెప్పఁబడిన నిన్నును, (సలక్ష్మణాం) లక్ష్మణునితోడ 'అద్యైవాహం గమిష్యామి లక్ష్మణేన' లక్ష్మణునితోడ నే నిప్పుడే పోయెదను' అని యెవఁడు రావణునిచే మూర్ఛిల్లినప్పుడు తానెంతమాత్రము నశించనెడఁబాసి నిలుపోపనని రాముఁడు చెప్పెనో అట్టి ప్రీతిపాత్రుఁడయినలక్ష్మణునిని విడుతును. కాని ప్రతిజ్ఞను మాత్రము విడువను' తనిశ్లోకి.

ధర్మమును సంకల్పింతునో దానినే నీవును సంకల్పించుకొనవలయును. వేఱు కూడదు" అనెను. మహాత్ముఁడగు రాముఁడు జనకరాజకూఁతురగు తన గారాబు సీతకిట్లు చెప్పి ధనుర్ధరుఁడై లక్ష్మణునిం గూడి రమణీయములగు తపోవనములకుఁ బోయినవాఁడయ్యె. ఇది పదియవసర్గము.



అడవి నడుమ రాముఁడు దన వెంటవచ్చిన ధర్మభృతుం డను మునివలన మాండకర్ణి నిర్మించిన పంచాప్సర మను సరస్సు ప్రభావము విని ఋషులందఱి యాశ్రమములందుఁ గొంతకాలముండి మరల సుతీక్ష్ణాశ్రమమునకు వచ్చి సుతీక్ష్ణుని నగస్త్యాశ్రమ ముండుచోటు నడుగుట. సుతీక్ష్ణుఁ డగస్త్యాశ్రమమునకు నగస్త్యభ్రాత యాశ్రమము మూలముగాఁ బోవలయు నని చెప్పి యామార్గపు చిహ్నములు దెలుపుట. రాముఁ డామార్గముననే పోవుచు లక్ష్మణుని కగస్త్యకథలను జెప్పుచు నగస్త్యభ్రాతయాశ్రమమున నొక రాత్రియుండి వేకువను బయనమై లక్ష్మణునకు నగస్త్యుని వింధ్యస్తంభనాదులను జెప్పుచు నమ్ముని యాశ్రమమును జేరి తొలుతఁ దనరాకఁ దెలుపుటకై యమ్మునికడకు లక్ష్మణుని బంపుట.

* రాముఁడు ముందఱఁ బోయెను. సీత యన్నువకౌఁదీఁగె వన్నెగులుక నడుమ నడచెను. వారిపిదప లక్ష్మణుఁడు విల్లుఁబట్టి వెంబడించెను. ఆ రామలక్ష్మణులు పలుదెఱఁగులైన కొండచఱియలను, వనములను, నానావిధములై సొంపు గులుకు

* ఇందులకుమూలము 'అగ్రతః ప్రయయౌ రామస్సీతా మధ్యేసుమధ్యమా। పృష్ఠతస్తు ధనుష్పాణి ర్లక్ష్మణోనుజగామహ' ఇందు ప్రణవార్థము ప్రకాశితమని సంప్రదాయము. ఎట్లనిన:- (అగ్రతః) అనియిందు 'అ'వర్ణము మొదటఁగలిగియుండుట తెలియునది, (అగ్రతః ప్రయయౌ) అనుటచే అర్థప్రాధాన్యము తెలియునది, (రామః) అనుటచే 'సత్తా సంపాదన రక్షణాదినారమతే' 'సత్త గలిగించుట రక్షించుట మొదలైనవానిచే రమించుచున్నాఁడు' అను వ్యుత్పత్తివలన కారణత్వమును రక్షకత్వమును దెలియుచున్నవి. మఱియు 'రమాసంబంధి రామః' అనువ్యుత్పత్తివలన శ్రీపతిత్వమును తెలియుచున్నది. (సుమధ్యమా) అనుటచే (స్+ఉ) ప్రణవపు రెండవయక్షరమైన 'ఉ'వర్ణము దెలియునది. (మధ్యే) అనుటచే ఉవర్ణము రెండువర్ణములకు మధ్యముననుండుట తెలియునది, (సీతామధ్యే) అనుటచే లక్ష్మీ పురుషకారత్వము వ్యంజితము, (లక్ష్మణః) 'మనజ్ఞానే' 'మన అవబోధనే అని మకారోక్తమైన అసాధారణధర్మవత్వమును, (ధనుష్పాణిః) అనుటచే లుప్తచతుర్థిచే నిరూపితమైన కైంకర్యమును, (అనుజగామ) అనుటచే అహంకార మమకారములు త్యజించి అనుసరించుటయు వ్యంజితములు. 'అనుజగామ' అని యీపదాంత మకారమువలన ప్రణవపు తృతీయవర్ణము వ్యంజితమగుచున్నది. తనిశ్లోకి-

ఇందులకు 'తాపశ్యమానో వివిధాన్ శైలప్రస్థాన్వనానిచ' ఇత్యాదులుమూలము. వీనియందు 'నారాయణ' పదార్థమును మాండకర్ణి వృత్తాంతమున 'నమః' పదార్థమును ప్రకాశితములని సంప్రదాయము.

నదులను, ఆనదుల యిసుకదిన్నియలపై తిరుగాడు సారసములను చక్రవాకములను, జలపక్షులు వెక్కుగలిగి తామరలచే కొమరుచూపు కొలఁకులను, పిండుగట్టి యున్న బొట్లలేళ్లను మదముచే మైమఱచి వాఁడికొమ్ములం గోరాడు నెనుపోతులను, పందులను, మ్రాఁకులను జూచిన విఱిచి గూల్చునట్టి యేనుఁగులను,జూచుచు సీతతోఁ గూడఁ బోయిరి. వారందఱునుగూడి బహుదూరముపోయి సూర్యుం డస్తమింపఁ బోవు సమయమున రమణీయమై నాలుగుప్రక్కలను యోజనప్రమాణము విరివి గల యొకతటాకమును గాంచిరి. అందు తామరలును సర్పములును మెండుకొనియుండెను. ఏనుఁగులును గుంపులుకొని నలుగడల సొంపు గులుకుచుండెను. నీటఁదిరుగాఁడు బెగ్గురుపిట్టలును రాయంచలును కలహంసములును నెరసి బెరసియుండెను. నిర్మల జలములు గలయాచెలువంపుకొలఁకుననుండి గీతవాద్యముల ధ్వని వినవచ్చెను; కాని యందొకఁడును గానఁ బడఁడయ్యె. అంత రాముఁడును మహాబలుఁ డగు లక్ష్మణుఁడును కుతూహలపడి యాతటాకమునుగూర్చి తమతోఁగూడ వచ్చిన ధర్మభృతుం డనుమునిని నడుగఁదొడఁగి 'మహామునీ! మిక్కిలి యాశ్చర్యకరమైన యీధ్వనిని వినఁగా మాకందఱికిని దీనిని దెలిసికొనవలయునని మిక్కిలి కౌతూహలముగలిగినది. ఇదియేమి? దీనిని జక్కఁగా జెప్పుము. బ్రాహ్మణోత్తమా! నీవు చెప్ప సమర్థుఁడవు. ఇది చెప్పఁదగునేని, చెప్పరానంత పరమరహస్యము గాకుండునేని, చెప్పుము' అని యడిగిరి. ధర్మాత్ముఁ డగుధర్మభృతుఁడు రాముఁడు చెప్పినమాటవిని ఆ సరస్సు పుట్టిన విధమును గీతధ్వని వినిపించుట యాదిగా నంతయును చెప్పఁదొడఁగి 'రామా! ఈ తటాకమునకు పంచాప్సరమని పేరు. ఇది యెల్లప్పుడును ఇట్లే గీతవాద్యధ్వనులతో నొప్పుచుండును. ఇది మాండకర్ణి యను మహామునిచే తపోబలమున నిర్మింపఁబడినది. మహాముని యగునామాండకర్ణి పదివేలవత్సరములు వాయుభక్షుఁడై తాను పన్నినయీతటాకపుజలములనుండి తీవ్రతపముగావించెను. అంత అగ్నిదేవుఁడు మొదలైనసమస్తదేవతలును మిక్కిలియు వ్యథితులై యొండొరులంగూడి తమలో 'ఈముని మనలో నొకనిస్థానమును బొందఁగోరుచున్నాఁడు.' అని చెప్పుకొని యందఱును మనస్సున మిక్కిలియుఁ గొందలపడిరి. అప్పుడు దేవతలందఱును మెఱుపుఁదీవియలంబోలెఁ తళతళమని దేహకాంతులు దుఱఁగలించుచున్నయప్సరసలమిన్నలను ఐదుగురిని ఆమునితపస్సును జెఱుపుటకై నియోగించిరి. అంత నాయప్సరసలు దేవకార్యసిద్ధికై,యమ్ముని జీవపరమాత్మస్వరూపవిదుఁడైనను,అతనిని మరులుకొలిపి వశము గావించుకొనిరి. ఆ యప్సరసలైదుగురును ఆమునికి భార్యలయిరి. ఈ తటాకములోన నాయప్సరసలకు గృహము అంతర్హితముగా నిర్మింపఁబడియున్నది. అవ్విధమున నాయచ్చరలైదుగురును నిందలి గృహమున హాయిగా వసించుచు తపోబలమున యౌవనరూపముదాల్చి యున్నయమ్మునికి సొంపువెంపు గొలుపుచున్నారు. ఆయప్సరసలు క్రీడించుచుండఁగా వారలభూషణఝుణంకృతులతోఁ

గలసి వీనుల విందుగా గీతవాద్యధ్వని వినఁబడుచున్నది' అనెను. ఆత్మవిదుఁడగునాధర్మభృతుఁడు చెప్పినమాటను విని మహాయశుం డగురాముఁడును లక్ష్మణుఁడును 'ఇది మిక్కిలి యాశ్చర్య'మని యొప్పుకొనిరి. ఇట్లు ముని చెప్పుచుండఁగా రాముఁడు దర్భలచేతను నారచీరలచేతను వన్నె గులుకుచు బ్రాహ్మణుల సొంపువెంపు పొంపిరివోవుచున్నయాశ్రమసమూహమును గాంచెను. ఆమహాయశుఁడు రాముఁడు సీతను లక్ష్మణునిం గూడి, ఆయాశ్రమములను బ్రవేశించి సమస్తమునులచేతను అర్ఘ్యాదివిధులఁ బూజితుఁడై సుఖంబుండెను. మహాస్త్రవిదుఁడైన రాముఁడు శ్రీమంతమైనయాశ్రమమండలమున, మహర్షులు పూజించుచుండఁగా, సుఖంబుండి, వారియాశ్రమముల మొద లొకసారివసించియుండి మరల రెండవమాఱట్లు వసించియుండిన యాశ్రమములకే రాక్షసబాధానివృత్తికై పోయి వాసముగావించెను. రాముఁ డొకయాశ్రమమునఁ బదుమూఁడుమాసములును, మఱొక యాశ్రమమున నొకసంవత్సరమును, ఒకచోట నాలుఁగుమాసములును, ఒక్కయెడ నైదుమాసములును, నొకయాశ్రమమున నాఱుమాసములును, ఒకపట్టున నేడుమాసములును, ఒకచోట నొకటియు పాతికమాసమును, మఱియొకయాశ్రమమున ముప్పాతికమాసమును, ఇంకొకయాశ్రమమున మూఁడు మాసములును, వేఱొకయాశ్రమమున నెనిమిదిమాసములును సుఖముగా వసించి యుండెను. అట్లు రాముఁ డామునులయాశ్రమముల రెండుమార్లు వాసముసేయుచు నింపారఁ గ్రీడింపుచు నుండఁగాఁ *బదిసంవత్సరములయ్యెను. ధర్మవిదుండైనయాశ్రమంతుఁడు రాముఁడు సీతాసహితముగా నాయాశ్రమము లన్నియు చుట్టు దిరిగి మరల సుతీక్ష్ణమహాముని యాశ్రమమునకు వచ్చెను. అరిందముఁడైనరాముఁడు ఆముని యాశ్రమమునకు వచ్చిచేరి మునులచేఁ బూజలందుచు నచ్చటను గొంతకాలము వసించియుండెను. అంత రాముఁ డయ్యాశ్రమమున నుండి యొకానొకప్పుడు వినయమున నాసుతీక్ష్ణునింజూచి 'ఈ యరణ్యమునందే భగవంతుఁ డగునగస్త్యమునీంద్రుఁడున్నాఁడని నిత్యమును వారువారు చెప్పుకొనుమాటలవలన విన్నాను. ఈ వనము మిక్కిలియు గొప్పది. కావున ఆముని యుండుప్రదేశ మేదో నాకుఁ దెలియదు. బుద్ధిమంతుఁడైనయామహర్షి పుణ్యాశ్రమ మెచ్చటనున్నది? మీ రనుగ్రహించి యాచోటుచెప్పితిరేని నేను సీతాలక్ష్మణులంగూడి యా యగస్త్యమహామునికి వందనము గావించుటకై యచటికిఁ బోయెదము. ఆ మునితిలకుని శుశ్రూషసేయుదునేని బాగు అని నామనంబునఁ బెద్దయుం గోరికగలదు' అనిచెప్పెను. ఇట్లు ధర్మాత్ముం డగురాముండు చెప్పినమాటవిని సుతీక్ష్ణమహాముని సంతుష్టుఁడై యతనింజూచి "రామా! 'సీత

* చిత్రకూటంబున నైదువత్సరములు. ఈ ఋషులయాశ్రమములందు వరుసగా లెక్కింపఁగా నఱువదిమాసములు-అనఁగా అయిదుసంవత్సరము లగుచున్నవిగాన మొత్తమునకు ఆశ్రమవాసముమాత్రము పదిసంవత్సరము దీనికి మునుపటి వెనుకటికాలము మీఁదికాండమున వ్యక్తములగును.

తోఁగూడ నగస్త్యమునియొద్దకుఁ బొమ్ము' అని నేనును, నీకును లక్ష్మణునకును జెప్ప వలయునని కోరియుంటిని. దైవికముగా నీవే యిప్పు డీవిషయము నన్నడిగితివి. నాయనా! అగస్త్యమహాముని యుండుప్రదేశమును నీకుం జెప్పెద వినుము. ఇచ్చటనుండి దక్షిణపుదిక్కుగా నాలుగామడలదూరము పోయినపిదప నచట నగస్త్యుని తమ్ముని (సుదర్శనుని) ఆశ్రమమున్నది. ఆయాశ్రమము, మిక్కిలి మెఱకపట్టయి, బహుపుష్పఫలయుతమై, వివిధపక్షులు కొలకొలఁగూయ రమణీయమై, పిప్పలీవనము వన్నెగులుకుచుండునట్టి యొకవనప్రదేశమునం దున్నది.అందు పలువిధము లైనతామరకొలఁకులు శుభంబు లగునిర్మలజలంబులుగలిగి వెలయుచుండును. అందు హంసలును నీరుకోళ్లు నెరసియుండును. మఱియు చక్రవాకములు చెలువు గులుకుచుండును. రామా! ఆ యాశ్రమమందు ఒకరాత్రియుండి తెల్లవాఱఁగా లేచి పొమ్ము. అచ్చటినుండి దక్షిణదిక్కుంబట్టి వనసమూహమునకుఁ బ్రక్క నోరగా నొక యామడదూరము పోఁగా నచ్చట నగస్త్యాశ్రమమున్నది.అందుఁ బెక్కువృక్షములు నెరసి బెరసి నీటుగులుకుచుండు వనప్రదేశమునందు నీవును సీతయును లక్ష్మణుఁడును గ్రీడింపుచుండఁగలరు.ఆవనప్రదేశము బహువృక్షములు నెరసియుండునుగాన మిగుల రమణీయముగా నుండునుజుమీ. మహాయశా!నీకాయగస్త్యమహామునిని జూడఁ గోర్కిగలదేని యిపుడే యచటికి బయలుదేఱి పొమ్ము''అని చెప్పెను. ఇట్లాముని చెప్పినదివిని రాముఁడు లక్ష్మణునితోఁగూడ నాఋషికి నమస్కరించి యంత తమ్ముని సీతనుంగూడి యగస్త్యునిఁగూర్చి పయనమై పోయెను.రాముఁడు మార్గమున నున్నరమణీయము లైనవనములను,మేఘములవంటి పర్వతములను,కొలఁకులను, నదులనుజూచుచు సుతీక్ష్ణముని చెప్పిన మార్గముననే సుఖముగాఁబోయి యంతసంతసము దొంతెరగొన లక్ష్మణునింజూచి 'మహాత్ముఁడును బుణ్యకర్ముఁడు నగు నగస్త్యభ్రాత (సుదర్శనుని) యాశ్రమమిదిగో! ఇందుకు సందేహము లేదు. సుతీక్ష్ణముని నాకు గుఱుతుచెప్పినట్లే మార్గమున పుష్పఫలభారములచేఁవ్రాలియున్న పిప్పలిచెట్లు వేలకొలఁదిని గనుపట్టుచున్నవి. మఱియు నీవనమునందుండి చక్కఁగా పండియున్న పిప్పలిపండ్లయొగరు వాసన యిదిగో గాలిచే నిటు పొలయుచున్నది. అచ్చటచ్చట ఋషులు సేకరించి పెట్టినకట్టెలు రాసులుగాఁ బడియున్నవి.మార్గమునందు ఋషులచే కోయంబడినవై వైడూర్యమణుల వన్నెగల దర్భమొక్కలు గనఁబడుచున్నవి. ఈవనమునడుమ నిదిగో! నల్లనిమబ్బుకొనవలె నాశ్రమమునందలి యగ్నిహోత్రమునుండి లేచినధూమపుఁగొన చక్కఁగా నగపడుచున్నది. బ్రాహ్మణులు పవిత్రములైనయాయాతీర్థములందు స్నానముగావించి తమచేతులారఁ బువ్వులను గోసితెచ్చి పుష్పబలి గావించుచున్నారు. సౌమ్యా! సుతీక్ష్ణుఁడుచెప్పఁగా మనము విన్నమాటలచొప్పుననే అగస్త్యమహామునితమ్ముని యాశ్రమమిది నిజము. ఆమునివరునియన్న పుణ్యకర్ముఁ డగునగస్త్యుండు లోకహితముగోరి తపోమహిమచే తనకు వాతాపీల్వలులవలనఁ గలిగిన మరణమునుగూడ నిగ్ర

హించి యిల్వలవాతాపులను రూపుమాపి యీదక్షిణదిక్కును వాసయోగ్యముగావించెను. ఇచ్చట ముందొకప్పుడు ఇల్వలవాతాపు లనునన్నదమ్ము లిద్దఱు రాక్షసులు బ్రాహ్మణులను జంపుచుండిరి. ఇల్వలుఁడు దయమాలి బ్రాహ్మణరూపము ధరించి సంస్కృతభాష మాటలాడుచు శ్రాద్ధమని చెప్పి బ్రాహ్మణులం బిలుచును. అంత నాయిల్వలుండు మేఁకరూపము నొందినతనతమ్ముని వాతాపిని పచనము సేసి శ్రాద్ధముసేయువిధి చొప్పుననే యాబ్రాహ్మణులను భోజనము చేయించును. అంత నాబ్రాహ్మణు లందఱును భుజించికాఁగా, నిల్వలుండు 'వాతాపీ వెడలిరమ్ము' అని పేరెలుంగునఁ బిలుచును. అంత వాతాపి యిల్వలుని మాట విన్నంతనే మేఁకవలె నఱచుచు బ్రాహ్మణులు కడుపు చించుచు వెడలివచ్చును. కామరూపులును మాంసాహారులు నైనయాయిరువురునిట్లు గూడి నిత్యమును వేవురకొలఁదిని బ్రాహ్మణుల నాశము చేసియున్నారు. అంత దేవతలు అగస్త్యుని ప్రార్థింపఁగా నామహర్షి యిల్వలుని యామంత్రణాదులకులోనయి యప్పుడు శ్రాద్ధమున మహాసురుఁ డగువాతాపిని భక్షించెను, అంత శ్రాద్ధము ముగియఁగా నిల్వలుఁడు 'తృప్తి యైనదా' యని యగస్త్యునడిగి 'అయినది' అని యామహర్షి చెప్పఁగా నాయన కుత్తరాపోశ మొసఁగి తమ్ముఁ డగువాతాపిని వెడలిరమ్మని క్రమముగాఁ బిలిచెను. ఆయగస్త్యుఁడు బుద్ధిమంతుఁడుగావున నట్లు తమ్మునిఁ జీఱుచున్న బ్రాహ్మణఘాతుకుని నాయిల్వలునిఁ జూచి పెడనవ్వు నవ్వుచు 'నీతమ్ముఁడు మేఁకరూపమును ధరించినవాఁడు నాయుదరమున జీర్ణించి యమునిగృహమును బోయి చేరినాఁడే! వాఁడింక నెట్లు వెడలివచ్చును?' అనెను. అంత నాయిల్వలుఁడు తమ్ముఁడు చచ్చినాఁడని ముని చెప్పినమాట విని కుపితుఁడై మునిని హింసింపఁదలపడెను. వాఁడు మునీంద్రునిపైకి నుఱకఁగా నమ్ముని తేజంబు ప్రజ్వరిల్ల నిప్పువంటివాఁడికంటఁజూచుటయు వాఁ డతనినేత్రాగ్నిచే నీఱైమృతిఁబొందెను. మడుఁగులును అడవులును సిరిగలుకు చున్నయీయాశ్రమము బ్రాహ్మణులయందు జాలిగొని యిట్టి దుష్కరకార్యమును గావించినయగస్త్యమహాముని తమ్ముని యాశ్రమము' అనెను. ఇట్లు రాముఁడు లక్ష్మణునితో మాటలాడుచుండఁగానే, సూర్యుఁ డస్తమించెను. సంధ్యాసమయము నయ్యె. రాముఁడు లక్ష్మణునితోఁగూడ మాపటిసందెను యథావిధిగ వార్చి యయ్యాశ్రమముఁ బ్రవేశించి యామహర్షికి నమస్కరించెను. రాముఁ డామునిచే చక్కఁగాఁ బూజితుఁడై యాతఁడొసఁగిన ఫలమూలములను భుజించి యారాత్రియంతయు నచ్చటనుండెను. అంతం దెల్లవాఱఁగా సూర్యుఁడు స్వచ్ఛముగాఁ బ్రకాశించుచుండ రాముఁడు అగస్త్యమునితమ్మునిఁ బోయివచ్చెదనని వీడ్కొనువాఁడై 'మహాత్మా! నీకు నమస్కారము. రాత్రియంతయు నిందు హాయిగా నుంటిమి. నీగురుఁడును అన్నయు నగునగస్త్యమహర్షిని జూడఁగోరెదను గాన పోయివచ్చెద. సెలవొసంగుము' అనెను. అమ్మునియు పొమ్మని యనుజ్ఞయియ్యఁగా నారాముఁడు ఆయడవిని జూచుచు సుతీక్ష్ణముని చెప్పినమార్గముననే పోయెను. రాముఁడు ఆ యడవియందు వంద

లకొలఁదిని నివ్వరులను పనసచెట్లను, తాటిచెట్లను, తినాసపుచెట్లను, పోగడచెట్లను, చంద్రచెట్లను, గానుగుచెట్లను, నిప్పచెట్లను, బిల్వవృక్షములను, తుమికిచెట్లను నిండారఁ జూచియు కొనలయందెల్లఁ బూచినతీఁగెలచేఁ బెనఁగొనియు నుండఁగాఁజూచెను. అందుఁగొన్ని యేనుఁగుతుండములచే విఱువఁబడియుండెను. కొన్నిట కోఁతులు చెలఁగాడుచుండెను. మఱియు నందలకొలఁదిని మత్తిల్లినపిట్టలు గుంపులుగొని మిక్కిలి గొలగొల చప్పుడు గొలుపుచుండెను. అంత తామరలవంటి కన్నులుగల రాముఁడు తన వెంట నంటివచ్చి వెనుకనున్న వీరుండును లక్ష్మీవర్ధనుఁడు నగులక్ష్మణునిఁజూచి*"వృక్షములన్నియు నునుపారెడి పచ్చనియాకులు గలిగియుండుటయు, మృగములును పక్షులును శాంతములై యుండుటయుఁ, జూడఁగా భావితాత్ముఁడైనయయ్యగస్త్యమహాముని యాశ్రమము దాపుననే యున్నదని తోఁచుచున్నది. ఎవ్వఁడు వింధ్యపర్వతమును స్తంభించినట్టి స్వకారమునం జేసియె యగస్త్యుఁడని లోకములఁ బ్రసిద్ధుఁడయ్యెనో యట్టిమహాముని యాశ్రమ మిదెచూపట్టుచున్నది. ఇది దారిబడలివచ్చినవారి బడలికలనన్నిటిని బోఁగొట్టునది. ఇందలివనమున దట్టముగా హోమాగ్ని పొగలే యంతట వ్యాపించియున్నవి. మఱి యిందు నారచీరలు వరుసగాఁ గట్టంబడియు వన్నె గులుకుచున్నవి. మృగసమూహములన్నియు మిక్కిలియు శాంతములై యున్నవి. నానావిధపక్షులు కొలకొల చప్పుడు సేయుచున్నవి. ఏ మహాముని ప్రభావమువలన రాక్షసులు ఈ దక్షిణపుదిక్కును, భయమునఁ జూతురుగాని మునుపటివలె నుపభోగింపరో యట్టియగస్త్యునియాశ్రమ మిది. ఈపుణ్యకర్ముఁడు ఈదక్షిణపుదిక్కును గయికొన్నదిమొదలుగా రాక్షసులు ఋషులపై వైరములు విడిచి మిక్కిలిశాంతులైరి. ఈదక్షిణపుదిక్కు భగవంతుఁడగునగస్త్యునిపేరిట నగస్త్యదిక్కని పేరువడసి మేటియై క్రూరకర్ములగురాక్షసులకు మార్కొనరానిదై ముల్లోకములను బ్రసిద్ధిగాంచినది. పర్వతరాజ మగువింధ్యశైలము సూర్యు మార్గమును నడ్డగింపఁబూనినదై యెవ్వని యాజ్ఞకు లోఁబడి పెరుఁగక యింకను నట్లేయున్నదో, ఎవ్వనికర్మములు లోకవిఖ్యాతములైనవో యాశ్రమంతుఁడును దీర్ఘాయుష్మంతుఁడు నగునగస్త్యునిది సుమీ సిరిగులుకుచు వినీత జనసేవితమై యున్నయీయాశ్రమము. ఈ యగస్త్యుఁడు సకలలోకపూజితుఁడు, సత్పురుషుఁడు, ఎల్లప్పుడు సాధుజనులకు హితముసేయుటం దాసక్తుఁడు. మనమతనికడకుఁ బోయినచో మనకు శ్రేయస్సుగావించును. సౌమ్యా! ప్రభూ! అట్లుగావున ఈయాశ్రమముననే ఈయగస్త్యమహాముని నారాధించుచు, ఇందే వనవాసమందలి మిగతకాలముండెదను. ఇందు దేవతలును గంధర్వులును సిద్ధులును మహర్షులును నియతాహారుఁడై తపస్సుగావించు చున్నయగస్త్యుని నెపుడును నుపాసిం

* నీళ్లుపోసి పెంపఁబడుటచే చెట్లయాకులుపచ్చనివిగా నుండుననియుఁ, గావుననే పోషకుఁడైన ఋషి దాపుననే యుండుననియు, మృగాదులు శాంతములై యుండుట ఆశ్రమసామీప్యమువలన ననియు నూహ్యము.

చుచుందురు. కల్లలాడువాఁడుగాని, క్రూరుఁడుగాని, వంచకుఁడుగాని, ఘాతుకుఁడుగాని, శాస్త్రనియతివిడిచి యిచ్ఛచొప్పున వర్తించువాఁడుగాని యీయాశ్రమమున జీవింపఁడు. ఈయగస్త్యుని మహిమయిట్టిది. దేవతలును యక్షులును నాగులును పక్షులును నాహారమువర్జించి ధర్మమునారాధించువారలై యిందు వాసముచేయుచున్నారు. మహాత్ములనేకులిందుఁ దపస్సుగావించి సిద్ధింబొంది మానుషదేహమువిడిచి నూతనము లైనదివ్యదేహములనుదాల్చి సూర్యసమానము లయినవిమానముల నారోహించి స్వర్గమునొందిరి. ఈయాశ్రమమున తమ్ము నారాధించువారలకు దేవతలు యక్షత్వము దేవత్వము నానావిధ రాజ్యాధిపత్యములును నొసఁగెదరు. లక్ష్మణా! అగస్త్యాశ్రమమునకు వచ్చితిమి. ఇచ్చటికి సీతతోఁగూడ నేను వచ్చియున్నాఁడనని యామహర్షికిం దెలుపుము' అనిచెప్పెను. ఇది పదునొకండవ సర్గము.

అగస్త్యుఁడు శిష్యులనంపి రాముని రప్పించుకొనుట. శ్రీరాముఁడు ప్రవేశించి ఋషిచేతఁ బూజితుండగుట. వైష్ణవధనువును శరతూణీరములను అగస్త్యుఁడు శ్రీరామునికొసఁగుట.

రామునితమ్ముఁడు లక్ష్మణుఁడు, అగస్త్యాశ్రమమును బ్రవేశించి యమ్మునిశిష్యునియొద్దకుఁబోయి 'దశరథుఁడనురాజొకఁడుగలఁడు. అతని జ్యేష్ఠకుమారుఁడు బలవంతుండగురాముఁడు అగస్త్యమహామునిని జూచుటకై భార్య యగుసీతతోఁగూడ వచ్చినాఁడు. నాపేరు లక్ష్మణుఁడు. నేనతనికిఁదమ్ముఁడను, హితుఁడను, మఱియు నతనియందు ప్రీతిగలవాఁడను;' కానయతనికి ప్రియముసేయుచుందును. *మేము ముగ్వురము మాతండ్రియాజ్ఞవలన మిక్కిలి భయంకరమైనవనమునకు వచ్చినారము. మేమందఱమును భగవంతుఁడగుమహర్షిని జూడఁ గోరుచున్నాము. కాన యమ్మునికిఁ దెలుపుము' అనెను. ఆలక్ష్మణుఁడు చెప్పినమాటవిని యాతపస్సంపన్నుఁడు "అట్లేకానిమ్ము" అనిచెప్పి అగస్త్యునికి విన్నవించుటకై యగ్నిహోత్ర గృహములోనికిఁ బోయెను. అగస్త్యముని మనసునకు మిక్కిలియుఁగూర్చునాశిష్యుఁడు అట్లుచొచ్చి తపోమహిమచే నెవ్వారికినిఁ జెనకరాకుండునగస్త్యమహామునిని, శీఘ్రముగాఁ జూచి లక్ష్మణుఁడుచెప్పినచొప్పున రామునిరాకంగూర్చి 'దశరథరాజకుమారులగు రామలక్ష్మణు లిరువురును రామునిభార్య యగుసీతతోడంగూడి మనయాశ్రమమునకు వచ్చియున్నారు. పగవారి నడంచుదిట్టలగువారిద్దఱును నిన్ను దర్శించి సేవసేయవలయునని వచ్చియున్నారు. వారువచ్చినందుల కిఁకఁ జేయవలసినదానిని గలరూపున నానతిందు'అనెను. అంతనామహర్షి శిష్యునివలన రాముఁడు లక్ష్మణుఁడును మహా

* ఇందులకు 'తేవయం వనమత్యుగ్రం' అనిమూలము. ఇందు 'య' అనునక్షరముచేత గాయత్రి యొనిమిదవయక్షరము గ్రహింపఁబడినదిగాన యేఁడువేలశ్లోకములై యొనిమిదవసహస్ర మారంభించెనని తెలియునది.

భాగ యగుసీతయు వచ్చినాఁగని విని యాశిష్యునిఁ జూచి 'నాభాగ్యవశమున బహుకాలమునకు రాముఁడు నన్నుఁ జూడ నిటవచ్చినాఁడు. నేను రాముఁడిట రావలయునని బహుకాలముగా మనస్సున నువ్విళ్లూరుచుంటిని. పొమ్ము. రాముఁడును సీతయు లక్ష్మణుఁడును బూజార్హులుసుమీ! వారి నాయొద్దికి రానిమ్ము. ఇంతకుమును పే వారిని జొరనీక జాగేలచేసితివి?' అనియడిగెను. మహాత్ముఁడును ధర్మజ్ఞుఁడు నగునమ్ముని యిట్లు చెప్పఁగా శిష్యుఁడు జాగుచేసినందులకుఁ బరిహారముగా నమస్కరించి చేతులు మొగుడ్చుకొని 'చిత్తము' అని చెప్పి యంత సంభ్రమమున వెడలిపోయి లక్ష్మణుం జూచి 'రాముఁ డెక్కడ! మహర్షిని జూడవచ్చుఁగాక. తానే వొచ్చి పోవచ్చును' అనెను. అంత లక్ష్మణుఁడు శిష్యునితోఁగూడ నాశ్రమద్వారముకడకుఁ బోయి కాకుత్స్థకులుని రాముని జనకరాజసుతను సీతను నతనికిఁ జూపెను. శిష్యుఁడు వినయముతో, పూజార్హుఁడగు రాముని న్యాయము నొప్పున చాల సత్కరించి యాశ్రమములోనికిఁ గొనిపోయెను. అంత రాముఁడు సీతాలక్ష్మణసమేతముగా, నయ్యాశ్రమమును మిక్కిలిశాంతములైన జింక లిందునందు చెలాఁగుచుండఁగాఁ జూచుచుం బ్రవేశించెను. ఆ యగస్త్యాశ్రమమునందు బ్రహ్మదేవునిస్థానమును, అగ్నిస్థానమును, విష్ణుస్థానమును, దేవేంద్రస్థానమును, సూర్యస్థానమును, చంద్రస్థానమును, భగస్థానమును, కుబేరస్థానమును, ధాతృస్థానమును, విధాతృస్థానమును, వాయుస్థానమును, శేషస్థానమును, మహాత్ముఁడగునవంతునిస్థానమును, గాయత్రీస్థానమును వసుస్థానమును, మహాత్ముఁడును పాశహస్తుఁడు నగువరుణునిస్థానమును, కుమారస్వామిస్థానమును, ధర్మస్థానమును జూచుచుఁబోయెను. అంత నగస్త్యమహర్షియు శిష్యులతోఁగూడ రాము నెదుర్కొనివచ్చెను. రాముఁడు మహాతేజస్సంపన్నుఁ, బహుమునులముందఱ వచ్చుచున్నయగస్త్యమహామునిని గాంచి యావీరుఁడు లక్ష్మీవర్ధనుఁ డగులక్ష్మణునిఁ జూచి 'లక్ష్మణా! ఇదిగో భగవంతుఁ డగునగస్త్యుఁడు వచ్చుచున్నాఁడు. అవ్వారిగాఁ దొలఁకుచున్నయితని తేజోవిశేషంపు పెంపుచేత నితఁడు మహాతపములకెల్ల నిధానమని కనుఁగొనుచున్నా'ననెను. ఇట్లు పరంతపుఁడగు నామహాబాహుఁడు రాముఁడు సూర్యునివలె వర్చస్సు దొలఁకుచున్నయగస్త్యునిఁ గూర్చి పలికి పరమప్రీతుఁడై యమ్మునిం జేరి యతని పాదములను బట్టికొని నమస్కరించెను. అప్పుడు ధర్మాత్ముఁ డగురాముఁడు సీతాలక్ష్మణులతోఁగూడ నమ్మునికి నమస్కరించి తాను చేతులు మోడ్చుకొని నిలుచుండెను. మునియు రాముని నాతిథ్యమునఁ బ్రతిగ్రహించి, ఆసనమొసఁగి, యర్ఘ్యపాద్యములఁ బూజించి, కుశలమడిగి 'కూర్చుండు'మని చెప్పెను. ఆముని వైశ్వదేవము గావించి యాయతిథుల నర్ఘ్యాదులఁ బూజించి వారలకు వానప్రస్థధర్మమున ఫలమూలాద్యాహారముల నొసంగెను. అంత నమ్మునిపుంగవుఁడు ధర్మవిదుఁడుగావున మొదలఁ దానుగూర్చుండి పిదప చేతులు మోడ్చుకొని కూర్చుండిన ధర్మకోవిదుని రామునిఁ జూచి 'వైశ్వదేవము చేసి, యర్ఘ్యమునొసంగి, యతిథిని బూజింపవలయును. కాకుత్స్థా! ఋషియగువాఁ

డిట్లు సేయక మఱియొకవిధమున నతిథిపూజ గావించునేని తప్పుసాక్ష్యము పలికినవానివలె పరలోకమున తనమాంసమును తానే భక్షించును.*నీవు సమ సలోకములకును రాజవు, ధార్మికుఁడవు, మహారథుఁడవు, పూజనీయుఁడవు, మాన్యుఁడవు.ఇట్టి ప్రియాతిథి వైన నీవు నాకుఁ బ్రాప్తించితివి. కాన నిన్ను విశేషించి పూజింపఁదగునని చెప్ప నేల?'యనెను. ఆముని యిట్లుచెప్పి † ఫలమూలములను పుష్పములను నితరములైనవన్యద్రవ్యములను విధిచొప్పున రాముని్ బూజించి మరలనతనిం జూచి 'పురుషసింహా! బంగారుమయమై రత్నములచే రంగారుచు దివ్యంబైనయీమహానీయధనువు‡విష్ణుదేవునిది. మఱి యిది విశ్వకర్మనిర్మితము. సూర్యునివలె వెలుంగుచున్న యీమేటిబాణము అమోఘమైనది; బ్రహ్మచే దత్తమైనది. మండుచున్న యగ్నివలె జ్వలించు చున్నబాణములు నిండియున్నవై బాణములెన్నఁడును దఱుఁగని యీ తూణీరములు రెండును నాకు దేవేంద్రుఁ డొసంగినవి. బంగారపుటొఱగలిగి బంగారుచే సింగారింపఁబడియు రంగారు నీఖడ్గము నాకు దేవేంద్రుఁ డిచ్చెను. రామా! తొల్లివిష్ణుదేవుఁడు ఈధనువుచేతనే యుద్ధమున నసురులను వధించి దేవతలకుఁ దేజరిల్లు రాజ్యలక్ష్మిని మరలఁ బడయనిచ్చెను. మానదా! ఆధనుస్సును ఆయమ్ములపొదులును అదియే ఖడ్గమును బాణమును, దేవేంద్రుఁడు తనవజ్రాయుధమును ప్రతిగ్రహించినట్లు, నీవు శత్రుజయముకొఱకు ప్రతిగ్రహింపుమా' అనెను. మహాతేజుండైనభగవంతుఁడాయగస్త్యుఁ డిట్లు చెప్పి రామున కాయుత్తమాయుధముల నొసఁగి మరల నతనిం జూచి యిట్లుచెప్పెను. § ఇది పండ్రెండవసర్గము.

¶ రాముఁడు ఖరాదులను వధించుటకై యగస్త్యునిచే ననుజ్ఞనొంది సీతను లక్ష్మణునిఁగూడి పంచవటికిఁ బయనమగుట.

రామా! లక్ష్మణా! మీరలు సీతతోఁగూడ నాకు మ్రొక్కుటకై యిటవచ్చి . ఇందులకు నాకు మిక్కిలియు సంతోషమయ్యెను. మార్గాయాసమువలన మీ

*ఇందులకు మూలము'రాజా సర్వస్యలోకస్యధర్మచారీ మహారథః। పూజనీయశ్చ మాన్యశ్చ భవాన్ ప్రాప్తః ప్రియాతిథిః' దీనికివిశేషార్థము:—(సర్వలోకస్య) మూఁడులోకములకును, (రాజా) స్వామివి. ఇందులకు 'పతింవిశ్వస్య' అనిశ్రుతి. కాఁబట్టియే లోకులకు, (పూజనీయః)కర్మములచే నారాధింపఁదగినవాఁడవు. ఇందులకు 'ఇష్టాపూర్తం బహుధాజాతం జాయమానం విశ్వంబిభర్తి భువనస్యనాభిః' అనిశ్రుతి. (మాన్యః) ముక్తికొఱకై యోగులకు చింతింపఁదగినవాఁడవు. (ప్రియాతిథిః) లౌకికులైన యతిథులకంటె విలక్షణుఁడైనవాఁడవు అనియర్థము. † రెండవతూరి ఫలాదులిచ్చుట నీతకొఱకని తెలియునది. ‡ రాముఁడు వైష్ణవధనువును పరశురామునివలననుండి తీసికొని వరుణుచేతనిచ్చెను. ఆ వరుణుఁడు ఆధనువునే ఖరాదివధము సమీపించుటఁజూచి అగస్త్యునిచేతఁబెట్టినాఁడని 'వైష్ణవ' శబ్దముచేత గ్రహింపఁదగియున్నది. § ఇందు ఆయాదేవతలకు స్థానములుచెప్పి రుద్రునకు స్థానముచెప్పనందున ఆదేవుఁడు పూజ్యుండు గాఁ డనుట సూచితము. గోవిందరాజులు.

ఇచ్చట కథ ముగియకుండుటచే సర్గవిచ్ఛేదము లేదని తోఁచుచున్నది.

కు మిక్కిలి చెమటపోసి చాల నలసట నలఁచుచున్నది. జనకరాజు కడుపునఁబుట్టినసుకుమారి సీత మిక్కిలియు నలఁగి విశ్రాంతిని గోరుచున్నదనుట స్పష్టముగాఁ దెలియుచున్నది. ఈబిడ మిక్కిలియు సుకుమారి, దుఃఖములచే నెప్పుడుఁ గీడ్పడినదిగాదు. పెనిమిటి వగుసీయందలి నెయ్యమునఁ బురికొన్నదై తాను బహుదోషభాజనమైనయడవిలోకి వచ్చినది. రామా! అట్టి యీసీత యీయాశ్రమమున నెట్లు సంతోషముగా నుండునో యట్లు గావింపుము. ఈబిడ నీవెంట నడవికివచ్చినదే! ఇది దుష్కరమైన కార్యము చేసినదగును. రామా! స్త్రీలు, పెనిమిటిని మంచిస్థితిలోనున్నపుడు సంతోషపెట్టుదురు; దుర్దశపాలైనప్పుడు దిగవిడుతురు. ఇది సృష్టిమొదలుగా స్త్రీలకు స్వభావమైయున్నది సుమీ! స్త్రీలకు మనస్సు మెఱపుఁదీఁగలవలె అతిచంచలముగా నుండును; చిరకాలపుచెలిమినైనను దెగ నఱుకును గావున నాయుధమువలె వాఁడిగలిగియుండును; ముందువెనుక చూడక తోడఁబడి దేనికైనఁబూనును గావున గరుడునికంటెను వాయువుకంటెను మిక్కిలివేగము గలిగియుండును. నీయిల్లాలగుసీతకో యట్టి దోషములేవియుఁ గలుగవు. అవి కలుగమియేకాదు; ఆబిడ మిక్కిలి పొగడ్తకుం దగినది. మఱి యరుంధతీదేవివలె పతివ్రతలయం దెల్ల మిన్నగా పేరుకొనం దగినది సుమీ! అరిందమా! రామా! నీవులక్ష్మణునితోను పతివ్రతామణి యగునిట్టిసీతాదేవితోడను వచ్చి వాసముగావించుటచే మా యీ యాశ్రమప్రదేశము అలంకృతమగుచున్నది' అని చెప్పెను. ముని యిట్లుచెప్పఁగా రాముఁడు చేమోడ్పుగీలించి ప్రజ్వరిల్లుచున్న యగ్నిహోత్రమువలె వెలుఁగుచున్నయమ్మహర్షిని జూచి సవినయముగా 'నాతమ్ముని గుణములను నాయిల్లాలి గుణములను నాగుణములను జూచి వరప్రదుండును మునితిలకుండు నగునీవు మిక్కిలి సంతసించితివి గావున నేను ధన్యుఁడనైతి; అనుగృహీతుఁడనయితిని. ఇఁక నేమన్నను ఎచ్చట నాశ్రమము గావించుకొని యెడతెగక హాయిగా నుండఁగూడునో యట్టిచోటుం జెప్పుము. అది జలసమృద్ధమై పెక్కువనములతోఁ గూడియుండవలయును' అనెను. అంత ధర్మాత్ముఁడగు నాముని ధీమంతుఁడు గావున రాముఁడు చెప్పినయప్పలుకువిని జరుగవలసిన విషయములనుగుఱించి *కొంచెము సేపు తనలో చింతించి కరము నిశ్చయించి యతనితో 'నాయనా! ఇచ్చటికి రెండు యోజనముల దూరమున మిక్కిలియు ఫలమూలములును జలములును గలిగి పెక్కుమృగములతోఁ గూడి సిరిగులుకుచున్న పంచవటి యనుప్రదేశమొకటిగలదు. నీవు సీతాలక్ష్మణులంగూడి యచ్చటికిఁబోయి యాశ్రమముగావించుకొని తండ్రియాజ్ఞను చెప్పినట్లు పరిపాలించుచుఁ గ్రీడించుచుండఁగలవు. రాఘవా! నీకు దశరథుఁ

* ఇందులకు 'ధ్యాత్వాముహూర్తం ధర్మాత్మా ధీరో ధీరతరంవచః' అని మూలము. (ధ్యాత్వా) ధ్యానించి-ఆలోచించియనుట-ఇట్లుధ్యానించుటచే రాఁగల సీతావియోగ మనుసంకటమునకు మనస్సు గలఁగినను రావణాదివధమును మరల సీతాప్రాప్తి మొదలైనవానిని గాంచి, (ధీరః) ధీరుఁడై-తెంపు తెచ్చుకొని, చెప్పెననియర్థము.

డు కావించినసమయముచొప్పున వనవాసము చేయవలసినపదునాలుగేండ్ల కాలము ఇంచుమించుగా చాలఁ గడచిపోయినది. కాకుత్థ్సా! నీవు ప్రతిజ్ఞను దీర్చుకొని రాజ్యమునను బొంది సుఖముగానుండఁగలవు. రఘునందనా! యయాతి తనకుమారునిచేత ప్రతిజ్ఞ గడచినట్లు దశరథుఁడు జ్యేష్ఠకుమారుఁడైన నీచేత తనప్రతిజ్ఞను దీర్చికొన్నవాఁడయ్యె. కావున నీతండ్రి యామహారాజు ధన్యాత్ముఁడు; పుత్రవంతుఁడు. అనఘా! నాకు దశరథునిపైఁ గలస్నేహమునంజేసి తపోమహిమవలన నిపుడు జరిగియున్న నీవృత్తాంతమునంతయుఁ దెలిసికొనియే యున్నానుజుమీ * నేను నాతపఃప్రభావమువలన నీమనస్సులోని యభిప్రాయము తెలిసికొంటిని. కావున మొదట నీయాశ్రమమున నాతోఁగూడ వసించియుండుమనట్లు నేననుమతించియు నీయభిప్రాయమును జూచుటంబట్టి పిమ్మట నిన్నుఁ బంచవటికిఁ బొమ్మని చెప్పుచున్నాను. రామా! ఆ వనప్రదేశము మిక్కిలియు రమణీయమైనదిసుమీ. సీత యచ్చట వేడుకగాఁ గ్రీడించుచుండఁగలదు. ఆప్రదేశము మిక్కిలి శ్లాఘనీయము మాత్రమేకాక యిచ్చటికి దాపుగానున్నది; మఱియు నది గోదావరీనదికి సమీపమున నున్నదిగాన సీత యందా నదిదాపున మిక్కిలియు వేడుకగాఁ గ్రీడించుచుండ వచ్చును. మహాబాహూ! ఆ ప్రదేశమున ఫలమూలములు మెండుగాఁగలవు; పలువిధములైన పక్షిసమూహములును గలవు. మఱియు నది విజనముగానుండును; మిక్కిలి పవిత్రమును రమణీయమునగును. ఆపంచవటి యంతరమణీయముగావున నీకు భార్యాసహితముగా వాసముచేయుటకుఁ దగినది. మఱియు నాపన్నులను రక్షించుటయందు సమర్థుఁడవుగావున నచ్చటఁ గాఁపుండువేని తాపసులను రక్షించుచుండఁగలవు. వీరోత్తమా! ఇదిగో గొప్ప యిప్పచెట్లుతోపు అగపడుచున్నది చూడుము. ఆతోపునుండి యుత్తరపుదిక్కునఁ బోవఁగా నొకమఱ్ఱిచెట్టుకడకుఁ బోదువు. ఆచెట్టునుగడచి యాదారినే పోగా నొక మెఱకపట్టు గనఁబడును. దాని నెక్కితివేని యందొక పర్వతము చూపట్టును. దానికి సమీపమున పంచవటి యనునది యున్నది. అందెప్పుడును వనములు పుష్పితములై యుండు'ననెను. అగస్త్యుఁడిట్లు చెప్పఁగా విని రాముఁడు లక్ష్మణునితోఁగూడ సత్యవాది యగునమ్మహర్షిని బూజించి పోయివచ్చెదమని చెప్పెను. ఆరామలక్ష్మణు లిరువురును అమ్మునిపాదములకు నమస్కరించి యతనియనుజ్ఞ నొంది సీతాసహితముగా నయ్యాశ్రమమునుండి పంచవటికిం బోయిరి. యుద్ధములందు వెనుదీయని యారాజకుమారులు విండ్లం దాల్చి యమ్ములపొదుల మూఁపులంగట్టికొని మిక్కిలి యెచ్చరికమీఱ మహర్షి బోధించినమార్గమున పంచవటికింబోయిరి. ఇది పదుమూఁడవసర్గము.



* 'మొదట నీవు నాయాశ్రమమున నాతోఁగూడవసించి యుండుటకు నియ్యకొంటిని. పిదప ఖరాదిరాక్షసవధము సేయఁగోరియుండు నీయభిప్రాయమును దెలిసి పంచవటికిఁ బొమ్మనుచున్నాను' అని యగస్త్యునియాశయము.

రాముఁడు పంచవటికిఁ బోవుమార్గమున జటాయువునిఁ గలయుట
జటాయువు తనవంశక్రమమును దశరథునికిని దనకునుగల
స్నేహమును జెప్పుట. అందఱును జటాయుసహిత
ముగాఁ బంచవటికిఁ బోవుట.

అంత నట్లు రాముఁడు పంచవటికిఁబోవుచు దారినడుమ పెద్దకాయమును భయంకర మగుపరాక్రమమునుగల యొకగద్దను దారసించెను. ఆగృధ్రము అగస్త్యుఁడు చెప్పిన మఱ్ఱిచెట్టుమీఁద నుండెను. మహాభాగు లగునారామలక్ష్మణులు దానిని జూచి రాక్షసునిగాఁ దలఁచుచు 'నీ వెవ్వఁడవు' అని యడిగిరి. ఆగృధ్రము తీపారెడు తిన్నని పలుకుల వారికి సంతసముఁ బుట్టించుచునే రాముని జూచి 'నాయనా! నేను మీతండ్రి దశరథమహారాజునకుఁ జెలికాఁడనని యెఱుఁగుము; మఱి కడవాఁడను గాను' అనెను. రాముఁడు దానిని తనతండ్రికి చెలికాఁడని తెలిసి పూజించి యంత ప్రాలుమాలక దానికులమును బేరును నడిగెను. రాముఁ డడిగినది విని యాపక్షి సమస్తభూతములుతొల్లి పుట్టినదాదిగాఁ జెప్పుచు తన్నును తనకులమును చెప్పఁబూని 'మహాబాహూ! రామా! పూర్వకాలమం దెవ్వరెవ్వరు ప్రజాపతులుగా నుండిరో వారినెల్ల మొదటినుండి చెప్పెదనువినుము. రాఘవా! ఆప్రజాపతులలో మొదటివాఁడు కర్దముఁడు. అంత విక్రీతుఁడును శేషుఁడును, బహుపుత్రకుఁడై వీర్యశాలి యగుసంశ్రయుఁడును, స్థాణుఁడును, మారీచియు, అత్రియు, మహాబలుఁడైనక్రతువును, పులస్త్యుఁడును, అంగిరసుండును, ప్రచేతసుఁడును, పులహుఁడును దక్షుఁడును వివస్వతుఁడును వరుసగా ప్రజాపతులైరి. అంత నరిష్టనేమి యనునామాంతరము గలమహాతేజుఁడగుకాశ్యపుఁడు ప్రజాపతియయ్యె. మహాయశా! దక్షప్రజాపతికి కీర్తిమంతు లగునఱువదిమంది కూఁతులు గల్గిరని యందఱకును దెలిసినదేకదా. కాశ్యపుఁడు వారలలో మంచి నెన్నడుములుగలిగి వన్నెగులుకుచున్నయదితి దితి, దనువు, కాళిక, తామ్ర, క్రోధవశ, మనువు అనల, అను నెనమండ్రను పెండ్లాడెను. అంతఁ గాశ్యపుఁడు ప్రీతుఁడై యాకన్యలంజూచి 'నన్నుం బోలినట్టికొడుకులను ముల్లోకములను బాలించునట్టి దిట్టలను గనుఁడు' అనెను. పురుషతిలకా! మహాబాహూ! అందుల కదితియు దితియు కాళికయు సమ్మతించిరి. మిగిలినవారలు మాత్రము సమ్మతింపరైరి. పరంతపా! అదితియందు పన్నిద్దఱాదిత్యులును ఎనమండ్రు వసువులును, బదునొక్కరు రుద్రులును, అశ్విదేవత లిద్దఱును ఇట్లు ముప్పదిముగ్గురు దేవతలు పుట్టిరి. నాయనా! దితి కీర్తిమంతు లగుదైత్యులను గనెను. మున్ను సమస్తము లైన యరణ్యములతోడను సముద్రములతోడను గూడిన యీభూతలమంతయు నాదైత్యులదిగా నుండెను. అరిందమా! దనువు హయగ్రీవుఁ డనుకొడుకును గనెను. కాళికకు నరకుఁడును గాలకుఁడును బుట్టిరి. తామ్రయను కాశ్యపభార్య, క్రౌంచి, భాసి, శ్యేని, ధృతరాష్ట్రి, శుకి యని లోకప్రసిద్ధులగునీయేవురు కన్యలనుగనెను. ఆ

యేవురలో క్రౌంచి గుడ్లగూబలనుగనెను. భాసి భాసపక్షులను గనెను. శ్యేనికి మంచి వీర్యము గలడేగలును గద్దలును బుట్టినవి. ధృతరాష్ట్రికి హంసలును కలహంసములును బుట్టినవి. ఆధృతరాష్ట్రికే చక్రవాకపక్షులుగూడ, రామా నీకు భద్రమగుఁగాత, జన్మించినవి. శుకికి నతపుట్టెను. నతకు వినతపుట్టెను. రామా! కాశ్యపునిభార్యయగు క్రోధవశకు మృగి, మృగమంద, హరి, భద్రమద, మాతంగి, శార్దూలి, శ్వేత, సురభి, సర్వలక్షణసంపన్న యగుసురస, కద్రువ యనుపదుగురు కొమార్తెలు పుట్టిరి. పురుషచూడామణీ! ఆపదుగురిలో మృగికి సమస్తము లయినజింకలు పుట్టినవి. మృగమందకు నెలుఁగుబంట్లును, సవరపుమెకములును చమరమృగములును బుట్టినవి. హరియనుదానికి సింహములును వడిగలవానరములును జన్మించినవి. అంత భద్రమదకు ఇరావతియను కూఁతురు పుట్టెను. ఆయిరావతికి, లోకమునకు మేటియైన యైరావతమను మహాగజముపుట్టెను. పురుషలలామా! మాతంగికి ఏనుంగులు కలిగినవి. శార్దూలికి గోలాంగూలములును వ్యాఘ్రములును గలిగినవి. రామా! శ్వేతకు దిగ్గజములు పుట్టినవి. రామా! అంత సురభియనునది రోహిణియు కీర్తిమంతురాలగుగంధర్వియు నను నిద్దఱుకూఁతులం గనెను. నీకుమంగళమగుఁగాక. రోహిణికి గోవులుపుట్టినవి. గంధర్వికి గుఱ్ఱములు జన్మించినవి. రామా! సురసకు పెక్కుతలలు గలసర్పములు పుట్టినవి. కద్రువకు సాధారణములగుసర్పములుగలిగినవి. నరశ్రేష్ఠా! మను వనుకాశ్యపుని భార్య బ్రాహ్మణులు క్షత్రియులు వైశ్యులు శూద్రులని ప్రశస్తి గన్నమనుష్యులనుగనెను. అనల యనుకాశ్యపభార్య మంచి ఫలములు (* పిండాకారములగు ఫలములు) గల వృక్షములనుగనెను. [ఇఁక చక్కనాకులము వచ్చినవిధము వినుము.] శుకికి వినతయనునది మనుమరాలు. కద్రువ సురసకు చెల్లెలు. అందు కద్రువ వేయితలలు దాల్చి భూమిని మోయుచున్నవాఁడగునాదిశేషునిఁ గనెను. వినతకు గరుడుఁడు అనూరుఁడు అను నిద్దఱుకొడుకులు గలిగిరి. అరిందమా! నే నాయనూరునకు † శ్యేనియందుఁ బుట్టినవాఁడను. సంపాతియనువాఁడు నాయగ్రజుఁడు. నా పేరు జటాయువని తెలియుము. నీవిష్టపడుదువేని, నీకు వనవాసమందు నేను సహాయుఁడనై యుండెదను. ఈయడవియందు క్రూరమృగములుగలవు; రాక్షసులును మెలంగుచుందురు. కాన యిది భయంకరమై చొరనలవిగాకుండును. కాఁబట్టి నను బోఁటిసాహాయ్యమువలన నీకుఁ బ్రయోజనముగలదు. నాయనా! నీవును లక్ష్మణుఁడును నెచ్చటికేని వేఁటకొఱకుఁగాని పోయినప్పుడు నేను సీతను రక్షించుచుండెదను అనెను. రాముండు మంచి స్వభావము

* 'పిండాకారఫలాన్ వృక్షాన్' అనుపాఠాంతరమున కిది యర్థము.

† శ్యేనియు శుకియు కాశ్యపునిభార్య యగుతామ్రకూఁతుండ్రు గావున ఈశ్యేన యరుణునిభార్యయెట్లు? దీనికొడుకు జటాయువగునా? అన్నచో శ్యేని సంతాన పరంపరలలోఁ జేరిన యొకానొక శ్యేనిగా నిది యుండవచ్చును. లేక విధినిషేధములం దధికారము మనుష్యులకే కాని మృగపక్ష్యాదులకు లేదు కావున కాశ్యపుని కూఁతురే కావచ్చును.

గలవాఁడుగాన జటాయువునుబూజించి సంతోషమునఁ గౌఁగిలించుకొని యతఁడు మరల మరల దశరథునకును తనకును గలిగిన సఖ్యమును జెప్పినప్పుడెల్ల నత్యాదరమున వినుచు తండ్రివలని గౌరవమున నాజటాయువునకు నమస్కరించుచుండెను. అంత రాముఁడు సీతను రక్షణార్థము జటాయువున కొప్పగించి మహాబలుండైనయాపక్షితోడను సీతాలక్ష్మణులతోడను, నగ్ని శలభములను దహించునట్లు, శత్రువులను దహింపఁగోరుచుఁ బంచవటిని జేరినవాఁడయ్యెను. ఇది పదునాలుగవసర్గము.

## పంచవటియందు గోదావరీతీరమున లక్ష్మణుండు నిర్మించినయాశ్రమమున రాముఁడు సీతాలక్ష్మణసహితుఁడై కొంతకాలము వాసముచేయుట.

అంత రాముఁడు నానావిధములైనక్రూరసర్పములును మృగములును నెరసిబెరసి యున్నపంచవటిం జేరి తేజమున వెలుంగుచున్నతమ్మునిని లక్ష్మణునిఁ జూచి 'సౌమ్యా! మహర్షి చెప్పిన చొప్పున మన మీప్రదేశమును జేరినారము. ఇదిగో! పూచినయడవులు గలయీప్రదేశమే పంచవటి. అడవినంతయు చూపు నిగుడ్పుము. అడవియందు తగినయాశ్రమస్థలమును గనుఁగొనుటయందు నీవు నిపుణుఁడవుగదా! ఏప్రదేశమున మనకందఱకిని సమ్మతమగునట్లు,ఆశ్రమముగుదురును? లక్ష్మణా! నీవేర్పఱచుచోటు సీతకును నీకును నాకును ఇంపయినదిగా నుండవలయును. అందు సమీపమునఁ గొలఁకుండవలయును; అందు మామిళ్లు పొన్నలు మొదలయిన వృక్షములచే*రమణీయములయిన వనములును మిట్టపల్లముగాక మంచి మెత్తని యిసుకపాతైయింపుగొలుపునేలయు నుండవలయును. మఱి యందు సమిధలును పువ్వులును దర్భలును జలములును సమీపముగానుండవలయును. అట్టిప్రదేశము నారయుము' అనెను. † రాముఁడిట్లు చెప్పఁగా లక్ష్మణుఁడు చేతులు మొగిడ్చి సీతాదేవి సమక్షమున

* రమణీయములైన వనములుండవలయు ననుటచే సీత పువ్వులుగోసికొని వేడుకగానుండుటకు అనువుగానుండవలయుననియు, మిట్టపల్లములేని మంచినేలగా నుండవలయుననుటచే సుఖశయనాదులను గోరు తన కనువుగానుండవలయుననియు, సమిధలు పువ్వులు మొదలైనవి సమీపముగా నుండవలయు ననుటచే లక్ష్మణునికైంకర్యమునకు అనువుగా నుండవలయుననియు నిట్లు ముగ్గురికిని ఇంపుగా నుండవలయుననుట సూచితము.

† ఇందులకు 'ఏవముక్తస్తు రామేణ లక్ష్మణః సంయతాంజలిః । సీతాసమక్షం కాకుత్స్థమిదం వచనమబ్రవీత్ ॥ పరవానస్మి కాకుత్స్థ త్వయి వర్షశతం స్థితే । స్వయంతు రుచిరే దేశే క్రియతామితి మాం వద' అనిమూలము. విశేషార్థము- రాముఁడు లక్ష్మణునకుఁగూడ సుఖముగా నుండవలయునని చెప్పుటకు లక్ష్మణుఁడు సైఁపక రామునితో 'నీకును సీతాదేవికిని రమణీయమైనప్రదేశమునే యానతియ్యఁదగును. నాకుఁగూడ సౌకర్యావహముగానుండవలయునని ఆనతియ్యరా'దనుచున్నాఁడు:—(సీతాసమక్షం) సీతసమక్షమున- ఇట పురుషకారసాన్నిధ్యము చెప్పఁబడినది. (పరవాన్ అస్మి) పరతంత్రుఁడను. నాయస్మిత నీయస్మితవంటిదిగాదనుట. నాఅస్మిత పారతంత్ర్యమే రూపముగాఁగలది. (కాకుత్స్థ) నీపరత్వావస్థయందేకాదు-నీ

రామునిఁజూచి 'కాకుత్స్థా! నీ వీవనమున నూఱుసంవత్సరములున్నను నేను నీవు చెప్పినపని చేయుచు నీకు పరతంత్రుఁడనై యుండువాఁడనేకాని స్వతంత్రుఁడనుగాను. నాకింపైనచోట ననక నీకేయింపైనచోట నాశ్రమము రచింపుమని యానతిమ్ము' అనెను. రాముఁడు మహాత్ముఁడగులక్ష్మణుఁడాడినమాటకు సంతసించి చక్కఁగా విమర్శించి సమస్తగుణసమన్వితమగుప్రదేశమునొకటినిచ్చగించినవాఁడై, యారమ

ఈయవతారావస్థయందుఁగూడనీకుపరతంత్రుఁడనే చుమీయనుట. ఈపారతంత్ర్య మెంతకాలమనఁగా చెప్పుచున్నాఁడు. (త్వయి వర్ష శతం స్థితే) ఇట శతశబ్దము ఆనంత్యవాచకము గనుక సర్వకాలమును నా పారతంత్ర్యముండునది యని యర్థము. ఇట్లు పారతంత్ర్యమే నాస్వరూపమైయుండుటచే దానికనుకూలమైనట్టి యాజ్ఞనే చేయఁదగును గాన తక్కినయాజ్ఞ చేయవలదని వేఁడుచున్నాఁడు:— (స్వయంతు రుచిరే దేశే) నీకు రమణీయమైనచోటనే- నాకును రమణీయమైనచోటనని చెప్పవలదనుట, (క్రియతా మితి మాం వద) ఆశ్రమమును గావింపుమని నాకుఁజెప్పుము. గోవిందరాజులు.

(ఏవముక్తః) ఇట్లు చెప్పఁబడినవాఁడై 'నీకుఁగూడ సౌఖ్యకరముగానుండుచోట పర్ణశాలను గావింపు' మని రాముఁడు లక్ష్మణునియందు స్వాతంత్ర్యము పెట్టి చెప్పఁగాననుట, (ఏవముక్తస్తు) ఇట తుకారము వైలక్షణ్యమును జెప్పునది గనుక రాముఁడు పారతంత్ర్య స్వరూపుఁడైన నాయందు స్వాతంత్ర్యమును పెట్టినపుడే నన్నుఁ బరిత్యజింపనివాఁడయ్యెను. అని రామునిచే త్యజింపఁబడియున్న యవస్థను బొందినవాఁడై - అనఁగా 'ఇంతవఱకు నాయజ్ఞానముచేత నా పారతంత్ర్యమును దెలియనందున తద్రూపమైన నాస్వరూపమునకు హాని కలిగినది. అనఁగా పారతంత్ర్యము లేకుంటిని ఇప్పుడు ఇతఁడే నాస్వరూపమునకు - అనఁగా నా పారతంత్ర్యమునకు- హాని సేయుచున్నాఁడు. కనుక ఇఁకమీఁద నాకు స్వరూపమని యొకటి యున్నదా' యని యిట్టి యవస్థాంతరమును బొందినవాఁడనుట. (లక్ష్మణః) పారతంత్ర్యమే లక్షణముగాఁగలవాఁడు, (సంయతాంజలిః) అంజలి బంధించినవాఁడు - నేనై నాస్వరూపమును చెఱుపుకొంటి నేని నేనే దానిని రక్షించుకొనవలయును. రాముఁడే నాస్వరూపమును జెఱుపునపుడు, నేను నాయంతట దానిని రక్షించుకొనఁజాలను. అంజలి సర్వాభీష్టములకు సాధనముగావున అంజలియె దానిని రక్షింపవలయునని అంజలి బంధించినాఁడనుట, (సీతాసమక్షం) సీతసన్నిధిని - పురుషకారభూతయై తన్ను అన్యపరునిగాఁ బ్రతిపాదింప భగవత్పరునిగానే రూపించునట్టిలక్ష్మి సన్నిధియందనుట, (కాకుత్స్థం) రామునిగూర్చి, (ఇదంవచన మబ్రవీత్) ఇటువంటి గొప్పమాటను జెప్పినాఁడని బుషి పొగడుచున్నాఁడు. సీతాసమక్షమనుటచే ద్వయమునందుత్తరఖండమునం బ్రతిపాదింపఁబడు లక్ష్మీవిశిష్టుఁడైన నారాయణునికే కైంకర్యము సంబంధించుచున్నది వ్యంజితము. (పరవానస్మి) నీఅస్మితవలె నాఅస్మిత కాదు. ఆ పారతంత్ర్యమును ఎవఁడుగాని గోరినవాఁడుగాఁడు. కాఁబట్టియే నీవెవరికిని దాని నిచ్చుటలేదు. లోకులు భిన్నరుచులు. కావున ఒకరు గోరనిది మఱొకరు గోరుదురు గనుక వారపేక్షింపకపోయినను నాకది అపేక్షితముగానేయున్నది. (వర్షశతమ్) అనంతకాలమనుట. దీనిచే పారతంత్ర్యము సర్వకాలీనమైనదని చెప్పఁబడినది. (రుచిరేదేశే) దీనిచే సర్వదేశమునను అది చేయఁదగుట చెప్పఁబడినది. (పరవానస్మి) అని సర్వదాపరతంత్రుఁడగుట తెలియుటవలన అది సర్వావస్థలయందును జేయఁదగుట చెప్పఁబడినది. (క్రియతామితిమాంవద) అని నిరుపపదమైన క్రియాపదము యోగముచే సర్వవిధకైంకర్యమున కుపలక్షణము. ఇట్లు ద్వయమునందుత్తరఖండమున ప్రోక్తమైన కైంకర్యరూపమగు ఫలమును ప్రార్థించుట ఇట వ్యంజితము.

ణీయప్రదేశమును ఆశ్రమముకొఱకు సొంతముగాఁ గయికొనఁదలఁచి తన హస్తము
న లక్ష్మణుని మోడ్పుచేతులను బట్టికొని 'సౌమ్యా ! ఈప్రదేశము మిట్ట పల్లములు
లేక సమమై సిరిపెంపు దొలఁకుచున్నది. ఇందుఁ బుష్పించిన తరువులు నలుగడలఁ
గ్రమ్మియున్నవి. ఇచట యథావిధిని ఆశ్రమము నిర్మింపుము. సూర్యునివలె వెలుంగు
చు కమ్మనితావులు గుబులుకొనుచున్న తామరలతోఁగూడి సిరి కాటపట్టయి సొం
పు పెంపారుచున్న తామరకొలను ఇదిగో దాపున చూపట్టుచున్నది. భావితాత్ముఁడగు
నగస్త్యమహాముని చెప్పినట్లు యిదిగో గోదావరి, పుష్పితములైన వృక్షములు నలు
గడల వెలయ హంసలును కారండవములును నెరసి బెరసియుండ, చక్రవాకములు నీటు
గులుక రమణీయమై చూపట్టుచున్నది చూడుము. సౌమ్యా ! ఇచటికి దాపును
దూరమునుగాక మిక్కిలి పొడవులైన పర్వతములు చూపట్టుచున్నవి చూడుము.
ఇందు మృగములు మూఁకలుగట్టి చెరలాడుచున్నవి. మయూరములు కొలకొల కేక
లిడుచున్నవి. ఇందు రమణీయములైనగుహ లనేకములు గనుపట్టుచున్నవి. మఱి
యు వీనియందు పువ్వులు పూచియున్న వృక్షములు నలుగడల గుబురుకొనియున్న
వి. ఆయా దేశములందు గనుపట్టు బంగారమువలెను వెండివలెను రాగివలెను గన
బడు గైరికధాతువులు రాసులుగా నిండుఁ గనుపట్టుటవలన గవాక్షములవలె మేలయి
న రేకలు వ్రాసి యలంకరింపఁబడిన యేనుఁగులవలె నివి ప్రకాశించుచున్నవి. మద్ది
చెట్లును, తాటిచెట్లును, చీఁకటిచెట్లును, ఖర్జూరపుచెట్లును, పనసచెట్లును నానావిధము
లయిన మామిడిచెట్లును, జలకదంబవృక్షములును, నేమివృక్షములును, పొన్నచెట్లును,
అశోకవృక్షములును, బొట్టుగుచెట్లును, సంపెఁగచెట్లును, మొగిలిపొదలును, పువ్వులపొ
దలు గ్రమ్మి తీఁగలు పెనఁచుకొనియున్న పలువిధములైన వృక్షములును, చందనవృక్ష
ములును, స్పందనవృక్షములును, కదంబవృక్షములును, పార్ణాసవృక్షములును, నిమ్మ
చెట్లును, ఉమ్మెత్తచెట్లును, ఇనుమద్దిచెట్లును చంద్రచెట్లును, జమ్మిచెట్లును, మోదుగు
చెట్లును, కలిగొట్టుచెట్లును, ఈపర్వతములయందు నలుగడల వెలయుచుండును. ల
క్ష్మణా ! ఈప్రదేశము పుణ్యప్రదము; ఇది పావనము. ఇందు మృగములును పక్షులు
ను మెండుగాఁగలవు. కాన యిచ్చట మనతోఁగూడ పచ్చిన యీపక్షితోఁగూడ వ
సించియుండెదను' అనెను. వీరు లగుపగవారిని పీఁచమడంచునట్టిమహాబలవంతుఁడగు
లక్ష్మణుఁడు రాముఁ డిట్లు చెప్పఁగా విని శీఘ్రముగా నన్నకు ఆశ్రమము నిర్మించెను.
లక్ష్మణుఁడు పనియందు మిక్కిలి చుఱుకైనవాఁడు కావున నతఁ డాయాశ్రమమున
మట్టి ద్రవ్వి గోడలు పెట్టి వెదుళ్లతో కంబములునిలిపి వానిపయి నడ్డముగా వెన్నుఁ
గాఁడి సాఁగించి దాని రెండుప్రక్కల నడ్డముగా వెదుళ్లను నిగిడించి వానిపయిని
జమ్మికొమ్మల నడ్డముగా పఱచి యాకొమ్మలనును నడ్డవెదుళ్లనును ఒండొంటితో నార
పేలికలు మొదలైనగట్టితాళ్లను గొని బంధించి వానిపయిని దర్భలు ఱెల్లు మొద
లైన యాకులచే మిక్కిలి సొగసుగా గప్పువేసి నేలను చదరముగావించి రామునికొఱ

కు మిగుల నెడలుపై చాలమురువు గులుకుచు మనస్సును రంజించునొకపర్ణశాలను వసతి గావించెను. అది మిక్కిలియుఁ జూడఁ దగినదై సాటిలేక నీటు గులుకుచుండెను. అప్పుడు శ్రీమంతుఁడాలక్ష్మణుఁడు తోడనే గోదావరికిఁబోయి స్నానము సేసి తామర పువ్వులను పండ్లను దీసికొని మరలివచ్చెను. అంత నతఁడు వాస్తుకల్పముచొప్పున వాస్తుపూజఁ గావించి శాంతికక్రియ నిర్వర్తించి రామునకు తాను నిర్మించినయాశ్రమమును జూపెను. రాముఁడు సీతతోఁగూడి లక్ష్మణుఁ డాశ్రమమును గావించినది చూచి పర్ణశాలనుగాంచి దానికి మిక్కిలియు సంతసిల్లినవాఁడయ్యెను. అట్లు పరమసంతుష్టుఁడై యతఁడపుడు మిక్కిలి నెయ్యము గడలుకొన బారసాఁచి లక్ష్మణుని బిగ్గఁ గౌఁగిలించుకొని 'ఓవిన్నాణీ! నీవు మిక్కిలియు గొప్పకార్యము సేసితివి. కనుక నీయెడ నేను మిక్కిలియుఁ బ్రీతుఁడనైతిని. అందులకై నీకియ్యఁదగిన పారితోషికమునకుఁగా నిన్నుఁ గౌఁగిలించుకొంటిని. లక్ష్మణా! * నాయభిప్రాయములను తెలిసికొని నాకుఁ జేయవలసినకార్యములను గుఱుతెఱిఁగి, ధర్మంబును నెఱిఁగి, పున్నామనరకమునుండి

---

* ఇందులకు 'భావజ్ఞేన కృతజ్ఞేన ధర్మజ్ఞేన చ లక్ష్మణ। త్వయాపుత్రేణ ధర్మాత్మా న సంవృత్తః పితా మమ' అనిమూలము. విశేషార్థము:- భావజ్ఞేన= భావము తెలిసినవాఁడును - ఋషులతో మాటాడుటకు నొకశాలను వంటకు నొకశాలను నిర్మింపుమని రాముఁడు చెప్పెనుగాని సీతతోఁగూడ నేకాంతముగా నుండుటకు నొకశాలను నిర్మింపుమని చెప్పలేదు. అయినను అతఁడు దానిని మనస్సున నుంచుకొనియుండును. కనుక లక్ష్మణుఁడు కన్నులే చెవిగాఁ జేసికొని దానినిఁగూడ యెఱింగి నిర్మించినాఁడు గావున భావజ్ఞుఁడనుట. (కృతజ్ఞేన) చిరకాలము దశరథుఁడు బిడ్డలులేక లేకయుండి రామునిఁ గన్నందువలన నట్టిపుత్రునికి ఆదరాతిశయమున యామహారాజు చంద్రతారాబలాదు లాలోచించి యెట్లు గృహమునుగట్టించెనో యాప్రకారమును దెలిసియున్నట్టివాఁడును, (ధర్మజ్ఞేన) తాను రాజపుత్రుఁడయ్యును తనకుఁదగినస్థలము నేర్పఱచుకొనక రాముఁడెట్లు సంతోషించునో యట్లె తానుకైంకర్యమునకు సిద్ధుఁడై యుండవలయు ననుధర్మమును దెలిసినవాఁడు- లేక తాను తమ్ముఁడయ్యును భృత్యునివలె నిట్లు పరిచరించినాఁడని డంబముప్రకటించుకొనుటకుఁ గాదు, అది తన కుజ్జీవనధర్మమేయగునని ధర్మమెఱిఁగినవాఁడనుట, (త్వయాపుత్రేణ) పున్నామనరకమునుండి కాపాడువాఁడు పుత్రుఁడు - దశరథుఁడు నాకభిమతము నొడఁగూర్పకుండుటయె తనకు నరకమని తలఁచెను. నీవు నాయభిమతమును జేసి యతనికట్టి నరకములేకుండ నుద్ధరించితివిగావున నతనికి పుత్రుఁడవైనవాఁడును- లేక 'నేనుండఁగా రామునికి రక్షణముచేయుదును, నావెనుక రామునిరక్షించువాఁడెవఁడు'. అని దశరథునకు సర్వదాదుఃఖము మనస్సునందుండును. నాకు ఆతనివెనుక రక్షకుఁడవై యతనిదుఃఖముఁ బోఁగొట్టినవాఁడవు నీవేయనుట- ఇట్టినీచేత (ధర్మాత్మా) ధర్మాత్ముఁడైన- అనఁగా తానుజీవించియుండువఱకు నాయభీష్టమె చేసి తనచరమకాలమున నాయభిమతమును జేసి నన్నుగాచుచుండుటకై చలివందిరి పెట్టిపోయినవానివలె నిన్నునిలిపి పోయినాఁడుగనుక ధర్మాత్ముఁడేయైన, (మమపితా) నాతండ్రి (నసంవృత్తః) మృతుఁడుగాఁడు- నీవే తండ్రివిగావున నాకుఁ దండ్రి లేకపోలేదు- అనఁగా నీమూలమున నాకు తండ్రిచేతఁ గలుగవలసినకోరికలన్నియు నొడఁగూడుచున్నవిగాన నీవే తండ్రి వనుట - 'అహంసర్వం కరిష్యామి' 'నేనన్నియును జేయుదును' అని చెప్పియుండుటంబట్టి యని భావము. లేక (నసంవృత్తః) భరతునకు తండ్రియెట్లోయట్లె నీవునాకు తండ్రివైతివని భావము.

కాచు పుత్త్రుఁడ వైననీవుండుటచేత ధర్మాత్ముఁ డగు నాతండ్రి మృతుఁడుగాడు; నాకు జీవించియున్నట్లే యున్నది' అనెను. ఇట్లు సంపదలసొంపు పెంపారఁ జేయురాముఁడు లక్ష్మణునకుఁ జెప్పి యంత బహువిధఫలభరిత మైనయాప్రదేశమునందు విషయ చాపలము లేక మిక్కిలియు సుఖముగా వసించియుండెను. ధర్మాత్ముఁ డైనరాముఁడు, సీతయు లక్ష్మణుఁడును దన్నుఁ గొలుచుచుండఁగా, కొంతకాల మా యాశ్రమమున, దేవలోకమునందు దేవేంద్రుఁడుంబోలె, సుఖముగా వసించియుండెను. ఇది పది యేనవసర్గము.

**ఒకనాఁడు వేకువను గోదావరికి స్నానార్థము రాముఁడు పోయినపుడు వెంటఁజనిన లక్ష్మణుఁడు హేమంతఋతువును వర్ణించుచు భరతునిగుణములను ముచ్చటించి కైకను నిందించుట. రాముఁ డందులకోర్వక మాతృనింద నుడుపుచు భరతునిగుణములను గొనియాడుచు వానిని జూడఁ దమకపడుచున్నట్లు చెప్పుట. అంత రామాదులు గోదావరియందు స్నానము సేయుట.**

మహాత్ముఁ డగురాముఁ డట్లయ్యాశ్రమమున సుఖముగా వాసము సేయుచుండఁగా శరదృతువు కడచి కామినీకాముకుల కిం పయిన హేమంతర్తువు వచ్చెను. ఒకనాఁడు తూర్పు తెలతెల వాఱుచుండఁగా రాముఁడు స్నానము సేయుటకై రమణీయమైనగోదావరీ నదికిఁ బోయెను. వీర్యవంతుఁ డైనయతనితమ్ముఁడు లక్ష్మణుఁడు, నమ్రుఁడై చేతఁ గలశ మెత్తికొని సీతతోఁగూడ రాముని వెంటఁబోవుచు నతనిం జూచి 'ప్రియంవదా! ఏది నీకు మిక్కిలి ప్రియమో దేనిచేత సంవత్సరమున కంతయు నలంకారము కలిగినట్లు వెలయునో అట్టి హేమంతఋతువు వచ్చినది. ఇపుడు జనుల దేహము మంచుచే బిఱుసువాఱి యుండును. భూమియంతయు పంటలచే నొప్పుచుండును. జలములను ముట్ట నలవిగాకున్నది. అగ్గి మిక్కిలియు నింపుగానున్నది. సత్పురుషులు, నవధాన్యములను భుజించుటకు మునుపు చేయవలసినయాగ్రయణ యజ్ఞములచేఁ బితృదేవతలను బూజించి యట్లు యుక్తకాలమున నాగ్రయణము నిర్వర్తించి విగతకల్మషులై యొప్పెదరు.* ఇప్పుడు జనపదములందున్నవారు మిక్కుటమైన కామోద్రేకము గలిగియు గోక్షీరములను సమృద్ధముగాఁ బడసియు నుందురు. యుద్ధయాత్రయందుఁ దమిగలిగి రాజులు పగవారిఁ జయింపఁగోరి తిరుగుచుందురు. సూర్యుఁడు దక్షిణపుదిక్కున నుండుటవలన నుత్తరపుదిక్కు, మొగమున తిలకములేని స్త్రీవలె, నెంతమాత్రము ప్రకాశింపకున్నది. హిమవంతమున సహజముగా మంచు పేరియుండును. ఇప్పు డది దక్షిణాయనమునందు సూర్యుఁడు దూరగతుఁడగుటచే మఱి

* ఆగ్రయణమనఁగా నూతనధాన్యములను భుజించుటకు మొదట ననుష్ఠింపఁబడు నొక హవిర్యజ్ఞము.

యు మంచుహెచ్చి హిమవంతము' 'అధికముగా మంచుగలది. అనుపేరు యథార్థముగాఁ గలదియగును. ఇది సువ్యక్తము. ఇప్పుడు ఈదినములందు మధ్యాహ్నములును, ఇంపుగా వేఁడిమి సోఁకుచుండుటచే, మిక్కిలి సొంపుగానుండును. కావుననే యిపు డెండలో తిరుగుటయు మిక్కిలియు సుఖముగానుండును; మఱి సూర్యుఁడును చూపునకు వేండ్రముగామిచే సొంపుగానుండును; నీడయును జలములును జిలుజిలుమని యుండుటవలన నుపయోగించుటకు నింపుగా నుండవు. ఇప్పటిదినములందు సూర్యుఁడు వేండ్రముగాక మెత్తగానున్నాఁడు. సూర్యుని గ్రమ్మి మంచు మిక్కిలి గురియుచున్నవి. చలి మిక్కుటము. గాలి మిక్కిలి వీచుచున్నది. అడవులలోనివారు చలికిఁ దాళక బయటఁ దిరుగకుందురు గావున నవి సందడిలేకున్నవి.* వానియందు వ్యాపించిన మంచుచే జనులు మేనులు ముడుఁచుకొని సొంపుదూలి యున్నారు. †ఇప్పుడు రాత్రులందు పయికప్పులేని వట్టిబయులఁ బరుండరు. పుష్యమాసమును దాపించినది. పుష్యనక్షత్రముతోఁ గూడిన పున్నమయు నీరాత్రులందు ముఖ్యమైనది. మఱి యాపుష్యనక్షత్రమువలననే నిప్పటి రాత్రులకొలఁది తెలియుచున్నది. రాత్రికాలము మంచుచే బూడిద వన్నెపాఱి యుండును. గాలి జిల్లుమని పొలయుచున్నది. రాత్రులందు జాములు మఱింతదీర్ఘములుగా సాఁగుచున్నవి ‡చంద్రునికిఁగలసొంపును సొబగును నిపుడు సూర్యునికిం జిక్కియున్నవి. చంద్రుఁడు సొంపును సొబగును మాలి తనబింబము మంచు గ్రమ్మియెట్టఁబాఱఁగా, నిట్టూర్పుసోఁకి నిగనిగ మెఱయని యద్దమువలెఁ బ్రకాశింపకున్నాఁడు.§ వెన్నెలుగలరాత్రి, మంచు గ్రమ్మి వన్నె మాసినదై పున్నమనాఁడుగూడ శోభిల్లకున్నది. కాన యిది యెండ సోఁకి నల్లఁబాఱిన మనసీతవలె చూపట్టుచున్నది; కానియాయమవలె చెలువు గులుకకున్నది.¶ పడమటివాయువు స్వభావము చేత నేచల్ల

* దీనిచే రాక్షసులంతటను జేయు పీడ తెలియుచున్నది.

† ఇందులకు 'నివృత్తాకాశశయనాః పుష్యనీతా హిమారుణాః। శీతావృద్ధతరాయామాస్త్రియామా యాన్తి సాంప్రతమ్' అనిమూలము. 'నివృత్తాకాశశయనాః' అనుటచే స్వర్గలోకోపద్రవమును, 'వృద్ధతరాయామాస్త్రియామాః' అనిరాత్రులవృద్ధిని జెప్పుటచే తామసరాక్షసవృద్ధియు, దీనిచే పగళ్లు కుఱుచలగుట వ్యంజితముకాన సజ్జనక్షయమును, 'పుష్యనీతా' అనుటచే పుష్యశబ్దమునకు కలి యనియర్థముగనుక కలిని అనుసరించుటయు సూచితములు.

‡ దీనిచే రావణుఁడు సర్వస్వమును దోఁచుకొనఁగా మలినాకృతినొందినయింద్రుని యవస్థచెప్పంబడినది.

§ ఇందు 'వెన్నెలరాత్రి పున్నమనాఁడునుశోభింపదనుట'చే సీతకు రావణునిచేఁ గలుగనున్న యభిభవమును- అనఁగా చెఱయును, అట్లు ఆమెచెఱపడుట. దేవతాస్త్రీల చెఱ విడిపించుకొఱకగును గావున దానిచేతను గలుగుపతిశయమును, వ్యంజితములు.

¶ ఇచట పడమటివాయువుచే రాముఁడు సూచితుఁడు. వాయువుస్వభావమున శీతలమగునట్లు రాముఁడు స్వభావముననే కరుణాశీతలుఁడనియును, అది మంచుతోఁగూడి మఱింతచల్లనయినట్లు రామున

గానుండునది. అది యిప్పు డీఋతువునందు మంచుతగులుటచేత ప్రాతఃకాలమునందు రెట్టించినశైత్యము గలదై వీచుచున్నది. *సూర్యుఁ డుదయింపఁగా నడవులు ఆవిరితోఁ గూడినవై యవలును గోధుమలును సమృద్ధముగాఁ గలిగి క్రౌంచపిట్టలును బెగ్గురులును గొలకొలగూయఁగా నెంతయు సొంపుగులుకుచున్నవి. † వరిపైరులు, చక్కఁగా పండుటవలన బంగారువన్నెగులుకుచు గింజలుమెండుకొని పేరీఁతపువ్వులవలె పసిమివన్నెగల యెన్నులబరువునఁ గొంత వంగి యెంతయు రంగారుచున్నవి. ‡ జిలుజిలుమను మంచుతోఁగూడి యుండుటవలన కిరణములు చల్లగా ప్రసరింపఁగా సూర్యుఁడుదయించి యాకాశమునఁ జాలదూరమువచ్చియు చంద్రునివలెఁ జల్లగానే చూపట్టుచున్నాఁడు. § ఎండ పూర్వాహ్ణమున వేండ్రముదోఁపక వెన్నెలవలెనుండి మధ్యాహ్నమున మేనికి హాయిగాసోఁకుచు కొంచెమెఱ్ఱగాను గొంత తెల్లగాను భూమిపయిఁ గాయుచున్నది. ¶అడవులయందు నేల, మంచుగురిసి తడిసియున్నపచ్చికపట్లుగలిగి పయిని లేఁతయెండ నిగుడఁగా నెంతయుఁ బ్రకాశించుచున్నది. ‖ అడవియేనుంగు మిక్కిలియు దప్పిగొన్నదై చాల శీతలముగానున్న తేటనీటిని మెలుపుగా తాఁకి, (తాఁకినంతనే) యాచల్లఁదనమునకుఁ దాళలేక తొండము నీడ్చుకొనుచున్నది.

---

కవతారకాలమున దేవతాప్రార్థనమువలన కృప మఱింత దిటవైనదనియు, తెల్లవాఱఁగా రెండింతలది చలువ యెచ్చెననుటచే మరల మున్యాశ్రమములకు రాఁగా రామున కాకృప రెట్టించెననియు, అది యిట్టిదై వీచునట్లు రాముఁడట్టి కృపతో వ్యాపారము గావించినాఁడనియు సూచితములు.

* ఇందు సూర్యుఁడుదయించె ననుటచే రాముఁడు వచ్చుట తెలియునది. ఆవిరివలన రామునికృపయు, యవాదుల సమృద్ధివలన తపస్సమృద్ధియు, క్రౌంచపిట్టలనాదములవలన వేదఘోషములును సూచితములు. రాముఁడురాఁగా ఆశ్రమములు తపస్సమృద్ధములై వేదఘోషములు చెలరేఁగి చెలఁగుచుండెనని భావము.

† ఇందు పండినవరిపైరులచే వృద్ధులును పసుపువన్నెయెన్నులచే జడలుదాల్చిన వారిశిరములును గ్రాహ్యము. వృద్ధులుగూడ శిరసులువంచి నీకుమ్రొక్కెదరని సూచితము.

‡ ఇందు సూర్యుఁడనఁగా రాముఁడు. సూర్యుఁడుదయించి చాల పైకివచ్చియు కిరణములు మంచునఁ దోఁగుటవలన చంద్రునివలెనున్నాఁడనుటచే రాముఁడు వచ్చి బహుకాలమయ్యును రాక్షసులప్రభచే తేజస్సుదూలి మెత్తనైనవానివలె రామా! ఏలవర్తించుచున్నావనియు అర్థము సూచితము.

§ ఇందు ఎండచేతరాముని పరాక్రమము సూచితము. మంచుగ్రమ్మఁగా వేండ్రముత్రలేక యెండ కాయునట్లు రాక్షసు లాక్రమింపఁగా పరాక్రమింపకుండుట రామా! నీకు తగదని సూచితము.

¶ ఇందు మంచుచేతఁ దడిసిన పచ్చికపట్లనుటచే రాక్షసులచేత పరిభవింపఁబడి రోదనముసేయు ఋషులుగ్రాహ్యులు. లేఁతయెండ నిగిడెననుటచే రాముని కృప ప్రవర్తించెననియూహ్యము.

‖ ఇందు అడవియేనుఁగువలన ఇంద్రుఁడు గ్రాహ్యుఁడు. అడవియేనుఁగు చల్లనై సుఖముగానుండు తేటనీటిని త్రాఁగఁబోయియు తొండము నీడ్చుకొనునట్లు ఇంద్రుఁడు రాజ్యభోగమును గోరియు దానినుపభోగించుటకు భయపడుట సూచితము.

* దిట్టలుగానివారు యుద్ధమును జొరలేకుండునట్లు జలచరములైనయాపక్షులు జలసమీపమునఁ గూర్చుండియుఁ జలికి వెఱచి నీటఁజొరఁబడకున్నవి † వనసమూహములు చీఁకటివలె దట్టముగా మంచునీళ్లుపడుటచేఁజిగుళ్లుముడిఁగి కట్టువడి నిశ్చలములై, పయిని పొగమంచు చీఁకటివలె కారుకొని క్రమ్ముకొనఁగా పువ్వులును లేనివై చలింపక దుప్పటిగప్పుకొని కన్నులుమూసి నిదురించువానివలె చూపట్టుచున్నవి. ‡ఇప్పుడు నదులయందు, నీళ్లు ఆవిరిచే గప్పఁబడియున్నది. మంచుక్రమ్ముకొనుటచే,అందలిసారసపక్షులు గానరాక కూఁతనుబట్టియే తెలిసికొనఁదగియున్నవి. వాని తీరములందలి యిసుక మంచుచేఁదడిసియున్నవి. § మంచుపడుటవలనను సూర్యుఁడు చక్కగా నెండగాయకుండుటవలనను, మిక్కిలి శైత్యముగానుండుటవలనను కొండలపయిని నిర్మలశిలాతలములం దుండుజలములుగూడఁ దఱచుగా విషమువలె త్రాగనలవిగాకున్నది. తామరలుపూచి బహుకాలమగుటచే పలుకఁబాఱి, యకరువులును దుద్దులును ప్రిదిలి రాలిపోఁగా మంచునఁ జెడి కాఁడలుమాత్రమే మిగిలియుండుటవలన తామరకొలఁకులు ప్రకాశింపకున్నవి. ఇట్టికాలమందు ధర్మాత్ముఁడైనపురుషతిలకుఁడు భరతుఁడన్నవో నిన్నెడఁబాయుటవలన దుఃఖితుఁడై నీయందలిభక్తితోడ

---

* ఇందు పక్షులచే మునులు గ్రాహ్యులు. పక్షులు జలముదాపుననుండియు దానిలోఁ జొరఁబడలేకుండునట్లు మును లాశ్రమములనుండియు సమాధిజరుపలేక పోయిరని వారిసమాధిభంగము సూచితము.

† ఇందులకు 'అవశ్యాయతమోనద్ధా నీహారతమసావృతాః। ప్రసుప్తా ఇవ లక్ష్యన్తే విపుష్పా వనరాజయః' అనిమూలము. (అవశ్యాయతమోనద్ధాః) చీఁకటివలెఁ గ్రమ్మి మంచునీరుగురియుటచే ఆకులుచిగుళ్లుముడిఁగి నిదురపోవువానివలె నిశ్చలములుగానుండునవి, (నీహారతమసావృతాః) చీఁకటివలె పొగమంచుపయిని గ్రమ్ముకొనఁగా నిదురించువారు దుప్పటిగప్పుకొన్నట్లుండునవి, (విపుష్పాః) పువ్వులులేకుండుటచే నిదురించువారు కనులు మూసికొనునట్లుండునవి. కావుననే (వనరాజయః) వనసమూహములు, (ప్రసుప్తాఇవలక్ష్యన్తే) నిదురించువారివలెఁ గనబడుచున్నవని తెలియునది-గోవిందరాజులు. నిదురపోవువారికి లోపలను వెలుపలను చీఁకట్లు రెండుగలవు. లోపల నిద్రయనుచీఁకటిచేత సంకుచితులగునట్లును వెలుపల రాత్రిచీఁకటిచేత గప్పఁబడినట్లును వనసమూహములు తమయందు పడినమంచునీరనుచీఁకటిచే చిగుళ్లుముడిఁగియు పయినిగప్పిన పొగమంచు అనుచీఁకటిచే గప్పఁబడియు నిదురించువానివలెఁ గనుపట్టినవి-మహేశ్వరతీర్థులు. ఇందు వనసమూహముల నిదురచెప్పుటచే వనవాసుల దైన్యము సూచితమని తెలియునది.

‡ ఇందు నదులనుటచే ఋషులు గ్రాహ్యులు. నదిజలము లావిరిచేఁ గ్రమ్మఁబడుటయు సారసములు కూఁతలనుబట్టియే తెలియఁగూడుటయు మొదలైనవానిచే దుఃఖాక్రాంతులై నిట్టూర్పులుపుచ్చుచు రాక్షసులభయంబున దాఁగి గానరాక మురియుచుండు ఋషులదైన్యము సూచితము.

§ ఇందులకు 'తుషారపతనాచ్చైవ మృదుత్వాద్భాస్కరస్య చ। శైత్యాదగాగ్రస్థమపి ప్రాయేణ రసవజ్జలమ్' అనిమూలము. 'అగాగ్రస్థమపి' అనుటకు 'అగాధస్థమపి'అని పాఠాంతరము. లోఁతుగానున్ననుగూడ జలము (రసవత్) రుచికరముగానుండెనని మహేశ్వరతీర్థులు. ఇందు తుషారపతనముచే రాక్షసుల బాధయు భాస్కరుని మృదుత్వముచే రాముఁడు ప్రయత్నము లేకుండుటయు దానిచే మునుల మనంబులు దుఃఖితములగుటయు సూచితములు.

అయోధ్యాపురమునఁ దపస్సుగావించుచున్నాఁడు. ఆభరతుఁడు రాజత్వమును తాను రాజనెడి యభిమానమును, విడువరాని నానావిధములైన భోగములను, దిగవిడిచి మునివేషమున జడలను నారచీరలను దాల్చి, ఫలమూలాహారుఁడై, వట్టిబయల చలిగొనుచు మంచము మొదలైనవి లేనిరిత్తనేలను బరుండుచున్నాఁడు. అతఁడీవేళకు స్నానముసేయుటకై ప్రకృతిజనులెల్లఁ గొలిచిరాఁగా సరయూనదికిఁ బోవును. * అతఁడు మిక్కిలియు గోముగాఁ బెరిఁగినవాఁడు; సుకుమారుఁడు; సుఖములకే తగినవాఁడు; ఇట్టివాఁడు అపరరాత్రులందు లేచి యెట్లు సరయూనదియందు మునుఁగును? అతఁడు దామరరేకులవంటి కన్నులుగలవాఁడు, వీరుఁడు, చామని చాయగలవాఁడు. అతనికి నడుముసన్నము; మిక్కిలి యతఁడుపూజ్యుఁడు, ధర్మములనెఱిఁగినవాఁడు, సత్యసంధుఁడు. అతఁడు, చేయఁదగనికార్యములయెడ సిగ్గుఁ బూనినవాఁడు, జితేంద్రియుఁడై యింపుగామాటలాడుచు నెంతయు సుందరముగా బొడసూపువాఁడు; మఱియు నిడుదచేతులుగలిగి పగవారిని పీఁచమడంచువాఁడు. ఇట్లు సమస్తభోగార్హుఁడయ్యును నానావిధములైన భోగములనెల్లఁ బరిత్యజించి పెద్దయగు నిన్నే యన్నివిధముల త్రికరణములచేతను బొందియున్నాఁడు. †మహాత్ముఁడె ననీతముఁ

* ఇందులకు 'అత్యంతసుఖసంవృద్ధః సుకుమారః సుఖోచితః । కథన్న్వపరరాత్రేషు సరయూ మవగాహతే' అనిమూలము. దీనికి విశేషార్థము- (అత్యంత సుఖసంవృద్ధః) రాజు మిక్కిలి యుపలాలించుటవలన సుఖసంవృద్ధుఁడు; నీవు నుపలాలించుటచే అత్యంతసుఖసంవృద్ధుఁడు; అని అత్యంత శబ్దమువలని యతిశయము దెలియునది. (సుకుమారః) నీకనుఁబాటునకును దాళనట్టి సౌకుమార్యముగలవాఁడు, (సుఖోచిత) నీతోఁగూడ హాయిగానుండుటకుఁ దగినవాఁడు కాని నిన్నుఁ బాసియుండఁదగనివాఁడు, ఇట్టి భరతుఁడు, (కథంను) ఎట్లు-ఇచట లక్ష్మణుఁడు తనస్థితివలెనే భరతుని స్థితియున్నదని తలఁచి చెప్పుచున్నాఁడు-అనఁగా తనకు రామవిరహములేనందున ఆబుతువుయొక్క శైత్యమును దాననుభవించుచున్నాఁడు. భరతునికో రామవిరహముచే నెమ్మదిగలుగదు 'ఉపతప్తోదకానద్యః' 'నదులయందును నీళ్లుగ్రాఁగినవయ్యెను' అన్నట్లు రామవిరహమువలన నదులుగూడ ఉష్ణములగుటచే విరహతప్తుఁడగు భరతునికి విరహతప్తమగు సరయూనదిలో మునుఁగుటవలన శైత్యప్రసక్తియేకలుగదు-ఇది యెఱుఁగక తనవలెనే భరతునిఁ దలఁచి యతఁడానదీస్నానమున శైత్యబాధయెట్లు పడుచున్నాఁడో యని కుందుచున్నాఁడు- (కథంను) ఎట్లు, (అపరరాత్రేషు) అపరరాత్రములందు - క్రొత్తఁగా విధవలైన స్త్రీలు మనుష్యులులేచి సంచరించుటకు మునుపే వారిముఖములనుజూడకయే నదికెట్లుపోవుదురో యట్లే తానును కైకకడుపునఁబుట్టుటచే 'పీనినిగుఱించియె యింతయనర్థము పుట్టినది' అనిజనులు చెప్పకొందురని వెఱచి, వేకువనుబోయి వారికంటఁబడక, అపరరాత్రములందే నదికిఁబోవుచున్నాఁడని యర్థము, (సరయూ మవగాహతే) నిర్వేదమువలన సరయువు మిక్కిలి వడిగాఁబాఱుచున్నను భయములేక యందుఁ గ్రుంకు లిడుచున్నాఁడు. (అవగాహతే) మునిఁగి మరల లేచుటకు శక్తి లేక స్నేహితులు లేవనెత్తువఱకు జలములందే యుండునని భావము.

† ఇందులకు 'జితస్స్వర్గస్తవ భ్రాత్రా భరతేన మహాత్మనా।వనస్థమపి తాపస్యే యస్త్వామనువిధీ

డు భరతుఁడు నీవడవిలో మునివేషముదాల్చియున్నను దానును నీవలెనే మునివేషమును దాల్చి నిన్ననుసరించుటంజేసి స్వర్గమును గొల్లగొన్నవాఁడేసుమీ, 'మనుష్యులు తల్లిస్వభావము ననుసరింతురుగాని తండ్రిస్వభావము ననుసరింపరు' అనులోకప్రవాదకలదుగదా. భరతుఁడు తల్లిస్వభావము ననుసరింపక తండ్రి స్వభావమునే యనుసరించుటంజేసి యాప్రవాదను పొల్లుగావించినాఁడు. †ఎవ్వతికి భర్త దశరథమహారాజో, ఎవ్వతికి కొడుకు సత్పురుషుఁడగుభరతుఁడో, యట్టికైకకు నిట్టి క్రూరస్వభావమెట్లుగలిగెను?" అనెను. ఇట్లు ధార్మికుఁడగులక్ష్మణుఁడు రామునియందలిస్నేహమువలనఁ జెప్పుచుండఁగా రాముఁడు అట్లు తల్లిని కైకను నిందించుటకు సైఁపఁజాలక లక్ష్మణునిఁజూచి 'నాయనా! నీవెంతమాత్రము నడిమితల్లిని నిందింపరాదుసుమీ. ఇదివఱకుఁజెప్పుచుంటివే! ఆ యిక్ష్వాకునాథుని భరతుని సమాచారమునే చెప్పుము. దృఢవ్రతుఁడగునేను వనవాసముసేయవలయునని నిశ్చయించుకొన్నవాఁడనైనను భరతునియందలిస్నేహమువశమున వానిని దలఁచుకొనునపుడెల్ల నాబుద్ధి మిక్కిలియుఁ జంచలమగుచున్నది. భరతునిమాటలు ప్రియములై కర్ణకఠోరములుగాక మధురములై నాహృదయమును బాయవు. అవి యమృతమువలెఁ జవులొలుకుచు నిప్పటికిని దలఁచుకొనఁగా నామనస్సు పల్లవింపంజేయుచున్నవి. రఘునందనా! ‡మహా

యతే' అనిమూలము. ఇందులకు భరతుఁడు, అడవిలోనీవున్నను నీవలెనేతానును మునివేషముదాల్చి నిన్ననుసరించుచున్నాఁడుగావున, (స్వర్గః) రామప్రాప్తికి అంతరాయమైన స్వర్గము, (జితః) అతనిచే తిరస్కరింపఁబడినది- దుఃఖాతిశయమున దేహవియోగము నొందువాఁడై స్వర్గములభించినను అది నీదర్శనమున కంతరాయముగనుక దానినిగూడ తిరస్కరించి, నీకుఁగాను ప్రాణములుపెట్టుకొని యున్నాఁడని యర్థము. ఇట్లు రాక్షసులను జంపుటకై చేసినప్రతిజ్ఞయు తీర్పక యాలస్యముచేసితివి. భరతుఁడు పడుచున్నక్లేశమును జూచి యైనను అక్కడికి త్వరగాఁబోవలసియున్నదిగావున నిక్కడపని యేమి యని సూచించి, సర్వానర్థ మూలభూతయైన కైకను ముందు నిందించుచున్నాఁడు.

† లక్ష్మణుఁడు, తెల్లవాఱుజామున రాముఁడును సీతయును, సరస్సున జలకమాడుట మొదలైనక్లేశములుపడుటం జూచి మిక్కిలి దుఃఖితుఁడై కైకను నిందింపఁదొడఁగి తటాలున నిందించినయెడల రామునికికోపముగలుగునని తలఁచి మొదట హేమంతస్వభావమును ప్రస్తావించి ఆప్రసంగమున భరతునిఁదెచ్చి తన్మూలమున కైకను నిందింపఁజొచ్చినాఁడని యిచట సూచింపఁబడియున్నది.

‡ ఇందులకు 'కదాన్వహం సమేష్యామి భరతేన మహాత్మనా। శత్రుఘ్నేన చ వీరేణ త్వయా చ రఘునన్దన' అనిమూలము. ఇట భరతుఁడు తనతోఁగూడ నుండకపోవుటచే సీతలక్ష్మణులు తనతోఁగూడనుండియు భరతునియందలి స్నేహాతిశయమువలన వారు సైతము తనతోఁగూడ లేనట్లె రాముఁడుచెప్పెనని తెలియునది. (హేరఘునందన) లక్ష్మణా, (శత్రుఘ్నేన వీరేణత్వయాచ సహితేన) శత్రుఘ్నునితోను వీరుఁడగు నీతోనుగూడి యున్నట్టి, (భరతేన) భరతునితో, (అహంకదాను సమేష్యామి) నేను ఎప్పుడుగూడియుందునో-ఇట చకారమువలన సీతనుగూడ చేర్చుకొనవలయును. అనురక్తులైన వారందఱితోఁ గూడియున్నను ఒక్క యనురక్తుని బాసినయెడల అనురక్తులనెల్లఁ బాసినట్లే ఆర్తి కలుగుచున్నది. ఆ ఒక్కయనురక్తుఁడే కూడియున్నను, అపూర్వులైన సర్వ సుహృజ్జనములతోనుగూడి



619 రామునిపంపున లక్ష్మణుఁడు శూర్పణఖముక్కు చెవులను కోయుట.

ట్టుం డగుభరతునిని వానితోఁగూడ శత్రుఘ్నుని వీరుండ వగునిన్నును సీతను మి మ్ముందఱను నొక్కటిగా నెప్పుడు గూడి యుండఁగలను' అనెను. ఇట్లు భరతునివలని స్నేహంబునం బెక్కువాక్యంబులఁ బలవించుచు రాముఁడు గోదావరీనదికిఁ బోయి సీతాలక్ష్మణసహితముగా నచట స్నానము గావించెను. అంత వారు పితృదేవతలకును దేవతలకును జలతర్పణములు గావించి యుదయించినసూర్యుని సంధ్యాదిదేవతలను నిచ్చరికతో మంత్రములనుపస్థానముసేసిరి. రాముఁడు స్నానముగావించి, సీతను ల లక్ష్మణునిం గూడినవాఁడై, కృతస్నానుండై పార్వతిని నందిని గూడియున్నభగవంతుఁ డగుశివునింబోలె, ప్రకాశించెను. ఇది పదియాఱవ సర్గము.

---

* శ్రీరాముఁ డాశ్రమమునకు వచ్చి సుఖం బుండుట. శూర్పణఖాగమనము. ఒండొరులకులగోత్రము లడిగి తెలిసికొనుట. శూర్పణఖ తన్ను భార్యగాఁ గయికొనునట్లు రాముని వేఁడుట.

స్నానము చేసినపిదప రాముఁడును సీతాలక్ష్మణులును గోదావరీతీరమున నుండి యంత తమతపోవనమునకుఁ బోయిరి. రాముఁడు లక్ష్మణసహితుఁడై యట్లు తపోవనమును జేగి బ్రహ్మయజ్ఞము మొదలైన పూర్వాహ్ణకర్మములను నిర్వర్తించి పర్ణ శాలను బ్రవేశించెను. అచ్చట రాముఁడు మహర్షులచే పూజితుండై తమ్ముం డగు లక్ష్మణునితో సుఖముండి పలువిధములైన యాయాయాముచ్చటలాడుచుండెను. మహాబా హుం డగునారాముఁడు పర్ణశాలయందు సీతాసహితుఁడై గూర్చుండి చిత్రానక్షత్ర ముతోఁగూడిన చంద్రునివలెఁ బ్రకాశించుచుండెను. అట్లు రాముఁడు ఆయాయికథ లందు మనస్సుదగిలి పర్ణశాలయందుఁ గూర్చుండియుండఁగా రాక్షసి యొక్కతి యా దృచ్ఛికముగా నాప్రదేశమునకు వచ్చినది. ఆరాక్షసిపేరు శూర్పణఖ. అది రా క్షసుఁ డగురావణునిచెల్లెలు. అది దేవతాప్రతిముఁ డగురామునిఁ జూచి యత నిని జేరవచ్చెను. ఆ విశాలవక్షుఁడును, నిడుదబుజములును, తామరరేకులవంటి కన్నులును, ఆజానుబాహువులును, తళుకొత్తుచుండు నెమ్మొగమును గలిగి క న్నులపండువై చూపట్టుచుండెను. ఏనుంగువలె బీరంపునడలుగలిగి జడలగుంపు దాల్చి సుకుమారుఁడై మహాబలుఁడును రాజలక్షణలక్షితుఁడు నై కలువరే కులవంటిచాయనిచాయయు మన్మథునివంటికాంతియు వెలయ దేవేంద్రునివలె వె లుఁగుచున్నరామునిం జూచి యారాక్షసి కామమోహితయయ్యె. రాముండు ముద్దు

---

యున్నట్లు అత్యంతహర్షము కలుగును, (త్వయాచ)సీతోడను-అని లక్ష్మణునితోఁగూడియున్నను సైతము అట్లుచెప్పుట భరతునివలని ప్రేమాతిశయమువలన నని తెలియునది.

* ఇట్లు రాముని తపోవిశేషమును దెలుపుటకు మొదట ప్రవర్తించిన హేమంతమును వర్ణించి యంత మూఁడుసంవత్సరములు గడచిపోఁగా ఒకానొకప్పుడు చైత్రమాసమున సకలరాక్షసవధమున ప్రమూలమైన శూర్పణఖ ప్రసక్తింపఁగా దానివృత్తాంతమును దెల్పుచున్నాఁడు.

మొగమువాఁడు ; శూర్పణఖయో వికారపుమూతిగలది. అతని నడుము గుండ్రనై కన్నులు విశాలములై కేశములు ప్రన్నగా నుండును. దానికిఁ బెనుపొట్టయు వికారపుఁగన్నులును ఎఱ్ఱనిపల్ల వెండ్రుకలును గలిగియుండును. రాముఁడు ప్రీతిగొలుపునట్టి యాకారమును మేఘగంభీరమైనస్వరమును గలవాఁడు. అది యో వికటమైనరూపును, భయంకరమగు కంఠధ్వనియుఁగలది. రాముండు వయసుకాఁడు; మఱి ప్రన్నని వాఁడు. అది బెడిదురాలు; మఱి ముసలిది. రాఘవుఁడు చక్కని మాటలాడువాఁడు. అది వికటంపుఁబలుకు పలుకునది. రాముఁడు సదాచారసంపన్నుఁడు. అది చెడునడతలుగలది. రాముఁ డింపుగా చూపట్టును. అది చూడ్కికి నసహ్యాముగా నుండునది. ఇట్టి రూపలావణ్యాదిలక్షితుని రామునిఁజూచి సర్వవికారదూషిత యగునారాక్షసి మన్మథావేశమై 'ఓయీ ! నీవు తాపసరూపమున జటలుదాల్చియున్నావు. కాముకునివలె భార్యతోఁ గూడియున్నావు. మఱి క్షత్రియునివలె వింటిని బాణములను బూనియున్నావు. ఇట్టి నీవు రాక్షసులు మెలఁగెడియీప్రదేశమునకు నెట్టువచ్చితివి? నీవిచటికి వచ్చినందులకేమిపని? ఇదంతయు నాకు ఉన్నది యున్నట్టుగాఁ జెప్పవలయు'ననెను. పరంతపుఁ డారాముఁడు శూర్పణఖ యిట్లు చెప్పినది విని బుద్ధికాపట్యములేనివాఁడగుటచే తనవృత్తాంతమంతయుఁ జెప్పందొడఁగినవాఁడయ్యె. రామున కెప్పుడుగాని యబద్ధమాడుట యిష్టముగాదుగదా. విశేషించి తపోవనమున తాపసధర్మమవలంబించియున్నపుడును,అందును స్త్రీలసమక్షమునను,ఎంతమాత్ర మది యిష్టము గానేరదుగదా. రాముండు దానినిజూచి 'పరాక్రమమున దేవతలకు సాటివచ్చుదశరథుండనునొక రాజుండెను. నే నతనికి పెద్దకుమారుఁడను. నన్ను రాముఁడని జనులు పిలుతురు. ఇతఁడు నా తమ్ముఁడు. ఇతనిపేరు లక్ష్మణుఁడండ్రు. ఇతఁడు న న్నెప్పటికిని నియమమున ననువర్తించుచుండును. నేను,నాతండ్రియగుమహారాజునియోగింపఁగా,తల్లికైకయు ప్రేరేపఁగా పిత్రాజ్ఞాపరిపాలనధర్మమును నాచరింపఁగోరినవాఁడనై యీ వనమునకు తపోరూప మగుధర్మమును బడయుకొఱకు వచ్చితిని. నిన్ను తెలిసికొనఁ గోరుచున్నాను. నీ వెవ్వతవు? నీతలిదండ్రు లెవరు? *ఇంత మనోహరము లైనయవయవములు గల నీవునాకు రాక్షసి వని తోఁపలేదు. నీ విచ్చటి కేల వచ్చితివి? ఈవిషయమంతయు నాకు యథార్థముగాఁ జెప్పుము' అనియడిగెను. ఆరాక్షసి రాముఁడు చెప్పినది విని మరులు ముంచుకొన నతనితో "రామా ! నేను ఉన్నరూపున నావిషయమంతయుఁ జెప్పెదను. నా పలుకు వినుము. నేను శూర్పణఖ యనురాక్షసిని; కామరూపిణిని. ఎల్లవారును నా పేరన్న భయపడుదురు. ఒక్కతినే యీయడవియందుఁ దిరుగుచుందును. వీరుఁడును విశ్రవసునికుమారుఁడును బలవంతుఁడును రాక్షసులకెల్ల రాజు నగురావణుఁడు నాకు తోఁబుట్టువు. అతనిని నీవు వినియుండవచ్చును. ఎప్పుడును మి

* కామరూపిణిగావున సుందరాకారము రామునికొఱకుఁ దాల్చియుండును. దానిని కవి వికరూపగా వర్ణించుట దానివాస్తవరూపమును దెలుపుటకని తెలియునది.

క్కిలియు నిద్రపోవుచుండు మహాబలుఁడు కుంభకర్ణుఁడును నా తోఁబుట్టువు. ధర్మాత్ముఁ డగువిభీషణుఁడును నాకుఁ దోఁబుట్టువు. అయితే అతనికిమాత్రము రాక్షస చేష్టలు లేవు. యుద్ధములందు పరాక్రమమునఁ బొగడ్త కెక్కిన ఖరదూషణులు నా సహోదరులు. వారు నాకుఁ దోఁబుట్టువు లని భయపడవలదు. నేను వారిసందఱిని మీఱి నాయిచ్చచొప్పున నడచుకొనుచుందును. కాన వారినెల్ల విడిచి యపూర్వదర్శనుండును పురుషోత్తముండు నగునిన్ను నా భావంబున భర్తగాఁ బొందఁ గోరితిని. 'సీత నా కున్న దే'యనకు. నేను మహాప్రభావము గలదానను. నా యిచ్చకొలఁది బలమునొందఁగలదానను. తలఁచినట్లు రాకపోకలు సేయుదానను. కనుక నాకు చిరకాలము భర్తగానుండుము. ఈ సీతతో నీకుఁ బనేమి? ఈసీత వికృతముగాను గురూపగాను నున్నది. ఇది నీకుఁ దగదు. నేనే నీకుఁ దగినదానను. నన్ను భార్యగాఁ జూడుము. విరూపయై దుష్టాచారముగలిగి బెడిదురాలై బాకి కడుపుగలిగియున్న యీ మనుష్యస్త్రీని నీ తమ్మునితోఁగూడ భక్షించెదను. కాంతా! అంత నీవు నన్నుఁ గూడి పర్వతశిఖరములను నానావిధము లైనవనములను జూచుచు, దండకారణ్యమున విహరింపఁగలవు'' అనెను. మాటలయందు నిపుణుఁడుగాన రాముఁ డది యిట్లు చెప్పినదివిని దానింజూచి యిట్లు చెప్పినవాఁడు. ల ఇది పదియేడవసర్గము.

రాముఁడు శూర్పణఖతో లక్ష్మణుని వరింపఁ బొమ్మనుట. లక్ష్మణుఁడు తాను
రామునకు దాసుఁ డగుటచే దాసభార్యగా నుండరాదనియు రాము
నే వరింపుమనియుఁ జెప్పుట. శూర్పణఖ యింతకును సీతయే
మూలమని యామెను జంపఁ బూనఁగా రామునియాజ్ఞచే
లక్ష్మణుండు దాని ముక్కుసెవులఁ గోయుట.
అది ఖరునియొద్దకుఁ బోవుట.

అంత రాముఁడు కామపాశంబునం గట్టువడి యున్నశూర్పణఖనుజూచి యర్థము తేటపడునట్లు మెత్తనిమాటల నవ్వుమొగమునం దోఁప దానితో "అమ్మా! నేను ఒక్కతెని పెండ్లిచేసికొనియున్నాను. 'దానిని దిగవిడువరాదా' యందువేని అది నాకు మిక్కిలి మక్కువయైనది. 'అయినను పెక్కుభార్య లుండఁగూడదా'యందువేని నినుబోఁటి గొప్పస్త్రీలకు సవతియుండుట సహించుట గష్టమనుమీ. ఇతఁడు నాతమ్ముఁడు. ఇతని పేరు లక్ష్మణుఁ డందురు. సదాచారవంతుఁడు, మంచిరూపరి,*శ్రీమంతుఁడు. ఇతఁడు భార్యనుదీసికొని వెంటరాలేదు. మఱియు నితఁడు మిక్కిలియుఁ బరాక్రమశాలి. ఇతఁడు ఇంతవఱకు భార్యాసుఖ మెఱుఁగనివాఁడు. కాఁబట్టి యితనికి భార్యగావలసియున్నది. మఱియు నితఁడు యౌవనవంతుఁడును సుందరాకారుఁడు నగుం

*ఇందులకు '(శ్రీ…నకృతదారశ్చ లక్ష్మణో నామవీర్యవాన్ ॥ అపూర్వీ భార్యయా చార్థీతరు

గావున నీరూపమున కనురూపముగా భర్త గాఁగలఁడు.*నీ పిఱుఁదులు సుందరములైనవి. నీకన్నులు వెడలుపులైనవి. కావున శూర్పణఖా! మేరుపర్వతమును సూర్యకాంతిపొందునట్లు నీవు నాతమ్ముని బెనిమిటిగాఁ బొందుము. నీకు సవతులును లేక సుఖముగానుండును' అనెను. ఆశూర్పణఖ కామమోహితగావున రాముఁడు చెప్పినదివిని యంత శీఘ్రముగా నతనిని విడిచి లక్ష్మణునింజూచి 'నాకు ఉష్ణకాలమున శీతలమును శీతకాలమున ఉష్ణమునై నా యంగములుండును. మఱి నేను భర్తయం దనురాగము గలయుత్తమకాంతను. నీ చక్కఁదనమునకుఁ దగినదానను. నీవు నన్నుం గూడి సౌఖ్యంబున నీదండకారణ్యమునం దంతటను విహరించుచుండుము' అనెను. రాక్షసి

---

ణః ప్రియదర్శనః। అనురూపశ్చ తే భర్తా రూపస్యాస్య భవిష్యతి' అని మూలము. విశేషార్థ మెట్లనఁగా:-రాముఁడు 'నవితథా పరిహాసకథాస్వపి' 'అనృతం నోక్తపూర్వం మే నచ వక్ష్యే కదాచన' అని యున్నఁడు గాని వ్యర్థపుమాటగాని కల్లమాటగాని పలుకఁడనుటచే నిచట (అకృతదారః) అనుటకు భార్యను బెండ్లాడనివాఁ డనియర్థము దగదు. భార్యను తనతోఁగూడఁ దీసికొనిరానివాఁ డనియర్థము (అపూర్వీ) 'పూర్వీ'యనఁగా పూర్వము భార్యాసుఖము నెఱిఁగినవాఁడు. 'అపూర్వీ' యనఁగా చిరకాలముగా భార్యాసుఖ మెఱుఁగకున్నవాఁడని యర్థము. రాముఁ డబద్ధమాడఁడు గనుక తదనుగుణముగా ఇచట స్వభార్యవలని సుఖము నెఱుఁగకున్నాఁడని లోపలిభావము. ఏదేనొకస్త్రీవలని సుఖముగూడ ఎఱుఁగకున్నాఁడని శూర్పణఖకుపైకి తోఁచించినయర్థము. కాఁబట్టియే (భార్యయా చార్థీ) భార్య గావలసినవాఁడు-స్వభార్య గావలసియున్నవాఁడని రాముని యంతరాశయము. ఎవతెనేని ఒకభార్యను గావలసియున్నాఁడని శూర్పణఖకుఁ దోఁపించినయర్థము (తే భర్తా) నీకు పెనిమిటియని యర్థము, (తేఽ అభర్తా) అని ఛేదముచేసి నీకు పెనిమిటి గాఁడని అంతరాశయము గ్రహించునది. (రూపస్య అస్య) ఈ నీసొగసైన రూపమునకు అని యర్థము. ఈ నీకుత్సితరూపమునకు అని అంతరార్థము. గోవిందరాజులు.

లేక (అకృతదారః) భార్యను పెండ్లాడనివాఁడు. కావుననే (అపూర్వీ) పూర్వము భార్యాసుఖ మెఱుఁగనివాఁడు, కాఁబట్టియే (భార్య యాచార్థీ) భార్య గావలసినవాఁడు, (అపూర్వ భార్యయా చార్థీ) అనుపాఠమున అపూర్వయగు-అనఁగా నూతనయైన-భార్య గావలసినవాఁడు-అట్టిభార్య నీవే యగుదువు, (అను రూపశ్చ తే భర్తారూపస్యాస్య భవిష్యతి) నీకుఁ దగినమగఁడు. నీ యీసుందరరూపమునకును దగినవాఁడగును; అని పరిహాసానుకూలమైన ప్రాతీతికార్థము తెలియునది. అంతరాశయ మెట్లనఁగా:-(అకృతదారః) పరదార పరిగ్రహము సేయనివాఁడు-లేక భార్యదగ్గఱ లేనివాఁడు. (అపూర్వ భార్యయా) ప్రథమభార్యచేతనే, (అర్థీ) చరితార్థుఁడైనవాఁడు, (శీలవాన్) ఏకపత్నీవ్రతశీలుఁడు, (ప్రియదర్శనః) ప్రియులందు-అనఁగా మిత్రులందు, దృష్టిగలవాఁడు (తే అభర్తా) నీకు మగఁడు కాఁడు. (అనురూపః) స్వభార్యకే తగినవాఁడు, (అస్య రూపస్య) ఈ నీరూపమునకు, (యోగ్యః) అని శేషము-యోగ్యుఁడు, (భవిష్యతి) అగునా అని కాకువు గ్రహించునది. లేక, (అస్య రూపస్య అనురూపో భవిష్యతి) ఈ నీరూపమునకు తగినవాఁడగునా అని కాకువు.-మహేశ్వరతీర్థులు.

*ఇందులకు 'ఏనంభజ విశాలాక్షి భర్తారం భ్రాతరం మమ। అసపత్నా వరారోహే మేరు మర్కప్రభా యథా' అనిమూలము. (విశాలాక్షి) వెడలుపైనకన్నులు గలదియని యర్థము మిక్కిలి గుండ్రనై యుండుటచే పెద్దకన్నులుగలదియని నిందాపరమైనయర్థము. అర్కప్రభ మేరువును భజించునట్లు ఇతనిని భజింపుమనియర్థము. అర్కప్రభ మేరువునుబొంది నివర్తించునట్లు ఇతనికడకుఁబోయి నివర్తిం

యిట్లు చెప్పఁగా విని లక్ష్మణుఁడు మాటలయందు నిపుణుఁడుగావున చిఱునవ్వుదోఁప చేఁటలవంటి గోళ్లుగల యారాక్షసినిజూచి యుక్తముగా "తామరపువ్వువంటి వన్నె గలదానా! నేను దాసుఁడను. దాసుఁ డగునాకు భార్యవై నీవును దాసిగావలయును. ఇట్లగుట కేల కోరెదవు? 'ఎవరికిఁ దాసుఁడవు' అనెదవా? నా పెద్దన్న నాకు నాథుఁడు. కాన నే నతనిదాసుఁడను † నీవు వెడలుపైన కన్నులుగలదానవు. ఇట్టి నీవు సర్వార్థములు సమృద్ధముగాఁ గలయార్యుని రామునిం జేపట్టి కోర్కియీడేఱి సంతోషమునుచెలఁగ రెండవభార్యవు కమ్ము. వికారమైనరూపముగలిగి, అప్రశస్తురాలై భయంకరముగాఁ గనుపట్టుచు నుఱుకుబొజ్జ వ్రేలాడుచున్న ముసలిదానిని ఈ సీతను విడిచి యితఁడు నిన్నే భార్యగాఁ బొందును. *శూర్పణఖా; నీవు ఉష్ణకాలమున సుఖశీతలమును శీతకాలమున సుఖోష్ణముగాను నున్నయంగములుగలిగి భర్తయం దనురాగము నెఱపునట్టియుత్తమవనితవు. బటువు లయినపిఱుఁదులు గలదానవు. మిక్కిలి మేలయిన యిట్టినీరూపమును విడిచి తెలిసినవాఁ డెవ్వఁడు మనుష్యస్త్రీలయందు మనస్సునుంచును?" అనెను. భయంకరాకారమును నుఱుకుబొజ్జయుఁ గల యారాక్షసి యిట్లు లక్ష్మణుఁ డాడినమాటవిని పరిహాస మెట్టిదో యెఱుఁగనిది గావున, ఆమాటనంతయు యథార్థముగాఁ దలఁచినది. అది మరులుకొని మైమఱచి

పుమని యర్థాంతరము. ఇట్లు రాముఁడు దయాళువగుటచే తన్ను కామమోహమునఁ జేరవచ్చిన స్త్రీని తోడనే ధిక్కరించి దుఃఖపెట్టనోపక పరిహాసంపుముచ్చట జరపినాఁడని తెలియుచున్నది-గోవిందరాజులు:- ఇందు (భర్తారం) అనుటచే భర్తగా భజింపుమనియర్థము. మనకెల్ల పోషకుండని భజింపుమని యంతరాశయము-మహేశ్వరతీర్థులు.

† ఇందులకు సమృద్ధార్థస్య సిద్ధార్థా ముదితామలవర్ణినీ। ఆర్యస్యత్వం విశాలాక్షి భార్యాభవ యవీయసీ॥ ఏనాం విరూపామసతీం కరాళాం నిర్ణతోదరీం। భార్యాం వృద్ధాం పరిత్యజ్య త్వామేవైష భజిష్యతి' అనిమూలము. విశేషార్థము:—వీనికి క్రింద ప్రాతీతికార్థము చెప్పఁబడినది. వాస్తవార్థమెట్లనఁగా:-(సిద్ధార్థా) ఇట అర్థశబ్దమునకు 'అర్థోభిధేయ రైవస్తుప్రయోజననివృత్తిషు' అని నివృత్తి యర్థము. సిద్ధమైన నివృత్తిగలది. సమృద్ధార్థుఁడైన రామునినుండి నినుబోఁటిదానికి నివర్తింప వలసినది సిద్ధమనుట, (అముదితామలవర్ణినీ) అనిఛేదము. నివర్తించుటవలన సంతోషములేనిది; మంచి వర్ణములేనిది యనుట, (యవీయసీ) హీనురాలైన, (భార్యా) భార్యయైనది-భార్య కాఁదగనిదనుట. (విరూపాం అసతీం కరాళాం నిర్ణతోదరీం వృద్ధాంత్వాం పరిత్యజ్య ఏనాం భార్యామేవ ఏష భజిష్యతి) అని వాస్తవార్థమున అన్వయము. 'విరూపత్వాదులుగల నిన్ను విడిచి యీభార్యయగు సీతనే యితఁడు గయికొనును' అని యాశయము-గోవిందరాజులు:—లేక: 'విరూపామ్' ఇత్యాదులకు సీతాపరముగా వాస్తవార్థమెట్లనఁగా:-(విరూపాం) విశేషమైన రూపముగలది-త్రిలోకసుందరియనుట, (అసతీం) తనకు సాటియైన సతిలేనిది-పరమపతివ్రతయనుట, (కరాళాం) పొడవైనది. 'కరాళో దంతురే తుంగేదారుణేపిచ కథ్యతే' అని నిఘంటువు. (నిర్ణత।ఉదరీం) లోఁతయిన ఉదరముగలది-సన్నని నడుముగలది యనుట, (వృద్ధాం) శీల గుణములచేఁ వృద్ధయైనది.-మహేశ్వరతీర్థులు.

* ఇందు విపరీతలక్షణగాన పరిహాసోక్తిగా వర్ణించుట తెలియుచున్నది-గోవిందరాజులు.

యుండుటవలన * పర్ణశాలయందు సీతంగూడి మార్కొనరాని తేజంపుపెంపునఁ గూర్చుండియున్న పరంతపుని రామునింజూచి 'నీవు, వికారరూపవై వాసికి వన్నెకు లేక, వ్రేలుకాడుకడుపుతో ఘోరముగానున్న యీ ముసలి పెండ్లమును బెట్టుకొని యీబలమున నన్ను గారవింపకున్నావు. ఇప్పుడు నీవు చూచుచుండఁగానే యీ మనుష్యస్త్రీని బట్టి భక్షించెదను. అంత సవతితోడును లేక నిన్నుఁగూడి సుఖముగా విహరించెదను' అని చెప్పి కన్నులు కొఱవులుంబోలె భయంకరముగాఁ గ్రాల మిక్కిలియుఁ గుపితయై ప్రళయకాలపు పెనుఁగొఱవి రోహిణిపై నడరునట్లు, లేడి కన్నులవంటి కన్నులు పన్నెగులుకు సీతాదేవి పైకి నురవడించి వచ్చెను. మహాబలుఁడగు రాముఁడు మృత్యుపాశమువలె బెడిదముగా పైపడి వచ్చుచున్న యారాక్షసినిఁ జూచి కుపితుఁడై యడ్డపడి నిలిపి యంత లక్ష్మణునిఁ జూచి 'సౌమ్యా! లక్ష్మణా! క్రూరులై దుర్జనులగువారితో నెట్లును బరిహాసము పెట్టుకొనరాదు. సీత శూర్పణఖ క్రౌర్యమును జూచియు నెట్లో మనస్సు కలఁగక కుదుటఁబెట్టుకొని యున్నది చూడుము. పురుషతిలకా! వికృతాకారయై దుష్టురాలునై మిక్కిలియు మత్తిల్లి పెద్దపొట్టనిక్కచూపుచున్న యీ రాక్షసిని మఱింత విరూపఁ గావింపుము.' అనెను. మహాబలుఁడగు లక్ష్మణుఁడు రాముఁడు చెప్పినది విని కుపితుఁడై యతనిపార్శ్వమున నున్న ఖడ్గము నెత్తి శూర్పణఖ ముక్కును జెవులును గోసివైచెను. ముక్కును జెవులును గోయఁగానే భయంకరాకారయగు నా శూర్పణఖ వికారస్వరముతోఁ గూయిడి వచ్చినదారినే యడవికిఁ బాఱిపోయెను. మహాఘోరరూపయైన యా రాక్షసి మఱింత విరూపఁగాఁ జేయంబడి నెత్తుటఁదోఁగి వర్షాకాలమునందు మేఘములవలె నానావిధములుగా నఱచెను. అది నెత్తురు మిక్కిలియు గాఱుచుండఁగా బహువిధముల మిక్కిలి భయంకరముగా చూపట్టుచుఁ జేతులు పయి కెత్తుకొని బిగ్గఱ బొబ్బలిడుచు మహారణ్యమును జొచ్చెను. అంత నట్లు విరూపితయై, జనస్థానంబున ననేకరాక్షసజనపరివేష్టితుఁడై చూచువారికి భయంకరముగాఁ బొడగట్టుచున్న తోడఁబుట్టువును ఖరునిఁ జేరి యాకాశమునుండి పిడుగుపడ్డట్లు గొబ్బున వానిమ్రోల నేలంబడెను. అంత నది భయమున నెఱుక తప్పి నెత్తుట 'దొప్పదోఁగి తోఁబుట్టువగు ఖరునితో రాముఁడు సీతనుఁగూడి వనమునకు వచ్చుటయు తన్ను విరూపగాఁ జేయుటయు మొదలైన వృత్తాంతమంతయుఁ జెప్పెను. ఇది పదునెనిమిదవ సర్గము.



* పర్ణశాలయందు రాముఁడుండెననుటచే లక్ష్మణుఁడు బయటనే యుండుట సూచితమగుచున్నది.



517 సీతారాములకడకు శూర్పణఖ వచ్చి, రామునిఁజూచి నన్ను పెండ్లియాడుమనుట.

శూర్పణఖ ఖరునకు రామాదుల వృత్తాంతము చెప్పుట. ఖరుఁడు రాముని జయింప పదునలువురు రాక్షసవరులను బంపుట. వారు శూర్పణఖతోఁడ రాముని యొద్దకుఁ బోవుట. —

ఖరుఁడు, అట్లు విరూపయై నెత్తుటఁదడిసి నేలంబడి యున్నతనతోఁబుట్టువును శూర్పణఖను జూచి కోపంబునఁ గొఱగొఱఁ బొక్కుచు 'లెమ్ము! మొదలు నీసంగతిని జెప్పుము. తెలివితప్పుట మాను. మనస్సున తత్తఱపాటు విడువుము. ఇట్టి రూపుగా నిన్ను విరూపను జేసినవాఁడెవఁడు? స్పష్టముగా చెప్పుము. ఎవ్వఁడు, కోఱలయందు విష మురులుచున్న కృష్ణసర్పము, తన్నేమియుఁ జెనకక యెదురువచ్చి కదలక మెదలక యూరకుండఁగా, దానిని వేడుకగా వ్రేలికొనతోఁ గారించుచున్నాఁడు? ఎవ్వఁడు తెలియక కంఠమునందు మృత్యుపాశమును దగుల్చుకొని, యది యిట్టిదని తెలియకున్నాఁడు? ఎవ్వఁడిపుడు నిన్నిట్లు చెనకి వేండ్రమైన విషమును ద్రావినవాఁడైనాఁడు? నీవో బలపరాక్రమములు మిక్కిలియుఁ గలదానవు, కామగమనవు, కామరూపిణివి, మృత్యువుం బోలినదానవు. ఇట్టి నీకు ఎవ్వఁడీ దురవస్థ గావించినాఁడు? దేవతలలోఁగాని గంధర్వులలోఁగాని భూతములలోఁగాని మహాత్ములగుఋషులలోఁగాని, మహాపరాక్రమశాలి యగువాఁడెవ్వఁడు నిన్నిట్లు విరూపం గావించినాఁడు? లోకమున పాకాసురుఁ జంపిన వేయుఁగన్నులువాఁడగు దేవేంద్రుఁడొకఁడుతప్ప నాకప్రియము సేయువాఁడెవ్వఁడును నాకుఁ గనుపట్టఁడుసుమీ. సారసపక్షి నీటం గలసినపాలను ద్రావునట్లు యిదిగో ప్రాణాంతకరము లైనబాణముల వాని ప్రాణములను గొనుచున్నాను. ఎవ్వఁడు, నాబాణములు నాటి మర్మములు త్రెంపఁగా హతుండై పడ, వానినుండి నురుఁగులతోఁగూడి మెఱ్ఱగాఁ దొరఁగుచున్న రక్తమును భూమి త్వరలో త్రాగఁగలదు? ఎవ్వండు యుద్ధమున నాచే హతుఁడై కూలఁగా పక్షులు సంతోషమున గుంపులుగూడి వాని దేహమునుండి మాంసమును బెఱికి తినఁగలవు? నేనిదిగో యీ యుద్ధమున వానిని కయ్యమున కీడ్వఁగా దేవతలుగాని గంధర్వులుగాని పిశాచములుగాని రాక్షసులుగాని యీ నీనునిఁ గాపాడ శక్తులుగారు. ఏదుర్జనుఁడు విక్రమించి వనములో నిన్నిట్లు గావించినాఁడో నీవు మెల్లఁగా తెలివి దెచ్చుకొని నాకుఁ జెప్పవలయును' అనెను. మిక్కిలియు కుపితుఁడై తమ్ముఁడగుఖరుఁడిట్లాడినమాట విని యంత శూర్పణఖ కన్నులనీళ్లుగాఱ వానితో 'దశరథునికుమారులు రామలక్ష్మణు లని గలరు. వారిరువు రన్నదమ్ములు. మంచిప్రాయముగలిగి చక్కఁదనము మిక్కిలియునిక్క, *సుకుమారశరీరులై మహాబలులై తెల్లదామరరేకుల

* ఇందులకు 'తరుణౌ రూపసంపన్నౌ సుకుమారౌ మహాబలౌ । పుండరీకవిశాలాక్షౌ చీరకృష్ణాజినాంబరౌ' అనిమూలము. ఇందులకు విశేషార్థము:- ఖరుఁడు 'నిన్నెవఁ డిట్లు విరూపగాఁజేసెను. స్పష్టముగాఁ జెప్పు' మన్నందులకు శూర్పణఖ 'పుత్రౌ దశరథస్యాస్తాం భ్రాతరౌ రామలక్ష్మణౌ' "దశరథుని

వలె విశాలము లగుకన్నుల నన్నెగులుకుచుందురు. వారు నారచీరలును కృష్ణాజిన

కౌమారులు అన్నదమ్ములగు రామలక్ష్మణులు' అని బదులు చెప్పవలసినదై యుండఁగా నట్లు చెప్పక 'తరుణౌ రూప సంపన్నౌ —' అని రామాదుల సౌందర్యాదులను జెప్ప నేల యనఁగా దానికి విరూపత్వముగలిగినను రామాదులయెడ విరక్తి గలుఁగలేదు గాన కామమోహాతిశయమునఁ దోఁబుట్టువుల సమక్షమందయినను తనమనస్సులో నున్నదే చెప్పినదయ్యెను. రాముని గన్నారఁ జూచినవారికి, వారనుకూలురైనను ప్రతికూలురైనను, రాముని నిట్లు వర్ణించుటయే స్వభావముగానున్నది. కాఁబట్టియే సుందరకాండమున సీత 'యాని రామస్యచిహ్నాని' 'రాముని గుఱుతులెవ్వి' యని యడుగఁగా హనుమంతుఁడు 'త్రిస్థిరస్త్రిప్రలంబశ్చ' 'త్రిస్థిరుఁడు త్రిప్రలంబుఁడు' అని చెప్పవలసియుండఁగా నట్లు ముందు చెప్పక 'రామః కమలపత్రాక్షః సర్వసత్త్వమనోహరః' 'రాముఁడు తామర రేకులవంటి కన్నులుగలవాఁడు, సకల ప్రాణుల మనస్సును హరించునట్టి చక్కనివాఁడు' అని రామసౌందర్యమునే మొదట వర్ణించినవాఁడయ్యె. లేక నిదురించినవారియు, పరాకుపడియున్నవారియు, కుపితులైనవారియు లోపలిభావము తెలియవచ్చుట గనుపట్టుచున్న దనున్యాయమున ముక్కు చెవులు గోయఁబడుటచే శూర్పణఖ దుఃఖప్రమత్తయై కుపితగానుండుటవలన హృదయమందలి భావమునే చెప్పుచున్నది. (తరుణౌ) యౌవనవంతులు. స్త్రీలకు మొదటి యాకర్షకము వయస్సే కనుక అదియే మొదట చెప్పఁబడుచున్నది. దీనికి మొదట మనస్సుతగిలినది రామునియందు; విరూపగాఁ జేసినవాఁడు లక్ష్మణుఁడు. రెండుపక్షములందును తాను గామించినవాఁడైనను తన్ను విరూపగాఁ జేసినవాఁడైనను ఒక్కనినే చెప్పవలసియుండఁగా (తరుణౌ) అను ద్వివచనమున ఇద్దఱిని ప్రధానముగాఁ జెప్ప నేలయనఁగా 'అన్యోన్యసదృశౌ వీరౌ' అన్నట్లు ఉభయులును యౌవనము మొదలగువానియందు సమానులుగానుండుటంబట్టి యిద్దఱిని జెప్పినది. మొదట రామునే వరింపఁగా నతఁడు లక్ష్మణుని నిర్దేశించి వరింపుమని పంపఁగా లక్ష్మణునియందు మనస్సుతగిలి యతనికడకుఁ బోయినది. లక్ష్మణుఁడు రాముని నిర్దేశించి రామునే వరింపుమనఁగా మరల రామునియందు మనస్సుతగిలి యతనికడకు వచ్చినది. పర్యాయక్రమముగా మూలమున వారిద్దఱియందును సమానముగా దాని మనస్సు తగిలియుండుటవలన ద్వివచనముచే నిద్దఱిని జెప్పినది. మఱియు రాముఁడు 'విరూపయితుమర్హసి' 'దీని విరూపగాఁ జేయఁదగుదువు' అని దానికి విరూపత్వమును జేయించు కర్తగాను, లక్ష్మణుఁడు 'ఉద్ధృత్యఖడ్గం చిచ్ఛేద కర్ణనాసం మహాబలః' 'కత్తితో ముక్కుచెవులు గోసెను' అనుటచే చేసినకర్తగాను నుండుటంబట్టి 'తాభ్యాముభాభ్యా మిమా మవస్థాం సంప్రాప్తా' అని యిరువురివలనే యిట్టియవస్థ తనకుఁ గలిగినదని మీఁద చెప్పుచున్నదిగావున నిరువురయందును ద్వేషము సమానముగానుండుటవలనను ఇద్దఱిని చెప్పినదనియు గ్రాహ్యము, (తరుణౌ) ఒక్కతెను ఇరువురయందు ఏక కాలమున మనసెట్లుచిక్కును? వారిద్దఱు అన్నయుతమ్ముఁడును అగుదురన్నను ఇద్దఱును పునర్వసూపుష్య నక్షత్రములందు వరుసగాఁ బుట్టినవారుగావున వయసునందంతగా తారతమ్యముగలుగదు. కనుక వారిద్దఱియందును ఒక్కతీరుగనే దానికి మనస్సు తగులవచ్చును. అయినను వయస్సు ఒక్కటిగానే యుండినను రూపమునందు హెచ్చుతక్కువలుండవచ్చునుగాన దానిబట్టియైనను దానికి వారియం దొక్కతీరుగనే మనస్సు తగులుపడఁజాలదు అనఁగా (రూపసంపన్నౌ) మన్మథాదులుకూడ యాచించి తీసికొనఁదగినంత నిరతిశయరూపసమృద్ధి యిద్దఱికిని గలదనియర్థము. మన్మథుఁడు 'అంగాదంగాత్సంభవసి' అని తండ్రియగు నీతని యంగము నొక్కపాలునఁ బుట్టినవాఁడే కనుక ఇతనియంగప్రత్యంగసౌష్ఠవముయొక్క లేశమును భజించి పడసియే యంతటిరూపవంతుఁడయినాఁడు సుమీ, (రూపసంపన్నౌ) 'ఉత్పన్నం ద్ర

మును గట్టి ఫలమూలము లాహారములుగా జితేంద్రియులై తాపసవృత్తి ధర్మము

---

వ్యం క్షణంనిర్గుణం తిష్ఠతి' 'పుట్టిన వస్తువు పుట్టినక్షణకాలము గుణములేకయే యుండును' అనున్యాయముచొప్పున దేనికిఁగాని పుట్టినప్పుడే గుణములు కలుగవు. అయినను 'రూపదాక్షిణ్యసంపన్నౌ ప్రసూతౌ' 'రూపముచేతను దాక్షిణ్యముచేతను పరిపూర్ణులై పుట్టిరి' అన్నట్లు పుట్టుకతోడనే రూపాదిగుణసమృద్ధి వీరికిమాత్రము గలిగినవి. కాన వయస్సునుబట్టి వారిరూప మతిశయించినదిగాదని భావము. మఱియు 'రామేతి రామేతి సదైవ బుద్ధ్యా విచింత్య వాచా బ్రువతీ తమేవ' 'రామరామాయని బుద్ధిచేఁ జింతించుచు నోటనతనినే చెప్పుచును' అన్నట్లు ఆఁడుపుట్టువులైనవారు మోహాక్రాంతులై ఏకధ్యానముగా చెప్పుకొనవలసినట్టిది సుమా వారిరూపము. ఇట్టివారి సౌందర్యములో తగులువడితినిగాన వారినాలింగనము చేసికొంటినేని సౌందర్యముండియు వారిదేహములు కఠినములగునా యనఁగా, (సుకుమారౌ) రాక్షసులగు మీవలెకఠినదేహులుగారు-పువ్వులను గౌఁగిలించుకొనునట్లు వారిదేహములు మృదువులై యుండును. కావుననే 'అతసీపుష్పసంకాశం' 'నల్లయవిసెపువ్వుతో సాటియైనవాఁడు' అని పుష్పమే యతనిదేహమునకుసమానముగాఁ జెప్పుదురు, (సుకుమారౌ) దేవీజనము కౌఁగిలించుకొనుటనే కాదు; వారు మాటిమాటికి చూచుటనుగూడ నోర్వఁజాలరుసుమీ వారి మృదుత్వము. (సుకుమారౌ) సహజమైన వ్యాపారముగూడ సుకుమారదేహమునకు ఆయాసకరమని అనుకూలురు మనస్సున నొచ్చుకొనునట్లుండును సుమీ వారిమృదుత్వము. (సుకుమారౌ) 'సు=మంచి, కు=భూమికి, మారౌ=మన్మథులు' అనఁగా దివ్యుఁడైన మన్మథుఁడొక్కఁడే; వీరినిజూడఁగా భూమియందలి యిద్దఱు మన్మథులవలెతోఁచుచున్నారు, (రూపసంపన్నౌ సుకుమారౌ) మన్మథునికి దేహములేదుగదా; 'కందర్ప ఇవమూర్తిమాన్' 'మూర్తిగలమన్మథుఁడు' అన్నట్లు ఈమన్మథులు రూపవంతులై యున్నారుసుమీ. ఇట్లు తారుణ్యసౌందర్యమాత్రములు గలిగి దూరమునుండి పరికరించుటయేకాని దాపునకు అనుభవించుటకై పోఁగా స్థిరముగా నిలువలేక దుర్బలులుగా నుందురో యనఁగా, (మహాబలౌ) బలమనఁగా అనుభవించుసామర్థ్యము 'రామస్తు సీతయా సార్ధం విజహార బహూనృతూన్' 'రాముఁడు సీతతోఁగూడి పెక్కుఋతువులు క్రీడించుచు విహరించుచుండెను' అన్నట్లు ఎడతెగకనెంతయు కాంతలను అనుభవింపవలసి వచ్చినను వారిబలము కుందదని భావము. దీనిచే రాక్షసజాతియందు పుట్టుటవలన కఠినప్రకృతి గలతనుబోఁటిదానికిని సమరతి నిచ్చు సామర్థ్యముగలవారనుట సూచితము. స్త్రీలకు తమతోడియనుభవవిశేషములం దాసపుట్టించి పురుషుని గెలువవలయునని యభిలాష. అట్లుగాక ఎవఁడు తనబలాధిక్యముచేత స్త్రీనే క్రీడకుఁ గూర్చుచున్నాఁడో వాఁడు మహాబలుఁడు. అట్టివారుసుమీ వీరు. ఇట్టిసముదాయశోభకంటె అవయవశోభ తగ్గియుండునా యనఁగా, (పుణ్డరీకవిశాలాక్షౌ) వీరి కన్నులయందము చూచెడివారి కన్నులకు ఎంతచూచినను తృప్తినొసఁగకున్నది- తృప్తినొసఁగినదేకదా వారికన్నులు తక్కినయవయవములందు ప్రవర్తించి చూడఁగలుగును, (పుణ్డరీకవిశాలాక్షౌ) తక్కినయవయవముల సౌందర్యము సమీపమునకుఁ బోయిననే చక్కఁగా ప్రకాశించును. నేత్రసౌందర్యమో దూరముననే స్ఫుటముగా ప్రకాశించును, (పుణ్డరీకవిశాలాక్షౌ) పుండరీక మనఁగా, తెల్లదామర - తెల్లదామరవలె సత్త్వగుణప్రాచుర్యమున ధవళమై ప్రసన్నమైన దృష్టిగల వారనుట. 'సంరక్తనయనా ఘోరాః' మీవలె మిక్కిలి యెఱ్ఱఁబాఱిన కంటిచూడ్కులు గలవారు గారని భావము. దృష్టిమాత్రమే తెల్లనిదనుటచే మహాపురుషలక్షణములైన కనుఁగొలఁకుల యెఱుపును కనుగ్రుడ్ల నలుపును వారితనులుగావు; గ్రాహ్యములేయని తెలియునది, (పుణ్డరీకవిశాలాక్షౌ) తమోగుణోద్రేకమువలన నిద్రాకషాయితములుగాక రజోగుణోద్రేకమువలన కోపసంరక్తములుగాక సత్త్వగుణముచే సర్వదా

లాచరించుచు నున్నవారు. వారు గంధర్వరాజునకు సాటియై రాజలక్షణలక్షి

---

ప్రసన్నులైనవారట, (పుణ్డరీకవిశాలాక్షౌ) 'ఆత్మానం మానుషం మన్యే' అని తన్ను మనుష్యునిగాఁదలఁచి తమ పరత్వమును మఱచిపోయినను 'యథాకప్యాసం పుణ్డరీకమేవమక్షిణీ' అను శ్రుతిచెప్పిన పుండరీకములవంటి యాకన్నులు అంతరంగమున దాఁగియున్న పరత్వమును కొండెములు చెప్పి ప్రకాశింపఁజేయుచున్నవి. విశాలశబ్దముచే క్షీరసముద్రమువలె వీని వైశాల్యమును గంభీరతయును ఎవ్వరికిని నిశ్చయింపనలవిగాదనిభావము. (పుండరీక విశాలాక్షౌ) కన్నుల తేటఁదనమునుబట్టి పుండరీకములు సాటిగా చెప్పఁబడెనుగాని వైశాల్యమును జూడఁగా వీనికి సాటియెక్కడిది, (పుండరీకవిశాలాక్షౌ) బద్ధముక్తనిత్యాత్మకమయి త్రివిధకోటి యగునుభయవిభూతులను ఒక్కమ్మడినే కటాక్షింపఁదగినంత విశాలములుసుమీ యాకన్నులు, (మహాబలౌపుండరీకవిశాలాక్షౌ) వీరు తమబలమును జూపి పగుల నోడించి వారు పాదాక్రాంతులై స్తుతింపఁగా ప్రసన్ననేత్రులగుటఁ బ్రకాశింపఁజేయుదురు, (సుకుమారౌపుండరీకవిశాలాక్షౌ) సుకుమారులని మన్మథులుగాఁజెప్పుటంబట్టి వారికి పుష్పబాణములెక్కడ ననఁగా అవియే వారి నేత్రములుగా మాఱినవి. తామరలు మన్మథుని బాణములుగదా. ఆతామరలే యీనేత్రములైనవి. కన్నులే మన్మథబాణములనుటచే శూర్పణఖ హృదయమును అవి భేదించుటసూచితము. నన్ను వశము చేసికొన్నది అవయవశోభచేతనే కాదు, (చీరకృష్ణాజినాంబరౌ) వారు కేవలమునయీవేషముచేతనుగూడ నన్ను వశపఱుచుకొన్నవారు. ఆభరణములేమియులేకయే వట్టినారచీరలు గట్టినవేషమాత్రమునచే నన్నుమరులుకొలిపి పీడించుచున్నారు. 'ఇదమధికమనోజ్ఞా వల్కలేనాపితన్వీ' 'ఈతన్వి నారచీర గట్టుకొన్నను అంతమాత్రముననే మఱింతమనోజ్ఞురాలుగానున్నది' యన్నట్లు చీరకృష్ణాజినములను ధరించినను వీరిసౌందర్యము కొఱఁతవడదు; మఱి వారితారుణ్యాదిగుణసముదాయముచే రంజితమేయగు. ఈనారచీర రామశరీరసన్నికర్షముచేత సర్వహృదయాకర్షకమగుచు 'రూపసంహననంలక్ష్మీం సౌకుమార్యం సువేషతాం। దదృశుర్విస్మితాకారా రామస్య వనవాసినః' అన్నట్లు స్వరూపధ్యాన పరులగుబుషులకును మనస్సు హరించినదయ్యెను.

లేక:—ఖరుఁడు 'నన్నింతచేసిన మహాపరాక్రమశాలి యెవఁడు?' అనిభీతుఁడై యడుగఁగా వానిభయముడుపుటకై శూర్పణఖ రామలక్ష్మణుల దుర్బలత్వమును జెప్పుచున్నది. (తరుణౌ) 'ఊనషోడశవర్షః' 'నయుద్ధయోగ్యతామస్య పశ్యామి' అన్నట్లు యుద్ధమునకు యోగ్యులుగానివారు, (తరుణౌ) 'యౌవనే విషయైషిణామ్' అన్నట్లు విషయప్రవణులేకాని యుద్ధప్రవణులు గారనుట, (రూపసంపన్నౌ) 'కన్యాకాముయతేరూపమ్' 'రూపేణవనితాజనమ్' అన్నట్లు స్త్రీలను వశపఱుచుకొనుటకై మేను మిటారించుకొని తిరుగుచున్నవారేకాని పురుషులను వశపఱుచుకొనునట్టి మగతనముగలవారుగారు. (రూపసంపన్నౌ) వెదురుఁబొదవలె మేనిపయిపసిమిమాత్రమేకాని యంతరమున సత్త్వమేమియులేదు. దీనికిఁ గారణమేమనఁగా, (సుకుమారౌ) శ్రీమంతుని పుత్రులగుటచేత మెత్తనివారై శ్రమమునకు నోర్వరనుట- నీయెఱ్ఱని కంటిచూపునకే తాళరు; ఇఁక ఉగ్రమైననీగాయుధమువాటున కెట్లోర్చెదురనుట, ఆకారమునుచూడఁగానే యశక్తులని తోఁచెను; కార్యములందేని సమర్థులైయున్నచో, (మహాబలౌ) మిక్కిలియబలులు- ఒక స్త్రీకిఁగాను రాజ్యమును విడిచివచ్చుటచేతనే వారిబలము దెలియుచున్నది. లేక (మహాబలౌ) 'మహతీ రక్షణీయా అబలా యయోస్తౌ' పాదములకు బందనువలె పరతంత్రురాలైన యొక స్త్రీనిగట్టుకొని తిరిగెడివారా నీతోడియుద్ధమునకువత్తురు? (పుండరీక విశాలాక్షౌ) రాఁబోవుసంగతి నెఱుఁగక దీని నుఱుక్కసెవులుగోసితిమి; ఇఁక నేమి సంభవించునోయనిభయభ్రాంతులై తెల్లబాఱిన కన్నులతో నలుగడలబెదరి కన్నెల్ల తప్పపాటులేనట్లు పెద్దగా విచ్చి చూచుచున్నవారు

త్తులై యుందురు. వారు దేవతలో మనుష్యులో యూహించి తెలియనేరను.

(పుండరీకవిశాలాక్షౌ) పుండరీకము తనస్థానమునందుండి తీసినవెనుక పసచెడునట్లు స్వస్థానమందు సమర్థులైయుండినను మఱి యిట్టి వనప్రదేశమందు అశక్తులేయని వారికన్నులే తెలుపుచున్నవి. వారశక్తులైనను, ఐశ్వర్యముచే బలముసంపాదించి యుద్ధముసేయుటకు వారికడ్డమేమియని యూరకుండవచ్చునాయనఁగా (చీరకృష్ణాజినాంబరౌ) ధరించుకొనుటకు మంచిబట్టలు సైతము లేక యడవియందు చెట్లనారలునుజింకలతోళ్లను గట్టుకొని త్రిమ్మరువారు, కాసుదొరకి బలముగూర్చుకొనిరాఁబోయెదరా, (చీరకృష్ణాజినాంబరౌ) క్రిందఁగట్టుకొనునది యొకవిధముగాను పైని వేసికొనునది మఱియొకవిధముగానుగదా యున్నది. (చీరకృష్ణాజినాంబరౌ) అవికూడ స్థావరము (వృక్షము) ఒకటియు జంగమము (జింక) ఒకటియు నియ్యఁగా నిట్లు పెక్కింటని యాచించి తెచ్చుకొన్నవేకాని పౌరుషముతోఁ దెచ్చుకొన్నవిగావు.

లేక:—ఖరుని ప్రోత్సాహపఱుచుటకై వారిబలాతిశయమును శూర్పణఖ చెప్పుచున్నది:—(తరుణౌ) 'ఊనషోడశవర్షః' అన్నట్లుముక్కిలిబాలుడుగాక 'అనేకవర్షసాహస్రో వృద్ధస్సమసిపార్థివ' అన్నట్లు ముదిమియుఁగాక యుద్ధమని చెప్పినమాత్రనే ఎక్కడెక్కడచూపుమని వచ్చునట్టి కటువైన యౌవనవయస్సుగలవారు, (తరుణౌ) 'యౌవనే విజిగీషూణామ్' 'యౌవనమందు గెలువనిచ్ఛగలవారు' అన్నట్లు ఇంకను రాజ్యము సంపాదింపవలయునని విజృంభించునట్టి వయస్సుగలవారు, (తరుణౌ) ఇట్టి వయస్సుగలవాఁడొక్కఁడే చాలియుండఁగా నిద్దఱుగూడిరేని యిఁక నసాధ్యముగలదా? తగిన పరువంపువయస్సును యోగ్యతయునున్నవి కాని ఆకారమును అందులకుఁ దగినదాయనఁగా, (రూపసంపన్నౌ) 'సింహోరస్కం మహాబాహుమ్' అన్నట్లు వారికి శత్రువులను గెలుచుట కాయుధముల క్కఱలేవు-వారిభుజములను వక్షములను జూచినంతనే శత్రువులు పలాయితులగునట్టి వీరరససూచకమైన మేనికట్టుదిట్టముగలవారు, (రూపసంపన్నౌ) ఇట రూపశబ్దమునకు 'రూప్యతే అనేన' అనువ్యుత్పత్తిచేత అసాధారణనిరతిశయరూపవిశేషము తెలియునని. కనుక వీరి వయిరూపమును పరువమును బట్టి కాదు వీరిపరాక్రమ మూహించుట 'గత్వా సౌమిత్రి సహితో నావిజిత్య నివర్తతే' 'లక్ష్మణునితోఁగూడిపోయి గెలువక మరలిరాఁడు' 'యశసశ్చైకభాజనమ్' 'కీర్తికి ముఖ్యస్థానము' అన్నట్లు బాల్యమాదిగా సుబాహుఁడు మొదలైనవారిని నిరసించుటచేత ఇంతపర్యంతమును విరోధినిరసనమందు ప్రసిద్ధగౌరవము గలిగియేయున్నవారు. విరోధివధమును శ్రమపడియే చేయఁజాలుదురా యనఁగా, (సుకుమారౌ) అనాయాసముగా శత్రువుల నిరసించువారు, (మహాబలౌ) 'సదేవగన్ధర్వమనుష్యపన్నగం జగత్సశైలంపరివర్తయామ్యహమ్' 'దేవగంధర్వమనుష్యపన్నగపర్వతములతోఁగూడ ప్రపంచమును తలక్రిందుఁజేసెదను' 'కిన్ను సాగరమేఖలాం।మహీందహామికోపేన' 'సముద్రము మేరగాఁగలభూవలయమునంతయు కోపమున దహింపకున్నాఁడేల' అన్నట్లు ప్రసిద్ధబాహుబలమును మహచ్ఛబ్దముచేత మనోబలమును ఉపాయబలమును గలవారు, (మహాబలౌ) వారిబలాతిశయముండదట నీచతురంగబలమును లేనట్టేసుమీ, (మహాబలౌ) బహుకాలము యుద్ధముచేసినను శ్రమము గలిగింపకుండునట్టి బల అతిబల అనెడివిద్యలుగలవారు. ఇట్లు శ్రాంతి లేకుందురని తెలియుట యెట్లు? అనఁగా, (పుండరీకవిశాలాక్షౌ) అతిసంకటమైనవనప్రదేశమునందు సంచరించినను వారినేత్రములు తనచోటనుండెడి తెల్లదామరలవలె వాఁడక వన్నెగులుకుచుండుటచే వారికి శ్రమముగలుగదని తెలుపుచున్నది. (పుండరీకవిశాలాక్షౌ) యుద్ధాదికాలములందును శత్రువులందలక్ష్యబుద్ధి కలిగియుండుటచే వారినేత్రములు సంకోచించుట వికసించుటయనెడి వికారములులేక యున్నవి. (పుండరీకవిశాలాక్షౌ) 'ప్రీతివిస్ఫారితేక్షణమ్' అన్నట్లు వారినేత్రములు శత్రువులను జూచి

మంచియెలజవ్వనము గలిగి మిక్కిలి చక్కఁదనముతోఁగూడి సమస్తభూషణాలంకృతయై సన్నని నడుము నకనకలాడుచున్న యొక చెలువ వారిద్దఱి నడుమ నుండఁగంటిని. ఆచెలువ నిమిత్తముగా వారిద్దఱును ఒక్కటిగాఁజేరి నన్ను అనాథవలెను కులటవలెను నిట్టి యవస్థను బొందించినారు. * ఆ చెడునడతలదాని నెత్తురును, రణా

---

నప్పుడు సైతము ఉగ్రములు గాక పయిపయి నుత్సాహముచేత మఱిమఱి విస్తృతములగుచుండును జుమా. పగవారినిజూడఁగానే మొగములు వికసించినంతనే పనయేమి? యుద్ధసన్నాహమునకుఁ దగినట్లు కవచాదులు దాల్చియుండినం గదా యట్టివి కానను దగును. ఏమఱుపాటున శత్రువులు పైపడిరేని యేమి సేయఁగలరనఁగా, (చీరకృష్ణాజినాంబరౌ) 'సన్నద్ధా విచరిష్యతః' అన్నట్లు యుద్ధసన్నాహసూచకముగా వస్త్రము బిగిగాఁగట్టి కవచమువలె తోలుగప్పుకొనియే యున్నారుసుమీ, (చీరకృష్ణాజినాంబరౌ) అడవిలో వేఁటాడుచు నంచరించువారగుటచే కృష్ణాజినమును నారచీరలును కట్టువస్త్రములుగాఁ గలిగి యున్నారు. ఇట్లు 'సత్యేనలోకాన్ జయతి, దీనాన్ దానేనరాఘవః । గురూన్ శుశ్రూషయావీరో ధనుషా యుధి శాత్రవాన్' అన్నట్లు సుందరులను సౌందర్యముచేతను, శత్రువులను బాణములచేతను, అగతికులను కృపారసముచేతను వశపఱుచుకొనుచు వారివారికిఁ దగిన వేషవ్యాపారములు గలిగియున్నవారు సుమీ యీకుమారులు - కనుక నేను ముక్కుకోసికొన్నరీతిని నీవు తలకోసికొనవలసినదేకాని వారితో యుద్ధముచేయుదువేని నీప్రయత్న మేమియుఁగొనసాఁగదని పౌరుషము పురికొలుపుట తెలియునది:—తన్నిశ్లోకి.

'న తం పశ్యామ్యహం లోకే పరోక్షమపి వానరః। స్వమిత్రోఽపి నిరస్తోఽపి యోఽస్య దోషముదాహరేత్'' 'రామునకు మిత్రుఁడుగాని శత్రుఁడుగాని ఎదుటనో మఱుఁగుననో అతనిపై దోషము సెప్పువాఁడెవఁడును నాకు లోకమునఁ గనఁబడకున్నాఁడు' అన్నట్లు సర్వలోకస్పృహణీయమైన శ్రీరాముని దివ్యరూపగుణములు మిత్రులకును అమిత్రులకు సమానముగానే ఆనందకరములు గావున శూర్పణఖ యతనిచేత విరూపితయయ్యును అతనిరూపగుణముల వర్ణనమున పరమసుఖమును బడయఁగోరి యట్లువర్ణించినదయ్యె' మహేశ్వరతీర్థులు.

శేషధర్మమునందు భీష్మయుధిష్ఠిరసంవాదమున భీష్ముఁడు 'యాజ్ఞవల్క్యసుతా రాజన్ త్రయోవై లోకవిశ్రుతాః । చంద్రకాంత మహామేధ విజయా బ్రాహ్మణోత్తమాః। ఖరశ్చదూషణశ్చైతి త్రిశిరాబ్రహ్మవిత్తమాః। ఆసన్ తేషాంచ శిష్యాశ్చ చతుర్దశసహస్రధా' 'యాజ్ఞవల్క్యునికి చంద్రకాంతుఁడు మహామేధుఁడు విజయుఁడు అని లోకప్రసిద్ధులైన బ్రాహ్మణోత్తములగు ముగ్గురుకొడుకులుగలరు. ఆబ్రహ్మవిత్తములు శివశాపమువలన ఖరదూషణ త్రిశిరులైరి. వారిశిష్యులు పదునాలుగువేవురు రాక్షసులైరి' అని యున్నది. మొదటివాఁడగుచంద్రకాంతుఁడే ఖరుఁడు. వానికి శివుఁడు 'తస్మాద్యః క్రూరరూపేణ దేహేనహరతామృతమ్। విష్ణుర్దాశరథిర్భూత్వా మోక్షయిష్యతి సువ్రత' అని దాశరథివలన శాపమోక్షముగలుగునట్లు చెప్పియున్నాఁడు. కాఁబట్టి వాఁడు శూర్పణఖవలన రామవృత్తాంతము విన్నపిదప విష్ణువనియెఱింగి సపరివారముగా రామునిచేఁ జావగోరి పైకి అప్పసెల్లెలికి ప్రీతిసేయునట్లు యుద్ధార్థము రాక్షసుల నాజ్ఞాపించినవాఁడని తెలియునది. కాఁబట్టి పయిచూపునకు పరుషోక్తులుగాతోఁచు వానివాక్యములకు సౌమ్యరూపముగా నర్థమెట్లన:—

* ఇట 'తస్యాశ్చానృజువృత్తాయా స్తయోశ్చహతయోరహం । సఫేనం పాతుమిచ్ఛామి రుధిరం రణమూర్ధని' 'ఏష మే ప్రథమః కామః కృతస్తాత త్వయా భవేత్ ।తస్యాస్తయోశ్చ రుధిరం పిబేయ మహ

గ్రమున హతు లయినయీ రామలక్ష్మణుల నల్లను నురుఁగుతోఁగూడఁ ద్రావఁ గోరెదను. నాయనా! నేను యుద్ధమున నాముగ్గురి నెత్తురుం ద్రావవలయును. ఇది నా మొదటికోర్కి. దీని నీవు నెఱవేర్పవలయును' అనెను. ఇట్లది చెప్పుచుండఁగా ఖరుఁడు విని క్రుద్ధుఁడై 'మహాబలశాలులును అంతకసమానులు నగుపదునలువురు రాక్షసులను జూచి, 'ఇద్దఱు మనుష్యులు ఆయుధధారులై నారచీరలును కృష్ణాజినము నుగట్టి యొక స్త్రీని వెంటఁగొని ఘోరమైనదండకారణ్యమును జొచ్చియున్నారు. వారి నిదఱిని దురాచార యగునాయాఁడుదానిని చంపి తీసికొనిరావలయును. నా యప్పసెల్లెలీశూర్పణఖ వారలనెత్తురుం ద్రావును. రాక్షసులారా! ఈ నాయప్పసెల్లెలి కోర్కి నాకును సమ్మతముగానున్నది.*కావున మీరు మీపరాక్రమమున నా రామలక్ష్మణుల నిద్దఱిని ఆ స్త్రీనిని జంపి నాతోఁబుట్టినదానికోరికను శీఘ్రముగా నొడఁగూర్పుఁడు' అని యాజ్ఞాపించెను. అంత నాపదునలువురు రాక్షసులును ఖరుని యాజ్ఞ చొప్పున,శూర్పణఖ మార్గము చూపుచు రా, వాయుప్రేరితము లైనమేఘములవలె నతివేగంబున దానితోడ రాముఁ డున్న యెడకుఁ బోయిరి. అంత నారాక్షసులు వాఁడిబాణములు గలవారయ్యును తమ్ముం జూచి తేజంబు రాజిల్ల నెదురుకొన్న రామునిం జూచి, అడవి యేనుఁగులు మండుచున్న కార్చిచ్చునుజూచి భయపడునట్లు,

---

మాహవే' అనిమూలము. 'తరుణౌ' అని శూర్పణఖ వారిని వర్ణించుటవలన ఖరుఁడు తన్నుఁ గాముకిఁగాఁ దలంచునోయని తలఁచి వారినెత్తురు త్రాగెద నని వానిశంక మాన్పినది. ఇందులకు వాస్తవార్థమేమనఁగా:—రణాగ్రమందు,(రామలక్ష్మణయోః)ఇట తృతీయార్థమందు షష్ఠి-రామలక్ష్మణులచేత,(అనృజువృత్తాయాఃతస్యాః)సరికానినడవడి గలదానియొక్క-అనఁగా అట్టినీయప్పసెల్లెలైనట్టినాయొక్క, అనిశేషము, (హతయోః) ఇట ద్వితీయార్థమందు షష్ఠి-ఛేదింపఁబడినముక్కుచెవులును చూడుమనుట. కాఁబట్టి యిఁకమీద నేను, (సఫేనమపి రుధిరం) నురుఁగుతోఁగూడినట్టి నెత్తురునైనను, (పాతుమిచ్ఛామి) త్రావఁగోరుదునా అనికాకువు- తాత్పర్యమనుట. (ఆహవే) యుద్ధమందు, (తయోః) వారిరువురిపట్ల (అయంకామః కృతోభవేద్యది) ఈకోరిక - ఈయపకారము-చేయఁబడునేని- వారికినీవిట్టి యపకారము సేయుదువేని, (రుధిరంపిబేయం) నెత్తురుత్రావెదను. నాముక్కు సెవులుగోసియుండుటఁ జూచియు నీవుపేక్షింతువేని నేను ఆహారమునువిడిచి దేహమును వదలుదునని భావము:—మహేశ్వరతీర్థులు.

*ఇందులకు'తౌ హత్వా తాంచ దుర్వృత్తాం మపావర్తితుమర్హథ।ఇయంచ రుధిరం తేషాం భగినీ మమ పాస్యతి॥మనోరథః 'యమిష్టోఽస్యా భగిన్యా మమరాక్షసాః।శీఘ్రం సంపాద్యతాం తౌచ ప్రమథ్య స్వేన తేజసా' అనిమూలము. వాస్తవార్థమెట్లనగా:—ఓరాక్షసులారా!(ఇయంభగినీ)ఈనాతోఁబుట్టువు, (ప్రమథ్య) నన్నుఁజంపి,(మమరుధిరంపాస్యతి) నానెత్తురు త్రాగెడిని. కాఁబట్టి, (తేషాం)(సమీపంగత్వా)అనిశేషము- వారియొద్దకుఁబోయి, (స్వతేజసా) మీతేజస్సుచేత, (శీఘ్రేణ) శీఘ్రముగా, (తౌ) ఆరామలక్ష్మణులను, (దుర్వృత్తాం).దుర్లభమైన ఆచారముగల సీతనును,(హత్వా) 'హన'హింసాగత్యోః అని గత్యర్థము జ్ఞానార్థముగావున-తెలిసికొని, (అపావర్తితుం) మరలివచ్చుటకు, (అర్హథ) తగుదురు. (అయంమమభగిన్యాం ఇష్టోమనోరథః) ఇది నాయప్పసెల్లెలికి ప్రియమైన యభిలాషము - అని సౌమ్యముగానర్థము గ్రాహ్యము.శూర్పణఖ మఱిమెచ్చునకై ఊరక పోయి రండని ఖరుఁడుచెప్పినాఁడు.

భయపడి తోడనే యాతనిం గొట్టఁజాలక యూరకుండిరి. ఇది పందొమ్మిదవసర్గము.

{ పదునలువురురాక్షసప్రధానులను రాముఁడు వధించుట.
శూర్పణఖ భయపడి ఖరునియొద్దకు మరలి పోవుట.

అంత భయంకరాకార యగుశూర్పణఖ రామునియాశ్రమమునకు వచ్చి సీతను రామలక్ష్మణులను ఆరాక్షసులకుఁ జూపెను. ఆరాక్షసులు, పర్ణశాలయందు జనకరాజసుత యగుసీతతోడఁ గూర్చుండి యున్నమహాబలుని రామునిం గాంచిరి. శ్రీమంతుఁ డగురాముఁడు, ఆరాక్షసులును రాక్షసి యగునా శూర్పణఖయు వచ్చుటం జూచి మహాతేజుం డగుతనతమ్ముఁడు లక్ష్మణునితో 'లక్ష్మణా! నీవు కొంతసేపు సీతయొద్ద నుండుము. నేనిపు, డీశూర్పణఖదారిం ద్రొక్కి దీనిని గావ వచ్చినయీ రాక్షసులను చక్కాడిపుచ్చెదను' అనెను. లక్ష్మణుఁడు, విదితాత్ముం డైనరాముఁడు చెప్పినది విని వల్లె యనియంత రాముని యాజ్ఞఁ జొప్పను పాటించి నడచుకొనెను. ధర్మాత్ముఁడగురాముఁడును బంగారున రంగారువింటి నెక్కుపెట్టియీ రాక్షసులంజూచి 'మేము దశరథమహారాజుకొమారులము; అన్నదమ్ములము; మాపేరు రామలక్ష్మణులు. దీని పేరు సీత. ఈ యబలతోఁగూడ దుశ్చరమైనదండకారణ్యమునకు వచ్చితిమి. మేము ఫలమూలములను దినుచు జితేంద్రియులమై, తపము సలుపుచు ధర్మమునాచరించుచు దండకారణ్యమున నున్నారము. ఇట్టి మమ్మేల హింసించెదరు? నేను, ఋషుల నియోగమున, వారలను హింసించునట్టి పాపాత్ములను మిమ్ము మహాహవమున వధించుకొఱకే బాణములను నాయుధములను దాల్చి యిచ్చటికి వచ్చితిని జుఁడీ. రాక్షసులారా! పరమదుష్టులారా! అల్లెయట నిలువుఁడు. పై పడి రావలదు. పాఱిపోవరాదు. మీకు ప్రాణములతో నక్కఱగలదేని మరలి పాఱిపొండు' అనెను. బ్రాహ్మణఘాతుకు లగునా పదునలువురురాక్షసులు (కన్నులు మిక్కిలియు నెఱ్ఱఁబాఱఁగా, మధురభాషుఁడును పూర్వపరాక్రముఁడు నగురాముఁడు కన్నుల కెంపుగదుర) నట్లు చెప్పినది విని చేతుల శూలములు గ్రాల మిక్కిలి క్రుద్ధులై *'మాదొర ఖరుఁడు మిక్కిలి గొప్పవాఁడు. అట్టి దొరకుఁ గోపము గలిగించితివి కావున నీవే యిపుడు యుద్ధమున మాచేత హతుఁ

---

* ఇందులకు 'క్రోధ ముత్పాద్య నోఽభర్తుః ఖరస్యసుమహాత్మనః। త్వమేవహాస్యసే ప్రాణా నద్యాస్మాభిర్హతో యుధి॥ కాహితే శక్తి రేకస్య బహూనాం రణమూర్ధని। అస్మాకమగ్రతః స్థాతుం కింపున ర్యోద్ధు మాహవే। ఏహిబాహుప్రయుక్తైర్నః పరిఘైశ్శూలపట్టిసైః। ప్రాణాం స్త్యక్ష్యసి వీర్యంచ ధనుశ్చకరపీడితమ్' అనిమూలము. వీనికి ప్రాతీతికార్థము స్పష్టము. వాస్తవార్థము:—(సుమహాత్మనః) గొప్పశరీరముగలవాఁడైన, (భర్తుఃఖరస్య) మాభర్తయగు ఖరునికి, (క్రోధముత్పాద్య) కోపముపుట్టించి, (అస్మాభిః) అతఁడు పంపిన తుచ్ఛులమైనమాచేత, (హతః) కొట్టఁబడినవాఁడవైనను, (త్వం) నీవు, (ప్రాణాన్) ప్రాణములను, (నోహాస్యసేఏవ) విడువనే విడువవు-మావలన నీకుప్రాణనాశము కలుగనే కలుగదనుట. ఇందులకు హేతువు:—(రణమూర్ధని) రణాగ్రమందు, (ఏకస్యతే అగ్రతః స్థాతుం) నీఒక్కనియెదుట నిలుచుటకు,

డవై ప్రాణములు విడువఁగలవు. నీ వొక్కఁడవు. మేము పెక్కండ్రము. రణాగ్రమున మాయిందఱిముందట నిలుచునంతటిబలము నీ కెక్కడిది? ఇఁక మాతో యుద్ధమున బోరుటను జెప్ప నేల ? యుద్ధమునకు రమ్ము. మాబాహువులచే ప్రయుక్తములైనపరిఘపట్టిసశూలములు దాఁకి, బలిమి వీడి, చేతఁ బట్టినవింటిని జాఱవిడిచి, ప్రాణములు విడువఁగలవు' అనిరి. ఇట్లారాక్షసులు పదునలువురును జెప్పి కోపమినుమడింప దుర్జయుఁ డగురామునిమీఁద దమచేత నున్నయాశూలములను వైచిరి. రాముఁ డా పదునాలుగుశూలములను బంగారుచే రంగారుచున్నయన్ని బాణములచేత నడుమనే ఖండించెను. అంత మహాతేజుఁ డగురాముఁడు మిక్కిలియు కుపితుఁడై సూర్యునివలె ధగధగమెఱయుచుఁ జక్కఁగా సానఁబెట్టి పదను తీరి శిలలనైననుచ్చికొనిపోవఁజాలినవాఁడిబాణములు పదునాలుగింటిని గయికొని వింటి నాకర్ణాంతముగా వంచి రాక్షసులను గుఱిపెట్టి, యింద్రుఁడు వజ్రములను బ్రయోగించునట్లు, వానిని వారిపయిని బ్రయోగించెను. బంగారుపూఁతపింజలుగలిగి, తళతళ కాంతి తళుకొత్తుచుఁ గాంచనాలంకృతములైనయాబాణములు వేగమున నారాక్షసులవక్షములను భేదించి నెత్తుటతోఁగూడి యావలికి దూసికొనిపోయి, యపుడు పిడుగులవలె మ్రోయుచుఁ గ్రిందఁబడి భూమియందుఁ జొరఁబాఱినవి. ఆరాక్షసులు ఱొమ్ములు అగలి, అవయవములెల్ల నెత్తుటఁ దోఁగ వికృతాకారులై ప్రాణములువిడిచి, వ్రేళ్లుదెగినచెట్లు వృక్షములవలె, నేలఁబడిరి. అట్లువారు నేలఁగూలుటఁ జూచి రాక్షసి శూర్పణఖ కోపపరవశయయ్యును చేయునది లేక భయమున నట భయంకరముగా కూయిడెను. ఆశూర్పణఖ యట్లు మాటిమాటికి బెదిదముగా నఱచుచు మరల వేగముగా ఖరునియొద్దకుఁబోయి, ముక్కుచెవులకోఁతనుండి కాఱి కొంతయెండి యున్నపచ్చినెత్తురుతోఁగూడిన దగుటం జేసి బంకతోఁ గూడినయంమగుఁజెట్టువలె నేలం బడెను. అట్లపు డాశూర్పణఖ ఖరునిదాపుం జేరి పలుమాఱు పలువిధములుగా నఱచుచు దుఃఖితయై రోదనముసేయుచుఁ గన్నీళ్లుగార్చెను. ఆపదునలుగురురాక్షసులును యుద్ధమున రామునిచేఁ గూలుటఁ జూచినంత నే, ఖరునితోఁబుట్టువగునాశూర్పణఖ యచ్చటఁ గాలూనక పరుగెత్తి ఖరునియొద్దకుఁబోయి యారాక్షసులందఱును హతులగుట మొదలుగా జరిగినవృత్తాంతమంతయును జెప్పెను. ఇదియిరువదియవసర్గము.

---

(బహూనామపి అస్మాకం) పెక్కండ్రయ్యును మాకు, (కాశక్తిః) శక్తియెక్కడిది-శక్తిలేదనుట. కాఁబట్టి ఖరుని నిర్బంధమునవచ్చినవారమై, (బాహుప్రయుక్తైః పరిఘైః శూలపట్టిసైః ఉపలక్షితానాం) పరిఘాదులతోఁ గూడినవారమునైన, (అస్మాకం) అని యిట ఆకర్షించుకొనవలయును. మాయొక్క, (ప్రాణాన్) ప్రాణములను, (వీర్యం) ఇదిజాత్యేకవచనము-వీర్యాదులను, (త్యక్ష్యసి) ఇది ణిచ్గర్భితము - విడుచునట్లు చేయఁగలవు, ఇందులకు సందేహములేదు. కాఁబట్టి, (ఏహి) రమ్ము అనిసంబంధము. నిన్నుండి మరలిపోవఁగా ఖరునివలనఁ గలుగు వధముకంటెను నీచేత వధమునొందుటయే మేలనిభావము.

## శూర్పణఖ ఖరునికి పదునలుగురు రాక్షసుల వధమును వినిపించుట.

ఖరుఁడు అట్లువచ్చి మరల నేలంబడినశూర్పణఖను జూచి కుపితుఁడై రాక్షస వినాశార్థముగా వచ్చినయద్దానితోఁ దేటమాటల 'నేను, ఇపుడే నీకుఁ బ్రీతిగా శూరులును రుధిరాహారులు నైనయారాక్షసులను పొండని పంపితి నే! మరల నేల రోదనము చేసెదవు? నేను బంపినరాక్షసులో నాకు మిక్కిలి కూర్చువారు; నాయందను రాగముగలిగి నాకు మేలు సేయుచుండువారు; ఎట్టిపగవారినైనఁ జంపఁ జాలినవారు; ఎదిరికిఁ జంప నలవిగానివారు. వారలు నాపంపు చేయుదురే కాని చేయకుండరు. అట్లుండఁగా మఱల నిపుడు వచ్చి 'అయ్యో! నాథుఁడా!' యని బిగ్గఱ నాక్రోశించుచు సర్పమువలెఁబడి నేలంబొరలుచున్నావే! ఇందులకుఁగారణమేమి? చెప్పుము వినఁగోరెదను. నాథుండై నేనుండఁగానే యనాథవలె నీవు పలవించుచున్నావేల? లేలెమ్ము. భయపడకుమా! దిగులువిడువుము' అనెను. ఇట్లు ఖరుఁడు పలు విధములఁ జెప్పి యూఱడింపఁగా మార్కొనరానిదిట్ట యగునాశూర్పణఖ కన్నులనీరు దుడుచుకొని యన్న యగుఖరునితోఁ 'ఇంచుకయును పే నేను ముక్కుసెవులు పోఁగొట్టుకొని నెత్తుటివెల్లువతోఁ దొప్పదోఁగుచు నిచ్చటికి వచ్చితిని; నీవు నన్నూఱడించితివి. వీరా! నీవు కోపించి నాకొఱకు రామలక్ష్మణులను జంపుటకై యారాక్షసులను పదునలుగురను బంపితివి. వారందఱును కోపమునఁ శూలములను బట్టిసములను చేతంగొని రామునిపై నడరఁగా యుద్ధమున రాముఁడు వారినెల్ల మర్మములభేదించునట్టి బాణములేసి వధించెను. వారందఱును మహాబలులయ్యును క్షణమాత్రముననే నేలం గూలుటయును, రామునిగొప్పపరాక్రమ కృత్యమును, జూడఁగా నాకు మిక్కిలి భయముగలిగినది. రాక్షసోత్తమా! నేను మిక్కిలియు భయమునొంది దుఃఖితనైయున్నాను. ఎందుఁ జూచినను రాముఁడేయున్నట్లు నాకు భయమగుచున్నది. కావున మరల నిన్నే శరణుఁజొచ్చితిని. దుఃఖమనెడి మొసలిలోపలఁగలిగి, భయ మనెడితరఁగలవరుసలతోఁగూడి మిక్కిలి విశాలముగానున్న దుఃఖమనెడి సముద్రమున మునిఁగితిని. మునిఁగిన నన్నురక్షింపవా యేమి? నావెంబడి వచ్చినమాంసాహారు లారాక్షసులు గూడ రామునిచే వాఁడిబాణములహతులై నేలంగూలిరే! రాక్షసవరా! దయ, నాయందుఁ గలదేని, ఆరాక్షసులయందును గలదేని, నీకు రామునితో సాటియైనశక్తియు పరాక్రమమును గలవేని, దండకారణ్యమున రాక్షసులకు కంటకముగానున్నవానిని జంపుము. నీవు నాపగవాఁడగురాముని నిపుడు వధింపవేని నే నిట్లు ముక్కుసెవులు పోయి సిగ్గులేనిదాననై నీయెదుటనే ప్రాణములు విడిచెదను. మహాత్ముండగు రాముని యెదుట యుద్ధమున, నీవు నీబలము లన్నిటితోఁగూడినవాఁడవయ్యు నిలువఁజాలవని నాబుద్ధికిఁ దోఁచుచున్నది. రామలక్ష్మణులు కేవలము మనుష్యులే; అట్టివారిని జంపఁ జాలకున్నావే! నిన్ను శూరుఁడని నీవే యెన్నుకొందువి తేకాని నిజముగను శూరుఁ

డవుగావు. వట్టిబింకములచే లేనిపోనిపరాక్రమము పయి నెక్కించుకొన్నవాఁడవు. వంశమును జెఱుపఁబుట్టినవాఁడా! రామునంతటి బలమును పరాక్రమమును గల వాఁడవేని, దండకారణ్యమున నున్నరాముని జంపుము; చూతము నీకు సత్తువలేదు. నీవీర్య మల్పము. ఇట్టినీకు భయంకర మైనయిట్టిజనస్థానమున వసించి యుండఁదగదు. కాఁబట్టి త్వరితముగా బంధువులంగూడి యిచ్చటనుంచి తొలఁగిపొమ్ము; లేక యిచట నేయుంటివా, రాముని తేజమున కీడ్పడినవాఁడవై త్వరితముగా నశింతువుసుమీ! దశరథమహారాజకుమారుఁడా రాముఁడు మహాతేజోయుక్తుఁడు. నన్ను విరూపగాఁ జేసిన యతనితమ్ముఁడు లక్ష్మణుఁడును మహాపరాక్రమవంతుఁడు' అనెను. పెద్దపొట్టగల యా కట్టేఁడిరక్కసి యిట్లు పలువిధములఁ బలవించి యంత దుఃఖము మఱియు పెచ్చు పెరుగఁగా చేతులతోఁ గడుపును మోఁదికొనుచు రోదనముగావించెను. ఇది యిరువది యొకఁడవసర్గము.

---

## (ఖరుఁడు పదునాలుగువేల రాక్షసులతోఁగూడి యుద్ధమునకు వెడలుట.)

ఖరుఁ డిట్లు రాక్షసులనడుమ శూర్పణఖ త న్నవమానింపఁగా శూరుఁడు గావున క్రూరాకారుఁడై మిక్కిలియు బెడిదం బగువాక్యంబున దానితో 'నీకుఁ గలిగినయవమానముచే నా కిపుడు మితి లేనికోపము పుట్టినది. పర్వకాలమునఁ బొంగినలవణసముద్రమువలె దాని నిప్పుడు నిలుపోప నలవి గాకున్నది. మనుష్యుఁడై యాయువు క్షీణించి యున్నరాముని పరాక్రమమును నేనెంతమాత్రమును సరకు సేయను. వాఁ డిప్పుడు తాను గావించినదుష్టకృత్యములకు ఫలముగా నాచే హతుఁడై ప్రాణములు విడువఁబోవుచున్నాఁడు. కన్నీరు తుడుచుకొనుము. తొందరపాటు విడువుము. నేను రామునిని వానితమ్మునిని యమపురికిఁ బంపెదను. రాక్షసీ! నేనుయుద్ధమందు రామునిఁ గుఠారమునఁ జంపెదను. అంత వాని ప్రాణములు మందగిల్లుచుండఁగా వాని వేఁడి నెత్తురును ద్రాగఁగల'వనెను. ఆ శూర్పణఖ ఖరునినోటనుండి వచ్చిన మాటకు మిక్కిలియుబ్బి, మనస్సు కుదురుగాసది గాన, యారాక్షసశ్రేష్ఠుని ఖరుని మరలఁ బ్రశంసించెను. అట్లది మొదట బిరుసుగా పలికి మరల బొగడఁగా ఖరుఁ డప్పుడు సేనాపతి యగుదూషణునిఁ జూచి "సౌమ్యా! రాక్షసులు పదునాలుగువేవురు నామనస్సుచొప్పున నడచువారై బెడిదంపువేగము గలిగి, యుద్ధములందు వెనుదీయక, నల్లనిమబ్బుల చాయగలిగి, భయంకరులును క్రూరకర్ములు నై యున్నవారు. వారు లోకహింసయందె క్రుమ్మరుచు, బలవంతులును ఉగ్రప్రతాపులు నై యుందురు. బెబ్బులివలె విఱ్ఱవీఁగుచు వికారముఖములతోఁ గూడి, గర్వితులై యున్న యారాక్షసులఁ గొని సర్వవిధములఁ యుద్ధమునకుఁ గావలసినన్ని ప్రయత్నములను చేయింపుము. మఱియు సారథమును ధనుస్సును నానావిధము లయిన బాణములను ఖడ్గములను పలు

విధములయిన వాఁడియాఁకెలను సనుకట్టితెస్సు * పులస్త్యవంశమునఁ బుట్టినమహాత్ములకు నందఱికిని ముందఱగా రణపండితుఁ డగునేను దుష్టుఁ డగురాముని వధించుటకుఁ బోవవలయునని యున్నాను." అనెను. ఇట్లు వాఁడు చెప్పుచుండఁగానే, దూషణుఁడు వింతవింతరంగులు గులుకునుత్తమాశ్వములు గట్టంబడి సూర్యునివలె ధగధగ మెఱయుచున్నగొప్పరథము 'ఆయత్తముగా నున్నది' యనిచెప్పెను. ఆరథము మిక్కిలి పొడవై యపరంజివికారమై రంజిలుచుండుటవలన మేరుపర్వతపు శిఖరమువలెఁ గనుపట్టుచు బంగారుచక్రములును వైడూర్యమణిమయములైననొగలును గలిగి యిఱుకటము లేక పఱపుగా నుండెను. మంగళకరములై బంగారుమయములగు మత్స్యములును పుష్పములును వృక్షములును పర్వతములును చంద్రసూర్యులును, పక్షిసమూహములును నక్షత్రములును నలుగడలఁ గలిగి, ధ్వజములతోను ఖడ్గములతోను గూడి, చిఱుగంటలు మురువుగులుక, మేటిగుఱ్ఱములం బూన్చినయామహారథమును ఖరుఁ డారోహించెను. ఖరుఁడు రథము నెక్కుట చూడఁగానే వానిని మహాబలుఁడైన దూషణునిని భయంకరపరాక్రము లగురాక్షసులుపరివేష్టించి నిలిచిరి. ఖరుఁడు, గొప్పవిండ్లు దాల్చి బెడిదములైనకవచములను ఆయుధములను గలిగి భయంకరము లగుధ్వజములను బట్టుకొని యున్నయారాక్షసుల నందఱిని జూచి రథముననుండియే 'బయలుదేఱుఁ' డని యాజ్ఞాపించెను అంత బెడిదములైనకవచములను ఆయుధములను ధ్వజములను దాల్చి యున్నయారాక్షససైన్యము మహాధ్వని గొలుపుచు మిక్కిలివేగమున జనస్థానమునుండి వెడలినది. మహాభయంకరులైనరాక్షసులు పదునాలుగువేవురును, ఇనుపగుదియలను, ఇనుప దుడ్డుకఱ్ఱలను, మిక్కిలి వాఁడిమొనగలశూలములను, గొడ్డండ్రును, ఖడ్గములును, చక్రములును తెళతెళ మెఱయుచున్న తోమరములను శక్తులను భయంకరము లగునినుపగుదియలను మిక్కిలియుం బెద్దవిండ్లను గదలను కత్తులను రోఁకండ్లను, ఎనిమిదంచుల యాయుధములను కేలంబట్టి, ఖరచిత్తముచొప్పున నడచువారై జనస్థానమునుండి బయలు వెడలిరి. భయంకరపరాక్రము లగునారాక్షసులు యుద్ధాభిముఖులై యురవడించి పోవుటఁజూచి సమ్మర్దమువలన ఖరునిరథము వారికిఁ గొంచెము వెనుకగాఁబోయినది. అంత సారథి ఖరుని యభిప్రాయమెఱిఁగి యపరంజిచే రంజితములును చిత్రవర్ణములు నగునశ్వములను శీఘ్రముగాఁ దోలెను అప్పుడు పగవారి పీఁచ మడఁచునాఁబలుజోదు, రథమును సారథి శీఘ్రముగాఁదోలఁగా ఆధ్వనిచే దిక్కులును వానిసందులును పూరితములయినవి. మహాబలుఁ డగుఖరుఁడు పరుషముగానార్చుచు, అంతకంతకుఁ గోపముగ్గలింపఁగా

---

* ఇందులకు 'అగ్రే నిర్యాతు మిచ్ఛామి పౌలస్త్యానాం మహాత్మనాం। వధార్థం దుర్వినీతస్య రామస్య రణకోవిదః' అనిమూలము. వాస్తవార్థము:-(రామస్య అగ్రే) రాముని ముందఱ, (పౌలస్త్యానాం రాక్షసానాం వధార్థమ్) పులస్త్యవంశ్యు లయినరాక్షసుల వధమునకుఁగాను, (నిర్యాతుమిచ్ఛామి) బయలుదేఱఁ గోరుచున్నాను. అనియర్థము:- మహేశ్వరతీర్థులు.

శత్రువులను వధించుటకై యమునివలె నురవడించుచు,ఝంఝూవాతప్రేరితమై ఱాళ్ల జడిగురియ నుద్యుక్తమైనమహామేఘము,తనపై నివ్యాపించియున్న మేఘమును దోలునట్లు, పేరెలుంగున సారథిని రథముఁదోలనాజ్ఞాపించెను. ఇది యిరువది రెండవసర్గము.



## ఖరుఁడు యుద్ధమునకుఁ బయలుదేఱఁగా దుశ్శకునములగుట.

రాక్షససైన్యము జనస్థానమునుండి వెడలఁగానే గాడిదవంటి బూడిదవన్నెగల మహామేఘ మాసేనపయిని అమంగళకరముగు రక్తజలముగురిసెను. వానిరథమునకుఁ బూన్చియున్న వేగవంతము లయినగుఱ్ఱములు పోవునపుడు, అది రాజమార్గమున,సమభూమియై పుష్పములుచల్లఁబడియున్నను పైనగతిచే బడినవి. సూర్యునిచుట్టును నల్లనై యోరలందు మాత్రము రక్తవర్ణముగలిగి చక్రాకారమైనకొఱవివలె నున్నగాలిగుడి కలిగినది.అంత పెద్దకాయము గలదై బెసిదముగానున్న యొకగ్రద్ద, బంగారుదండము గలిగి మిక్కిలిపొడవై యున్న ధ్వజము నాక్రమించి నిలిచెను. మాంసభక్షకముల యినమృగపక్షులు జనస్థానసమీపమునం జేరి నానావిధముల వికారముగాను పరుషముగాను నఱచినవి. నక్కలు సూర్యుఁడు వెలుఁగుచున్నదిక్కునం జేరి, భయంకరములై పేరెలుంగున రాక్షసుల కమంగళసూచకముగా నఱచినవి. బ్రద్దలు వాఱినకొండలవలె గండుమీఱుచు బెసిదముగా గండరించు,మేఘములు నెత్తురువంటిజలమును వర్షించుచు, ఆకాశమంతయు నిరవకాశము గావించినవి. చీఁకటి భయంకరమై గగ్గురుపుట్టించుచు మిక్కుటముగాఁ గ్రమ్మినది.దిక్కులుగాని విదిక్కులుగాని యెంతమాత్రమును ప్రకాశింపకుండెను.సంధ్యాకాలము రాకమునుపే నెత్తురువంటిరంగు గలసంజ యడరినది.అప్పుడు భయంకరములైన క్రూరమృగములును పక్షులును రాపులుఁగులును నక్కలును గద్దలును ఖరుని దిక్కుమొగమై భయము సూచించుచు నఱచినవి.ఏవి తోఁచెంచు నేని యుద్ధమునఁ దప్పక యమంగళము గలుగునో, మఱి భయమునకు సూచకములగునో, అట్టినక్కలు సైన్యమున కెదురుగా నోటనుండి నిప్పుసెగ లురుల నఱచినవి. సూర్యుని సమీపమున నినుపగుదియవంటి నల్లనిమానిసిమొండెము ఒకటి చూపట్టినవి. రాహువు పున్నమగాని యమావాస్యగాని కానికాలమున సూర్యుని గ్రసించెను. వాయువు మహావేగమున ప్రతికూలముగా వీచెను. సూర్యుండు కాంతిగుందినవాఁడయ్యె. పట్టపగటనే నక్షత్రములు మిణుఁగుఱుబుర్వులవలె నుదయించినవి. ఆసమయమందు తామరకొలఁకులు, మత్స్యములును జలపక్షులును జలముల నడఁగఁగా, తామర లెండఁగా, కాంతిహీనములై యుండెను. వృక్షములు, పుష్పములును ఫలములును లేకుండెను. ఆ రాక్షససేనయందు గాలిలేకయే మేఘమువలె ధూసరవర్ణము గలదుమ్ము రేఁగినది. గోరువంకలు వీచి కూచియని పరుసుగాఁ గూయుచుండినవి. పిడుగులు చూపఱకు మహాభయంకరములై మిక్కుటపుఁగాంతితో మిఱుమిట్లు గొలుపుచుఁబడియె. పర్వతములతోను వనములతోను భూమియంతయు నల్లలాడెను. బుద్ధిమంతుఁడగు

ఖరుఁడు రథముపైఁగూర్చుండి గర్జించుచుండఁగా వాని యెడమభుజ మదిరినది. వాని కంఠధ్వనియు డగ్గుత్తికవడి తడఁబడసాఁగినది. ఖరుఁడును నాలుగుప్రక్కలఁ జూచినప్పుడు నిర్నిమిత్తముగా వానికన్నులనుండి నీళ్లుగాఱినవి. వానికి నెత్తియం దొకవిధమైన వికారముగలిగెను. అయినను వాఁడు యుద్ధముసేయవలయు ననెడిమోహమును విడిచినవాఁడు గాఁడు. అప్పుడు ఖరుఁడు భయంకరము లైనయా యుత్పాతములు ఉదయించుటంగాంచి పకపకనవ్వుచు రాక్షసుల నందఱిని జూచి "ఇప్పుడు భయంకరములై యుదయించుచున్న యీ మహోత్పాతములను నేను పరాక్రమబలమున, బలవంతుఁడు బలహీనులను తృణీకరించునట్లు, ఎంతమాత్రమును సరకుసేయను. నేను కోపించితినా, వాఁడిబాణములునైచి నక్షత్రములనుగూడ నాకాశమునుండి పడఁద్రోయుదును; మృత్యువునకుఁగూడ మరణముగలిగింతును. నేను కఱకుబాణములచే బలగర్వితుఁ డైనరాముని వానితమ్ముని లక్ష్మణునిని వధింపక మరలివచ్చుటలేదు. నాయప్పసెల్లెలు శూర్పణఖయు నారామలక్ష్మణుల రుధిరముద్రావి తనకోర్కినీడేర్చుకొనుఁగాక. అబిడకొఱకేకదా యిప్పుడు సీతారామలక్ష్మణులకు చేటు వాటిల్లినది. ఇంతవఱకును నాకెన్నఁడుగాని యెచ్చటనేని పరాజయము కలిగినదిలేదు. ఇది మీకును జక్కఁగా దెలిసినదేకదా! నేనబద్ధము చెప్పలేదు. నేను గోపింతునేని యుద్ధమునందు, మత్తిల్లిన యైరావతముపైఁగూర్చుండిన వజ్రహస్తుఁడగు దేవేంద్రునేని వధించి పుత్తును. ఇంక నాకుచ్చితంపుమనుష్యులగు రామలక్ష్మణులవిషయము చెప్పనేల?' అనెను. ఆసైన్యమునందలి రాక్షసులందఱును ఖరుని గర్జిల్లుమాటవిని మృత్యుపాశవశంగతులు గావున పరమసంతుష్టులైరి. మహాత్ములగుఋషులును దేవతలును గంధర్వులును సిద్ధులును చారణులును యుద్ధమును జూడఁ గోరి యచ్చటికివచ్చిరి. పుణ్యకర్ములయినయా దేవర్షులును గంధర్వులును చారణులును అచ్చటికివచ్చి యొక్కటిగాఁగూడి యొండొరులతో 'గోవులకును బ్రాహ్మణులకును లోకహితముగోరు మహాత్ములకును మంగళమగుఁగాక. చక్రపాణి యగువిష్ణుఁడు యుద్ధమున నసురులనందఱిని జయించినట్లు, రాముఁడు యుద్ధమునఁ బులస్త్యవంశ్యు లయినరాక్షసుల నందఱిని జయించుఁగాక' యని చెప్పుకొనిరి. ఆమహర్షులును దేవతలును యుద్ధమును జూచువేడుకలతోడ విమానారూఢు లయి 'గోబ్రాహ్మణులకు మంగళము కలుగుఁగాక 'యని యీమున్నగుమాటలం జెప్పికొనుచు గతాయుష్కు లగునారాక్షసులసైన్యమును గాంచిరి. భయంకరసేనాపరివృతుఁ డైనఖరుఁడు రథమునెక్కి వేగమున వెడలెను. వాఁడు వెడలుటంజూచి రాక్షసులందఱును వెడలిరి. శ్యేనగామియు, పృథుగ్రీవుఁడును, యజ్ఞశత్రుఁడును, విహంగముఁడును, దుర్జయుఁడును, కరవీరాక్షుఁడును, పరుషుఁడును, కాలకార్ముకుఁడును, మేఘమాలియు, మహామాలియు, సర్పముఖుఁడును, రుధిరాశనుఁడును, మహాపరాక్రము లయినయీపన్నిరువురు రాక్షసులు ఖరునిం బరివేష్టించి వెడలిరి. మహాకపాలియు, స్థూలాక్షుఁడును, ప్రమాథియు, త్రిశిరుఁడును, అను నలువురు

సేనాపతులు దూషణునిం బరివేష్టించి తరలిరి. భయంకరవేగులై, మహాబలశాలులగు రాక్షసవీరు లందఱును యుద్ధోత్సాహం బొప్ప, అంగారకాదిగ్రహములు చంద్రసూర్యులం బొందునట్లు, ఆ రామలక్ష్మణులయొద్దకుం బోయిరి. ఇది యిరువదిమూఁడవ సర్గము.

రాముఁడు జయసూచకములైనశుభనిమిత్తములం గాంచి సీతను గొండగుహాయందుఁ బదిలముగానుంచుకొని కాచియుండ లక్ష్మణుని నియోగించి యుద్ధసన్నద్ధుఁడగుట. రాక్షససైన్యము రాముని సమీపించుట.

భయంకరపరాక్రముఁడగుఖరుఁడు రామునియాశ్రమమునకుఁ బయనమై వచ్చుచుండఁగా, రాముఁడు లక్ష్మణుఁడును మున్ను రూపింపఁబడినయుత్పాతములనే కాంచిరి. రాముఁడు, మిక్కిలి వెడిదములై గగ్గురుపుట్టించుచు జనులకుఁ గీడుఁ గావించునట్టి యుత్పాతములు పొడసూపుటం గాంచి లక్ష్మణునిఁజూచి 'మహాబాహూ! సమస్తరాక్షసులను సంహరించుటకై సమస్తభూతసంహారకరముగా నీమహోత్పాతములు పొడసూపినవి; చూడుము. కటువులై గాడిదవన్నె గలయీమేఘములు రక్తధారలుగురియుచు మహాధ్వని గలుగునట్లు గర్జించుచు నాకాశంబునం జెరలాడుచున్నవి. లక్ష్మణా! నాబాణములన్నియును పొగరాఁజుచు యుద్ధముగోరుచున్నవి. బంగారుపూఁతలు గలపిఱిఁదిపట్టితోఁ దళతళలాడునాధనువులు యుద్ధంపుతమకంబున పొరలుచున్నవి. ఇప్పుడు కూయుచున్న వనచరములైన పక్షులనుజూడఁగా ముందు మనకు భయమును ప్రాణసంశయమును గలుగునని తోఁచుచున్నది. మహాయుద్ధముమాత్రము జగుగును. ఇందులకు సందేహము లేదు నాకుడిభుజము మాటిమాటికి నదరుచుండుటవలన నిది దెలియవచ్చినది. శూరా! ఇంక శీఘ్రముగానే మనకు జయమును శత్రువునకు పరాజయమును గలుగును. నీమొగమును గాంతి దళుకొత్తుచు ప్రసన్నముగా చూపట్టుచున్నది. లక్ష్మణా! యుద్ధమువచ్చినపుడు ఎవ్వరిముఖము కాంతిహీన మగునో వారికిఁ బ్రాణహాని కలుగును. ఇవిగో రాక్షసుల సింహనాదములును భేరీధ్వనులును, మహాభయంకరముగా మనచెవులకు వినవచ్చుచున్నవి. ఆపద వచ్చునేమోయని భయపడువాఁడును, మంగళముగోరువాఁడును పండితుఁడునగు పురుషుఁడు, ఆపద వచ్చుటకుమునుపే దానికి ప్రతీకారము సేయవలయును. కాఁబట్టి నీవు వింటిని బాణములనుదాల్చి సీతం దోడ్కొని, దుర్గమము లయినవృక్షములచేఁ గప్పంబడినగుహం బ్రవేశించి కాచియుండుము. లక్ష్మణా! నీవీమాట కడ్డము చెప్పవలదు. నాపాదములయాన, జాగుసేయవలదు. శీఘ్రముగాఁబొమ్ము. నీవును శూరుఁడవు; బలవంతుఁడవు; ఈరాక్షసులనందఱను వధింపఁజాలుదువు. ఇందులకు సందియము లేదు. అయితే నేనే యీరాక్షసులనెల్ల వధింపఁ దలఁచియున్నాను' అనిచెప్పెను. ల

క్ష్మణుఁడు రామునిమాటనువిని వింటిని బాణములను దాల్చి సీతం దోడ్కొని దుర్గమం బయినగుహ నాశ్రయించెను. లక్ష్మణుఁ డట్లు సీతతోఁగూడ గుహను ప్రవేశించినంత రాముఁడు 'ఆ! మంచియుపాయము తోఁచినది. లక్ష్మణుఁడు పంచినపని చక్కఁగాఁ జేసినాఁడు' అని మేన కవచము దొడిగెను. అగ్నివలె ధగధగ మెఱయు చున్నకవచమున నలంకృతుఁడై రాముఁడు చీఁకటియందుఁ బొగలేక మండుచున్న యగ్నిహోత్రమువలెఁ బ్రకాశించుచుండెను. ఆ వీర్యవంతుఁడు తనగొప్పవింటిని బాణములను దీసికొని యల్లెత్రాటిచప్పుళ్లచే దిక్కులు పిక్కటిల్లఁ జేయుచు నచ్చటనుండెను. అంత మహాత్ములయిన దేవతలును, గంధర్వులును, సిద్ధులును, చారణులును యుద్ధముఁ జూచుకోరికలతో నచ్చటికి వచ్చి కూడిరి. ముల్లోకంబుల మహాత్ములును పుణ్యకర్ములును బ్రహ్మర్షిప్రవరులు నగుబుషులు నచ్చోటికి విచ్చేసి యందఱును జేరి యొండొరులతో 'గోవులకును బ్రాహ్మణులకును లోకానుకూలురైనవారికిని మంగళమగుఁగాక. చక్రహస్తుఁడైనవిష్ణుదేవుఁడు యుద్ధమున సమస్తరాక్షసవీరులను జయించినట్లు రాముఁడును యుద్ధమున పులస్త్యవంశ్యులగు రాక్షసులనెల్ల జయించుఁగాక' యని చెప్పుకొనిరి. ఇట్లు వారు చెప్పి మరల నొండొరులంజూచి 'భయంకరకర్ములగు రాక్షసులు పదునాలుగువేవు రున్నవారు. ధర్మాత్ముఁ డగురాముఁడో ఒక్కఁడే. యుద్ధమెట్లు జరుగును' అని గుజగుజలు వోయిరి. ఇట్లు దేవత్వము నొందినరాజర్షులును, సిద్ధులును, బ్రహ్మర్షులును, దేవతలును, తమతమ పరికరముతో యుద్ధమును జూచుకుతూహలమున విమానారూఢులై యాకాశమున నుండిరి. అప్పుడు అత్యంతమైన తేజమావేశింపఁగా యుద్ధాగ్రంబున నున్నరామునిఁ జూచి సమస్తభూతములును భయమున కొండలపడినవి. సహజముగా నెవ్వరికిఁగాని నొప్పికలిగించుకార్యములు చేయని రాముని యొనలేని యాకారము *అప్పుడు మహాత్ముఁడగురుద్రుఁడు క్రుద్ధుఁడైనప్పటి యాకారముపగిది నతిభయంకరముగానుండెను (ఇట్లు దేవతలును గంధర్వులును చారణులును చెప్పుకొనుచుండఁగానే) యంత రాక్షససైన్యము గంభీరధ్వనులు సెలంగఁ బెడిదము లగుకవచములును ఆయుధములును ధ్వజములును దాల్చి నలుగడలం గ్రమ్మి రాఁ జూపట్టెను. వారు సింహనాదములు సేయుచు ఒండొరులనుజూచి 'నేను నేనుజయించెదను'అని బిగ్గఱగా గర్జిలుచు, నారి మ్రోయించుచు, మిక్కిలియు మత్తిల్లి మీఁదికి నిక్కుచును, బిగ్గఱగా గుంజనధ్వనులు గావించుచును, భేరులు వాయించుచును, గ్రమ్ముకొనఁగా వారలవలని యాతుములధ్వని యావనమంతయు నిండి చెలంగిన

*ప్రళయకాలరుద్రునివంటిరూపమే ఖరాదివధార్థ ముద్యుక్తుఁడైనరామునికిఁ గలిగెను. ఇందులకు స్కాందమున 'రుద్రతేజోవిలసితం దృష్ట్వా రామకళేబరం| శంఖం చక్రంచ శూలంచ పినాకం ఖేటమేవచ| ఖట్వాంగంచ ఘంటాం డమరుం బాణపాశాంకుశం తథా| చాపం వజ్రంచ ఖడ్గంచ పరశుం త్రాసకారణమ్|| జయశ్రియంచ గంగాంచ దదృశుః సిద్ధచారణాః' అని సిద్ధచారణులు రామునియందు ప్రళయకాలరుద్రుని చిహ్నములన్నియుఁ గాంచిరనియున్నది-మహేశ్వరతీర్థులు.

ది. అడవిలో చరించుక్రూరజంతువులును, ఆధ్వనికి బెదరి, తిరిగిచూడక నిశ్శబ్దముగా నున్నస్థలమునకుఁ బాఱిపోయినవి ఆసైన్యము నానావిధాయుధముల ధరించి యితరులకు దుష్ప్రవేశమై సముద్రమువలెఁ జెలంగుచు భయంకరమై రాముని సమీపించి నదయ్యె. రాముఁడు రణకర్మమునం బండితుండుగావున నలుప్రక్కల దృష్టిఁ బఱపి యుద్ధమునకై సన్నద్ధముగా వచ్చి యున్నఖరసైన్యమును జూచెను. రాముండు బెడిదంబగువింటినిబట్టి యమ్ములపొదులనుండి బాణములను దీసి కొంత బాణవిసర్జనము గావించి సమస్తరాక్షసవధమునకై తీవ్రంబగుకోపంబు నవలంబించినవాఁడయ్యె. అట్లు రాముఁడు క్రుద్ధుఁడై ప్రళయకాలాగ్నివలెఁ దేఱి చూడ నలవిగాక తేజరిల్లుచుండెను. అట్లు తేజం బావేశింప దుర్నిరీక్ష్యుఁడై వెలుంగుచున్నరామునిఁ జూచి వనదేవతలు భయంబునఁ బాఱిపోయిరి. అప్పుడు రాక్షసవధార్థమట్లు క్రుద్ధుఁడైనరాముని యాకారము దక్షునియజ్ఞమును ధ్వంసముసేయఁ గ్రుద్ధుఁడైనరుద్రునియాకారమువలె నతిభయంకరముగా నగపడెను. అట్లు యుద్ధాగ్రమున నిలుచుండి దుర్నిరీక్షతేజుండై యున్నరాముం జూచి సమస్తభూతములును భయార్తములై పరుగిడినవి. విండ్లును ఆభరణములును ధ్వజములను దాల్చి †అగ్నివలె ధగధగలాడు కవచములను దొడిగి యారాక్షససైన్యమును, సూర్యోదయమున సూర్యకిరణంబులం గ్రాలుచు నింద్రధనువునను ఉత్పాతధ్వజములను రాజిలుచుండునీలమేఘసమూహమునవలెఁ బ్రకాశించుచుండెను. ఇది యిరువదినాలుగవసర్గము.

రామునకు రాక్షసులతోడి తుములయుద్ధము; శస్త్రప్రయోగము; రాక్షసులచిత్రవధము.

ఖరుఁడు తనపురస్సరులతోఁగూడ రామాశ్రమమునకు వచ్చి విల్లు గయికొని క్రుద్ధుఁడై, పగవారివీఁచ మడంచు నీరలలాము రాముం జూచెను. వాఁడు రామునిఁ జూచి వింటిని పరుషముగా మొరయించుచు బాణముగూర్చి రామునికభిముఖముగాఁ దోలుమని సారథికాజ్ఞ యిచ్చెను. ఆసారథియు ఖరునియాజ్ఞ చొప్పున, గుఱ్ఱములను, మహాబాహుఁడగురాముఁడు తానొక్కండె వింటిని విదుల్చుచు నెలకొనియున్నస్థలమునకుఁ దోలెను. ఆఖరుఁడట్లు రామునియొక్కి నడరుటఁ జూడఁగానే యతనిమంత్రులగు శ్యేనగామి మొదలగురాక్షసు లందఱును మహాధ్వనిగలుగ సింహనాదములు సేయుచు వానిం బరివేష్టించిపోయిరి. నక్షత్రములనడుమ నుదితుండైన యంగారకుఁడు ప్రకాశించునట్లు, ఆ రాక్షసులనడుమ రథగతుఁ డగుఖరుఁడు తేజరిల్లెను. అంత ఖరుఁడు యుద్ధమునకుఁ దొడఁగి యప్రతిమతేజమున రాజిలుచున్నరాముని వేయిశ

---

†ఇట రాక్షసులకును నీలమేఘములకును సామ్యమునందు అగ్నివలె మెఱుఁగు లడరించుకవచములకును సూర్యకిరణములకును, విండ్లకును ఇంద్రధనుస్సునకును, ధ్వజములకును ఉత్పాతసూచకముగా మేఘములం దోఁచు ధ్వజములకును, వరుసగా సామ్యము దెలియునది.

ణములు వైచి నొప్పించి పెనుచప్పుడుగా నార్చెను. అంత రాక్షసులందఱును కుపితు లగుచు, భయంకరధనుర్ధరుఁడై జయింప నలవిగా కున్న రామునిమీఁద నానా విధము లయినయాయుధములం గురియించిరి. రాక్షసులు క్రోధమున యుద్ధంబున మాఱ్కొని ముద్గరములు పట్టిసములు శూలములు ప్రాసములు ఖడ్గములు గొడ్డండ్రుము న్నగునాయుధంబులచేత రామునిం బ్రహరించిరి. మహాపరాక్రమశాలు లగునా రాక్షసులు మేఘములఁబోలెఁ గారుకొనుచు బిట్టుగా నార్చుచు యుద్ధమున రాముని వధింపఁగోరి కొందఱు రథములనెక్కియు కొందఱు గుఱ్ఱములనారోహించియుఁ గొందఱు పర్వతశిఖరాకారము లైనగజములపైనుండియు రాముని నెదుర్కొని పాఱుతెంచిరి. ఆరాక్షససమూహములు, మేఘములు గొప్పపర్వతముపయిని జలధారలు వర్షించునట్లు, రామునిపయిని బాణవర్షము గురియించిరి. రాముఁ డప్పుడు భయంకరము లగు రాక్షసగణములు చుట్టుఁ గ్రమ్ముకొనఁగా నుల్లసిలుచుండెను. సముద్రమునందు నదీప్రవాహములు సేరి మాయునట్లు, ఆరాక్షసులు ప్రయోగించిన యాయుధములన్నియు రాముని బాణములఁ దాఁకి రూపుమాసినవి. ఆ రాముఁడు భయంకరము లయినయారాక్షస ప్రహారణములవలన భిన్నగాత్రుఁ డయ్యును, పిడుగులు మెఱుంగు లడరించుచుఁ బెక్కులుపడినను చలింపని మహాపర్వతమువలె, బాధ నొందినవాఁడు గాఁడయ్యె. ఆరాముఁడు తన యవయవములన్నిటను బాణములు గ్రుచ్చుకొనఁగా నెత్తుటఁ దొప్పదోగి సందెమబ్బులచే నావరింపఁబడిన సూర్యునివలెఁ బ్రకాశించుచుండెను. అప్పుడు దేవతలును గంధర్వులును సిద్ధులును పరమర్షులును, రాముఁడొక్కఁడు పెక్కువేవురు రాక్షసులతో మాఱ్కొనుటను జూచి విషాదము నొందిరి. అంత రాముఁడు మిక్కిలియుఁ గుపితుఁడై కోదండంబు మండలాకారముగా వంచి వందలకొలఁదిని వేనవేలుగాను అర్ధచంద్రాగ్రము లైన బాణములను బ్రయోగించెను. రాముండు రణమునందు, నివారింపనలవి గానివియు, దుస్సహములు నై యమదండములం బోలి గుఱి దప్పక నిగుడు బాణంబులఁ బెక్కింటి నవలీలఁ బ్రయోగించినవాఁడయ్యె. రాముఁ డట్లు రాక్షససైన్యములపయి నవలీలగా వైచిన బాణములు యమప్రయుక్తము లైనపాశములవలె యుద్ధమున రాక్షసుల ప్రాణముల నెల్లఁ గొనెను. ఆ బాణములు రాక్షసదేహములను భేదించి* నెత్తుటఁ దడిసి యాకాశంబున కెగసి మండుచున్నయగ్నులవలె తేజంబునఁ బ్రకాశించుచుండినవి. అప్పుడు మండలాకారమై యున్న రామునివింటినుండి మిక్కిలి యుగ్రములై లెక్కపెట్టనలవి గాని బాణములు వెడలి రాక్షసుల ప్రాణముల నపహరించినవి. రాముఁడు యుద్ధమున రాక్షసులధనుస్సులను ధ్వజములకొనలను, కవచములను శిరములను, కడియములతోఁ గూడిన బాహువులను ఏనుఁగుతొండములవంటితొడలను వందలకొలఁదిని వేనవేలుగను వాఁడిబాణంబులఁ దుండించె. రాముఁ డట్లు యుద్ధమున, బంగారపుజీని మొదలగువాని

---

* నెత్తుటం దడియుటచేత మండుచున్న యగ్నితో సాదృశ్యము చెప్పఁబడెనని తెలియునది.

చే నాయత్తములై సారథియుక్తములై రథములకుఁ బూన్పంబడియున్న గుఱ్ఱములను మావటీలతోఁగూడిన యేనుంగులను, రౌతులతోఁగూడినగుఱ్ఱములను, కాలిబంటులను, దునుమాడి యమపురికిఁబంపెను. అంత రాక్షసు లట్లు వాఁడిమొగముగల నాళీక (తూండ్ల) బాణములచేతను, ఇనుపబాణములచేతను కర్ణబాణములచేతను భిన్నులగుచు నోర్వఁజాలక భయంకరముగా నార్తస్వరంబున నఱచిరి. అట్లు రాముండు మర్మములు గాఁడ నేసిన వాఁడిబాణములచేత నాసైన్యమునొచ్చి,యెండినవనము కార్చిచ్చుచేఁ గాలినట్లు, మిక్కిలియు వ్యథ చెందెను గాని కొంచెమైనను సుఖముగానదయ్యెను. భయంకరబలశాలులును శూరులు నగురాక్షసులుగొందఱు రామున కెదురుగాఁ బోయి యుత్తమము లయినశూలములు ఖడ్గములు గొడ్డండ్రు మొదలయిన యాయుధములను నతనిపై వైచిరి. మహాబాహుండగు రాముండు బాణములచే నారాక్షసులు ప్రయోగించిన యాయుధములను వారించి యుద్ధంబున వారికంఠములను దునుమాడి ప్రాణములను గొన్నవాఁడయ్యె. ఆ రాక్షసులు తలలు దెగియు, కవచంబులును విండ్లును తుండెములయ్యు, గిరుడుని ఱెక్కలగాలిచే వృక్షంబులు భూమిపయిని ద్రెళ్లినట్లు, నేలంగూలిరి. వారలలోఁ జావఁగా మిగిలిన రాక్షసులు, రామబాణంబులు గాఁడ దుఃఖితులయి కావుకావుమని శరణార్థులై ఖరునియొద్దకుఁ బాఱిరి. దూషణుఁడు వారినందఱినిమరలఁ గూర్చి తోడ్కొని యాశ్వాసించి క్రుద్ధుఁడై, రుద్రునిపైకిఁబోవు యమునివలె, రామునిపైఁ దలపడెను. ఆ రాక్షసులందఱును మరలినవారై దూషణుని నండఁగొని యాయుధములన్నియు నష్టప్రాయము లగుటవలన సాలవృక్షములను తాళవృక్షములను ఆయుధములుగాఁగొని రామునిపైకి నడరిరి. రాక్షసులు శూలములను ముద్గరములను గేలందాల్చియు విండ్లనిగొనియు బహుబలులుగావున యుద్ధమున రామునిపై బాణవర్షములను ఆయుధవర్షములను వృక్షవర్షములను శిలావర్షములనును గురియించుచుండిరి. అప్పుడు మరల రామునకును ఆరాక్షసులకును మిక్కిలియద్భుతముగాను గరుపుట్టించున ట్లతిభయంకరముగాను బాణయుద్ధము జరిగెను. ఆరాక్షసులు కుపితులై మరల రాముని నలుగడలం గ్రమ్ముకొనిరి. మహాబలుఁడగు రాముఁడు ఆరాక్షసులు ప్రాసములుగొని బాణవర్షములు గలయ వర్షించుచు దిక్కులను విదిక్కులను నావరించియుండుటను జూచి భయంకరముగా సింహనాదము నేసి మిక్కిలియు భాస్వర మగుగాంధర్వాస్త్రమును రాక్షసులపైఁ బ్రయోగించెను. అంత గుడుసువడియున్న రామునివింటినుండి వేలకొలఁదిని బాణములు వెలువడెను. దానినుండి వెడలివచ్చిన బాణంబులచే దశదిశలును గప్పంబడినవి. రామబాణపీడితు లగునారాక్షసులు అతండు బెడిదంపుబాణములను దీయుటగాని బాణములవిడుచుటగాని వింటనాకర్షించుటగాని గానఁజాలరైరి; కాని బాణములం బీడితు లగుచుమాత్రముండిరి. బాణము లవ్వారిగా నిగిడి, చీకటివలె గ్రమ్మి సూర్యునితోఁగూడ నాకాశమునంతయు నావరించెను. రాముఁడాబాణములను గ్రక్కుచుండునట్లు చూపట్టుచుండెను. రాముఁడు లెక్కలేని బాణము

లవ్వారిగా నొక్కుమ్మడిని బ్రయోగించులాఘవాతిశయమువలనను వేగాతిశయమువలనను రాక్షసులు నేకకాలమున గుంపులుగుంపులుగా బడుచున్నవారును, ఒక్కుమ్మడిని మిక్కిలియు గుంపులుగా వధింపఁబడుచున్నవారును, ఉవ్వెత్తుగా వివశులై నేలంబడియున్నవారునయిరి. కాఁబట్టి వారిచే నాయుద్ధభూమియంతయు నెరసి బెరసి యుండెను. ఆయుద్ధమునం దచ్చటచ్చట రాక్షసులుగొందఱు కేవలముకొట్టుపడియు, మఱికొందఱు పిడుగుపై పడినట్లు భయమున నేలంబడియు, కొందఱు కుత్తుకను గొఱప్రాణములు గలిగియుఁ, గొందఱు రెండుగాఁద్రుంపఁబడియుఁ, గొందఱు అవయవములు తుండింపఁబడియుఁ, గొందఱు పొట్టమొదలుగాఁ గుత్తుకవఱకుఁ జీల్పఁబడియు, వేనవేలుగాఁగూలి గనుపట్టుచుండిరి. రాముని బాణములచే తుండింపఁబడినతలగుడ్డలతోడి తలలును, వట్టితలలును, బాహుపురులచే నలంకృతము లయినబాహువులును, నానావిధాలంకారములైన చల్లాడములతోడితొడలును, కటకములతోడిజానువులును పలువిధములుగా భిన్నములయిన నానావిధము లగుగుఱ్ఱములును, మేటియేనుఁగులును, రథములును, విచ్ఛిన్నములైన పలుదెఱంగుల చామరములును,వీవనలును, గుబ్బగొడుగులును, ధ్వజములును, ఖండితములైన వింతవింత లగుశూలములును, పట్టిసములును, ఖడ్గములును, ప్రాసములును, చెల్లచెదరయిన గొడ్డండ్లును,పలుదునియలుగా చూర్ణితములయిన శిలలును, చిత్రము లగుశరీరములును, ఆయుద్ధభూమిని వ్యాపించియుండఁగా నదిచూడ భయంకరముగానుండెను. ఇది యిరువదియైదవసర్గము.

## దూషణాదివధము.

మహాబాహుఁ డగుదూషణుఁడు తన సైన్యమునంతయు రాముఁడు హతముఁగావించుచుండుటం జూచి, బెడిదంపువేగము గలవారు గాన దురాసదులై యుద్ధంబున వెనుదీసి పోవనియైదువేలరాక్షసులను రామునిపైఁ దలపడ నాజ్ఞాపించెను. వారు రాముని నలుప్రక్కలను గ్రమ్మి శూలములును పట్టిసములును ఖడ్గములును శిలావర్షములును వృక్షములును బాణవర్షములును, తెఱపిలేకుండునట్లుగాఁ గురియించిరి. రాముఁడు ధర్మంబున యుద్ధముసేయువాఁడు గనుక నెదిరి ప్రాణంబులను దీయునట్టి యాగొప్పవృక్షవర్షమును శిలావర్షమును వాఁడిబాణములువైచి నివారించెను. రాముఁడు, ఆఁబోతు కన్నుమూసికొని యెంతటివానను గాని సరకుసేయకుండునట్లు, రాక్షసులు గురియునావర్షమును సరకుసేయక గయికొని సమస్తరాక్షసులను వధించుటకై కోపము మిక్కిలియుఁ బూనినవాఁడయ్యె. అంత రాముఁడు, కోపముపైకొనఁగా, తేజంబున మిక్కిలియు వెలుంగుచు దూషణసహితమగు నారాక్షససైన్యముపైనంతయు నలుగడల బాణముల బఱపినవాఁడయ్యె.అంత శత్రుదూషణుఁడగు సేనాపతి యాదూషణుఁడు క్రుద్ధుఁడై పిడుగులంబోలియుగ్రబాణములను రామునిపైఁ బఱపెను. పిదప వీరుఁడు రాముఁడును యుద్ధమున నొకకత్తివాతియమ్మున నాదూషణుని

వెనువింటిని ఖండించి నాలుగుబాణంబులచే వానిగుఱ్ఱముల నాలుగింటిని గూలనేసెను. రాముఁడట్లు వాఁడిబాణములచే గుఱ్ఱములను జంపి యొకయర్ధచంద్రబాణమున సారథిశిరముఁ ద్రుంచి యంతంబోక యాదూషణునిఱొమ్మున మూఁడమ్ములు వైచి నొప్పించెను. దూషణుఁడట్లు విల్లువిఱిగి విరథుఁడై గుఱ్ఱములును గూలి సారథియు హతుండు-కాఁగా నంత పర్వతశిఖరమువలె చూడ గరు పుట్టించునట్టిగొప్పపరిఘముఁ గేలం బూనెను. ఆపరిఘము బంగారుకట్లచేఁ జుట్టంబడి కఱకు లయినయినుపమేకులు నెఱసినదై వజ్రమణులవలెను వజ్రాయుధమువలెను బిఱుసుగాఁ దాఁకుచు, పెక్కుదేవసైన్యంబుల మర్దించియు పగవారి మేదస్సులం దోఁగియు శత్రుపురద్వారముల బడలుపఱిచియు మెఱయుచుండునది. క్రూరకరుఁడగునారాక్షసుఁడు మహాసర్పముంబోనియాపరిఘమును జేకొని యుద్ధమున రామునిపయికిం బోయెను. రాముఁడట్లు దూషణుఁడు పరిఘమును జేతంబట్టి తనపయికి వచ్చుచుండుటం జూచి రెండు బాణములువేసి బిరుదభూషణాలంకృతము లయినవానిబాహువులను ద్రుంచెను. రణాగ్రమున వానిచేతులు రెండును ఖండింపఁబడఁగా వెనుకొలఁదిగా నుండువానిపరిఘము జాఱినదై, యుత్సవాంతమున నింద్రధ్వజము పడునట్లు, ముందఱ పడెను. అట్లువాఁడు రెండుచేతులును దెగి, రెండుకొమ్ములును దెగినధీరగజమువలె, నేలఁగూలెను. దూషణుఁడట్లు యుద్ధమున హతుఁడై పుడమిని ద్రెళ్లుటం జూచి సమస్తభూతములును కాకుత్థ్సుని రాముని బాగుబాగని ప్రశంసించినవి. ఇంతలో మహాకపాలుఁడును స్థూలాక్షుఁడును, మహాబలుఁడగుప్రమాథియు ననుమువ్వురురాక్షసులు మృత్యుపాశబద్ధులగుటంజేసి క్రుద్ధులై యొక్కటిగా రామునిపైకి నడరిరి. మహాకపాలుఁడు విశాలమగు శూలమును స్థూలాక్షుఁడు పట్టిసమును ప్రమాథి పరశ్వథమును చేకొని దలపడిరి. రాముఁడు వారు మువ్వురును తనపైకి వచ్చుటం జూచి, యతిథులు వచ్చినచో వారికి నర్ఘ్యాదులిచ్చునట్లు, శీఘ్రముగా నారాక్షసులను వాఁడిమొనలుగలబాణంబులం బ్రయోగించి ప్రతిగ్రహించెను. రాముఁడు మేటిబాణములువైచి మహాకపాలుని శిరము ఖండించెను. లెక్కలేనిబాణములు వైచి ప్రమాథిశరీరమును పెక్కుతునియలు గావింపఁగా వాఁడు పెక్కుకొమ్మలతోఁ గూడినమహావృక్షమువలె నేలఁగూలెను. రాముఁడు స్థూలాక్షుని కన్నులనిండ కఱకుబాణములు వైచెను. మఱియు కుపితుఁడై దూషణుని వెంబడించి వచ్చినయైదువేలరాక్షసుల నయిదువేల బాణములచే క్షణమున యమపురికిఁబంపెను. దూషణుఁడును వానివెంటఁ బోయినవారును నిహతు లగుటం జూచి ఖరుఁడు క్రుద్ధుఁడై మహాబలు లగుతన సేనాధ్యక్షులను జూచి 'చూచితిరా! ఈ దూషణుఁడును వీని వెంటఁబోయినవారును రామునిచే హతులైరి. రాక్షసులారా! మీరందఱును గొప్పసైన్యముతోఁగూడి నానావిధరూపంబులైన యాయుధములనుగొని కుత్సితమనుష్యుఁడగురామునితో యుద్ధముగావించి వానిని బట్టి వధింపుఁడు' అని యాజ్ఞాపించెను. ఇట్లు ఖరుఁడానతిచ్చి తానును రామునిమీఁదికే

పోయెను. శ్యేనగామియు, పృథుగ్రీవుఁడును, యజ్ఞశత్రుఁడును, విహంగముఁడును, దుర్జయుఁడును, కరవీరాక్షుఁడును, పరుషుఁడును, కాలకార్ముకుఁడును, మేఘమాలియు, మహామాలియు, సర్పాస్యుఁడును, రుధిరాశనుఁడును, అను మహావీర్యులగు నీ సేనాధ్యక్షులు పన్నిరువురు సేనాసమేతులై మేటిబాణముల నేయుచు రామునిమీఁదికే యడరిరి. అంత రాముఁడు మహాతేజుండుగావున బంగరుచేతను వజ్రఋణులచేతను నలంకృతములై యగ్నిహోత్రములవలె వెలుఁగుచున్న బాణములేసి యామిగిలిన సైన్యమునుగూడ వధించెను. బంగారుపింజలుగలిగి, పొగరాఁజుచున్న యగ్నిహోత్రములవలె తేజరిలుచున్నయాబాణములు, వజ్రములు మహావృక్షముల నఱకునట్లు, ఆరాక్షసుల నందఱిని ఖండించినవి. రాముఁడు రణాగ్రమున నూర్వురరాక్షసులను కర్ణాకారము లగునూఱుబాణంబులను వేవురు రాక్షసులను వేయిబాణములను నేసి వధించెను. రాక్షసులాబాణములచే కవచములు తునిసి సొమ్ములు పఱియలై విండ్లు ఛిన్నభిన్నములై నెత్తుటఁ గలయం దోఁగుచు భూమింబడిరి. అట్లు విరిసినతలవెండ్రుకలతో నెత్తుటఁ దోఁగుచుఁ బడియున్న రాక్షసులచే నావృతమైనయాయుద్ధభూమి, దర్భలచేఁ గప్పఁబడినయాగవేదికవలె నొప్పుచుండెను. మహాభయంకరమైనయావనము రాక్షసులందఱును హతులుకాఁగా, క్షణమాత్రంబున రక్తమాంసంబుల రొంపిగొనుచున్న నరకమువలె నుండెను. రాముఁ డొక్కఁడు కేవలమనుష్యుఁడు; అందును పదాతి. ఇట్టియొక్కఁడు భయంకరకృత్యు లగుపదునాల్గువేలు రాక్షసులను వధించెను. ఆ సైన్యమున కంతయును మహారథుఁ డగుకర్ణుఁడును త్రిశిరుఁడును శత్రుసూదనుఁడగు రాముఁడును, వీరు ముప్వురే మిగిలిరి. *మహాబలవంతులై ఘోరాకారులగుచు మార్కొనఁ దరముకాని తక్కినరాక్షసు లందఱును లక్ష్మణాగ్రజుఁ డగురామునిచేత యుద్ధమున హతులయిరి. అంత బలవంతుఁ డగురామునిచేత మహాయుద్ధమున భయంకర మగుతనబలమంతయు హతమగుటం జూచి ఖరుఁ డప్పుడు మహారథము నెక్కి వజ్రాయుధము నంకించినయింద్రునివలె భయంకరాకారుఁడై రామునిపైఁ గవిసెను. ఇది యిరువదియాఱవ సర్గము.

---

## త్రిశిరునివధము.

ఖరుఁడు రాముని కభిముఖముగాఁ బోవుచుండఁగా సేనాపతి యగుత్రిశిరుఁడు వానిదాపునకుఁబోయి†'పరాక్రమనిధీ! నన్ను నియోగింపుము. యుద్ధమున కురవడించు నీసాహసమేల! మరలుము. ఇదిగో మహాబాహుఁ డగురాముని యుద్ధమున

---

* ఇట 'మహాబలవంతులే' నంపఁబడిరనుటచే బలహీనులగు కొందఱు హతులుగాక మిగిలిరనియు వారే యుత్తరసర్గమున హతశేషు లనఁబడిరనియుఁ దెలియునది.

† 'ఇట 'మాం నియోజయ విక్రాన్త సన్నివర్తస్వ సాహసాత్। పశ్యరామం మహాబాహుం సంయుగే వినిపాతితమ్॥ ప్రతిజానామి తేసత్యం మాయుధం చాహమాలభే। యథారామం వధిష్యామి వధార్హం సర్వరక్షసామ్॥ అహం వాస్య రణే మృత్యు రేషవా సమరేమమ। వినివృత్య రణోత్సాహా న్ముహూర్తం ప్రా

వధించెదను. చూడుము. నేను సమస్తరాక్షసులకును వధ్యుం డగురాముని వధించెదను. ఇట్లని ఆయుధమును దాఁకి సత్యముగాఁ బ్రతిజ్ఞగావించెదను. నేనయినను ఈ రాముని యుద్ధంబునఁ జంపెదను. లేక రాముఁడేని నన్ను యుద్ధంబున వధించుఁ గాక. నీవిప్పుడు యుద్ధోత్సాహమును వదలి కొంచెము సేపు సాక్షివిగా నుండుము. రాముఁడు హతుఁడగునేని నీవు సంతుష్టుఁడవై జనస్థానమునకయినను బోఁగలవు. లేక నేను హతుఁడ నగుదునేని రామునితో నేని యుద్ధమునఁ దలపడుదువు' అని చెప్పెను. ఆత్రిశిరుఁ డిట్లు వేఁడికొనఁగా ఖరుఁడు, మృత్యువు తనకుఁ బుట్టించినయుద్ధ లోభమునుడిగి, 'పొమ్ము! యుద్ధము గావింపుము' అని యనుమతింపఁగా, నాత్రిశిరుఁడు రాముని కభిముఖముగాఁ బోయెను. త్రిశిరుఁడు మంచిగుఱ్ఱములు బూన్పఁబడి, దేదీప్యమానం బగురథ మారోహించి మూఁడుతలలుగలవాఁడు గావున మూఁడుశిఖరములతోఁ గూడినపర్వతముకరణి యుద్ధమున రామునిపయికి నడరెను. ఆత్రిశిరుఁడు మహామేఘము జలధారలను విడుచునట్లు, బాణములు గురియించుచు నీటందడిపిన భేరినాదమునకు తుల్యముగా సింహనాదము గావించెను. రాముఁడు త్రిశిరుఁడు వచ్చుటం జూచి తీక్ష్ణము లగుబాణములను వింటను సంధించి ప్రయోగించుచు నాతనిని బ్రతిగ్రహించెను. అంత మహాబలశాలు లగునారామరాక్షసులకు, సింహమునకును మదపుటేనుఁగునకుంబోలె గొప్పతుములయుద్ధము గలిగెను. అంతఁ గ్రుద్ధుఁడైన

శ్నికోభవ॥ ప్రహృష్టో వా హతేరామే జనస్థానం ప్రయాస్యసి। మయివా నిహతే రామం సంయుగాయోపయాస్యసి॥' అనిమూలము. వీనికి ప్రాతీతికార్థము స్పష్టము. వాస్తవార్థము:—(హేఖర) ఖరుఁడా, (సంయుగే) యుద్ధమందు, (రామం) రాముని, (వినిపాతితం) (సైన్యం అని శేషము) రామునిచేఁ గూల్పఁబడిన మనసైన్యమును, (పశ్య) చూడుము. కాఁబట్టి నీవు, (సాహసాన్నివర్తస్వ) సాహసమునుండి మరలుము, (మాం నియోజయ) నన్ను నియోగింపుము. 'నన్ను సాహసముసేయక మరలు మనెదవే? నీవుమాత్రము రామునిఁ జంపఁగలవాయని' ఖరుఁ డడుగఁగా చెప్పుచున్నాఁడు-(సర్వరక్షసాం వధార్థం) సర్వరాక్షసహంతయగు, (రామం) రాముని, (యథా) యథావత్తుగా-కలరూపున, (అహంప్రతిజానామి) నేను చక్కఁగా నెఱుఁగుదును. కాఁబట్టి, (తం వధిష్యామి) ఇతి అని శేషము. 'అతనిని జంపుదునని, (సర్వమాయుధం ఆలభే) సర్వాయుధములను ఊరకపట్టుకొనుచున్నాను. కాని నిజముగా నతనిని జంపుట యెక్కడిది. చంపను శక్యముగాదేని యీ యుద్ధప్రయత్నమేల? యనఁగా చెప్పుచున్నాఁడు. (అస్యరామస్య) ఈరామునికి, (అహంవారణే మృత్యుః) నేనా యుద్ధమున మృత్యువగుదును? కాననుట. అయితే, (ఏషవా సమరే మమమృత్యుః) ఇతఁడే నాకుమృత్యువు. కాఁబట్టి నీవు, (మహోత్సాహాత్ వినివర్తస్వ) ఈగొప్పయుత్సాహమును విడిచి మరలుము. (ముహూర్తంప్రాశ్నికోభవ) కొంతసేపు జయాపజయముల నిర్ణేతవు గమ్ము అని సంబంధము. (ప్రహృష్టోవా హతే) అనుచో 'అహతే' అనిఛేదము. (రామే అహతేసతి) రాముఁడు హతుఁడు కాకుండఁగా, (మయిచ నిహతే సతి) నేను హతుఁడనుకాఁగా, (ప్రహృష్టః) మిక్కిలి సంతుష్టుఁడవై, (త్వం) నీవు, (రామంప్రతి) రామునిఁగూర్చి, (సంయుగాయ ఉపయాస్యసి) యుద్ధమునకుఁ బోదువు. లేదా, (జనస్థానం ప్రయాస్యసి) జనస్థానమునకైనను బోదువు. అని దూషణుఁ డిట్లుప్రార్థింపఁగా ఖరుఁడు యుద్ధమునకుఁ బొమ్మని యనుజ్ఞ యిచ్చెనని తెలియునది.

రాముఁడు, త్రిశిరుఁడు నొసట నాటినమూఁడుబాణములం జూచితుఁడై మఱియుఁ గోపమునొంది 'ఓహో! పరాక్రమశూరుఁ డగురాక్షసునిబలము చాల గొప్పదిగా నున్నదే! ఈబాణములు నానొసటం దగిలి పుష్పములవలె నున్నవి. ఇఁక నావింటినుండి వెడలెడి బాణములను బ్రతిగ్రహించిచూడుము' అనెను. ఆరాముఁ డిట్లుచెప్పి కుపితుఁడై వేగమునఁ గ్రూరసర్పంబులకు సాటి యగుపదునాలుగుబాణములను త్రిశిరునిఱొమ్మున గాఁడనేసెను. అంత మహాపరాక్రమశాలి యగురాముఁడు నాలుగు బాణములచేత నాత్రిశిరునిగుఱ్ఱముల నాలిగింటిని గూలనేసెను. రాముఁ డెనిమిది బాణముల సారథిని గూలనేసెను. ఒక్కబాణమున రథముపయి నుండుధ్వజమును దెగవ్రేసెను. అంత రాముఁడు, గుఱ్ఱములు దూలినయారథమునుండి త్రిశిరుఁ డుద్గమించుటం జూచి వానివక్షస్థలమునఁ బెక్కుబాణంబులు గాఁడనేయఁగా వాఁడు మూర్ఛిల్లెను. అప్రమేయబలుఁ డగురాముఁడు కోపమునొంది వేగవంతము లగుమూఁడు వాఁడిబాణముల నాత్రిశిరుని మూఁడుతలలను తుంచెను. ఆత్రిశిరుఁ డిట్లు రామబాణములచే శిరంబు ఖండితంబుగా నెత్తురుగ్రక్కుచు తలలతోఁగూడ నేలఁగూలెను. అంత ఖరసైనికులలో హతశేషు లగురాక్షసులు భయపడి, పెద్దపులికి భయపడిన జింకలవలెనిలువక పలాయితు లైరి. ఖరుఁ డట్లు పరుగెత్తుచున్న రాక్షసులం జూచి కుపితుఁడై వారల మరలించి, రాహువు చంద్రునిపైకిఁ బోవునట్లు, రామునిపైకిఁ బోయెను. ఇది యిరువదియేడవసర్గము.



## రాముఁడు ఖరుని రథతురగాదిసకలపరికరమును నాశము సేయుట.

రాముఁడు యుద్ధమున దూషణుని త్రిశిరునిని గూడ వధింపఁగా చూచి ఖరునకుఁగూడ రామునిపరాక్రమమునకు బెదరు గలిగెను. మహాబలుఁ డా ఖరుఁడు రాముఁ డొక్కనిచే దుర్జయం బగురాక్షససైన్యమంతయును త్రిశిరుఁడును దూషణుఁడును హతులగుటంజూచి, మేటు లగురాక్షసులందఱును నశించుటనుంగాంచి, మనమున గర్వముదూలి, నముచి యింద్రునిపై నడరినట్లు, రామునిమీఁదికిఁ దలపడెను. ఖరుఁడు బలముకొలఁదిని వింటిని లాగి క్రుద్ధములగు సర్పములంబోలినవై నెత్తురుగుడుచునట్లు నెత్తుటం బ్రుంగి యున్నబాణములను రామునిపయిని బ్రయోగించెను. ఖరుఁడు రథగతుం డై యుద్ధమున ధనుర్వేదంబు గఱచినకౌశలమేర్పడ నారి విదుల్చుచు, మిక్కిలియుం బెక్కువిధముల బాణములు బ్రయోగించుపటిమను బ్రకటించుచు,నిట్లు బాణములచే గూర్చుట యేయుట మున్నగు నానాప్రకారములను బచరించెను. మహారథుఁ డా రాముఁడు ఖరుఁడు తనపైఁ గవియుటఁజూచి తనువెనువింటను బాణములు నిండించియు సమస్తములైనదిక్కులును విదిక్కులును నిండార బాణముల నిగిడించెను. రాముఁడు మిడుఁగుఱులు గుప్పించు నగ్నిహోత్రములవలె సహింప నలవిగానిబాణములను గురియించి యాకాశమునంతయు, మేఘుఁడు వర్షధా

రలచే దట్టముగాఁ గప్పినట్లు, ఆబాణవర్షములచే తెలుపిలేకుండునట్లు గావించెను. అట్లు ఖరుఁడును రాముఁడును ఒండొరులపయిని ప్రయోగించినవాఁడిబాణములచేత వారలచుట్టు నున్నయాకాశమంతయు బాణములు దొమ్మిగాఁ గ్రమ్ముకొనఁగా నిరవకాశమయినది. అప్పుడు ఒండొరులను వధించుసంరంభమున వారియిరువురును మిక్కిటముగా యుద్ధముసేయగా సూర్యుఁడు వారిబాణములచే నావృతుఁడై ప్రకాశింపఁడయ్యె. అంత ఖరుఁడు, బరిగోలలచే మహాగజమును బొడుచునట్లు, నానాకారములును కర్ణాకృతులు నైనవాఁడిమొనలబాణములచే రామునిఁ బ్రహరించెను. అట్లు రథగతుఁడై ధనువు చేతంబట్టి, యుద్ధసన్నద్ధుఁడై ఖరుఁడు, పాశముచేతం దాల్చియున్న యమునికైవసి, భయంకరాకారంబున సమస్తభూతములకును గనుపట్టెను. రాముఁడు మహాబలుఁడును పరాక్రమంబున నెంతయు స్థిరుఁడు నయ్యు,అంతటి మహాసైన్యమునంతయు వధించినవాఁడుగావున నప్పుడు బడలియుండునని ఖరుఁడుతలంచెను. రాముఁడట్లు సింహమువలె విక్రమించి సింగమువంటి బింకపునడతో వచ్చుచున్నయాఖరునిఁజూచి, సింహము క్షుద్రమృగమును చలింపజూచినట్లు, తానెంతమాత్రమును చలింపఁడయ్యె. అంత సూర్యునివలె ధగధగ మెఱయుచున్నరథమెక్కి ఖరుఁడు యుద్ధంబునకుఁ బూని, మిడుతె యగ్గిమీఁద నుఱుకునట్లు, రామునిపైకి నడచెను. అంత ఖరుఁడు,మహాత్ముఁడురాముఁడు కొంతబడలికచే పరాకునడిన తెఱపివలనఁ, దనహస్తలాఘవమును నెఱపుచు, అమ్ముఁ గూర్చినయతనివింటిని, పిడికిలిపట్టుదాపున, తుంచెను. వాఁడు క్రుద్ధుఁడై మరల నింద్రునివజ్రముంబోని బాణములేడుకేసి రామునికవచముపై బిట్టు దాఁకవైచెను అంత ఖరవిముక్తములై మంచిగణుపులు గలిగియున్న యాబాణములచేఁ గొట్టునడి రాముని కవచము నేలఁబడెను. అట్లు కప్పువిడుచుటచే రాముఁడు సూర్యునివలెఁ దేజరిల్లినవాఁడయ్యె. పిదప నప్రతిమతేజమున రాజిలుచున్న రాముని యుద్ధమున ఖరుఁడు వేయిబాణములేసి బిట్టుదాఁకించి మహాధ్వని గలుగునట్లుగా సింహనాదముగావించెను. ఆరాముఁ డట్లు యుద్ధమున తనగాత్రములందెల్ల బాణములునాటఁగా, క్రుద్ధుఁడై, పొగలేక మండునగ్నిహోత్రముకైవడిని, ప్రకాశించెను. అంత శత్రువిరాముఁ డగురాముఁడు ఆపగవానిని తుదముట్టించుటకై మిక్కుటముగా మొరయునట్టిమఱియొక వినువింటిని గొని సజ్యము గావించెను. మిక్కిలియు గొప్పది యగునాధనువు వైష్ణవమైనది. అది యగస్త్యమహామునిచే నొసంగఁబడినది. రాముఁ డామేటిధనువును బుచ్చుకొని ఖరునిపైకి నురువడించెను. పిదప రాముఁడు క్రుద్ధుఁడై, బంగారుపింజలును చక్కనిగణుపును గలిగిన బాణములనేసి, యుద్ధమున ఖరునిధ్వజమును ఖండించెను. మిక్కిలి చూడఁదగి యొప్పు నాబంగారుధ్వజము చెల్లచెదరై నేలంగూలి దేవతలశాపమున భూమికి వచ్చిన సూర్యుఁడోయనఁ జూపట్టుచుండెను.ఖరుఁ డాయాపట్టుల నెఱిఁగినవాఁడుగావున యుద్ధమునఁ గ్రుద్ధుఁడై, చిల్లకోలల నేనుఁగును బొడుచునట్లు, రాముని యవయవంబుల మ

ర్మముల నాలుగు బాణములు నాటి నొప్పించెను. రాముఁడు అట్లు ఖరునివింటినుండి వెడలిన బాణములు పెక్కు ద్రుంచుకొనఁగా నంగములెల్ల నెత్తుటం దోఁగ మిక్కిలి రోషావిష్టుఁడయ్యెను. విలుకాండ్రలో నెల్ల మేటియు మేటివిల్లుదాల్పును నగు రాముఁడు, అట్టి యుద్ధమున మఱియొకవింటిని జేకొని మిక్కిలి ప్రసిద్ధములయిన బాణములాఱింటినిగొని ఖరునిశిరమున నొకబాణమును బాహువులు రెంటను రెండు బాణములును ఱొమ్మునం దర్ధచంద్రాకారము లగుమూఁడుశరములును నాటి వానిని నొప్పించెను. పిమ్మట నమ్మహాతేజుఁ డారాక్షసునిఁ జంపఁబూని కుపితుఁడై సూర్యునివలె ధగధగలాడుచున్న పదుమూఁడు బాణములను దీసెను. ఇంద్రసమానుఁడును మహాబలసంపన్నుఁడు నగు రాముఁడు అట్లు బాణంబులఁ గొని, నవ్వుచున్నట్లే యనాయాసముగా వానిలో నొకబాణమున రథముకాఁడిని ఖండించి నాలుగింటిచే గుఱ్ఱములను గూల్చి, యాఱవబాణమున వానిసారథిశిరమును దెగవ్రేసి, మూఁడింట నొగను తుమురుసేసి, రెంట నడ్డకమ్మిని నుమ్ము గావించి, యంత వజ్రాయుధముంబోని పండ్రెండవబాణమున వానిచేత నున్నబాణముతోడివింటిని తుండించి, పదుమూఁడవబాణమున వానియంగముల జర్ఝరితము గావించెను. ఖరుఁ డప్పుడు విల్లువిఱిగి, రథము కూలి, గుఱ్ఱములు ద్రెళ్లి, సారథి గెడసినవాఁడై, గద చేతంగొని రథమునుండి లంఘించి నేలపయి నిలిచెను. అప్పు డచ్చటికివచ్చి కూడి యాకాశమున విమానాగ్రగతులై యున్న దేవతలును మహర్షులును మహారథుం డగు రాముఁడు ఖరునిఁ బఱచినయాంపాటుం జూచి మిక్కిలి సంతుష్టులై యంజలిఁ గీలించి యందఱు నొక్కటిగాఁ గూడి రామునిఁ బూజించిరి. ఇది యిరువదియెనిమిదవ సర్గము.



రాముఁడు ఖరునితో * మృదుపూర్వము లయినపరుషోక్తులాడుట.
ఖరుఁడు గద వైచుట. రాముఁడు దానిని ఖండించుట.

మహాతేజుఁ డగు రాముఁడు, ఖరుఁ డట్లు విరథుఁడై గద చేతం దాల్చి నిలిచియుండుటం జూచి, న్యాయమును బూనుటం జేసి మృదువులై మర్మములనెత్తి పొడుచుటం జేసి పరుసులుగా నుండుమాటలతో, 'నీవు గజములును తురగములును రథములును గ్రిక్కిఱిసి యున్నమహాసైన్యమునకు నధిపతివై యుండి సర్వలోకములకు మిక్కిలి యేవపుట్టించునట్టి పరమదారుణకర్మములను గావించితివే. ప్రాణులకు దుఃఖముసేయుచు ఘాతుకుఁడై, పాపములుసేయుచుండునేని, అట్టివాఁడు ముల్లోకములకు నాథుఁడయినను బ్రతుకఁడు. ఇంక నినుఁబోఁటివాఁ డెంత! రాక్షసా! దుష్టసర్పము వచ్చినయెడ జనులందఱును దయాళురయినను దానిని బట్టి వధించునట్లు, లోకవిరుద్ధ మగుకర్మము సే

* ఖరునకు, సాధనములన్నియు వికలములగుటచే యుద్ధముమాని యనుకూలుఁడై వచ్చునో రాఁడోయని వానిచిత్తమును బరీక్షించుటకై మృదుపూర్వములైన పరుషోక్తులు వాత్సల్యమున రాముఁ డాడినాఁడని తెలియునది.

యుచుండు పరమక్రూరుని సమస్తజనులు చంపుదురు. లభించిన వస్తువుల నొసఁగనోపని లోభమునఁగాని, లభింపని వస్తువులు గావలయునని యాఱటపడుకామమునఁగాని పాపములాచరించుచు పిదప దెలిసియును పరితాపపడక యెవఁడుండునో వాఁడు భ్రష్టుఁడై *వడిగల్లురాయి దిన్న నలిగండ్లపామువలె దానిఫలమును బొందును.'నేనేమి పాపము చేసితినందువా?'రాక్షసా! ధర్మచారులును మహాభాగులునై దండకారణ్యమున వసించునట్టిఋషులను వధించితివే! వారిని జంపి ఫలమేమి గట్టికొంటివి ? 'అయినను పాపులు పెక్కండ్రు జీవింపలేదా' యందువా ? [కేవలము పాపముచేయువారు జన్మాంతరమున ఫలమునందుదురు. కాని] పాపకర్ములే కాక క్రూరులునయి లోకములకు రోఁతఁ బుట్టించువారన్నో కొంతపుణ్యలేశమున ఐశ్వర్యమును బొంది బ్రతికియున్నను చిరకాల మట్లుండరు; వ్రేళ్లు దెగినవృక్షములవలె శీఘ్రముననే నాశము నొందుదురు. ఋతుకాలము వచ్చినప్పుడు వృక్షము లయ్యైఋతువులకుఁ దగినపుష్పములను దప్పక పొందునట్లు, పాపము సేయుప్రాణి యేదిగాని కాలమువచ్చినపుడు తన పాపకర్మమునకు దుఃఖరూపముగాఁ గలుగుఘోరఫలమును తప్పక పొందును. రాక్షసా! విషముతోఁగూడినయన్నమును భుజించినచో దానిఫలము శీఘ్రముగానే పొందునట్లు మిక్కిలి యుత్కటము లయినపాపములు సేసినవారలకు వానిఫలము శీఘ్రముగానే కలుగును. రాక్షసా! ఘోరపాపము లాచరించుచు లోకమునకుఁ గీడుసేయఁగోరుచుండుదుష్టుల ప్రాణములను దీయుటకై రాజయినదశరథునియాజ్ఞచే నేను వచ్చియున్నాను. ఇప్పుడు బంగారుచే రంగారుచున్న బాణములు, నేను ప్రయోగింపఁగా,వచ్చి నిన్నుఁజీల్చి పాములు పుట్టలం జొచ్చునట్లు నాపొదులందు బ్రవేశింపఁగలవుచుమీ! నీ వింతవఱకు దండకారణ్యమున ధర్మచారు లగుమునుల నెవ్వరెవ్వరిని భక్షించియున్నావో కదా! ఇప్పుడు నీవుయుద్ధమున నాచే హతుఁడవై సైన్యసహితముగా †వారల యొద్దకుఁ బోగలవు. మున్ను నీచే హింసితు లగుమహర్షులిప్పుడు విమానగతులై యాకాశముననుండి, నీవు నాబాణంబులం గూలి నరకమున దుఃఖమును బొందఁగాఁ జూడఁగలరు. కులాధమా! నీవు యథేచ్ఛముగా నన్నుఁ బ్రహరింపుము. నీచే నైనంతమట్టునకుఁ జూడుము. ఇప్పుడు తాటిపండువలె నీతలను నేలంబడఁ గూల్చెద' ననెను. రాముఁ డిట్లు చెప్పఁగా ఖరుఁడు కోపమునఁ గన్నెఱ్ఱఁబాఱఁ బకపకనవ్వుచుఁ గోపావేశమున మైమఱచి రాముంజూచి 'దశరథపుత్రా ‡నీవు యుద్ధమున సామాన్యులైనరాక్షసులఁగొం

*వడిగల్లురాయి నలిగండ్లపామునకు విషమువంటిది.

† పాపులుసైతము తాము చంపినట్టివారి యుత్తమలోకములను బొందుటగలదు. స్కాందమున 'రామవిద్ధా నిశిచరా బాణైర్మర్మసు తాడితాః। రామ మాసాద్య సమరే సాయుజ్యపదవీం గతాః' అని రాక్షసులుగూడ రామబాణహతులై సాయుజ్యమునే పొంది రని యున్నది.

‡ ఇందులకు మూలము 'ప్రాకృతాన్ రాక్షసాన్ హత్వా యుద్ధే దశరథాత్మజ। ఆత్మనాకథమాత్మానం మప్రశస్యం ప్రశంససి' ఇత్యాదులు. ఇందులకు వాస్తవార్థమెట్లనఁగాః—(ఆత్మానంప్రశంససి)

దటిని జూపి యంతమాత్రకుఁ బొగడ్తకుం దగనినిన్ను నీవే పొగడుకొనుచున్నా వేమి? పరాక్రమశాలురును బలవంతులును నగుపురుషతిలకులు తమప్రతాపమునకు గర్వించి తమ్ముఁదామే యెంతమాత్రమును బొగడుకొనరు. రామా! అల్పులై ధైర్యము రూఢిగా లేని క్షత్రియాధములు, నిష్ప్రయోజనముగాఁ దమ్ముఁదామె పొగడికొందురు. వీరుఁ డెవ్వఁడు, యుద్ధమున, మరణకాలము వచ్చియుండునపుడు, అవసరము గాని యపుడు, తనమహాకులీనత్వమును ప్రకటించుకొనుచు ఆత్మస్తుతిఁ జేసికొనును? నీవే నిన్నుఁ బొగడికొనుటచేత నీయల్పత్వము స్పష్టముగాఁ దెలియవచ్చినది. *దర్భను రాఁజుకొన్ననిప్పు శీఘ్రముగా బంగారువలెఁ బ్రకాశించుచు మండినను దోడనే యాఱి మఱియొకవస్తువును దహింపలేనట్లు, తన్నుఁదాను దెప్పరముగాఁ బొగడికొనువాఁడు తోఁడనే యందులకుఁ దగినశౌర్యము చూపఁజాలఁడు. నీయెదుట నిశ్చలముగా

నిన్ను నీవే పొగడుకొనుచున్నావు- మహాత్ముఁడగు నీకిది యుక్తముగాదని భావము. 'విక్రాన్తా బలవన్తో వా యే భవన్తి నరర్షభాః। కథయన్తి న తే కిఞ్చి త్తేజసా స్వేనగర్వితాః' (యేనరర్షభాః) నీవంటి మహాత్ములెవరో, (తే) వారు, (ఏవం) ఇట్లు అని అధ్యాహార్యము, (నకథయన్తి) చెప్పుకొనరు. (తేజసా స్వేన గర్వితాః) తమతేజస్సుచేత గర్వించినవారు కొందఱు, చెప్పుదురనుట. కనుక ఇది నీకుఁదగదని భావము. 'ప్రాకృతా స్త్వకృతాత్మానో లోకేక్షత్రియపాంసనాః। నిరర్థకం వికత్థన్తే యథారామవికత్థసే' (క్షత్రియపాంసనాః) క్షత్రియపాంసనులు, (యథానిరర్థకం వికత్థన్తే) ఎట్లు వ్యర్థముగాఁ బొగడికొందురో యట్లు, (త్వం వికత్థసే) నీవును బొగడికొనెదవు- ఇది నీకుఁ దగదనుట, 'కులం వ్యపదిశన్ వీర స్సమరే కో ఽభిధాస్యతి। మృత్యుకాలేహి సంప్రాప్తే స్వయ మప్రస్తవే స్తవమ్' (సమరే) యుద్ధమందు- శత్రుపక్షమునకు అని అధ్యాహార్యము, (మృత్యుకాలే సంప్రాప్తేసతి) మరణకాలము ప్రాప్తింపఁగా, (స్తవం కోవా అభిధాస్యతి) స్తోత్రము ఎవఁడు చెప్పుకొనును - ఎవఁడును చెప్పుకొనఁడనుట. 'సర్వథైవలఘుత్వం తే కత్థనేన విదర్శితం। సువర్ణప్రతిరూపేణ తప్తేనేవ కుశాగ్నినా' నిన్నిట్లుపొగడుకొందువేని యపుడు (తవ లఘుత్వమేవ విదర్శితంభవతి) నీలఘుత్వమే చక్కఁగా తేటపడునుగాని గౌరవము కలుగదు. కాన యది నీకుఁ దగదనిభావము. 'నను మా మిహ తిష్ఠన్తం పశ్యసి త్వం గదాధరం। ధరాధరమివాకంప్యం పర్వతం ధాతుభిశ్చితం॥' 'పర్యాప్తోఽహం గదాపాణి ర్హన్తుం ప్రాణాన్ రణే తవ। త్రయాణా మపిలోకానాం పాశహస్త ఇవాన్తకః' (గదాధరం మాంపశ్యసినను) గదనుదాల్చియున్న నన్నుఁజూచుచున్నావుగదా. ఇట్టి గదనుదాల్చిన నేను, (పాశహస్తః అంతకఇవ) పాశహస్తుఁ డగుయమునివలె, (త్రయాణామపిలోకానాం ప్రాణాన్ హన్తుం పర్యాప్తః యద్యపితథాపి) ముల్లోకముల ప్రాణములను హరింపఁ జాలినవాఁడనయ్యును, (రణే) యుద్ధమందు, (తవ) నీకు, (నపర్యాప్తః) అనిశేషము- చాలినవాఁడనుగాననియర్థము. 'చతుర్దశ సహస్రాణి రాక్షసానాం హతానితే । త్వద్వినాశాత్కరోమ్యేష తేషామశ్రుప్రమార్జనమ్' పదునాలుగువేల రాక్షసులు నీచే హతులైరి. అట్లే, (త్వద్వినాశాత్ =త్వత్తః నాశాత్) నీవలన నేనువశించుటవలన, (తేషాం అశ్రుప్రమార్జనమ్ కరోమి) వారలభార్యాదుల కన్నీళ్లను దుడిచెదను. వారలనెల్ల నీచేఁ జంపించినట్టినేను జావఁగా వారలభార్యలకు దుఃఖము నివర్తించు ననిభావము. మహేశ్వరతీర్థులు.

* ఇందులకు 'సర్వథైవ లఘుత్వం తే కత్థనేన విదర్శితం । సువర్ణప్రతిరూపేణ తప్తేనేవ కుశాగ్నినా' అనిమూలము. (కత్థనేన) ఆత్మస్తుతిచేత, (తేలఘుత్వం) నీ తేలిక, (సర్వథైవ) సర్వవిధముల, (విదర్శితం) చ

నిలిచి, శత్రులనెత్తుటం దోఁగినగదను దాల్చి, యున్ననన్ను, ధాతువులు నెఱసియున్న పర్వతమువలె కంపింపరానివాఁడుగాఁ గనుఁగొనవు. కావుననే యిట్లు పొగడికొనెదవు. నేను గదను దాల్చి పాశహస్తుఁడైనయంతకునివలె యుద్ధంబున నీప్రాణములును ము ల్లోకముల ప్రాణములను నపహరింప నొక్కఁడనే చాలుదును. ఇట్లాత్మస్తుతిఁ జేసికొను విషయమై యింకను బరుసుగాఁ జాలఁ జెప్పవలసియున్నది. అయినను నిప్పుడు చెప్పను. *అట్లుచెప్పినచో సూర్యుఁడస్తమించును. అంత యుద్ధమునకు విఘ్నముగలుగును. నీవు పదునాలుగువేల రాక్షసులను వధించితివి. నే నిప్పుడు నిన్నుఁ బనితీర్చి వారిబంధువుల కన్నీళ్లను తుడిచివైచెదను' అనెను. ఖరుఁ డిట్లుచెప్పి, మేలయినబాహుపురులు సిరులు గులుక మిక్కిలియుఁ గోపముమీఱ, వజ్రమువలె ధగధగ మెఱయుచున్న యాగదను రామునిపైవైచెను. అట్లు ఖరుఁ డమ్మహాగదను బ్రయోగింపఁగా నది మిక్కిలి వెలుఁ గుచు దారినడుమ నున్నవృక్షములను గుల్మములను భస్మము గావించుచు, రామునిఁ దారసించిపోయెను. రాముఁ డట్లు మృత్యుపాశమువలె నమ్మహాగద జ్వలించుచు వచ్చు టం జూచి దాని నాకాశముననే బాణములచేఁ బెక్కువ్రయ్యలుగా ఖండించెను. అ ట్లాగద బాణములచేఁ గొట్టువడి తుత్తునుకలై, మంత్రౌషధబలమున వడఁద్రోయఁ బడినసర్పమువలె, నేలంబడెను. ఇది యిరువదితొమ్మిదవసర్గము.

---

క్కఁగాఁజూపఁబడినది. ఎట్లనఁగా (తప్తేవ) కాల్పఁబడినదియు, కావుననే(సువర్ణప్రతిరూపేణ) బంగారు తోసాటియైనదనియు నగు, (కుశాగ్నినా) దర్భను ఆశ్రయించిన యగ్నిచేత, (లఘుత్వం విదర్శ్యతే య థాతథా) తేలికచూపఁబడినట్లు, నీతేలికయుఁ జూపఁబడినదని భావము. అనఁగా తృణాగ్ని బంగారువలె అతివేగముగా మండి ప్రకాశించుచున్నను తోడనే యాఱి మఱియొకవస్తువును దహింపలేనట్లు, ఆత్మస్తు తిచేత నీవు వీరునివలె వెలుఁగుచున్నను తోడనే నీస్తుతికిఁ దగిన ట్లొకరిపై ప్రతాపము నెఱపలేవు అని భావము. గోవిందరాజులు:— 'సువర్ణప్రతిరూపేణ తప్యతే నాశ్మనాగ్నినా' అని పాఠాంతరము ; అప్పుడు, (సువర్ణప్రతిరూపేణ) బంగారుతోసాటియైన, (అగ్నినా) అగ్నివర్ణమైన, (అశ్మనా) పాషాణ ముచేత, (నతప్యతే) వస్తు అనిశేషము - వస్తువు కాల్పఁబడదు. బంగారువలె మెఱయుచున్న రాయిని జూచి యిది నిప్పు అని పొగడి పేర్కొనుచున్నారు గాని దానిచే వస్తువులు దహింపఁబడవు; ముఖ్యాగ్ని చేతనే దహింపఁబడును' అని యర్థము. అనఁగా అగ్నియనుబుద్ధితో అగ్నివర్ణము గలరాయిని తాఁకినపు రుషునికి ఉష్ణస్పర్శము లభింపమిచే అది తన లఘుత్వమును - అనఁగా అగ్ని కాకుండుటను - తేటపఱుచు నట్లే, నిన్ను వీరునిగాఁ దలఁచుచున్ననాకు నీయాత్మస్తుతిచేత నీ అవీరత్వమనెడి లఘుత్వమును విదర్శితమై నది యనిభావము. 'సువర్ణప్రతిరూపేణ తప్తేనేవ కుశాగ్నినా' అనుపాఠమున, (కుశాగ్నినా) బంగారును శోధించుఅగ్నిచేత, (తప్తేవ) కాల్పఁబడిన, (సువర్ణప్రతిరూపేణ) బంగారువలెనుండు పిత్తళిచేత, (లఘు త్వం) నల్లఁదనము అనెడితేలిక యెట్లువిదర్శితమో యట్లే, (తే) నీచేత, (కత్థనేన) ఆత్మస్తుతిచేత- నీవు చేయు నాత్మస్తుతిచేతననుట, (లఘుత్వం) అశూరత్వము, విదర్శితమైనదని భావము: మహేశ్వరతీర్థులు.

* ఇట రాక్షసుఁడగు ఖరునికి రాత్రివలన బలము పెరుఁగునదైనను రాత్రి అశక్తుఁ డగుమను ష్యునివధించుటవలనఁ దనకుఁ గీర్తి యేదియుఁ గలుగదని వానియభిప్రాయము.

గదాధ్వంసమునుజూచి క్రోధమైనఖరుఁడనుకూలుఁడై వచ్చునోయని రాముఁడు న్యాయవచనములాడుట. ఖరుఁడుసాలవృక్షముగొని రామునిపైఁగవిసి మర్మముల బాణములు గాఁడ నతని సమీపమునఁ బడఁగా రాముఁడు తెలిపికై వెనుకరెండడుగులిడి యగస్త్యదత్తబాణమున ఖరునిహృదయముభేదించుట. మహర్షిస్తోత్రాదులు పర్వతగుహనుండి సీతవచ్చి భర్తపరాక్రమముఁ జూచి యానందపరవశయై యతనినిగౌఁగిలించుకొనుట.

రాముఁడాగదను బాణములచేఁ దునియలుగావించి ధర్మవత్సలుఁడు గాననిరాయుధునిపయి నేయక పరిహాసము సేయువాఁడై, తొట్రుపడుచున్నఖరుంజూచి "రాక్షసాధమా! ఇదె నీబలమంతయుఁ జూపితివి. ఇంక నేమిసేయఁగలవు? నీవు బలమున నాకన్న హీనుఁడవయ్యు వ్యర్థముగాఁ బ్రేలెదవు. ఇంతదూరము ప్రేలితివే!వట్టిమాటలాడుటయందుమాత్రము మంచిదిట్టఁడవే. ఇంతవఱకీ గద నీపగవారిని దుండించుచుండినది; కాన యిప్పుడును నీకు జయముఁ గల్గించునని నమ్మియుంటివి.అట్టి యీగద యిదిగో! బాణములఁ దుత్తుమురై నేలంబడినదే!చూడుము. నాతో 'నిన్ను వధించి యిప్పుడు నీచేత హతులైనరాక్షసుల బంధువుల కన్నీళ్లు తుడిచెద' నంటివే. ఆమాటయు నబద్ధమైనది. నీవు కేవలము వదరుచుండునల్పుఁడవు, హీనస్వభావుఁడవు, మంచియాచారసంపత్తిలేని రాక్షసుఁడవు,నీప్రాణములను గరుడుఁ డమృతమును హరించినట్లు నేను హరించెదను. ఇప్పుడు నాబాణముల ద్రొమ్ము చీలి కంఠము దెగిపడు నీదుక్రొన్నెత్తురు,నురుఁగుబుగ్గలతోడఁ, దొరుఁగఁగా భూమి త్రాగఁగలదు. నీవు,అంగములెల్ల దుమ్ము బ్రుంగ చేతులు రెండును జాపుగా నేలంబడ్డవై చినవాఁడవై, దొరకరానిపడతినింబోలెఁ బుడమిని గవుంగిలించుకొని, పెద్దనిదుర పోఁగలవు. రాక్షసకులపాంసనుండ వగునీవు పెద్దనిదురం బొంది శయనించినపిదప,అగతికులు గానున్న ఋష్యాదులకు నీదండకారణ్యము సుఖవాస మగును. రాక్షసా! జనస్థానమందుఁ గలరాక్షసుల పట్లన్నియు నాబాణములచే హతముకాఁగా మును లీవనమందు అంతటను నిర్భయముగా సంచరింపఁగలరు. ఇంతవఱకు నితరులకు భయముఁ గలిగించుచుండినరాక్షసస్త్రీలు,ఇప్పు డిదిగో తమబంధువు లందఱును హతులు కాఁగా, కన్నీళ్ల మొగములు దడియ, దీనలయి, భయపెట్టుట మాని, తామే భయమునొంది నలుగడలఁ బాఱిపోవఁగలరు. నీకు సరియైన దుర్వృత్తులు గలిగి; యిట్టిపాపి వగునిన్నుఁ బెండ్లాడినట్టిరాక్షసస్త్రీలు,ఇంతవఱకు దుఃఖమెఱుఁగనివారయ్యు నిపుడు దుఃఖరసం బెట్టిదో చక్కఁగానెఱిఁగి కామపురుషార్థము దూలినవారగుదురు. ఓరీఘాతుకా! నీచపునడతలవాఁడా! క్షుద్రబుద్ధీ! బ్రాహ్మణకంటకుఁడా! మును లగ్నిహోత్రములో హవిస్సువేల్చునపుడు, నిన్నుఁబట్టి యే విఘ్నముగలుగునోయని శంకించుచునే హవిస్సును అందు వైతురు. ఇట్టిపాపిని నిన్నుఁ

జెట్టఁబట్టినందులకు నీపడఁతులు దుఃఖ మెట్టిదో తెలియఁగల'రనెను.*ఇట్లు రణమునసం రంభించి రాముఁడు పలుకుచుండఁగా ఖరుఁడు రోషముగదుర మిక్కిలియు దెప్పరంపు ధ్వనితో నారామునింజూచి 'నీవు మిక్కిలియు గర్వితుఁడవు. ఇది నిజము, కావుననే భయకారణములు గలుగుచుండినను గూడ భయముమాలి మృత్యువశుఁడ వగుటం జేసి 'ఇది చెప్పవచ్చును ఇది చెప్పరాదు'అని కూడఁ దెలియవు. కాన నోటికివచ్చినట్లు ప్రేలుచున్నావు. ఎవ్వరు మృత్యుపాశమున బద్ధులగుదురో యాపురుషులు ఇంద్రియ ము లాటింటివ్యాపారములును దప్పి యిది చేయఁ దగును దగదని యెఱుంగఁజాలరు' అనెను. ఖరుఁ డిట్లు రామునితోఁ జెప్పి యంత బొమలుముడిపెట్టి యుద్ధమునకై యా యుధమునకుఁగాను నలుప్రక్కలను జూచుచుం దాపున నొక్కమహావృక్షముగని, యది పెకల్పరానట్లు గట్టిగానుండుటచే, బిగ్గ పెదవిం గొఱుకుచు దానిని బెల్లగించెను. అతిస్థూల మగుటవలన దానిని, అమ్మహాబలుఁడు రెండుచేతులను బట్టియెత్తి సింహనా దముసేసి రామునిపై నేసి'నీవు చచ్చితివి' అనియుఁ జెప్పెను. ప్రతాపశాలి యగురా ముఁ డట్లుతనపైకి వచ్చుచున్న యమ్మహావృక్షమును బాణములఁ దుండించి,ఖరుఁడు సా మగ్రులన్నియు నశించినను అనుకూలుఁడై కొంచెమైనను రాకుంటంజూచి యుద్ధ మున వానిని జంపుటకై తీవ్రం బగురోషముఁ గయికొనెను. అంత నట్లు రాముఁ డు రోషావేశమున దేహమంతటను జెమ్మట గ్రమ్మ కన్నుల నెఱ్ఱఁదనము గదుర ఖరు ని వేయిబాణముల భేదించెను. ఖరునిమేన బాణములు నాటినగండినుండి నురుఁ గుతోఁ గ్రొత్తనెత్తురులు, ప్రస్రవణపర్వతమునుండి జలధారాప్రవాహములు స్రవిం చునట్లు, మిక్కిలియుఁ గాఱెనవి. ఆ ఖరుఁడు యుద్ధమున రాముఁ డేసినబాణముల నవయవములు విరవిరపోవఁగా, మత్తుఁడై, నెత్తురు వాసనదేఱఁగా, శీఘ్రమున రామునిమీఁదికే యురవడించెను. అట్లు ఖరుఁడు సంభ్రమించి ఆయుధములను జూఁచుటకుఁగాని బాణములను వేయుటకుఁ గాని యవకాశము లేకుండునట్లుగా పైపడి మిక్కిలి సమీపించి వచ్చుచుండఁగా రాముఁడు బాణముదొడిగియు దానినేయుటకై తెఱపి గల్గుటకును, వానిమేనినెత్తురు తనదేహమును సోఁకునని యేవమువలనను,

---

* ఇందులకుమూలము 'తమేవ మభిసంరబ్ధం బ్రువాణంరాఘవంరణే।ఖరో నిర్భర్త్సయామాసరోషాత్ఖరతరస్వనః॥ దృఢం ఖల్వవలిప్తోసి భయేష్వపిచనిర్భయః। వాచ్యావాచ్యం తతోహి త్వం మృత్యువశ్యో న బుధ్యసే॥ కాలపాశపరిక్షిప్తా భవన్తి పురుషాహి యే। కార్యాకార్యం నజానన్తి తే నిరస్తషడిన్ద్రియాః'వీనికివాస్తవార్థము-(ఏవం బ్రువాణం రామం)ఇట్లు చెప్పుచున్న రామునిఁగూర్చి,(మృత్యువశ్యః ఖరః) మృత్యువునకుఁ జిక్కినఖరుఁడు, ఓ,రామా,(త్వం వాచ్యావాచ్యం న బుధ్యసే ఇతి)నీవువాచ్యావాచ్యము లెఱుఁగవు అనియు,(నిర్భర్త్సయామాస)భర్జించెను. ఇట్లు భర్జించుటకు హేతువేమనఁగా (కాలపాశ పరిక్షిప్తా...షడిన్ద్రియాః) లోకమున కాలపాశమునఁ జిక్కినపురుషులు మహాత్ములైనను భర్జింతురే యని భావము-మహేశ్వరతీర్థులు.

త్వరితముగా నడుగులిడుచుఁ గొంత వెనుకకుఁ* దొలఁగెను. అంత రాముఁడు ఖరుని వధింపఁబూని యగ్నివలె వెలుఁగుచు రెండవ బ్రహ్మదండమువలె విలసిల్లుచున్న బాణమును చేకొనెను. ఆబాణము, మున్ను, దేవేంద్రుఁడు బుద్ధిమంతుఁడుగావున భావిసంగతి నెఱిఁగి యగస్త్యమహామునిమూలముగా రామున కొసఁగియుండెను. రాముం డాబాణమును వింటఁ దొడిగి ఖరునిపయిఁ బ్రయోగించెను. అట్లు రాముఁడు ఆకర్ణాంతముగా వింటినిలాగి విడువఁగా నామహాబాణము పిడుగుపాటువలె మిక్కిలి ధ్వని సెలఁగ ఖరునివక్షస్స్థలమున నాటుకొనెను. అంత నాఖరుఁడు రామునిబాణాగ్నిచే దగ్ధుఁడగుచు, రుద్రునినేత్రాగ్నిచే శ్వేతారణ్యక్షేత్రమందు దగ్ధుఁడైనయంధకాసురునివలె, నేలం గూలెను. దేవేంద్రునిచేత వజ్రాయుధమునచే నిహతుఁడైన వృత్రాసురునివలెను, నురుఁగున గీటడఁగిననముచిపగిదిని, వజ్రమునఁ గూలిన బలాసురునికరణిని, ఆ ఖరుఁడు రామబాణహతుఁడై నేలంగూలెను. అంత రాజర్షులును బ్రహ్మర్షులును వచ్చికూడి పరమసంతుష్టులై రామునిఁ బూజించి యతనితో 'మహాతేజుఁడును పాకాదిరాక్షసజయశాలియు నగుదేవేంద్రుఁడు, ఈఖరాదివధముకొఱకే పవిత్ర మగుశరభంగాశ్రమమునకు వచ్చెను. క్రూరులును పాపకర్ములు నైనయీరాక్షసులను జంపించుకొఱకై మహర్షు లుపాయము పన్ని యయ్యెయాశ్రమములు చూచునెపమున, నిన్నీస్థలమును జేరునట్లు గావించిరి. దశరథకుమారా! నీవు మాకుఁ జేయవలసిన దీకార్యము; దీనిం జేసి తీర్చితివి. ఇఁకమీఁద మహర్షులు దండకారణ్యమున సుఖముగా ధర్మము నాచరించుచు నుండఁగల'రనిరి. ఈనడుమ దేవతలును చారణులును గూడి వచ్చి పరమసంతుష్టులై మిక్కిలి విస్మయమున, భేరులు వాయించుచు రామునిపైఁ బువ్వులవాన లపుడు గురియించిరి. అంత నాదేవతలు 'రామునిచే మహాయుద్ధమున ఒకటియు నఱగడియలో ఘోరపరాక్రము లగుఖరదూషణాదులు పదునాలుగువేల రాక్షసులు హతులైరి. ఏమాశ్చర్యము! విదితాత్ముఁ డగురాముఁ డెంతగొప్పకార్యము గావించినాఁడు! ఔరా! ఈతనిపరాక్రమేమి! ఇతనిసామర్థ్యమేమి! అంతయు విష్ణుదేవునిపరాక్రమసామర్థ్యములుంబోలె అచింత్యము లై చూపట్టుచున్నవి' యనిరి. ఇట్లా దేవతలుచెప్పి యందఱును దమతమవచ్చినదారిం బోయిరి. అయ్యవసరమున వీరుఁ డగు లక్ష్మణుఁడు రామపరాక్రమముం జూచి సంతుష్టుఁడై సీతతోఁ గూడ పర్వతగుహానుండి వెడలి యాశ్రమముఁ బ్రవేశించెను. అంత వీరుఁడగు రాముండు జయంబుగొని మహర్షులు పూజించుచుండఁగా, లక్ష్మణుఁడు నెదుర్కొని పూజలుసలుప, నిజాశ్రమమును జొచ్చెను. ‡సీత, యట్లు సమస్తశత్రువులను సం

---

* అతిసంకటములైన దేశకాలములందు వీరధురంధరులైనవారికిఁ గూడ నిట్లు కొంత యెడదొలఁగుట సమ్మతమేయగును. కావుననే వేదాంతాచార్యులు ఈయభిప్రాయముగొని 'క్వచిదతిసంకటవిషయే సుభటానా మభిమతోఽయ మపసర్పః' అని చెప్పియున్నారు.

‡ ఇందులకు మూలము 'తం దృష్ట్వా శత్రుహంతారం మహర్షీణాం సుఖావహమ్। బభూవ హృష్టా



654 ఖరదూషణత్రిశిరుల వధము.

**హరించినవాఁడై మహర్షులకు సుఖంబు గూర్చినయారామునిఁ జూచి మిక్కిలిసంతుష్ట యై పెనిమిటిని బిగియఁ గౌఁగిలించుకొన్నదయ్యె- జనకరాజసుత యాసీత రాక్షసగ ణములు హతము లగుటకుఁ బరమసంతుష్టిం బొంది రాముఁడును సమరంబున నే**

వైదేహీ భర్తారం పరిషస్వజే' దీనికి విశేషార్థము:— పదునాలుగువేల రాక్షసులతో రాముఁ డొంటి గా నేమి మార్కొనఁగలఁడని కొందలపడుచున్న సీత రాముఁడు గెలుపునొందిరాఁగా మహోత్సవముగాఁబుట్టి నదిగావున వీరులతారతమ్యమును ఎఱుఁగఁజాలినదగుటచే భర్తను వీరత్వమునకు మెచ్చి సగౌరవముగాఁ గౌఁగిలించినదని చెప్పుచున్నాఁడు:— (తం దృష్ట్వా) ఆరామునిం జూచి- అంతకుమునుపు మహాయుద్ధ మున కంటికిఁదెలియరాకుండి యప్పుడు సమీపమున రాఁగా కన్నులకగపడుచున్న రామునింజూచి,(తందృ ష్ట్వా) 'వీరవ్రణేన విగళద్రుధిరేణ రోమకూపోల్లసద్భిరపి ఘర్మపయః కణౌఘైః । కోదణ్డదణ్డ మవల మ్బ్య వినీయ వర్మ కిఞ్చిత్పరిశ్రమభృతం ప్రియమీక్షమాణా' 'నెత్తురుగాఱుచున్న వీరవ్రణములతోను రో మకూపంబుల తలతలలాడుచున్న చెమట బిందువులతోనుం గూడి వింటికొయ్యనాని కవచము పుచ్చి కొం చెము బడలియున్న ప్రియుని రామునింజూచి' యనుట, (తందృష్ట్వా) పైకెత్తి కూర్చి తీఁగలతో ముడి చినట్టిజడలగుంపు గలిగి, నడుము గట్టిగాఁ గట్టుకొని మూఁపున నమ్ములపొదులు వ్రేల యుద్ధముముగియు టచే కోపాగ్నిచల్లారఁగా ప్రసన్నముగా నుండుమొగముతోఁగూడి, సీతాలక్ష్మణులు వచ్చుమార్గమును జూచుచు,రాక్షసులుమరల నెవరైన వత్తురా యేమియని యెచ్చరికగలిగియున్నట్టి రామునిఁజూచి,(తం దృ ష్ట్వా)మునుపు వీరుఁ డని వినఁబడిమాత్రమే యుండి యిపుడు ప్రత్యక్షముగా వీరకృత్యము నెఱవేర్చిచూ పినట్టి రామునినిజూచి,చూచువిధమును జెప్పుచున్నాఁడు:—(శత్రుహన్తారం) శత్రువులను జంపువానిని -రాముని హననవ్యాపారమే కనఁబడినదిగాని బాణములు నొడుగుట యేయుట మొదలైన వ్యాపారము లెంతమాత్రమును దెలియవయ్యెననుట; 'శత్రు' అనుపదముచేత దేవగంధర్వాది సంఘములు వచ్చియుండి నను శత్రువులనుమాత్రమే చంపినాఁడని దుష్టనిగ్రహము చెప్పఁబడినది. శిష్టపరిపాలనము చెప్పుచున్నాఁ డు:—(మహర్షీణాం సుఖావహమ్)(మహర్షీణాం)తమతపమునందలి లేశమాత్రము చేత రాక్షసులను జంపు సామర్థ్యముగలిగియుండియును,తామే యట్లురక్షించుకొన్నయెడల నప్పుడు తమ్ము రక్షింపవలసిన భగవం తునిరక్షకస్వరూపమునకును తాము రక్ష్యభూతులై యుండుస్వరూపమునకును హానికలుగు ననితలఁచి కేవల ము తమరక్షకునిరక్షణవ్యాపారమునే యెదురుచూచుచు రామునిప్రతిజ్ఞనే కాంచుచున్నమహర్షులకు, (సుఖావహం)'ఏహిపశ్యశరీరాణి''ఇటరా;ప్రోవుగాపడియున్న మునులశరీరములను జూడుము'అని ఋషులు మొఱపెట్టుకొన్న దుఃఖమును లేశముకూడ లేకుండునట్లు తొలఁగించి సుఖమునే కూర్చువాఁడైనరాము నిఁ జూచి, (వైదేహీ)సీత, (బభూవ) భూధాతువు సత్తావాచకముగావున- సత్తగలది అయ్యెనని యర్థ ము. పెక్కుశత్రువు లాక్రమించుటవలనను రాముఁడొంటిగా నుండుటవలనను ఇంతకుమునుపు సత్త - ఉ నికి అనఁగాదిట- లేకయుండిన సీత యిప్పుడు సత్తనుబొందెను.జగత్తునకెల్ల ప్రాణభూతుఁడు రాముఁడు గావున ప్రాణమునకు సత్తకలుగఁగా ప్రాణికిని సత్తగలుగునట్లు రామునకు సత్తకలుగఁగా అతనిని ప్రా ణముగాఁ గల సీతకును సత్తగలిగెననుట, మఱియు 'ఆత్మావై పురుషస్యదారాః' 'పురుషునకు భార్య ఆ త్మ యగును'అన్నట్లు రామునికి సత్తలభించుటవలన తదాత్మభూతయగు తనకును సత్తగలిగినదనిభావము. లేక 'భూప్రాప్తౌ' అని భూధాతువునకు ప్రాప్త్యర్థముకలదు గావున భర్త గెలుపుగొనుటఁ జూచి తొడిఁబడుచు గుహాంతరమునుండి ప్రాప్తించినది అనఁగా వచ్చినదని యర్థము. (హృష్టా) హర్షమునొంది

మియు గాసి నొందకుండుటయుం జూచి మఱియుఁ దుష్టినొందినదయ్యె. అంత నప్పుడు రాక్షసులపిండులనెల్లం జెండాడి యుందులకై మహర్షులు ముదితులై పూజించుచుండఁ

నది. 'సతి ధర్మిణిధర్మాః' 'ధర్మియుండఁగా ధర్మములు కలుగును' అను న్యాయముచొప్పున రామవిజయ రూపమైన ధర్మి లభింపఁగా దానిధర్మమైన హర్షమును గలిగెనని యర్థము. లేక (హృష్టా) గగ్గురుపాటు నొందినది. లోపలిప్రీతియొక్క మొలకలవలె నున్ననిడు వెండ్రుకలతోఁ గూడినది. ఇట్లురామునిశౌర్యమును జూచి ప్రీతినొందుటకు హేతువును జెప్పుచున్నాఁడు. (వైదేహీ) 'మిథిలాధిపతిర్వీరః' 'జనకుఁడు వీరుఁడు'అన్నవీరునికులమునఁ బుట్టినదిగాన రామునివీరత్వము కొలఁది యెఱిఁగి ప్రీతినొందినదనుట,(భర్తారం పరిషస్వజే)కొలఁదిలేనట్టిప్రేమాతిశయమును గలిగియుండుటచే తానై కౌఁగిలించెననుట, (భర్తారం)లోకభర్తయైనవానిని-తాను సర్వలోకమునకు మాతగాన తనబిడ్డలైనసర్వలోకులను రక్షించుటనుజూచి. (పరిషస్వజే)ఆయుధములు గ్రుచ్చుకొనినయైనట్టిగాయములను నలివెచ్చగానున్న పాలిండ్లతో నొత్తెననుట, (పరి+సస్వజే)(పరి)పర్యాప్తముగా-పరిపూర్ణముగా వెనుకను ముందును ప్రక్కలను స్పృశించెననుట,యుద్ధమున వెన్నుఁజూపి పాఱిపోవనివానికి వీఁపున బాణముపడుటయే కలుగదుగాని శత్రువులు నలుప్రక్కల క్రమ్మి ఆయుధములను వైవఁగా వీఁపునఁ గూడ వ్రణము సంభవించినది. మఱి బాణములు చక్కఁగాఁ ప్రయుక్తములై యొస్త్రమునుచ్చికొని వీఁపున వెడలుటయుఁగలఁదుగావున వీఁపున వ్రణము సంభవించును. కావుననే సీత నులివెచ్చనిచన్నులతో వీఁపునందలిగాయములనుగూడ నొత్తెననుట, (మహర్షీణాం సుఖావహం పరిషస్వజే)మహర్షులకు సుఖావహుఁడైనవానిని గౌఁగిలించినది-అనఁగా పుత్రులయెడ భర్త యుపకరింపఁగా పుత్రులయందలి వాత్సల్యమువలన వారి కుపకరించినభర్తయెడల సంతోషించు భార్యవలెనే ఋషిజనుల రక్షించినందులకు రామునిని గౌఁగిలించుకొనెను. ఇచట 'రామునివిడిచి గుహకుఁబోయిన సీత,యందుండి వెడలివచ్చి సమస్తశత్రువులను నిరసించినరామునిఁ గౌఁగిలించినది' అనుటచే హృదయగుహానున్నజీవుఁడు పరతంత్రుఁడై ఆచార్యముఖముగా పరమశేషినిఁజూచి యతనిచే సకలవిరోధివర్గము నివర్తింపఁబడఁగా ఆగుహనుండి వెడలి నిత్యసూరిసభనడుమఁ గూర్చున్నశేషిని బొంది తద్భోగపరీవాహము ను అనుభవించెనని ధ్వనిచూపట్టుచున్నది.గోవిందరాజులు.

లేక:—(తం) 'తేతు యావన్త ఏవాజౌతావాంస్తు దదృశేసతైః' 'వారెందఱో తాను అందఱైరాముఁడు గనుపట్టెను' అన్నట్లు తత్కాలమందు తనయిచ్చచేఁ బరిగ్రహించిన పదునాలుగువేల దివ్యమంగళవిగ్రహములు గలవాఁడగుటచే ఒక్కొక్కరాక్షసునికి ఒక్కొక్కరాముఁడుగా నగపడుచున్నవాఁడని తచ్ఛబ్దార్థము, లేక (తం) ఇంద్రాదులెల్ల నొక్కటిగాఁగూడియు ఎదిరింపరాని బలవంతులగు పదునాలుగువేల రాక్షసులను ఒకటిన్నఱగడియలో తాను గొట్టువడకయే యవలీలగా సంహరించి తన ముందట నిలుచున్నవానిని, లేక (తం) 'రామజామాతరం ప్రాప్య స్త్రియం పురుషవిగ్రహమ్' 'పురుషవిగ్రహముతోనున్న.కేవల స్త్రీయైననిన్ను అల్లునిగాఁ బొంది' అని అజ్ఞానమునఁ దాను బూర్వము పరిహసించినవానిని, (తం)'తైర్థనూంషి ధ్వజాగ్రాణి వర్మాణిచ శిరాంసిచ। బాహూన్ సహస్తాభరణా నూరూన్ కరికరోపమాన్ । చిచ్ఛేద సమరేరామః' 'వారివిండ్లను టెక్కెములమొనలను కవచములను శిరములను బిరుదాభరణములతోఁగూడినభుజములను, ఏనుఁగుతుండములవంటి తొడలను, రాముఁడు యుద్ధమున ఛేదించెను' అన్నట్లు(శత్రుహన్తారం)శత్రులను హతులనుజేసినవాఁడైనరామునిఁజూచి, మఱియు 'పరిత్రాణాయసాధూనాం వినాశాయచ దుష్కృతాం। ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే' అన్న తనప్రతిజ్ఞను పరిపాలింప నవతరించి అసజ్జనులగు రాక్షసులను జంపి సజ్జను లగుఋష్యాదులకు

గా రాజిలుచున్న రామునిఁజూచి, చంద్రబింబమువంటి నెమ్మొగము గలయాచెలువ మఱిమఱి బిగ్గఁ గవుంగలించుకొని పరమసంతుష్టురాలయ్యెను. ఇదిముప్పదవసర్గము.

{అకంపనుఁడు జనస్థానమున ఖరాదిసమస్తరాక్షసవధమును రావణునకుఁ బోయి తెలుపుట. రావణుఁడు మారీచునికడకు వచ్చి సాహాయ్యము వేఁడుట. మారీచుఁడు రాముని ప్రభావమును బోధింపఁగా రావణుఁడు లంకకుమరలుట.}

*అంత రావణునిచారుఁడయిన యకంపనుఁడు జనస్థానమునుండి త్వరితముగా లంకకుఁ బోయి రావణునిఁజూచి '†రాజా! జనస్థానమం దున్న రాక్షసులు పెక్కండ్రు

జగన్మోహనదివ్యమంగళ నిజమూర్తి సాక్షాత్కారముచేత పరమానందమునుగూర్చినవాఁడనుట, (మహర్షీణాంసుఖావహం) మహర్షులకు సుఖావహుఁడైనవాఁడు నగురాముని, (దృష్ట్వా) చూచి, (వైదేహీ) సీత, (బభూవ) 'భూసత్తాయాం' అనుటచే స్వనిర్వాహరూపమైన సత్తను - అనఁగా తాను నిలుపోపుటయను సత్తను - బొందినదయ్యెననుట. శ్రీరాముఁడు శత్రుమధ్యమున నుండగుటచే అసత్ప్రాయుఁడగుటవలన తానును అసత్ప్రాయగా మున్ను దలఁచినది; ఇప్పుడు తనప్రాణేశ్వరుఁడగు రామునికి సత్తగలుగుటచే తనకును సత్తగలిగినదని తలంచినది. 'ఆత్మావై పుత్రనామాసి' అనుశ్రుతి యనుసరించి కొన్న (హృష్టా) ప్రీతయై, (పరిషస్వజే) ఆయుధపుగండ్లకు చన్నుల వెచ్చఁదనముచే పరిహారము చేయుటకై బిగ్గఁగౌఁగిలించుకొన్నదనిభావము. ఈసర్గమునకు ఫలము 'శ్రుత్వా శ్రీరామవిజయం పాపబంధాత్ప్రముచ్యతే। తథైవ శృంఖలాబంధాదృణబంధాద్విముచ్యతే॥ శ్రుత్వా పుష్పవతీ నారీ తనయం వంశవర్ధనం। లభతే రాఘవేన్ద్రస్య ప్రసాదాత్ కీర్తివర్ధనమ్' అనిస్కాందమునఁ జెప్పఁబడినది. మహేశ్వరతీర్థులు.

* ఇట్లు శరణాగతిమంత్రవివరణరూపమైన రామాయణమునందు ఇంతవఱకుఁ గలగ్రంథముచేత ఉత్తరఖండమున కర్థము వివరింపఁబడినది. ఫలము ననుసరించియే ఉపాయముండును గనుక అనుష్ఠానదశయందు ప్రథమఖండార్థము ముఖ్యము. వ్యుత్పత్తిదశయందు ఉత్తరఖండార్థము ముఖ్యము. కాఁబట్టి వ్యుత్పత్తికొఱకు ఉత్తరఖండార్థము మొదట నింతవఱకు వివరింపఁబడినది. అందు బాలకాండమున ప్రథమపదమునకు అర్థమగు పురుషకారయోగము దర్శితము. అయోధ్యాకాండమున ద్వితీయపదమునకర్థమగు సౌలభ్యాదిగుణయోగమును, ఆరణ్యకాండమున శూర్పణఖరాకమునుపు జరిగినవృత్తాంతము చేత చతుర్థికి అర్థమగు కైంకర్యవృత్తియు, అదిమొదలుగా ఖరవధమువఱకుఁగల వృత్తాంతముచేత చరమపదమునకు అర్థమగు విరోధినివృత్తియుఁ జెప్పఁబడినవి. ఇఁకమీఁది గ్రంథమున పూర్వఖండము నర్థము చెప్పఁబడుచున్నది. అందు ఆరణ్యకాండము తక్కినభాగముచేత విభీషణునికి పురుషకారసాన్నిధ్యమును కిష్కింధాకాండమున నారాయణపదమున కర్థమగువాత్సల్యమును సుందరకాండమున 'రామః కమలపత్రాక్షః' ఇత్యాదులచే చరణశబ్దమునఁ జెప్పఁబడు దివ్యమంగళవిగ్రహవైశిష్ట్యమును యుద్ధకాండమున శరణాగతియు ఉత్తరకాండమున ప్రపన్నచర్యయు తెలియఁదగును. ఇట్లు నడుమ ప్రసక్తించిన మునిజనశరణాగతిని, దేవతలశరణాగతినిఁబట్టి చేయఁదగురావణవధమున కంగముగాఁ జెప్పి అంగియగురావణవధమునకు నిమిత్తమైనసీతాపహార మనుబీజమును ఉపక్షేపించుచున్నాఁడు.

† ఇందులకు 'జనస్థానస్థితా రాజన్ రాక్షసా బహవో హతాః। ఖరశ్చనిహతః సంఖ్యే కథంచిదహ

యుద్ధమున హతులయిరి. ఖరుఁడును దూషణత్రిశిరులును హతులయిరి. నేను మాత్ర మెట్లో తప్పించుకొనివచ్చితిని' అనెను. రావణుఁడు సహజముగానే కుపితుఁడై కన్నెఱ్ఱఁబాఱి యుండువాఁడు; మఱి యకంపనుఁ డట్లు చెప్పినప్పుడు మిక్కిలియుఁ గ్రుద్ధుఁ డగుటవలన మఱింత కన్ను లెఱ్ఱఁబాఱ దహించువాఁడుంబోలె చుఱచుఱం జూచుచు వానితో 'చచ్చినవాఁడెవ్వఁడు నా దయినజనస్థానమును హతము చేసినవాఁడు? ఇంక వానికి సమస్తలోకములందును నిలువ నీడయెక్కడిది? నాకు నప్రియముగావించిరేని, దేవేంద్రుఁడుగాని కుబేరుఁడుగాని యముఁడుగాని విష్ణుదేవుఁడుగాని యెంత మాత్రమును సుఖమును బొందఁజాలరుసుమా. నేను యమునికి యముఁడను; అగ్నిని కూడ దహింతును; మృత్యువునకుఁగూడ మరణధర్మమును గూర్పనేర్తును. నేను క్రుద్ధుఁడ నయితినేని, నా తేజమున సూర్యాగ్నుల నిద్దఱినిఁగూడ దహింతును. నా వేగమున వాయువువేగమునుగూడఁ దోడనే యడంపఁజాలుదును' అనెను. రావణుఁ డట్లు క్రుద్ధుఁ డగుటఁ జూచి యకంపనుఁడు చేతులు మోడ్చి భయమున మాటలు తొకతొకపడ 'అభయ'మని రావణుని యాచించెను. రాక్షసప్రభుఁ డగు రావణుఁడును వాని కభయ మొసఁగెను. వాఁడంత భయము విడిచి నమ్మిక గలిగి మాట తొట్రిలక రావణునితో 'దశరథునికుమారుఁడు రాముఁ డనువాఁడు గలఁడు. అతనిరూపము లోకోత్తరమయినది. అతఁడు ప్రాయమువాఁడు. అతనికి మూఁపులు ఆఁబోతుమూఁపురములవలె నుండును; బుజములు గుండ్రనై పఱపయి నిడుదలుగా నుండును. అతఁడు మంచివీరుఁడు; మిక్కిలి కీర్తిగన్నవాఁడు; శ్రీమంతుఁడు; అసమానబలపరాక్రమసంపన్నుఁడు. అతనిచేతనే జనస్థానమునందలి రాక్షసులును ఖరుఁడును దూషణుఁడును హతులైరి' అనెను. రాక్షసాధిపతి యగు రావణుఁడు అకంపనునిమాట విని సర్పరాజువలె వెచ్చనూర్చి వానితో 'అకంపనా! ఆ రాముఁడు దేవేంద్రునిని దేవతలందఱినిని గూడి జనస్థానమునకు వచ్చెనా యేమి? లేక యొంటివాఁ డెట్లింతటి కార్యము చే

మాగతః' అనిమూలము. విశేషార్థము:- లంకకు జనస్థానము పురద్వారము వంటిదిగదా. లంకకు జనపదగ్రామాదులు గలిసియున్న రాజ్యము కొంచెమేనియులేదు. లంక ఒక్కటియే; దానికి రక్షయైనది జనస్థానమొక్కటియే. కాన జనస్థానము నశింపఁగా లంకకు మూసియున్న ద్వారము తెఱచినట్లే- (రాజన్) నీసత్తకే హానిసుమీ! (రాక్షసాః) నీవు రాక్షసులకుఁ గదా రాజవు- రాక్షసులు నశించిరేని నీరాజత్వమే నశించునుగదా. (బహవః) ఒక్కరిద్దఱు నశించినను హానికలుగునఁగా పెక్కండ్రునశించిరేని చెప్పవలయునా, (హతాః) చంపఁబడిరి- వారు ప్రాణములతో నున్న వారుగారు. సమస్తరాక్షసులు నశింపఁగా ఖరుఁ డేమిచేసినాఁడనఁగా చెప్పుచున్నాఁడు. (ఖరశ్చ) ఖరుఁడును హతుఁడైనాఁడు- ఇట చకారముచేత దూషణత్రిశిరులును హతులైరని చెప్పఁబడినది. (కథంచిత్ అహమాగతః) నేనెట్లో వచ్చితిని- శూర్పణఖ రావణునితో 'స్త్రీవధం శంకమానేన ఏకాకథంచిన్ముక్తాహమ్' 'స్త్రీవధమునకు జంకుచు నన్నొకతెను ఎట్లో విడిచిపెట్టినాఁడు' అని జనస్థానమునుండి తాను తప్పించుకొనివచ్చినందులకు స్త్రీత్వమే హేతువుగాఁ జెప్పటంబట్టి అకంపనుఁడును స్త్రీవేషముననే తప్పించుకొని వచ్చినాఁడని యూహించుకొనునది.

యఁగలఁడు? నాకావివరము చెప్పుము' అనెను. అకంపనుఁడు మరల రావణుఁడు చెప్పినమాటవిని మహాత్ముఁడగునారాముని బలమును పరాక్రమమునుఁ జెప్పువాఁడై రావణునితో 'రాముఁడనువాఁడు మహాతేజస్వి; సమస్తధనుర్ధరులలో నగ్రగణ్యుఁడు. దివ్యాస్త్రములను దివ్యకల్యాణగుణములచేతను సంపన్నుఁడు. యుద్ధమున దేవేంద్రునితో సాటియైనవాఁడు. ఆరామునకుఁ దగినట్లుగా లక్ష్మణుఁడనునొకతమ్ముఁడు గలఁడు. అతఁడు బలవంతుఁడు; అతనికన్నులెఱ్ఱనిసెరల మురువుగులుకును; కంఠధ్వని భేరివలె గంభీరముగా నుండును; మొగము చంద్రబింబమువలె డంబుమీఱును. శ్రీమంతుఁడును రాజశ్రేష్ఠుఁడు నగునారాముఁడు, వాయువు అగ్నితోఁగూడునట్లు, ఆలక్ష్మణునితోఁ గూడియున్నాఁడు. ఆ రాముఁడే జనస్థానమునంతయుఁ బడఁగూల్చెను. మహాత్ములు దేవతలెవ్వరుగాని యచటికి వచ్చి రామునకు సహాయపడినది లేదు. ఈవిషయమున సంశయింపవలవదు. బంగారుపింజలు గలగఱులబాణములను రాముఁడు ప్రయోగింపఁగా నవి విఱివిడలలు గలపాములై రాక్షసులను భక్షించినవి.* రాక్షసులు భయమున స్రుక్కి యాత్మరక్షణార్థము ఏయేమార్గములఁ బాఱిపోవుదురో ఆయామార్గములందెల్లను రాముఁడే వారికెదుటఁ గాన్పించుచుండెను. అనఘా! రాముఁడీప్రకారమున జనస్థానమునంతయు నాశము నొందించె' ననెను. అకంపనుఁడు చెప్పినది విని రావణుఁడు 'నేను రామునిని లక్ష్మణునిని జంపుటకై జనస్థానమునకుఁ బోయెదను' అనెను. రావణుఁడట్లు చెప్పుటవిని యకంపనుఁడు† 'రాజా! రామునిబలమును పౌరుషమును జ

* ఇందులకు మూలము 'యేనయేనచ గచ్ఛంతి రాక్షసా భయకర్శితాః। తేన తేనస్మ పశ్యన్తి రామమేవాగ్రతస్స్థితమ్' దీనికివిశేషార్థము:—(యేనయేనగచ్ఛన్తి) ఏయేమార్గమునఁబోవుదురో ఆయామార్గమున కెదుట రామునేయున్నట్లు చూతురు. మార్గమందెల్ల రాముఁడే కనుపట్టుట భయముచేతనని తెలియునది. లేక (యేనయేనచ) ఏయేవస్తువులను దాఁగికొనుటకు సాధనములుగాఁదలఁచి, (గచ్ఛంతి) పోవుదురో,-(తేనతేన) ఆయావస్తువునందు, (రామమేవ అగ్రతః స్థితం పశ్యన్తి) రాముఁడే కెదుటనుండఁగాఁ జూతురు-ఇచట ఒక్కొక్కరాక్షసుని కొక్కొక్క రాముఁడుగా ఇచ్ఛచేత దేహములు పరిగ్రహించుట ధ్వనించుచున్నది. తనిశ్లోకి-మహేశ్వరతీర్థులు.

† ఇందులకు 'శృణు రాజన్ యథావృత్తం రామస్యబలపౌరుషమ్। అసాధ్యఃకుపితో రామో విక్రమేణ మహాయశాః। ఆపగాయాః సుపూర్ణాయా వేగం పరిహరేచ్ఛరైః' అనిమూలము. విశేషార్థము:—(యథావృత్తం) వారివారియెడలఁ గావించిన అతిమానుషకర్మములను దప్పకుండునట్లుగా రామునిబలపౌరుషములు చెప్పెదననుట—లేక (రామస్యవృత్తం) రాముని ఇతిహాసపురాణోక్తమైన వృత్తాంతమును, (యథావత్) కలరూపుగాను, (బలం) పరులను క్రిందుపఱుచుసామర్థ్యమును, (పౌరుషం) మహాపురుషకర్మమును చెప్పెదవినుమనుట, (కుపితః) మర్యాద నతిక్రమించినందులకు నిగ్రహముగలవాఁడు, (రామః) రమయతి అనువ్యుత్పత్తిచే రామునికోపము అహార్యమని వ్యంజితమగుచున్నది. (విక్రమేణ అసాధ్యః) విక్రమమునకుఁ బ్రవర్తించెనేని వారింపనలవిగానివాఁడు, (అసాధ్యః) అని ఉపపదము మఱొకటిలేక సామాన్యముగాఁ జెప్పుటచే బ్రహ్మరుద్రేంద్రాదులకును అసాధ్యుఁడనుట ధ్వనించుచున్నది. (మహాయశాః) లోకమునను వేదమునను ప్రసిద్ధముగానున్న విభవముగలవాఁడు అనియర్థము. దీనిచే త్రివిక్రమావతారము

రిగినది జరిగినట్టుగాఁ జెప్పెద వినుము. మహాయశుఁ డగురాముఁడు కుపితుఁడై పరాక్రమమునకుఁ బూనెనా, అతనిని సాధింప నెవ్వరికి నలవిగాదు. అతం డట్లు కోపించి పూనెనేని పరిపూర్ణ మైననదీప్రవాహమునురవడినిగూడ బాణములచే నరికట్టి నిలుపును. *ఆ రాముఁడు నవగ్రహములతోడను నిరువదియేడునక్షత్రములతోడను తక్కినజ్యోతుల తోడనుగూడ నాకాశమునంతెయు చెల్లచెదరు గావింపఁజాలును. శ్రీమంతుఁ డారాముఁడు సముద్రమున భూమి మునుఁగునేని, దానినిగూడ లేవనెత్తును. ‡రాముఁడు

సూచితమగుచున్నది. 'ఆపగాయాః సుపూర్ణాయా వేగం పరిహరేచ్ఛరైః' 'పూర్ణమైన యేటిప్రవాహపు వేగమును మాన్పఁగలఁడు' అనుటచే 'భయానకావర్త శతాకులా నదీ మార్గం దదౌ సింధు రివ శ్రియఃపతేః॥' 'భయంకరములైన వందలకొలఁది సుళ్లచే పిరిగొన్ననది శ్రీపతికి మార్గము నొసఁగెను' అని భాగవతోక్తప్రకారమున భవిష్యత్కృష్ణావతారముగాని భూతకృష్ణావతారముగాని వ్యక్తమగుచున్నది - తనిశ్లోకి-మహేశ్వరతీర్థులు.

* ఇందులకుమూలము 'సతారగ్రహనక్షత్రం నభశ్చాప్యవసాదయేత్ । అసౌ రామస్తు సీదన్తీం శ్రీమానభ్యుద్ధరేన్మహీమ్॥' (సతారగ్రహనక్షత్రం) నక్షత్రగ్రహతారములతోఁగూడిన, (నభశ్చ అపి) వానికి అధిష్ఠానమైన అండకోశమునుగూడ, (అవసాదయేత్) నశింపఁజేయును, అనిదీనిచేతఁగూడ త్రివిక్రమావతారము ధ్వనించుచున్నది- అట్లే 'యో అస్కభాయదుత్తరగ్ం సధస్థవిచక్రమాణస్త్రేధోరుగాయ' అనిశ్రుతి. (సీదన్తీం) మునుఁగుచున్న, (మహీం అభ్యుద్ధరేత్) భూమినిలేవనెత్తును. అనుటచే వరాహావతారము సూచితము. ఇందు (శ్రీమాన్) అనుటచే 'అన్యేషుచావతారేషు విష్ణోరేషానపాయినీ' 'ఇతరములయిన యవతారములందును విష్ణువుతో నీమె యెడతెగక కూడియుండునది' అన్న పరాశరవచనమట్లు వరాహాద్యవతారము లన్నిటను లక్ష్మి అనువర్తించుచుండుట సూచితమగుచున్నది. ఇట శ్రీమాన్ అని లక్ష్మినిగూడఁ జెప్పుటంబట్టి శ్రియఃపతి, 'సీదన్తీం మహీమభ్యుద్ధరేత్' అనుటచే మహీశబ్దముచే మహియందలి జనులను అనుగ్రహింపఁగా సంసారమందుమునుఁగుచేతనులను ఉద్ధరించునని భావము గర్భితమగుచున్నది. శ్రియఃపతికి పరత్వమున కసాధారణలక్షణము మోక్షప్రదత్వము గావున శ్రీమాన్ శబ్దముచేత శ్రియఃపతియగు పరుఁడు సంసారమునుండి యుద్ధరించి మోక్షమునొసఁగునని యర్థము. (శ్రీమాన్ మహీమభ్యుద్ధరేత్) అనుచో లక్ష్మితోఁగూడియే భూదేవి నుద్ధరించినాఁడు గావున లక్ష్మీదేవియు భూదేవి నుద్ధరించుటయందు సహాయపడుటచే నద్దేవికి సపత్నీద్వేషము లేదనుటయు సూచితము. తనిశ్లోకి—మహేశ్వరతీర్థులు.

‡ ఇందులకు 'భిత్త్వా వేలాం సముద్రస్య లోకానాప్లావయేద్విభుః। వేగం వాపి సముద్రస్య వాయుం వావిధమేచ్ఛరైః' అనిమూలము. సముద్రవేలను భేదించి లోకములను ముంచునవనుటచే సంకర్షణావతారము ధ్వనితము. తనిశ్లోకి—లోకములను ముంచుననుటచే సంహారకారణమును శ్రీరాముఁడేయని తెలియుచున్నది. మహేశ్వరతీర్థులు. సముద్రవేగమును బాణములచే నిలుపుననుటచే కావింపఁబోవు సముద్రబంధనము ధ్వనితము. (వాయుం వా విధమేత్) ఇటవాయువు తక్కినభూతముల కుపలక్షణము. సమస్తభూతములకు 'పృథివ్యప్సులీయతే' 'ఆపస్తేజసిలీయన్తే' అన్నప్రకారమున ప్రళయము గావించునని ధ్వనించుచున్నది. మఱియు నీప్రళయము మీఁదిశ్లోకమున 'సంహృత్య' అని యనువదించుటచేతను ఇట చక్కఁగా ధ్వనితమగుచున్నది. తనిశ్లోకి - మహేశ్వరతీర్థులు.

స్వతంత్రుఁడుగావున సముద్రము చెలియలికట్టనుభేదించి లోకముల నన్నిటిని దానిజలముల ముంచును; బాణములచే సముద్రపునురవడినిగాని వాయువువేగమునుగాని నడఁగఁద్రొక్కును. *మహాయశుఁ డగునాపురుషసింహుఁడు పరాక్రమమున లోకముల నన్నింటిని సంహరించి మరల మొదటనుండి ప్రజలను సృజించుటకుఁగూడ సమర్థుఁడు. †రావణా! స్వర్గము పాపజనులకుఁ బడయనలవిగానట్లు నీకుఁగాని మన రాక్షసజనములకుఁగాని యుద్ధమున రాముని జయింప నలవిగాదు. ‡దేవాసురులందఱు నొక్క-

---

* ఇందులకు 'సంహృత్యవాపునర్లోకాన్ విక్రమేణ మహాయశాః। శక్తస్స పురుషవ్యాఘ్రః స్రష్టుం పునరపిప్రజాః' అనిమూలము. (పునః సంహృత్య) అని మరలసంహరించుటను జెప్పుటచే పూర్వపుసంహారమును సృష్టియు నితఁడే చేసినవాఁడని వ్యంజితమగుచున్నది. (లోకాః)లోకములు అని బహువచనము ఏవిశేషణముచేతను సంకోచమునొందక సామాన్యముగాఁ జెప్పఁబడుటచే అండములలోఁజేరిన సర్వలోకములును వివక్షితములు, (విక్రమేణ) సంకల్పమాత్రముచేత-ఇందులకు 'ఏతస్యవా అక్షరస్య' ఇత్యాద్యిశ్రుతులు. (మహాయశాః) షడ్గుణైశ్వర్యములవలనఁ గలిగినప్రసిద్ధి యిటఁజెప్పఁబడియె. (శక్తః) అనంతశక్తిగలవాఁడు. 'పరాస్యశక్తిః' అని యిందులకుశ్రుతి. 'ఏకోహవైనారాయణః' ఇత్యాదిశ్రుతులు నారాయణునికే సృష్ట్యాదుల కర్తృత్వము చెప్పుచుండఁగా రాముని కట్టికర్తృత్వ మెక్కడిదనఁగా, (సపురుషవ్యాఘ్రః) ఆపురుషోత్తముఁడు-'నహిదేవైరుదీర్ణస్య' ఇత్యాదులచే ఆనారాయణుఁడే రాముఁడుగా నవతరించినాఁడు అని యర్థము,కాన రామునికి కర్తృత్వముగలదని భావము.(స్రష్టుం పునః)మరల సృజించుటకు - ఇట (పునః) అనుట పూర్వసృష్టిగూడ ఇతనికి లోనైనదేయని సూచించుచున్నది-తనిశ్లోకి - మహేశ్వరతీర్థులు.

† ఇందులకు మూలము 'నహి రామో దశగ్రీవ శక్యో జేతుం త్వయా యుధి'రక్షసాం వాపిలోకేన స్వర్గ పాపజనైరివ'(రామః)విక్రమములచే రంజింపఁదగినవాఁడు.(దశగ్రీవ)పదికుత్తుకలు గలవాఁడగురావణుఁడు-ఎవరికిలేని పదితలలు నాకున్నవి అని కదా నీకిఁ గర్వముగలిగినది.రాముఁడును రామానుజుఁడును సహస్రశిరములు గలవారు సుమీ యని దశగ్రీవశబ్దముచే సూచితమగుచున్నది,(త్వయా జేతుం యుధి నశక్యః)యుద్ధమునజయించుటకు నీకు నలవిగాఁడు, అల్పశక్తిగల నీవు అపరిమితానంతశక్తిగలరాముని ఎట్లు గెలువఁగలవనుట. (రక్షసాం) నముచి హిరణ్యకశిపుఁడు శంబరుఁడు బలిమొదలైనరాక్షసులయొక్క, (లోకేన) సమూహముచేతను జయింప నలవిగానివాఁడనుట. జయము మీకెంతమాత్రము గలుగ నేరదనుచున్నాఁడు-(స్వర్గః పాపజనైరివ)పాపులకు స్వర్గమెంతమాత్రమును గలుగనట్లె మీకు రాముని జయించుట గలుగదనుట. మేముప్రసిద్ధులమై పెక్కండ్రుండఁగా ఒక్కని జయింప లేమనుట యెట్లనఁగాఁ జెప్పుచున్నాఁడు, (స్వర్గఃపాపజనైరివ) పాపజనులు పెక్కండ్రుండియు ఒక్కస్వర్గమును జయింపలేనట్లు మీరుపెక్కండ్రయ్యు రామునొక్కని జయింపలేరని భావము.

‡ ఇందులకు మూలము 'నతం వధ్య మహం మన్యే సర్వైర్దేవాసురైరపి।'రాక్షసులగుమనము ఒంటిగాగెలువ లేకపోయినను ఇంద్రజిత్తుచే గెలువఁబడిన యింద్రాదులను తోడుజేసికొని గెల్వరాదా యనెడియాశను వారించుచున్నాఁడు, (దేవాసురైః) దేవతలచేతను అసురులచేతను-ఇట బహువచనముచేతనే సర్వదేవాసురులును గ్రహింపఁబడఁగా మరల 'సర్వ' శబ్దమును పెట్టుటవలన భూతభవిష్యద్వర్తమానకాలములందలి ఇంద్రాదులందఱిని మొత్తముగాఁగొని చెప్పినట్టుగా తెలియునది. ఇట్లు రాముని

టిన్నైనను రాముని వధింప శక్యము గాదని నాయభిప్రాయము. రాముని వధించు నుపాయమొకటియున్నది. దానిని జెప్పెద. ఎచ్చరికతో వినుము. అతనికి సీతయను భార్య యొకతిగలదు. ఆబిడ మిక్కిలి యుత్తమురాలు; బెడగారు నెన్నడుముగలది. నడి యౌవనము గలిగియుండునది. ఆచెలువ యవయవములు ఒండొంటికి సమముగా తీరియుండును. ఆయింతి కాంతలలోపల మేలుబంతి; రత్నాభరణములతో రాణించుచుండునది. దేవతలలోఁగాని గంధర్వులయందుఁగాని, యప్సరసలలోఁగాని, దానవులలోఁగాని యాసీతకు సవతియైనవనిత లేదు? ఇంక మనుష్యులలో నెక్కడిది? ఆ మహారణ్యమునకు నీవుపోయి బలాత్కారమున రామునిభార్యను దొంగిలికొని రమ్ము. రాముఁడు సీతయందు మిక్కిలియు కామముగలవాఁడు గావున సీతను బాసి యుండఁజాలక ప్రాణములు విడుచును' అనిచెప్పెను. *రాక్షసులఱేఁడును మహాబా

---

గెలువ నలవికాదని,(అహంమన్యే) నేను దలఁచుచున్నాను. నేను రాక్షసజాతిని బుట్టినను సుకృతపరిపాకవశమున శ్రీరామమహాత్మ్యమును గూర్చినజ్ఞానము నాకుఁగలిగినది - నీకో 'ఆసురం యోని మాపన్నా మూఢాజన్మనిజన్మని' అను శాస్త్రరీతిని దుష్కర్మవశమున ఇట్టిజ్ఞానము గలుగదయ్యెనని భావము. తనిశ్లోకి- మహేశ్వరతీర్థులు.

ఇట అకంపనునికి రామునిఁగూర్చిన పరత్వజ్ఞానము సనత్కుమారాదులు చెప్పిన యితిహాసాదులను వినుటచేతఁగాని, మాల్యవంతుఁడు మొదలైనవారు సుమాలిమాలివధాదివృత్తాంతములు చెప్పుటవలనఁగాని, విశ్వరూపాదుల దర్శించినట్లు పదునాలుగు వేలరాక్షసులతో పోరునప్పుడు ఒక్కొక్కరాక్షసునికి రాముఁడు ఒక్కొకవిగ్రహముదాల్చుటను గనుఁగొనుటచేతఁగాని కలిగియుండవచ్చును. లేక అకంపనుని పేర: ఋషి తానే రామునిపరత్వమును ప్రకటించినాఁడనియుఁ దలంచినచో విరోధమేదియుఁ గలుగదు-తనిశ్లోకి.

* ఇందులకు 'ఆరోచయత తద్వాక్యం రావణో రాక్షసాధిపః। చిన్తయిత్వా మహాబాహు రకంపనమువాచహ' అనిమూలము. దీనికివాస్తవార్థము:—రావణుఁడు అకంపనునివలన రామవృత్తాంతమును విన్నపిదప,(చింతయిత్వా) త్రేతాయుగమున శ్రీరాముఁ డవతరించు నని సనత్కుమారుఁడు చెప్పినవాక్యమును దలఁచుకొని, శ్రీరామునిచేత వధమునుగోరినవాఁడై,(తద్వాక్యం) సీతను అపహరింపుము అనియకంపనుఁడు చెప్పినవాక్యమును, (ఆరోచయతి) అనుకూలముగానున్నదని యంగీకరించెను. ఇందులకు ఉత్తరరామాయణమున రావణసనత్కుమారులనుగూర్చి అగస్త్యునికిని రామునికిని గలిగినసంవాదమును జూచునది. అందు అగస్త్యుఁడు రామునితో 'రామా! రావణుఁడు మున్ను సీతను అపహరించిన కారణము వినుము. తొల్లి కృతయుగమున రావణుఁడు బ్రహ్మపుత్రుఁ డగుసనత్కుమారునిఁజూచి దైత్యులును దానవులును రాక్షసులును యుద్ధమునహతులై యేగతినొందుదురు. విష్ణుఁడెందులకు వారిని జంపుచున్నాఁడు' అని యడుగఁగా సనత్కుమారుఁడు 'విష్ణువుచే జంపఁబడినరాక్షసులందఱును అద్దేవునిలోకము నే పొందిరి. అద్దేవునికోపముకూడ వరముతో సాటియైనది' అనఁగా రావణుఁ డాశ్చర్యపడి 'ఆవిష్ణువుతో నాకుయుద్ధమెపుడుగలుగును?' అని యడుగఁగా సనత్కుమారుఁడు 'రావణా! కొంతకాలమోర్చియుండుము. కృతయుగముగడచి త్రేతాయుగ మారంభింపఁగానే దేవహితార్థముగా భగవంతుఁడు ఇక్ష్వాకుకులీనుఁడగు దశరథమహారాజునకు రాముఁడనుపేరఁ గొడుకై పుట్టగలఁడు' అనిచెప్పెను. రావణుఁ డదివిని యతనితో

హుం డగురావణుం డనకంపనునిమాటకు నిష్టపడి దానిని జక్కఁగా యోచించి వానితో 'మంచిది నేనొక్కఁడనే ప్రొద్దున సారథితోఁగూడఁబోయి సంతోషమున నీవుచెప్పినసీత నిమ్మహాపట్టణమునకుఁ దీసికొనివచ్చెదను' అనెను. రావణుఁ డిట్లుచెప్పి యంత ప్రాతఃకాలమున, సూర్యునివలె మెఱయుచు గాడిదలు పూన్పియున్న రథము నారోహించి దిక్కులు వెలిఁగించుచు బయలువెడలెను. రాక్షసప్రభుం డయినయా రావణునిమహారథము ఆకాశమార్గమునఁ దిప్పంబడుచు, మేఘమండలమునం దిరుగు చంద్రునిభంగి ప్రకాశించుచుండెను. ఆ రావణుఁడు మారీచాశ్రమముఁ జేరి యచ్చట తేరుడిగ్గి తాటకాపుత్త్రుఁ డగుమారీచునొద్దకుఁబోయెను. మారీచుఁడు మనుష్యులకు దుర్లభంబు లయినభక్ష్య భోజ్యంబులచే రాక్షసప్రభుని రావణునిఁ బూజించెను. మారీచుఁడు రావణునికి గద్దెయిడి యర్ఘ్యాదులం బూజించి మహార్థ మయినవచనమున నాతనిం జూచి 'రాజా! రాక్షసేశ్వరా! రాక్షసులందఱికిని కుశలమా? నీవింత వేగిరముగా వచ్చుటవలన నాకు సంశయము కలుగుచున్నది' అనెను. మహాతేజుఁ డగు రావణుఁడు మాటలయందు నేర్పరిగావున మారీచుఁ డట్లుచెప్పఁగా నంతఁ దాను వానితో 'నాయనా! అక్లిష్టకర్ముఁ డగురాముఁడు నాతలారిని ఖరుని చంపినాఁడే! మఱియెట్టివారికిని వధింప నలవి గానిజనస్థానమందలిరాక్షసులును అందఱును యుద్ధమున వానిచేఁ గూలిరి. వానిభార్య నపహరింపనున్నాను. నీవు ఈవిషయమున బంధువులనెల్లఁ బోఁగొట్టుకొని యున్ననాకు సహాయము గావింపుము' అనెను. ఆరాక్షసేంద్రుఁడు చెప్పినమాటను విని మారీచుఁ డతనితో 'రాక్షసతిలకా! మిత్త్రునివలె పయికి నగపడుచు లోపల నీకు శత్త్రువై నిన్నుఁ జెఱుపఁదలంచిన వాఁడెవ్వఁడు నీకు సీత పేరుచెప్పెను? ఎవ్వఁడు నీచే తిరస్కృతుఁడై నీయైశ్వర్యమునకు నోర్వకున్నాఁడు? సీత నిచ్చుటకిఁ దెమ్మని నీకుఁ జెప్పువాఁడెవఁడు? వానిని నాకుఁజెప్పుము. ఎవ్వఁడు, రాక్షసలోకమునకెల్ల కొమ్మువలెకన్నాకై యున్న నిన్నుఁ ద్రుంపఁజూచినాఁడు? ఎవ్వఁడు నిన్నీవిషయమునఁ బురికొలుపుచున్నాఁడో వాఁడే నీకుశత్త్రువు; సందేహము లేదు. ఎవ్వఁడు నిన్నుఁ గ్రూరసర్పమునోటనుండి కోఱఁ బెఱికించుచున్నాఁడు? ఎవ్వఁ డిట్టి కార్యముచే నీకు చెడుత్రోవను పట్టించినాఁడు. రాజా! సుఖముగా నిదురించుచుండఁగా నీతల నెవ్వఁడుగొట్టినాఁడు? రావణా! పరిశుద్ధమైనయున్నతవంశమునఁ బుట్టుటయే పొడవైనతొండముగాఁ గండుమీఱి, సహింపరానిప్రతాపమే మదజలముగా చెలువుసూప, చక్కఁగాఁ దీరిన నిడుదబాహువులే నిడుదకొమ్ములుగా నెమ్మెసూప, దనమదగంధమును మూర్కొ-

---

విరోధమునుగోరి సవతుక్కమాయఁడు చెప్పినవాక్యము మాటికిచింతించుచు మదములో యుద్ధార్థియైతిరుచుండెను. ఇందులకుఁగాసే రావణుఁడు సీతను అపహరించికొనిపోయి తల్లివలె యత్నములోఁ గాపాడెను' అని యున్నకథ నూహించుకొనునది. దీనిఁబట్టి రావణుఁడు సీతారాములనుజూచి చెప్పఁబోవుమాటలు పయికి దుర్భాషలుగాఁదోఁచినను వా స్తవమునకు స్తుతిపరములే యగునుగాన అచ్చటచ్చట స్తుతిపరముగాఁగూడ వ్యాఖ్యానము సేయుదము-మహేశ్వరతీర్థులు.

న్నమాత్రనే తక్కినగజములను పలాయితములు సేయించు రాముం డనుమదపుటేనుఁగును, ఇప్పుడు,ఈదేశమునను యుద్ధమునఁ దేఱిచూడనైన నలవికాదు.ఇంక యుద్ధముసేయుట చెప్పవలయునా?యుద్ధాగ్రమును నుండుటయే కోపమున నడుముదాఁకియున్నవాలముగాఁ గ్రాల, బాణములే వాఁడిగోళ్లు మొద లగునవయవములుగాఁ గలిగి, కఱకైనకత్తియే కోఱలుగా మీఱి, పటువు లయినరాక్షసులనెడిమృగములను జంపునది యగురాముఁ డనుసింహము నిదురించుచున్నది. నీవు దానిని మేలుకొలుపఁ దగదు.*రాక్షసరాజా! విల్లనెడి మొసలితోఁగూడి,బుజములచే తూపు లేయువేగమనెడి రొంపి గలిగి,బాణము లనెడియలలపంక్తులు మీఱి, యుద్ధమను మహాజలప్రవాహము వహించి, మిక్కిలి భయంకరముగా నున్నరాముఁ డనెడి మహాబిలమువాఁతం బడుట యెంతమాత్రము యుక్తముగాదు. లంకేశ్వరా! కాఁబట్టి రామునియెడ కలంకవిడువుము.రాక్షసేంద్రా!కలఁక విడువుము. లంకకు లెస్స పొమ్ము. అచట నీభార్యలంగూడి హాయిగా నిత్యము క్రీడింపుము. రాముఁడు తనపడఁతినిగూడి యడవులం గ్రీడించుఁగాక' యనిచెప్పెను. మారీచుఁ డిట్లుచెప్పఁగా రావణుఁడు విని లంకకు మరలినవాఁడై యుత్తమంబగుతనగృహమును బ్రవేశించెను. ఇది ముప్పదియొకండవ సర్గము.

---

## శూర్పణఖ రావణునియొద్దికిఁ బోవుట.

అంత శూర్పణఖ రాముఁ డొక్కఁడే భయంకరపరాక్రము లగుపదునాలుగు వేలరాక్షసులను దూషణునిని ఖరునిని త్రిశిరునిని వధించుటంజూచి మరల మహాధ్వని గలుగునట్లు మేఘమువలె గర్జిల్లెను. రాముఁ డితరులకుఁ జేయ నలవిగానట్టి పరాక్రమకృత్యమును జూచి యది మిక్కిలి భయమునొంది రావణుఁడు పాలించు లంకకుఁబోయెను. అట్లు పోయి పుష్పకవిమానాగ్రమునందు, మంత్రులు దాపున బలసి కూర్చుండ, దేవతలతోఁగూడఁ గూర్చున్నదేవేంద్రునివలెఁ, దేజము వెలుఁగుచున్న రావణునిఁ జూచెను. వాఁడు సూర్యునివలె వెలుఁగుచు, బంగారుమయమైన మేలియాసనమునఁ గూర్చుండి, బంగారపుటిటికరాలు పఱచినవేదియందు మిక్కిలియు నేయి వేల్వఁగా ధగధగఁ బ్రజ్వలించుచున్నయగ్నిహోత్రునివలెఁ దేజరిల్లుచుండెను. వాఁడుదేవతలకుగాని, గంధర్వులకుఁగాని, భూతములకుఁగాని, మహాత్ము లగుఋషులకుఁగాని యుద్ధమున జయింప నలవిగానివాఁడు; శూరుఁడు; నోరు తెఱచుకొని యుండుయమునివలె భయంకరాకారుఁడు. దేవాసురయుద్ధములందు నింద్రునివజ్రాయుధపువాటులచే వాని మేనియందు గంట్లుపడి యుండును. మఱి

---

*ఇట వింటిని మొసలిగాఁజెప్పుటచే పతనకాలమందే పట్టుకొనఁబడుటయు, బాణములువేయు వేగమును బురదగాఁజెప్పుటచే దిగంబడిన పిదప తప్పించుకొనరామియు, బాణములను తరంగపంక్తులుగాఁ జెప్పుటచే మునుఁగుటకు అయితియు,యుద్ధమును జలపూరముగాఁ జెప్పుటచే దాఁట నలవిగామియు సూచితములు.



664 ముక్కు చెవులు తెగినశూర్పణఖ రావణునికడకు నెత్తురు కాలువగా వచ్చి
రామలక్ష్మణుల ధూర్తతను జెప్పుట.

యైరావతము తనకొమ్ములకొనలు గ్రుచ్చంగా వానివక్షమున మేటియైనకాయలు నీటు గులుకుచుండును. వానికిం జేతు లిరువది ; తలలుపది; ఛత్రచామరాదు లయినవాని పరిచ్ఛదమును జూడ వేడుకయైనది. మఱియు వాఁడు విశాలం బగువక్షముగలిగిన వీరుఁడు; రాజలక్షణంబులు వన్నెగులుకువాఁడు. ఆభరణములందలివైడూర్యమణులు తలతలమనివెలుఁగ వాఁడు మిక్కిలియుఁ బ్రకాశించుచుండును.అపరంజికుండలములు చెవుల గండుమీఱ, గుండ్రని బలుపుబుజములు గ్రాల, తెల్లని పలువరుస మురువు సూప, వెడఁదనోరు గలిగి పర్వతమువలె మిక్కిలియొడ్డుఁబొడువునఁ బొడసూపుచుండును. దేవతలతోడి యుద్ధములందు నూఱుమాఱులు, విష్ణుదేవునిచక్రాయుధమునఁ గొట్టువడినవాఁడు; మఱి యితరము లైనమహాయుద్ధములందును నితరములైన యాయుధములచేతను గొట్టువడి గడిదేఱినదిట్టఁడు. దేవతలకుఁ గలసమస్తాయుధముల చేతను నట్లు గొట్టువడి గట్టి పాఱినమేనిదిట్టము గలవాఁడు. కలఁచి పుచ్చరానిసముద్రములనేనియుఁ గలఁచిపుచ్చువాఁడు;తలఁచినకార్యమును తోడనే చేసితీర్చువాఁడు. వాఁడు పర్వతములనేని యెగఁజిమ్మువాఁడు, దేవతలను మిక్కిలి నలఁచినవాఁడు, ధర్మములను ద్రుంచువాఁడు, పరస్త్రీలఁబట్టువాఁడును. సమస్తములైనదివ్యాస్త్రములను వాఁడు ప్రయోగింపఁ జాలును. వాఁడెప్పుడును పరులయజ్ఞములకు విఘ్నము లాచరించుచుండును. మఱియు వాఁడు భోగవతీపురమునకుఁ బోయి వాసుకి నోడించి తక్షకుని ప్రియభార్యను నపహరించెను. కైలాసపర్వతమునకుఁబోయి కుబేరునిగెలిచి కామగమన మగునతనిపుష్పకవిమానమును అపహరించెను. కుబేరునివన మగుచైత్రరథమును, అతని పుష్కరిణిని, ఇంద్రుని నందనవనమును, మఱియు నితరదేవతలయుద్యానవనములను, ఆ వీర్యవంతుఁడు, కోపముగొని నాశమునొందించెను. వాఁడు పర్వతశిఖరముఁబోలెఁ గ్రాలుచు, మహాభాగులును పరంతపులు నగుచంద్రసూర్యులుదయించునప్పుడు వారలను రెండుచేతులతో నడ్డగించును. ఆధైర్యశాలి మున్ను మహావనమునందు, పదివేలేండ్లు తపస్సు గావించి తనతలలను తానే త్రుంచి పూజోపకరణములుగా బ్రహ్మదేవునిఁ బూజించినవాఁడు. వానికి మనుష్యుఁ డొక్కఁడుతప్పఁ దక్కిన దేవదానవగంధర్వపిశాచపతగోరగాదులవలన యుద్ధమున మరణభయము గలుగదు. ఆ మహాబలుఁడు యాగములందు, బ్రాహ్మణులచే మంత్రముల నభిష్టుతమై పవిత్ర మగుసోమాభిషవశాలలయందలిసోమమును నాశము సేయును. వాఁడు, యాగము లంతయు ముగిసి దక్షిణ నిచ్చుకాలమున వానిం జెఱుచును.మఱియువాఁడు క్రూరుఁడు;బ్రహ్మహత్య గావించువాఁడు,దుష్టచారుఁడు,నిర్దాక్షిణ్యుఁడు, నిర్దయుఁడు. ప్రజలకెప్పుడును గీడుసేయుటయందే వాని కాసక్తి.వాఁడు సమస్తభూతముల నేడ్పించుచుండును;సకలలోకములకును వెఱపుగొలుపుచుండును.ఇట్లు శూరుఁడును మహాబలవంతుఁడు నైనతనతోఁబుట్టువును రావణుని శూర్పణఖఁగాంచినదయ్యె.అట్లు దివ్యవస్త్రాభరణములు దాల్చి దివ్య పుష్పమాలికలతో నొప్పుచు,సింహాసనమున లెస్సఁగాఁ

గూర్చుండి; లోకసంహారమున కుద్యుక్తుండయిమృత్యువుంబోలె, బెడిదముగాఁ బొడకట్టుచు, మంత్రులు చుట్టును బలసి కొలువ వెలుఁగుచు, పౌలస్త్యకులమునకు సొంపు గూర్చుమహాభాగుఁడును శత్రుహంతయు నగురావణునియొద్దకుఁ బోయి యా రాక్షసి భయమున నవయవములు విరవిరఁబోవఁగా నిట్లనియె. నిర్భయముగా సర్వపురుషులవలనను సర్వలోకములందును గ్రుమ్మరుచుండునట్టి యాశూర్పణఖ యట్లు మహాత్ముఁడగులక్ష్మణునిచే విరూపితయై చని, విశాలంబు లగుకన్నులు వెలుఁగుచున్నరావణునిఁజూచి, భయమునను మోహమునను సోలుచు మిక్కిలిభయంకరముగా నిట్లుచెప్పెను. ఇది ముప్పదిరెండవసర్గము.

ర్పణఖ రావణుఁ డూరకుండుటకుం గినిసి వానిని నిందించుట.

అంత శూర్పణఖ విరూపితయగుటం జేసి **దుఃఖిత**యై, మంత్రులనడుమ, లోకరావణుం డగురావణునిం జూచి మిక్కిలియుఁ గుపితయై, పరుషవాక్యముల 'నీవు మత్తిల్లి, యెదురులేక యథేచ్ఛముగా మన్మథభోగములం బడియున్నావు. ఇప్పుడు **మహాభయము** నీకు దాపరించియున్నదే! ముఖ్యముగా దీనిని నీవే చారులవలనఁ దెలిసికొనవలసియున్నను, మదోన్మత్తుఁడ వగుటచేఁ దెలిసికొనకున్నావు. ఎల్లప్పుడును మైథునాదిగ్రామ్యభోగములందే తగిలి యథేచ్ఛముగా వర్తించుచు లుబ్ధుఁడై యుండురాజును ప్రజలు వల్లకాటినిప్పువలెఁ జూతురు; కాని యెంతమాత్రము గారవింపరు. ఏరాజు యుక్తకాలమునఁ దనకార్యములను దానే చేసికొనఁడో యతఁ డాకార్యములను బోఁగొట్టుకొనుటయేకాక రాజ్యమునుం బోఁగొట్టుకొని తానును నశించును. ఏటియందు, మెలఁగరానిదై తనయందు మెలఁగువానికి లోకువ కానిదై కానరాకున్నయడుసులోనికి, ఏనుఁగులు పోయినఁ దగులుకొందుమని దానిని దూరముననే వదలునట్లు, స్వపరరాజ్యవృత్తాంతములకై చారులను నియోగింపక తగినకాలములందు ప్రజలకుఁ గొలువున దర్శనమియ్యక స్త్రీపరతంత్రుఁడై స్వబుద్ధి మాలి యొకరిబోధనకు లోనై యుండురాజును, ప్రజ లట్టివానితోఁ జేరినయెడఁ దామును దుమని దూరమునఁ జెడుద్యజింతురు. స్త్రీపరతంత్రులై చక్కఁగా దేశమును బాలింపనిరాజులు వృద్ధిఁబొందుచున్నను, సముద్రమునందు మునిఁగినపర్వతమువలెఁ బ్రకాశింపరు. దేవగంధర్వదానవులు నీకుఁ బ్రతికారము చేయుటయందే యెచ్చరిక గలిగియున్నవారు. నీవో, చారులను ఆయాకార్యములకు నియోగించి సంగతులు తెలిసికొనక విషయలోలుఁడవై యున్నవాఁడవు. ఇట్టినీవు అట్టిదేవాదులతో విరోధము పెట్టుకొని దొరతనము నెట్లు దక్కించుకొనఁగలవు. రాక్షసా! నీవు బాలునివంటి స్వభావము గలవాఁడవు, కనుక వివేకమే లేదు. మఱి బుద్ధియుఁ జాలదు. దేనిని ముఖ్యముగాఁ దెలిసికొనవలయునో దానినిగూడఁ దెలిసికొనకున్నావే. నీవెట్లు రాజుగా నుండఁగలవు? జయించువారలలో మేటివి. అయినను ఏరాజులు చారులను బొక్క

సమును నీతిని తమవశమున నేర్పఱచుకొనకుందురో వారలు సాధారణజనులవంటి వార లే. రాజులు చారులవలన బహుదూరమున జరిగినవిషయములనన్నిటిని కనుఁగొను చుందురుగాన, వారలు దీర్ఘచక్షువు లనఁబడుదురు. జనస్థానమునందలినీజనులందఱును హతు లగుటనుగూడఁ దెలిసికొనకున్నావే! కావున నీవు చారులనే యుంచుకొనలేదని యు కేవలము సామాన్యులైనమంత్రులే నిన్నుఁ జుట్టుకొనియున్నారనియుఁ దలఁచు చున్నాను. క్రూరకర్ములగుపదునాలుగువేల రాక్షసులును ఖరుఁడును దూషణుఁడును రాముఁ డొక్కనిచేతనే హతులైరి. ఇంతేకాదు. అక్లిష్టకర్ముఁ డగు రాముఁడు ఋషుల కెల్ల నభయ మొసఁగినాఁడు. జనస్థానమునంతయుఁ జక్కాడి దండకారణ్యమును క్షేమకరముఁ గావించినాఁడు. రావణా! నీవో చారాదులకుఁ గోరినట్టు లియ్యనిలుబ్ధుఁ డవు, పరాకుగలవాఁడవు, స్త్రీపరతంత్రుఁడవు. కావున నీ విషయమునందే పుట్టినభ యమునుగూడఁ దెలిసికొనకున్నాఁడవు. క్రూరుఁడును, ఎంతకార్యముచేసినను అల్ప ముగానిచ్చువాఁడును, ప్రమత్తుఁడును, గర్వితుఁడును, గూఢముగా నప్రియముచేయు వాఁడునునైన రాజునకు, ఆపద వచ్చినపుడు మంత్రులు భృత్యులు మొదలగుజను లెవ్వరుగాని రక్షింపరారు. మిక్కిలియునహంకారముగలిగి, సత్పురుషులకుఁ జేరనరాని వాఁడై, తన్నుఁ దానే యెక్కువగాఁ బొగడుకొనుచు, తగనిచోట చుఱచుఱ మండిపడు చుండు రాజునకు ఆపద వచ్చినపుడు, వానిజనులే వానిని వధింతురు. ఏరాజు, కార్యముల నయ్యైకాలములందు సరిగాఁ జేయక భయములు వచ్చునపుడు జంకుగొని జాగ్రత్త నొందకయుండునో వాఁడు శీఘ్రమున రాజ్యభ్రష్టుఁడై గర్వముడిగి, గడ్డిపఱకతో సాటి యగును. ఎండుకొయ్యలచేతను మట్టిగడ్డలచేతను తుదకు దుమ్ముచేతను నేదైన నొకకార్యము గావచ్చును; కాని పదవినుండి భ్రష్టులైనరాజులచే నేకార్యమును గ లుగదు. కట్టుకొని విడిచినవస్త్రమును ముడుచుకొని నలఁగినపుష్పములును నెట్లు పనికి రావో యట్లె రాజ్యభ్రష్టుఁ డగు రాజెంతగట్టివాఁడైనను బనికి రాఁడు. ఏరాజుఏమఱు పాటులేక సమస్తము నెఱింగి జితేంద్రియుఁడై, చేసినమేలుమఱవక, ధర్మశీలుఁడు నై యుండునో, యట్టివాఁడు బహుకాలము సుఖముగా రాజ్యముఁ బాలించుచుండును. ఏరాజు మాంసపుఁగన్నులచే నిదురపోవుచుండినను నీతి యనెడికన్నుఁ దెఱచుకొని మే లుకొనియుండునో, మఱి యెవ్వనికోపముగాని యనుగ్రహముగాని గూఢములుగాక స్ఫుటముగాఁ బచరించునో, యతఁడు జనులచేతఁ బూజితుఁ డగుచుండును. రావణా! నీవన్ననో, జనస్థానమున రాక్షసులందఱును మిక్కిలియు వధింపఁబడుట చారులచే నింతకును దెలియకున్నావు. కాన దుర్బుద్ధి వగు నీకిపుడు చెప్పఁబడినరాజయోగ్యము లగుగుణములేవియు లేవు. నీవు పగవారి నుపేక్షించువాఁడవు; పరుల నవమా నించువాఁడవు; విషయభోగంబులఁ జిక్కినవాఁడవు. ఆయా దేశభేదములయు కాలవిశే షములయు తత్త్వము నెఱుఁగనివాఁడవు. గుణదోషముల నిశ్చయించుటకై బుద్ధి నుప యోగించువాఁడవుగావు. కావున నీవు శీఘ్రమున రాజ్యమును బోఁగొట్టుకొని యడుమ

లం బడఁగలవు' అనెను. ధనమును దర్పమును బలమును గలిగి రాక్షసులకెల్ల దొర యైయున్న యారావణుఁ డిట్లు శూర్పణఖ యెత్తి వివరించినతనదోషములనెల్లను స్వబుద్ధిచేఁ జూచుకొని బహుకాల మాలోచించెను. ఇది ముప్పదిమూఁడవసర్గము.

{ శూర్పణఖ రావణునితో రామలక్ష్మణులరూపసౌందర్య పరాక్రమములను జెప్పి సీతసౌందర్యాతిశయమును వర్ణించి యాబిడ నపహరింపఁ బురికొలుపుట. }

అంత, రావణుఁడు ఖరాదివధమును విని మిక్కిలియుఁ గ్రుద్ధుఁడై, తనతోఁ గోపంబునం బరుషముగాఁ బలుకుచున్నశూర్పణఖను జూచి మంత్రిమధ్యమున దానితో 'రాముఁడెవ్వఁడు? వాని వీర్య మెట్టిది. వానిరూప మెట్లుండును? వానిపరాక్రమ మేపాటి? ఎవ్వరికిని ఎంతమాత్రమును జొరరాని దండకారణ్యమునకు వాఁడేల వచ్చెను? మఱియు రాముఁడు యుద్ధమునం దాయుధము దేనినిగొని రాక్షసులను అట్లే ఖరునిని దూషణత్రిశిరులను జంపెను?' అనియడిగెను. రాక్షసప్రభుఁడు రావణుఁ డిట్లడుగఁగా రాక్షసి కోపము పెనఁగొనఁగా నంత రామునిఁ గలరూపునఁ జెప్పఁదొడఁగి రావణునితో 'దశరథుని కుమారుఁ డగురాముఁడు నిడుద లయినభుజములు గలవాఁడు. విశాలములగు కన్నులు వానికి పన్నెగులుకును. వాఁడు నారచీరలును కృష్ణాజినమును గట్టుకొనియుండును. వానిరూపము మన్మథునిం బోలియుండును. ఆరాముఁడు, బంగారుపట్టబంధము గలిగి యింద్రధనుస్సువలె వెలుంగువింటి నాకర్షించి మహావిషంబు లగుసర్పములంబోని మెఱుంగుబాణములను విడుచును. యుద్ధమున రాముఁడు బెడిదము లయినబాణములను తీసికొనుటగాని బాణములను విడుచుటగాని వింటినాకర్షించుటగాని నాకుఁ గనఁబడినదికాదు. కాని, యింద్రుఁడు గురియువడగండ్లచే మంచిపయిరు పసదూలునట్లు, బాణవర్షములచే నాసైన్యమంతయు వధింపఁబడుచుండుటమాత్రమే నాకుఁ గనఁబడుచుండినది. పదాతి యగునారాముఁడొక్కరుఁడే ఒకటియు నఱముహూర్తమున తీక్ష్ణము లగుబాణముల భయంకరాకారు లగుపదునాలుగువేలమంది రాక్షసులను దూషణుని ఖరునింగూడ వధించి పుచ్చెను. ఇంతే కాదు. అతఁడు ఋషులకభయము నొసఁగినాఁడు. దండకారణ్యమును క్షేమకరముఁ గావించినాఁడు. ఆమహాత్ముఁడు విదితాత్ముఁడుగావున స్త్రీనివధించుటకుఁ గొంకుచు నన్నొకతెను మాత్రము నవమానించి విడువఁగా, నే నెట్లో కష్టమునఁ దప్పించుకొని వచ్చితిని. ఆ రామునకు లక్ష్మణుఁ డనునొకతమ్ముఁడు గలఁడు. వాఁడు మహాతేజుఁడు; గుణములను పరాక్రమమునను రామునిం బోలువాఁడు. వాఁ డన్నయెడ మిక్కిలి యనురాగముగలిగి, యాతనిని గొలుచుచునే యుండును. వాఁడు వీర్యవంతుఁడు; మిక్కిలియుఁ గోపవంతుఁడు; పగవారికి గెలువ నలవిగానివాఁడు; ఎట్టివానినైనను జయించునట్టివాఁడు. మహాపరాక్రమశాలి, బుద్ధిమంతుఁడు, బలవం

తుఁడు, రామునకుఁగుడిభుజము, రామునకునిత్యమును వెలుపలఁదిరుగుప్రాణము. రామునికి అనుఁగు ధర్మపత్ని యొకతిగలదు. ఆబిడ వెడందకన్నులుగలది. దానినెమ్మొగము పున్నమచందురునివలెఁ దులకించుచుండును. అది యెప్పుడును,పెనిమిటికిఁ బ్రియమును హితమునే కావించుచుండునది. ఆచెలువ సొగసైననెరికురులుగలిగి, సొబగైన ముక్కును దొడలును బెడఁగుచూప, చక్కందనపుఁగుప్పయై, మిక్కిలి పొగడ్త గాంచి యీ దండకారణ్యదేవతయో, రెండవ లక్ష్మియో,యనఁదగి ప్రకాశించుచున్నది. ఆలలన మంచియపరంజిచాయ గలది. దానిగోళ్లు ఎఱ్ఱనై నిక్కఁగలిగి యుండును. ఆయింతి సుందరములైనపిఱుందులును సన్నని నడుమునుగలిగి వెలుఁగుచుండును. అది శుభలక్షణంబులు గలది.ఆబిడపేరుసీత;అది విదేహదేశపురాజువెంపుడుఁగూఁతురు.నేను ఆబిడవంటిరూపు గలదేవతాస్త్రీనిగాని గంధర్వినిగాని యక్షినిగాని కిన్నరినిగాని, జూడలేదు. మఱి భూతలమునం దట్టిరూపు గలచెలువను ఇంతవఱకుఁ జూచినదానను గాను. ఆ సీత యెవ్వనికిఁ, గౌఁగిలించుకొనకపోయినను ఊరక భార్యగానుండునో, వాఁడు సమస్తలోకములను మించిన పరమసుఖజీవనమును బడయును; భార్య గాకపోయినను ఎవ్వనిని ఒక మాఱయినను గౌఁగిలించుకొనునో వాఁడు దేవేంద్రునిగూడ నతిశయించి బ్రతుకును. అది మంచిశీలముగలది. దానిమేను ఏమని పొగడుదును? వేయేల! దానివంటిరూపను భూలోకములో లేదు. అట్టిది నీకుఁ దగిన భార్య; అట్లే నీవు నాబిడకుఁ దగినపెనిమిటివి. విఱివియైనకటియును, బలితంపుఁబిఱుఁదును, బలు పయినగబ్బిగుబ్బలును, చక్కని ముద్దుమొగము గలయీచెలువను, నీకు భార్యగా నుండు నని నే నిచ్చటికిఁ దేను బ్రయత్నించితిని. మహాభుజా! నే నట్లు ప్రయత్నింపఁబోఁగా క్రూరుఁడగులక్ష్మణుఁడు నన్నిట్లు విరూపఁ గావించినాఁడు.నీవు,నిండుచందురునిం బోలునెమ్మొగంబు గలయాసీత నిపుడు చూచితివేని, తత్క్షణము మన్మథబాణములబారిం బడుదువు. నీ కాసీత భార్య గావలయునని కోర్కిగలుగునేని, ఇప్పుడే శీఘ్రముగా రామలక్ష్మణులను జయించుటకై కుడియడుగును ముందెత్తిపెట్టుము. రాక్షసేశ్వరా! ఘాతుకుఁడై యాశ్రమంబులఁ గాపున్నరాముని వధించి దానంజేసి వాఁడు వధించినట్టి రాక్షసులకందఱికిని ప్రియము గావింపుము. ఆ రామునిని మహారథుఁ డగులక్ష్మణునిని వాఁడిబాణముల వధింతువేని యప్పుడు సీత, రక్షించునాథుఁడు చావఁగా దిక్కుమాలిన దగునుగాన,దానిని సుఖముగాఁ గయికొని గలరూపున భోగముల ననుభవింపఁగలవు. రాక్షసేశ్వరా! రావణా! నే నిప్పుడుచెప్పుచున్నమాట నీకిష్టముగానున్న దేని నేను జెప్పినదానిని జంకుఁ గొంకుమాలి చేసి తీర్పుము. రాక్షసాధిపా! నీకుఁ గలబలమును ఆలోచించి, ఏయంగమునందును గందులేనియీసుందరిని ఆ సీతను, భార్యగా బలాత్కారమునం గొని తెచ్చుకొమ్ము. రాముఁడు జనస్థానమందలి రాక్షసులనందఱిని జంపుట వినియు ఖరునిని దూషణునిని

గూల్చుటఁ దెలిసియు నిఁక నీవిషయమునఁ జేయవలసిన దిది యని నిశ్చయించుట దగును' అని చెప్పెను. ఇది ముప్పదినాలుగవసర్గము.

❖

## రావణుఁడు మారీచునొద్దకుఁ బోవుట.

అంత నా రావణుఁడు, శూర్పణఖ గగురుపుట్టునట్లు చెప్పినమాటవిని మంత్రులవలన రాచకార్యములు తెలిసి వారలను వీడ్కొలిపి యంతఃపురమునకుఁ బోయెను. రావణుఁ డేకతమున సీత నపహరించుటనుగూర్చి తానై యాలోచించి యిట్లు చేయవలయునని మొదటనిశ్చయించి యంత నది రూఢియగుటకుఁగాను *దానిని తీర్పవలసినమార్గములలో దోష మెందుతక్కువ గుణమెందు మిక్కిలి యని వాని దోషగుణముల బలాబలములను విమర్శించి తుదకు నిట్లు చేయవలసినదని మనస్సులో నిశ్చయము చేసికొని యాబుద్ధిచలింపక యచటనుండి రమణీయ మైనయశ్వశాలకుఁబోయెను. ఆ రాక్షసవీరుఁడు తాను జేయుకార్యము మందోదరి మంత్రులు మొదలగువా రెఱింగిరేని వారింతురని, యెవ్వరికిని దెలియకుండునట్లు యాగశాలకుఁబోయి సారథింజూచి 'రథమాయత్తముసేయు'మని యాజ్ఞాపించెను. ఇట్లు చెప్పఁగా నాసారథి త్వరితముగాఁ బోయి క్షణమాత్రమున రావణునకు సమ్మత మయినయుత్తమరథమును బూన్చి తెచ్చెను. కుబేరునితమ్ముఁ డగునా రాక్షసేశ్వరుఁడు శ్రీమంతుఁడు గావున కామగమనమై రత్నభూషితమై పిశాచవదనములతోఁ గూడి కాంచనాలంకృతము లై యొప్పు గాడిదలను బూన్చినరథమును, మేఘమువలె ధ్వనిగొలుపఁగా, నెక్కి సముద్రముచెంతకుఁ బోయెను. దేవతలకు శత్రుఁడై మునీంద్రులం బొరిపుచ్చు రాక్షసేశ్వరుఁ డా రావణుఁడు తెల్లని వింజామరలును తెల్లనిగొడుగును బెడఁగార, నిద్ధమగు వైడూర్యమువంటి చాయగలిగి, యిట్లు చామరాది పరిచ్ఛదము కన్నులపండువుసేయఁగా, నిరువదిచేతులు గలిగి పదితలలతోఁగూడి పది శిఖరములుగల పర్వత రాజమువలె దేజరిల్లుచును ‡ అపరంజి పోఁగులుదాల్చియు కామగమనమైన రథమునెక్కియు, మెఱుఁపు జొంపములతోను గొక్కెరలతోను గూడిన మేఘమువలె మిక్కిలియుఁ బ్రకాశించెను.

* రావణుఁడు తానుబూనిన సీతాపహరణకార్యము పౌరుషమున చేయుట సుకరమా లేక శౌర్యముచేత చేయఁదగినదా, ఏపక్షమున దోషము అల్పముగాను గుణము ఎక్కువగాను నున్నది. అందు పౌరుషమునఁ జేయఁబూనినయెడల ఖరాదులతోడి యుద్ధమున రాముని యచింత్యపరాక్రమము దెలియుటవలన నది శక్యముగాదు. ఉపాయమున చౌర్యము చేయుటకుఁ బూనినచో నప్పటికి దోషములేవియుఁ గనఁబడవు. మఱియు సీతను బాసినవ్యసనమున రాముఁడు క్రుంగి హానియేమియుఁ జేయ నేరఁడు, అని దోషముయొక్కయు గుణముయొక్కయు ప్రాబల్యమును దౌర్బల్యమును ఆలోచించి నిశ్చయించుకొన్నాఁడని భావము.

‡ ఇట అపరంజిపోఁగులును మెఱుపులును, అలంకృతమైన రథమును కొక్కెరసమూహమును, రావణుఁడును మేఘమును, ఉపమానోపమేయములని తెలియునది.

ఆ వీర్యవంతుఁడు పర్వతములతోఁ గూడినదై నానాపుష్పఫలములు గలవేలకొలఁది వృక్షములు నెరసి బెరసినదై యున్న సముద్రతీరమును జూచుచుఁబోయెను. దాని తీరమున నలుగడల మంచిచల్లనినీళ్లు గలతామరకొలఁకులును, విశాలములై యాగవేదికలతో నొప్పుచున్న యాశ్రమములును నావరించి యుండినవి. మఱియు నరఁటిచెట్లును కందితీఁగెలును గ్రిక్కిఱిసియుండినవి. టెంకాయచెట్లు వన్నెగులుకుచుండెను. మద్దిచెట్లు తాటిచెట్లు తమాలపుచెట్లు మున్నగు వృక్షములు చక్కఁగాఁ బూచి యొప్పుచుండెను. నాగులును, గరుడులును, గంధర్వులును, గిన్నరులును, అయోనిజు లగు, వైఖానసులును మాషగోత్రమునఁ బుట్టినవారును, చంద్రసూర్యకిరణములె యాహారముగాఁ గొనువాలఖిల్యులును మిక్కిలి నియతాహారులైన పరమర్షులును, అచట సొంపుగూర్చుచుండిరి. కామములనెల్ల గెలిచినవా రగుసిద్ధులును చారణులును అందు సొబగుగఁ గనుపట్టిరి దివ్యము లయినయాభరణములను బుష్పమాలికలను దాల్చి దివ్యరూపములు గలిగి నానావిధక్రీడారతులం దాఱి తేఱినయప్సరసులు వేవురకొలఁది నా తీరమునఁ గనుపట్టిరి. శ్రీమతు లగుదేవతాపత్నులును అందు సేవించుచుండిరి. మఱియు నది మిక్కిలియు సిరులు గులుకుచుండెను. అమృతమును ద్రాగిన దేవతలును, తక్కుంగలదేవదానవులును అందు గుంపులుగ మెలఁగుచుండిరి. మఱియు హంసలును క్రౌంచములును నీరుకోళ్లును నెరసియుండెను. సారసపక్షులు కొలకొలమని మిక్కిలియు చప్పుడు గొలుపుచుండెను. వైడూర్యపురాళ్లను మెండుగాచూపట్టుచుండెను. మఱియు నది రమణీయమై సముద్రకాంతిచే మఱింత సుందరముగాఁ జూపట్టుచుండెను. ఇట్లాసముద్రతీరమున వీనినెల్లఁ జూచుచుం బోయి యాకుబేరునితమ్ముఁడు మార్గమునఁ దెల్లనివియు విశాలములునై, దివ్యపుష్పమాలికలతోఁగూడి, తూర్యఘోషములను గీతధ్వనులను బోరుకొనుచు, కామగమనములై, తపోబలమున దివ్యలోకమును సాధించినట్టిపురుషు లెక్కునట్టి విమానములను, గంధర్వులను, అప్సరసలను గాంచెను. మఱియు నిందునిర్యాసము దొలఁకుచుండుమూలము లనెడి యోషధులను, చందనవృక్షములు గలిగి సుందరములై ఘ్రాణమునకుఁ దనివిగా సుగంధము గుబాళించుచుండువనములను, మే లయినయగరువృక్షములయు తక్కోలవృక్షములయు మేలివాసనగలజాజికాయలయు వనములను, ఉపవనములను, తమాలవృక్షముల పుష్పములనును, మిరియపుఁదీఁగెలను, తీరమునంబడి యెండుచున్నముత్తెములసమూహములనును, నలుగడల సంకువులసమూహములనును, పగడముల రాసులనును, బంగరుకొండలనును, మఱియు మనోహరములయిన సెలయేళ్లనును, తేటనీటిని గులుకుచున్నమడుఁగులను జూచుచుఁబోయెను. మఱియు ధనధాన్యసంపన్నములై యుత్తమస్త్రీలతో నొప్పుచు రథగజతురగములు నిబిడములై యొప్పునగరములను వాఁడు చూచుచుఁ బోయెను. మిట్టపల్లములు లేక యంతటను రమణీయమై చల్లఁగా గాలి సోఁకుచుండ స్వర్గమువలె నతిసుందరమైయున్న సముద్రతీరమును

రావణుఁడు చూచెను. అచ్చట వాఁడు మేఘమువలె నున్నయొక మఱ్ఱిచెట్టును జూచెను. దానియందు ఋషులుండిరి. దానిశాఖలు నలుప్రక్కలను నూఱుయోజనములనిడుపు గలిగియుండెను. ముందు మహాబలవంతుఁ డగుగరుడుండు, పెనుకాయము గలయేనుఁగును, తాఁబేలును, దీసికొని వానిని దినుటకై యామ్రాని కొమ్మకు వచ్చివ్రాలెను. మహాబలవంతుఁ డగునాపక్షిశ్రేష్ఠునిభారమునకు దాళఁజాలక యాచెట్టుకొమ్మ తటాలున పెళపెళ విఱిగినది. ఆకొమ్మక్రింద చంద్రసూర్యకిరణములు ద్రావువారును ధూమమును ద్రావువారును అయోనిజులు నగువైఖానసులును వాలఖిల్యులును మాషలును అను మహర్షులుగూడి తపస్సుగావించుచుండిరి. గరుత్మంతుఁ డాఋషులవలనికనికరముచేత నూఱుయోజనముల నిడివి గలయాశాఖను గజకచ్ఛపములను రెంటినిని దీసికొని వేగమునం బోయెను. ఆ గరుత్మంతుఁడు ధర్మాత్ముఁడు గావున నొంటికాల నూని యాయెరను దిని,యంత నాశాఖను నిషాదులగ్రామము పై వైచి దానిని హతముచేసి వారినిభక్షించి యామహామునులను విడిపించి మిక్కిలి సంతోషమును బొందినవాఁడయ్యె. ఆ గరుత్మంతుఁడు బుద్ధిమంతుఁడు గావున నిట్లు గావించి యా సంతోషాతిశయమునఁ బరాక్రమము రెట్టింపఁగా, యమృతమునుదేరఁ దలంపుగొనెను. అతండు ఇనుపకిటికీలను బగులఁగొట్టి రత్నమయ మగుగృహమునుభేదించి మహేంద్రునిగృహమునఁ బదిలముగా రక్షితం బై యున్న యమృతమును దెచ్చెను. మహర్షిసమూహములు సేవింపఁగా, గరుడుఁడు కొమ్మ విఱిచినగుఱుతు నొఱపుచూపఁగా, నొప్పుచు సుభద్రమను పేరుగలిగి యున్న యామఱ్ఱిచెట్టు రావణునకుఁ గనుపట్టెను. వాఁడట్లు సముద్రమునవ్వలిగట్టుఁ జేరి, యచట,నే కాంతమును నతిరమణీయము నై పవిత్ర మగువనమునడుమ నొకయాశ్రమమును గాంచెను. రావణుఁ డయ్యాశ్రమమున కృష్ణాజినమును జటావల్కలములును దాల్చి నియతాహారుఁ డై యున్న మారీచుఁ డనురాక్షసునిఁ జూచెను. రావణుఁ డామారీచునియొద్దకుఁ బోవఁగా వాఁడును యథావిధిని మనుష్యులకు దుర్లభము లయినసకలభోగ్యపదార్థములచే నారాక్షసరాజుం బూజించెను. వాఁ డారావణున కట్లు అర్ఘ్యపాద్యము లిచ్చి యాహారములిడి,యతనితో మిక్కిలి యర్థవంతముగా,'రాజా! రాక్షసేశ్వరా! లంకయందెల్ల నందఱికిని మిక్కిలిక్షేమమే కదా! నీవే మరలి యొంటిగా వేగ నిచ్చటికి రానేల?' అని యడిగెను. మారీచుం డిట్లడుగఁగా మహా తేజంబు దొలఁక మాటనేర్పుగలుగు రావణుండు వానితో నంత నీవాక్యమునుచెప్పెను. ఇది ముప్పదియేనవసర్గము.

(రావణుఁడు మారీచునకు జనస్థానవృత్తాంతమును జెప్పి సీత నపహరించుటకై విచిత్రమృగరూపముదాల్చి తనకుఁ దోడుపడ వేఁడుట.)

'నాయనా! మారీచా! నేను జెప్పుచున్నమాటలను బాటించివినుము. నేను మిక్కిలి యార్తుఁడ నయితిని. అట్లార్తుఁడ నగునాకు నీవే పెద్ద దిక్కుచుమీ! నాతమ్ముఁడు ఖరుఁడును, మహాభుజుఁ డగుదూషణుఁడును, నాచెల్లెలు శూర్పణఖయు, మహాతేజుఁడును మాంసాహారుఁడు నగుత్రిశిరుఁ డనురాక్షసుఁడును, మఱియు శూరులయి కయ్యమునకుఁ దెఱపి గని తమకించుచుండుతిక్కనరాక్షసులు పెక్కండ్రును, నాయాజ్ఞచేత దండకారణ్యమున ధర్మచారు లగుమునులను బాధించుచు జనస్థానమున నెడతెగక యింపుసొంపారఁ గాఁపుందురని నీకుఁ దెలిసియున్నది. భయంకరకర్ములును క్రూరులునై కయ్యమునకుఁ దమకించుచు ఖరునిచిత్తము ననువర్తించుచు వానిక్రింద రాక్షసులు పదునాల్గువేవు రందు వాసము సేయుదురుగదా. జనస్థానమున నిపుడు వాసముచేయుచున్నమహాబలవంతు లగు ఖరుఁడు మున్నగు రాక్షసులు నానావిధము లయినయాయుధములనుగొని కట్టాయితులై రామునితో యుద్ధమునకుఁ బురికొనిరి. దానికి రాముఁడు రోషముగొని, కొంచెమేనియుఁ బరుసులయినను పలుకక గంభీరుఁడై వింట బాణములు గూర్చియు నేసియు విలువిద్యయంతయు జూపెను. కాలుబంటగునా కేవలమనుష్యుఁడొక్కఁడే యుగ్రప్రతాపు లగుపదునాలుగువేలరాక్షసులను తీక్ష్ణము లయినబాణములేసి రూపుమాపెను. ఖరుఁడు యుద్ధమున హతుఁడయ్యెను. దూషణుఁడును గూల్పఁబడినాఁడు. త్రిశిరుఁడుగూడ హతుఁడయినాఁడు. దండకారణ్య మిపుడు నిర్భయము గావింపఁబడినది. * తండ్రి కోపించి తఱుమఁగొట్టఁగా భార్యను దోడ్కొని యడవికి వచ్చినక్షత్రియపాంసనుఁ డా రాముఁడు ఆయువు క్షీణించుటచే నావలనిసైన్యమును హతము సేసినాఁడు. ఆరాముఁడు చెడునడతలవాఁడు, కఠినహృదయుఁడు, క్రూరుఁడు, మూర్ఖుఁడు, లుబ్ధుఁడు, ఇంద్రియలో

* ఇందులకు మూలము 'పిత్రా నిరస్తః క్రుద్ధేన సభార్యః క్షీణజీవితః। స హన్తా తస్యసైన్యస్య రామః క్షత్రియపాంసనః । దుశ్శీలః కర్కశః తీక్ష్ణో మూర్ఖోలుబ్ధో జితేన్ద్రియః। త్యక్తధర్మో హ్యధర్మాత్మా భూతానా మహితేరతః' ఇందులకు వాస్తవార్థము:— (క్రుద్ధేన పిత్రా) కుపితుఁడైన తండ్రిచేత, (నిరస్తః కిం) తఱుమఁగొట్టఁబడినాఁడా? కాదు-కైకేయీవరదానమున మోహితుఁడైన తండ్రిచేత ప్రార్థితుఁడై వనమునకు వచ్చినవాఁడు, (సభార్యః - సభా+ఆర్యః) సభయందు పూజ్యుఁడు - సభ్యుఁడనుట, (క్షీణజీవితః కిం) జీవితము క్షీణించినవాఁడా? కాదు. (తస్యసైన్యస్యహంతా) ఆఖరునిసైన్యమును సంహరించినవాఁడు, ఏలనఁగా (క్షత్రియపాంసనః) క్షత్రియాన్ పాతీతి - క్షత్రియపః-సచ అసౌ అంసనశ్చ - 'అంసన ఆఘాతే' అనుటంబట్టి క్షత్రియులను పాలించువాఁడు శత్రువులకు అంసనుఁడు- అనఁగా నాశము సేయువాఁడని యర్థము. ఇట్టివాఁడుకాఁబట్టి,(దుశ్శీలః కిం) దుశ్శీలుఁడా, కాదు-సద్వృత్తుఁడు, అయినను (కర్కశః) శత్రువులయెడల కఠినుఁడు. (తీక్ష్ణః) కార్యములందు అలసుఁడుగాఁడు-చుఱుకై

లుఁడు, ధర్మమువిడిచి యధర్మము నాచరించువాఁడు, ప్రాణులకుఁ గీడుగావించుట యందాసక్తుఁడైనవాఁడు. ఎవ్వఁడు వైరములేక ధర్మమునుగూడ నెంచక కేవలము తనబలమునే యూని యరణ్యమున నా చెల్లెలిని ముక్కు సెవులు గోసి విరూపగావించెనో, యట్టివానియిల్లాలిని దేవకన్యంబోలుదానిని సీతను జనస్థానమునుండి పరాక్రమించి దేనున్నాను. నీ వావిషయమున సహాయపడవలయును. నీవు మహాబలుఁడవు; కావున నీవును నాతమ్ములును సహాయులై నాప్రక్కనుండఁగా నేను యుద్ధమున దేవతలందఱును నొక్కటిగావచ్చినను సరకుసేయనుగదా! కాఁబట్టి, రాక్షసా! నాకు సహాయుఁడవగుము. నీవు మిక్కిలి సమర్థుఁడవుగదా! వీర్యమునను, యుద్ధమునను, దర్పమునను, నీకు సాటి యెవ్వఁడును లేఁడు. నీ కన్నియుపాయములును దెలియును. నీవు మహాశూరుఁడవు. సమస్తమాయలందు నాఱితేఱినవాఁడవు. మారీచా! ఇందుకొఱకే నేను నీయొద్దికివచ్చితిని. నాకు నీవు సాహాయ్యవిషయమై యేకార్యము చేయవలయునో చెప్పెదనువినుము. నీవు వెండిబిందువులతో వింతవన్నెలు గులుకుచున్నయొకబంగారుజింకరూపు దాల్చి యారాముని యాశ్రమమునకుఁ బోయి సీతముందఱ సంచరింపుము. సీత బంగారుజింకరూపున నున్ననిన్నుఁ జూడఁగానే 'దీనిని బట్టియిండు' అని తనపెనిమిటితోను లక్ష్మణునితోను తప్పక చెప్పఁగలదు. అంత వారిరువురును తరలిపోవఁగా మఱియెవ్వరు నచ్చట లేక యది శూన్యముగా నుండును. అప్పుడు ఏయడ్డియు లేక సుఖముగా, రాహువు చంద్రునిప్రభవును హరించునట్లు, సీత నపహరించెదను. *అటుపిమ్మట రాముఁడు భార్యావిరహమున స్రుక్కి కృశించిపోవునుగాన నతఁడు యుద్ధమునకువచ్చినను గృతార్థుఁడనై జంకుమాలి యతనిని బ్రహరించెదను' అనెను. రామునిఁగూర్చి విన్నంతనే మహాబలుఁడగు నామారీచుఁడు నోరెండ వడవడవడంకెను. వాఁడు ఎండిన పెదవుల నాఁకి తడుపుకొనుచు, ఱెప్పపాటులేని నేత్రవ్యాపారములతో చచ్చినజంతువువలె నార్తుఁడై రావణునిఁ జూచె

నవాఁడు, కాఁబట్టి (అమూర్ఖః) మూర్ఖుఁడుగాఁడు, (అలుబ్ధః) లుబ్ధుఁడుగాఁడు, ('జితేంద్రియః') అనిఛేదము - జితేంద్రియుఁడైనవాఁడు, (త్యక్తధర్మః) విరుద్ధధర్మములను త్యజించినవాఁడు, కాఁబట్టి (అధర్మాత్మా కిం) అధర్మాత్ముఁడా? కాఁడు - ధార్మికుఁడే, కాఁబట్టియే, ('భూతానాం అహితే అరతః' అనిఛేదము) సర్వభూతదయాపరుఁడనుట- మహేశ్వరతీర్థులు.

* ఇందులకు మూలము 'తతః పశ్చాత్సుఖం రామే భార్యాహరణకర్శితే। విస్రబ్ధః ప్రహరిష్యామి కృతార్థే నాన్తరాత్మనా' వాస్తవార్థము:— (రామేభార్యా హరణకర్శితే) రామ+ఇభ = గజమువంటిరామునియొక్క, ఆర్యా=పూజ్యురాలైన సీతను, హరణ=హరించుట చేత, కర్శితే=కృశింపఁజేయఁబడినదగుచుండఁగా-నాశరీరము అని శేషము - రామునిచేత నాశరీరము సీతాహరణమునుబట్టి కర్శితము కాఁగాననుట, (తతః) దానిచేత, (కృతార్థేన అంతరాత్మనా ఉపలక్షితః సన్) కృతార్థమైన అంతరాత్మ గలవాఁడనగుచు, (పశ్చాత్) వెనుక, (విస్రబ్ధం) నిష్కళంకముగా, (సుఖం) పరమానందసుఖమును - మోక్షమునను‌ట, (ప్రహరిష్యామి- ప్రకర్షేణ హరిష్యామి) మిక్కిలియుఁ బడసెదను. అని యాశయము

ను. వాఁడు తొల్లి దండకారణ్యమున రాముని పరాక్రమమును దెలిసియున్నవాఁడు గావున రామునిమాట వినఁగా మనసు తత్తఱించి యు త్తలపడ చేతులుమోడ్చి రావణుంజూచి వానికిని తనకును, హితమును యథార్థమునగుమాట నిట్లుచెప్పెను. ఇది ముప్పదియాఱవసర్గము.

(మారీచుఁడు సీతాపహారణము సమస్తరాక్షసనాశమునకును మూలముగాన వలదని రావణునకు హితోపదేశము సేయుట.)

మాటలయందు నిపుణుఁడును మహాప్రాజ్ఞుఁడు నగుమారీచుఁడు రాక్షసప్రభుఁ డగురావణుఁడు చెప్పినదివిని వానితో 'రాజా! స్వామికి, ఆపదవచ్చినపుడును, కీడు మేలెంచక యిచ్చకము లాడువారలు ఎల్లప్పుడును గావలసినంతమంది దొరకుదురు. అప్పటికి అప్రియమైనను పిదప హితమగుదానిని చెప్పువాఁడును, చెప్పినచో వినువాఁడును దొరకుట యరుదు. నీవు చారులను బుచ్చి శత్రువుజాడలు తెలిసికొనలేదు. మఱియుఁ జపలుండవు. కావున రాముఁడు మహాపరాక్రమశాలియనియు సకలగుణసంపూర్ణుఁడనియు మహేంద్రవరుణులతో సాటియైనవాఁడనియు నిజముగా నీకుఁ దెలియకున్నది. నాయనా! భూమిలో నింక రాక్షసులకెల్లను మంగళము కలుగునా? రాముఁడు కుపితుఁడై లోకములో రాక్షసులే లేకుండునట్లు చేయకుండునా? జనకరాజసుత సీత నీప్రాణము తుదముట్టించుటకై పుట్టినది కాకుండునా? సీతానిమిత్తమై నాకు వ్యసనము కలుగకుండునో? అడ్డుమడ్డులేక మనసునకువచ్చినట్లు విచ్చలవిడి నడచుకొను నిన్ను నేలికగాఁ బొంది, లంక నీతోను సమస్తరాక్షసులతోడను నాశమునొందకుండునా? ఎవ్వఁడు నీవలె విచ్చలవిడిగా నడచుకొనుచు దుశ్శీలుఁడై దుష్టవిచారములు సేయుచుండునో యట్టి దుర్మతి యగురాజు తన్నును తనబంధువులను తనరాజ్యమును జెఱుచుకొనును. రాముఁడు తండ్రిచేఁ దఱుమఁగొట్టఁబడినాఁడని వెక్కసలు చెప్పి  అతఁడు తండ్రిచే వెడలఁగొట్టఁబడినవాఁడుగాఁడు. అట్లగుటను మర్యాద తప్పినవాఁడుగాఁడు; లుబ్ధుఁడుగాఁడు; దుష్టస్వభావుఁడునుగాఁడు; క్షత్రియపాంసనుఁడునుగాఁడు; ధర్మముగాని గుణములుగాని లేనివాఁడునుగాఁడు; క్రూరుఁడుగాఁడు. అతఁడు కౌసల్యకడుపు చల్లఁగాఁ బుట్టి యానందముఁ బెంచువాఁడు. అతఁడు సమస్తభూతములకును గీడుసేయుటయందాసక్తుఁడునుగాఁడు నాయనా! అతఁడు తనతండ్రి కైకవంచనకుఁ జిక్కి సత్యపాశమునఁ గట్టువడియుండఁగాఁ జూచి యాధర్మాత్ముఁడు రాముఁడు కైకకోర్కితీర్చి తండ్రిని సత్యసంధుని గావింతు నని యూరు వెడలి యడవికి వచ్చినాఁడు. అతఁడు కైకయింపారుకోర్కిదీర్చుటకును తండ్రి దశరథునికోర్కి తీర్చుటకును రాజ్యమును భోగములను దిగవిడిచి దండకారణ్యమునకు వచ్చినాఁడుగాని వేఱుగాదు. నాయనా! రాముఁడు కఠినుఁడుగాఁడు; మూర్ఖుఁడుగాఁడు; ఇంద్రియలోలుఁడుగాఁడు; అబద్ధమును తప్పుడుమాటలనువిని నీవిట్లుచెప్పరాదు. రాముఁడు రూపమునొందినధర్మము; సత్పురు

షుఁడు, సత్యపరాక్రముఁడు; దేవతలకందఱికి నింద్రుఁడుంబోలె సమస్త జనములకును నతండు ప్రభుఁడు. అతనిసతి సీత తనపాతివ్రత్యపువైభవముననే సురక్షితయైనది. అట్టిసతినిబలాత్కారమున నీవెట్లు హరింపఁగోరెదవు.సూర్యునిప్రభ నెవ్వరేని తోడింబడ హరింపఁగలరా ? బాణములును వాఁదరలును జ్వాలలుగా మీఱ, విల్లును వాలును కట్టెలుగా నెట్టుకొన, రణమునఁ జెనకరానిదై దిగ్గనఁ బ్రజ్వలించుచున్న రాముఁ డనునగ్నిహోత్రములోఁ బడఁదగదు. ఆకర్ణాంతముగా లాగుటచే గుడుసుపడిన విల్లే విచ్చినదై మండుచున్న వాయిగాను, బాణములే యంచలిమంటలుగాను గలిగి లోకసంహారార్థము కుపితుఁడై వింటిని బాశమును దాల్చి వీరుఁడై పగవారిసైన్యముల మీఁచమడఁచునట్టిరాముఁ డనుయమునిచెంతకు, నాయనా ! నీరాజ్యమును సుఖమును బ్రియమైన జీవితమును దిగవిడిచి యిప్పుడుపోవలదు. జనకరాజసుతయగు సీత కుం బతి యైనయీరాముని తేజము అప్రమేయముసుమీ! అట్టిరామునివింటి నండ గొని యున్నయీమచ్చెకంటిని, జనకుని కులమునఁబుట్టిన యీవాలుఁగంటిని, వనమున హరింప నీవు సమర్థుఁడవుగావు.సింహమువంటి విశాల మగువక్షము గలయీనరసింహుఁడు ఆరాముఁడు, ఆరమణిని, తనప్రాణములకంటె మిక్కిలి గారాముగాఁజూచును. ఆ సీతయు నెప్పుడును పతినే యనువర్తించుచుండును. మండుచున్నయగ్నిహోత్రపుజ్వాలను జెనకఁ నలవిగానట్లు మహాతేజస్వి యగునారాముని గారాబుసీతను ఆ సుమధ్యను జెనకుట కెంతమాత్రము నలవిగాదు. రాక్షసాధిపా ! ప్రయోజనము లేని యీ పూన్కిని గావించుటవలన నీకు ఫలమేమి? యుద్ధమున నీవు రామునికంటఁబడితివా ! అదియె నీప్రాణమునకు అంతము సుమీ ! జీవితమును సుఖమును దుర్లభమగు రాజ్యమును చిరకాలము అనుభవింపఁగోరుదువేని రామునికప్రియమును జేయకుమీ! నీవు, మిక్కిలి ధర్మాత్ము లయినవిభీషణుఁడు మొదలగుమంత్రులతోఁగూడి యాలోచించి పిదప నీయంత నొంటిగాను నిశ్చయించి "గుణములయు దోషములయు బలాబలములను జక్కఁగా విమర్శించి నీబలమును రామునిబలమును గలరూపునఁ దెలిసికొని కీడుమేళ్లను నిశ్చయించుకొని, యేది యుక్తమో దానిని జేయుము. రాక్షసేశ్వరా ! నాకుమాత్రము నీవు దశరథరాజకుమారుఁ డగురామునితో యుద్ధము గావించుటయు కమగాదని తోఁచుచున్నది. నేను ముమ్మాటికి నీమాటయే చెప్పెదను. యుక్తియుక్తమును దేశకాలోచితము నగునాయీయుక్తమువాక్యమును వినుము" ఇది ముప్పదియేడవసర్గము.

మారీచుఁడు రావణునితోఁ దాను మున్ను బాలుఁడైనరాముని
వలనఁ బడినబన్నములును రాక్షసులవధమును జెప్పుట.

"మున్నొకప్పుడు నేను వేయిగజములబలిమి గలిగి కొండవలె గండుమీఱినన్ల నిమేఘమువలెఁ జూపట్టుచు, యపరంజిపోఁగులు చెవుల దులకింప కిరీటంబు దాల్చి ప

రిఘము కేలఁగొని లోకమునకంతయు భయముగలిగించుచు విక్రమమున భూమిని గ్రుమ్మరుచుండి ఋషిమాంసము భక్షింపవలయునని కొంతకాలము దండకారణ్యమునఁ దిరుగుచుంటిని. అంత, ధర్మాత్ముఁ డగువిశ్వామిత్రమహాముని, నాకు భయపడి, తానై దశరథమహారాజునొద్దకుఁ బోయి యతనితో 'రాజా! మారీచుఁడు మమ్ము మిక్కిలి ఘోరముగా బాధించి భయపెట్టుచున్నాఁడు. కాన నిప్పుడు రాముఁడు వచ్చి యెచ్చరికతో పర్వకాలమున నన్నుఁ గాచుచుండుఁగాక' అనెను. ముని యిట్లు చెప్పఁగా ధర్మాత్ముఁ డగునాదశరథమహారా జప్పుడు మహాభాగుఁ డగువిశ్వామిత్రమహర్షిం జూచి 'ఈబాలుఁడు రాముఁడు పండ్రెండేండ్లవాఁడు. అస్త్రములందు గడిదేఱకున్నాఁడు. నీవు కావలెనన్నచో నాకుఁ గలసైన్యమునంతయు వెంటఁదీసికొని నేనే యెంతయు వచ్చెదను. మునితిలకా! చతురంగబలములతోడ నేనేవచ్చి రాక్షసులను మఱి నీమనస్సునఁ గోరినశత్రువులను వధించెదను' అనెను. రా జిట్లు చెప్పఁగా ముని యతనితో 'లోకమున రాముఁడు తప్ప, మఱి యెంతబలమయినను, ఆరాక్షసునిఁ దీర్పఁజాలదు. నీవో కేవలుఁడవుగావు సరే. యుద్ధములను దేవతలనుగూడ రక్షించినవాఁడవే. రాజా! నీవు గావించినకృత్యములు ముల్లోకములను ప్ర[illegible] పరంతపా! నీకుఁ గలసైన్యము గొప్పదే యగుఁగాకేమి! అయినను నది యారాక్షసునిఁ జెనకఁజాలదు. అదంతయు నిచటనే యుండుఁగాక. ఈ రాముఁడు బాలుఁడయినను, మహాతేజుఁడు. పరంతపా! అట్లుగావున నేను రామునిఁ దోడ్కొనిపోయెదను. నీకు శుభమగుఁగాక' యనెను. విశ్వామిత్రముని యిట్లు చెప్పి రాజకుమారుని రామునిఁ దోడ్కొని పరమసంతుష్టుఁడై తనయాశ్రమమునకుఁ బోయెను. అప్పుఁడు రాముఁడు దండకారణ్యమునం దాముని తనయాశ్రమమున యాగమునకై దీక్షవహించి యుండుటఁ జూచి చిత్రంబగుధనువును సారించుచు నమ్మునిదాపునఁ బదిలముగాఁ గాపుండెను. అప్పుడు ఆశ్రీమంతునకు మీసములు మొదలయినయావనపుఁజిన్నెలు తలసూపలేదు. కన్నులు తామరరేకులవలె దులకించుచుండెను. బ్రహ్మచారియగుటచే నొంటివస్త్రముగట్టి బంగారుదండతోఁ జుట్టఁబడిన కూఁకటిజుట్టుగలిగి నెమలికుత్తుకవలె నిగనిగమెఱయుఁ దనమేని మెఱుంగుఁజాయచే దండకారణ్యమును వెలిఁగించుచు క్రొత్తగాఁ బొడిచినబాలచంద్రునివలె కన్నులపండువుగా నాకుఁ గనుపట్టెను.అంత నీలమేఘాకారమున మంచి బంగారుపోఁగులు చెవుల చౌకళింపఁగా,బలము మిగిలియున్న నేను, వరములఁ బడసియున్నగర్వమున విఱ్ఱవీఁగుచు నామునియాశ్రమమునకుఁ బోయితిని. నే నాయుధమునుబట్టి రాముఁడు చూచుచుండఁగా,చటాలున నాశ్రమమునుఁ జొచ్చితిని. రాముఁడు నన్నుఁ జూడఁగానే యెంతమాత్రమును దొట్రుపడక వింటిని మోపెట్టెను. నేను అజ్ఞానమున 'వీఁడొకపిల్లవాఁ' డని రాముని సరకుసేయక వేగిరపడి విశ్వామిత్రుని యాగవేదిపైకి నుఱికితిని. అంత నా రాముఁడు పగవారిపీఁచమణఁచు నొకవాఁడిబాణమును వైచెను. ఆ బాణపుఁదెబ్బకు నేను నూఱుయోజనముల కావలసముద్రమునఁ

బడితిని. నాయనా ! అప్పు డావీరుఁడు నన్ను వధింపనొల్లనందున నా ప్రాణములఁ గొనక రక్షించెను. నేను రాముని బాణపునురవడిచేఁ జిమ్మఁబడి సముద్రమునఁబడి మూర్ఛనొందితిని. నాయనా ! అప్పు డాబాణవేగమున నేను లోఁతయినసముద్ర జలములంబడి చాలసేపటికి తెలివినొంది తెప్పిరి లంకాపురికి వచ్చితిని. అప్పటికి రాముఁడు బాలుఁడు;ఇంకను అస్త్రములం దాటి తేటియునుండ లేదు. అక్లిష్టకర్ముండు. అట్లుండఁగానే నను బోఁటివాని నట్లు జిమ్మివిడిచెను. నాసహాయులనెల్లఁ బడఁగూల్చె ను. రావణా ! రాముఁ డిట్టివాఁడుగావున నేను వలదని వారించుచుండఁగా వినక నీవు రామునితో విరోధము పెట్టుకొందువేని, శీఘ్రముగా గొప్ప యాపదం బొందఁగలవు. నీవు చెడుట యేకాదే ! నానావిధ లీలాభోగ క్రమములం దేలుచు సభ లుగూడుచు పండుగలు సేయుచు సుఖించుచున్న రాక్షసులకునుగూడ దుఃఖమును సంతాపమును దెచ్చినవాఁడవగుదువు. మేడలును ఉప్పరిగలును క్రిక్కిఱిసి గృహ ద్వారములందు నానా రత్నములచే నలంకృతములైయున్న లంకాపురి సీతానిమి త్తమై నశించుటం జూడఁగలవు. సర్పములుండు నట్టిమడుఁగునం దుండుటచే మత్స్య ములుగూడ గరుడునిచే భక్షింపఁబడునట్లు, పాపము లేమియుఁ జేసియెఱుఁగనిపరి శుద్ధాత్ములుగూడఁ బాపులసహవాసము చేత వారలపాపదోషమునఁ దామును నశింతురు. దివ్య మైనచందనము మేన నలఁదుకొని, దివ్యము లైనభూషణములను నలంకరించుకొని యుండు రాక్షసులు నీదోషమునం జేసి రామబాణములం గొట్టువడి కూలుట చూడఁగలవు. హత శేషు లగురాక్షసులు, రక్షించు దిక్కుగానక కొందఱు భార్యలను దిగవిడిచియు,కొందఱు భార్యలంగూడియు పలుదిక్కులఁ బాఱుచుండఁగాఁ జూడఁగలవు. లంకాపురమంతయు బాణజాలములఁ బొదువంబడి యగ్నిజ్వాలలు నలుగడలఁ గడలుకొన, మండుచును మండి నీఱయ్యు నున్నగృహంబులతోఁగూడి యుండఁగాఁ జూడఁగలవు. ఇది నిజము. రాజా ! పరదారగమనము కంటెను, గొప్ప పాపము మఱొకటిగలుగదు. వేయిమంది స్త్రీలు నిన్నుఁ బెండ్లాడినవా రున్నారు. పర స్త్రీలఁ గోరకుము. రాక్షసతిలకా ! పరస్త్రీసంగముమాని నీసొంతభార్యలయందె యాసక్తుఁడవై యుండుము. నీకులమును, మానమును, సంపదను, రాజ్యమును, ప్రియమగు జీవితమును, రక్షించుకొనుము. చిరకాలము సౌందర్యవతు లగుభార్య లతో నుపభోగించుచు, మిత్రవర్గముతోఁగూడి సుఖించుచు నుండఁగోరుదువేని, రామున కెంతమాత్రము నపకారము సేయవలదు. నీమేలు మనస్సునంగోరి నేను వలదని నొక్కిచెప్పుచుండఁగా వినక నీవు బలాత్కారమున సీతనుబట్టుదువేని, రామబాణములకు నీయును రప్పగించి నీవు బలము క్షీణించి బంధుసహితముగా య మపురము సేరంగలవు'' ఇది ముప్పదియెనిమిదవ సర్గము.

మారీచుఁడు రామవృత్తాంతమును రావణునకుఁ జెప్పుట.

"అప్పుడు బాల్యమునందు రాముఁడు నన్నిట్లు కేలకు మన్నించి విడిచిపుచ్చెను. అతనికి యౌవనము వచ్చిన వెనుక జరిగినవృత్తాంతమును జెప్పెదను వినుము. మాతాడక యూరకవినుము. రామునిచే నట్లు దెబ్బదినియు నంత నూరకుండక నేను మరల మృగరూపములను దాల్చినయిద్దఱురాక్షసులతోఁగూడి దండకారణ్యమును జొచ్చితిని. నేను నాలుక మిక్కిలియు వెలుఁగ కఱకుఁగోఱలుమీఱ పెద్దమేనును గలిగి మహాబలమును మాంసభక్షము నగు పెద్దజింకనై దండకారణ్యమున సంచరించితిని. రావణా ! నేను మిక్కిలియు భయంకరముగా నగ్నిహోత్రములయొద్దను ఋణ్యతీర్థములందును చైత్యవృక్షములచెంతను ఋషులను మిక్కిలి యదల్చుచుఁ దిరుగుచుంటిని. దండకారణ్యమున ధర్మచారు లగుఋషులను వధించి వారినెత్తురులఁ గ్రోలుచు మాంసములను భక్షించుచునుంటిని. ఇట్లు క్రూరుఁడనై ఋషిమాంసము లాహారముగా మెసవుచు వనమునందలివారిని వెఱపించుచు మిక్కిలియు నల్లఁ ద్రావి మత్తిల్లి ధర్మములును జెఱుపుచుఁ దిరుగుచుంటిని. అప్పుడు నేను, ఋషివేషము దాల్చి ధర్మము నాచరించుచుండు రాముని మహాభాగ యగుసీతను మహారథుఁ డగులక్ష్మణునిని చేరం బోయితిని. నేను గఱకుఁగొమ్ములుగలజింకరూపమును దాల్చినవాఁడనై యతండు గొట్టినదెబ్బను తలఁచి మిక్కిలి కుపితుఁడనై, పూర్వవైరమును స్మరించుచు బుద్ధిమాలి 'వీఁ డొకతాపసవేషము దాల్చి యున్నవాఁడు గావున నిపుడేమియుఁ జేయుఁ'డని తలఁచి,యతనిని జంపఁబూని తాపసుఁడును నియతాహారుఁడును సర్వభూతహితరతుఁడునై,యడవికి వచ్చి యున్నమహాబలుని రామునిఁ దృణీకరించి వధింపవలయునని యాతనిపయికి నురవడించితిని. ఆరాముఁడు వింటిని బలముగా నాకర్షించి, గరుడునివలెను వాయువువలెను గిఱ్ఱుమని వేగంబాఱునట్టి బాణములు మూఁటిని పగవారిని గీటణఁచువానిని బ్రయోగించెను. వజ్రములవలెఁ గటువులై రక్తంబు గ్రోలునవై వంగిన గనుపులు గలయాబాణములుమూఁడును, వింటిని బలముగా లాగి విడుచుటంజేసి, నొక్కపెట్ట మాపైకి నురవడించినవి. నేను మున్ను రామునిబాణము బారింబడి భయము గుడిచియున్నవాఁడను గావున రామునిపరాక్రమము నెఱిఁగి పలాయితుఁడ నయితిని. రామబాణము పలాయితులజోలికిఁ బోవదు గనుక దానినుండి తప్పించుకొంటిని. ఆ యిద్దఱు రాక్షసులును రాముని పరాక్రమము నెఱుఁగరుగావున మార్కొని హతులైరి. అట్లు రామునిబాణబాధబారింబడి యెట్లో తప్పించుకొని ప్రాణములు దక్కించుకొని దుష్టకార్యములన్నియుఁ దొలఁగఁబెట్టి తపోనిష్ఠుఁడనై యోగాభ్యాసము సేయుచు నిచటనున్నాను. చెట్టుచెట్టునకు రాముఁడు నారచీరలును కృష్ణాజినమును దాల్చి విలుఁబట్టి పాశహస్తుఁ డగుయమునికైవడి భయంకరముగా నాకుఁ జూపట్టుచున్నాఁడు. రాముఁడొక్కఁడే చెట్టుచెట్టుకడ వచ్చి చూపట్టుచున్నాఁడు గాఁడు. రావణా ! దిగులుచెందిననాకుఁ బెక్కువేలరాములు గనుపట్టుచున్నారు.

ఈయడవియంతయు నాకు రామమయముగాఁ దోఁచుచున్నది. రాక్షసాధిపా! ఇది రామునిమాయచేఁ గలిగినదిగాదు. రాముఁడు లేనిచోటఁగూడ నాకు రాముఁడే తప్పక పొడసూపుచున్నాఁడు. మేలుకొన్నప్పుడే కాదు; కలలోఁగూడ రామునిఁజూచి నెఱుకతప్పి తబ్బిబ్బునఁ గలవరించుచున్నాను. రావణా! నేను రామునింజూచి దిగులుగూరియుండుటవలన రకారము మొదటఁగల రత్నములు రథములు మొదలగుపేళ్లుగూడ, మొదటియక్షరము వినుచుండఁగానే రాముని పేరే చెప్పఁబడునోయని భయము గలిగించుచున్నవి. వాని రెండవయక్షరము విన్నపిదప నది నివర్తించుచున్నది. నాకారాముని ప్రభావము చక్కఁగాఁ దెలియును. కనుక నతనితో యుద్ధముసేయుట నీకెంతమాత్రము దగదు. రాముఁడు బలినిగాని, నముచినిగాని, వధింపఁజాలునంతటివాఁడుసుమీ! రాక్షసోత్తమా! నీవు పగదీర్చుకొనఁగోరుదువేని రాముని మార్కొని యుద్ధముసేయుము. కాదేని ఖరాదులను జంపినందుల కోర్చి కాని యూరకుండిన నుండుము. నీవు నన్నుఁ బ్రాణములతో నుండఁ జూడఁగోరుదువేని రాముని ముచ్చటమాత్రము నాయొద్దఁ జేయవద్దు. లోకమునందు యోగ్యులై ధర్మము ననుష్ఠించుచుండుసత్పురుషులు పెక్కండ్రు తాము దోషరహితులయ్యును ఒరుల యపరాధమువలనఁ దమపరిజనులతోఁగూడ నాశమునొందియున్నారు. రాక్షసేంద్రా! అట్లే సాధువృత్తిఁ బూనియున్న నేనును నీయపరాధమున నాశమునొందుదును. నీకేది యుక్తముగా తోఁచునో యట్లు చేసికొనుము. నా కాజోలి వలదు. నీవెంట నేనెంతమాత్రము రాను. రాముఁడు మహాతేజుఁడు, మహాధీరుఁడు, మహాబలుఁడు. రాక్షసులకందఱికిని నతండంతకుఁడే కాకపోవునా? రాముఁడొకరికిదుఃఖము కలిగించుకార్యములు సేయువాఁడుగాఁడు. 'శూర్పణఖను విరూపను జేసి యందులకై యుద్ధమునకు వచ్చిన ఖరునిఁ జంపినాఁడే?' యందువేని శూర్పణఖ సీతను జంపఁబోవఁగా రాముఁడు దాని నట్లుగావించెను. అందులకై ఖరుఁడుమీఱి యతనిఁగొట్టరాఁగా రాముఁడాత్మరక్షణమునకై వానిని వధించెను. ఇందు రాముని తప్పేమియున్నది? యథార్థముగాఁ జెప్పుము. నేను బంధువగునీకు హితముగోరువాఁడను గనుక నేను పరమార్థముగాఁ జెప్పుచున్నమాటను అంగీకరింపవేని యుద్ధమున రాముని చక్కని బాణములహతుఁడవై బంధుసహితముగా నిపుడు ప్రాణములు విడువఁగలవు" అనెను. ఇది ముప్పదితొమ్మిదవసర్గము.

(రావణుఁడు మారీచుఁడు చెప్పిన హితోపదేశమును నిరాకరించి
బలాత్కారమునం దనకుఁ దోడుపడ నియమించుట.)

రావణుఁడు, మారీచుఁడు తనకు యుక్తియుక్తముగా తన్నుమరల్పఁదగునట్లింత చెప్పినను, చావఁగోరినవాఁడు మందును బుచ్చుకొననియట్లు, వానిమాటను గయికొనఁడయ్యె. ఆరాక్షసవిభుఁడు కాలచోదితుఁడగుటంజేసి తన కనపాయముగాను సుఖావ

హముగాను నుండుమాటలను మారీచుఁడు చెప్పినవాఁడయ్యె వానితో నయుక్తార్థము గాను బరుషముగాను, 'మారీచా ! నావిషయమై రాజుచి తముునకుఁ బొసఁగనియీాయ నుచితార్థములను చెప్పితివిగా ! అవియెల్లఁ జవుటినేలయందు నాటినవి త్తనములవలె నెంతయు నిష్ఫలములునుమీా ! రాముఁడు నిష్కారణముగా ఖరాదులను జంపినపాప శీలుఁడు, మూర్ఖుఁడు, విశేషించియు నొకమనుష్యుఁడు. అట్టివానితో యుద్ధముసేయ నాకుఁ దగునా ? కాన సీతాపహరణమునుండి మరల్చి వానితో యుద్ధమునకు నన్నుఁ బూన్చుట నీమాటలచే నెంతమాత్రము శక్యముగాదు అట్టివానికి భార్యనపహరిం చుటయే తగిన ప్రతికారము.'వాఁడు మూర్ఖుఁ డెట్లందువా? కేవలమైన యొకయాఁడు దానిమాటవిని తక్షణమే చెలికాండ్రను రాజ్యమును తల్లిదండ్రిని దిగవిడిచి యచ టినుండి యడవిని చేరినంతటివాఁడుగదా. అవశ్యము నేను యుద్ధమున ఖరునివధించి న యాఘాతుకునికి ప్రాణములకంటె మిక్కిలియుగా రామగు నిల్లాలిని సీతను నీయెదు టనే తప్పక నపహరింపవలయునని కంకణము గట్టుకొంటిని. మారీచా! ఇట్టియభిప్రా యము నేను మనస్సున గట్టిగా నిశ్చయించుకొనియున్నాను. ఈ నిశ్చయమును దేవేం ద్రుఁడును సురాసురులందఱును ఒక్కటియై వచ్చినను మరల్పఁజాలరు. నేను బూ నినకార్యమును నిశ్చయించువిషయమై 'గుణమేది? దోషమేమి? దానిని సాధించునుపా యమేది? అపాయమెయ్యది?' యని నిన్నడిగితినేని నీవిట్లు చెప్పవచ్చును. సంప త్తిని బడయఁగోరినపండితుఁ డగుమంత్రి, రాజు తన్నడిగినపిమ్మటనే చేతులు మోడ్చు కొని తనకుఁ దోఁచినది రాజునకు జెప్పికొనవలయును. అడుగనియెడఁ జెప్పనేరాదు. అట్లు రాజునకు హితముచెప్పుటయందును, రాజునకు విరుద్ధముగాకుండునట్లు మృదు వుగను ఉపచారపూర్వముగను మంచిమాటలుగనుఁ జెప్పవలయును. మారీచా! తిరస్కారముతోఁ జెప్పఁబడునేని యది హితవాక్యమయినను సమ్మానరహితమగుటచే సమ్మానయోగ్యుఁ డగురాజు దానిని మెచ్చఁడు. అమితప్రతాపు లగురాజులు, అగ్ని ఇంద్రుఁడు, చంద్రుఁడు వరుణుఁడు యముఁడు అను నీ యేవురిరూపములను దాల్చి యుందురు. రాక్షసా! అట్లు మహాత్ము లగునారాజులు అగ్నిదేవుని వేఁడిమిని, నింద్రుని ప రాక్రమమును, చంద్రునిచల్లఁదనమును, వరుణుని ప్రసన్నతను, యమునిదండమును, దాల్చియుందురు. కాఁబట్టి రాజులను సర్వావస్థలయందును గౌరవించుచుఁ బూజించుచు నుండవలయును. నీవు రాజధర్మమును దెలియక కేవల మజ్ఞానమునం బడి దుష్టత్వము వలన నీయింటికి వచ్చినరాక్షసరాజును నన్నుఁ జూచి పరుషములాడఁగోరుదువా! మా రీచా ! ఇప్పుడీవిషయమునందు గుణదోషములనుగాని యుక్తాయుక్తములనుగాని నే ను నిన్నడుగలేదు. నేనిప్పుడు నీకింతమాత్రము కార్యముచెప్పితిని. నీవు కొలఁది లేని పరాక్రమము గలవాఁడవుగావున దానిని చేసి తీర్పవలయునుగాని మాటాడఁగూడ దు. ఆ కార్యమేమనఁగా ఈ మహాకార్యమునందు నీవు నాకు సాహాయ్యము చేయ వలయును. నాకు సాహాయ్యము చేయుటలో నీవు నా కేమి చేయవలయునో చెప్పెద

వినుము. నీవు వెండిచుక్కలచే చిత్రింపఁబడిన బంగారుజింకరూపు దాల్చి యారాముని యాశ్రమమునకుం బోయి సీత యెదుటం దిరుగుము. సీతకు నీపయిని మిక్కిలి యాసఁ గల్పించి యంత నీయిచ్చవచ్చినదారిని బోవచ్చును. బంగారుమయమైనమాయామృగ మగునిన్నుం జూడఁగానే సీత యబ్బురపడి 'యాజింకను దెచ్చి యి'మ్మని రాముని నడుగం గలదు. రాముఁడు నిన్నుఁబట్టుటకై సీతను లక్ష్మణుని వదలి తొలఁగివచ్చినపిదప నీవు దూరముగాఁ బోయి రాముఁడు చెప్పినట్లుగానే తోఁచునట్లు, 'అయ్యో! సీతా! లక్ష్మణా!' యని యఱవుము. ఆ మాటను విని లక్ష్మణుఁ డేమియుఁదోఁచక తొట్రుపడుచు సీత పురికొలుపుటవలనను అన్నవలని మంచిమనస్సువలనను రాముఁడు పోయినమార్గమును బట్టిపోవును. అట్లు రాముఁడును లక్ష్మణుఁడును సీతను విడిచి తొలఁగి పోవఁగానే, ఇంద్రుఁడు శచీదేవింబోలె, సుఖముగా సీతను దెచ్చెదను. సువ్రతా! నీ వీకార్యము నేనుజెప్పినయీరీతిని గావించి నీయిచ్చకు వచ్చినచోటికిఁ బొమ్ము. నీకు నారాజ్యములో సగమిచ్చెదను. సౌమ్యా! ఈ కార్యము వర్ధిల్లుకొఱకు సుందరమగు మృగరూపమునొంది దండకారణ్యమునకుఁ బొమ్ము. నేనును రథమునెక్కి నీవెంట వచ్చెదను. ఇట్లు రాముని వంచించి యుద్ధము సేయవలసినదిలేకయే సీత నపహరించుకొని కృతార్థుఁడనై నిన్నుఁగూడి లంకకు మరలిపోయెదను. మారీచా! నీ వీకార్యమును జేయవేని నిన్నిపుడే చంపుదును. కాన యిపుడు బలాత్కారమునైనను నీచే నీకార్యము నవశ్యము జేయింతును. రాజునకు ప్రతికూలముగా నుండువానికి నొకప్పుడును సుఖముగలుగదుగదా! నీ వారామునియొద్దకుఁ బోవుదువేని నీకు ప్రాణములు దక్కినను ఒకవేళ దక్కవచ్చును గాన మరణము సందేహము. నాతో విరోధించితివా మరణమిప్పుడే నిశ్చయమనుసుమీ! ఇది యిట్టిదిగానే నీబుద్ధియందు రూఢిగా నిశ్చయించి యీరెంటిలో నీ కేది హితమో దానిని గావింపుము'' అనెను. ఇది నలువదియవసర్గము.

।మారీచుఁడు రావణునకు మఱియు హితములు బోధించుట।

రావణుఁడు తనరాజత్వము దోఁపఁగ 'నీ కిష్టము లేకున్నను జేసి తీఱవలయును' అని తనకుఁ బ్రతికూలముగా నాజ్ఞాపింపఁగా, మారీచుఁ డారాక్షసేశ్వరునిఁ జూచి, పరుషవాక్యముల 'రావణా! ఏపాపకర్ముఁడు నీకును నీకొడుకులకును నీరాజ్యమునకును నీమంత్రుల కందఱికిని వినాశము గలిగించునట్టి యీ యుపాయము నీ కుపదేశించినాఁడు? రాజా! నీవు సుఖముగా నుండుట నే పాపాత్ముఁడు చూడఁజాలకున్నాఁడు. మృత్యువునకు ద్వారమువంటి యీతుంటకార్యమును నీకు సాకుపెట్టి యెవఁడు బోధించెను. పరాక్రమహీనులెవరో రాక్షసులు నీశత్రువులు. ఇందులకు సందేహము లేదు. నీకంటె బలీయుఁడగు రామునిచేత నీవు చిక్కి నశింపవలయునని వారు కోరెదరు. రావణా! కేవలము పగవాఁ డిట్లుచేయఁడు; అందును క్షుద్రుఁడునుగూడ నగువాఁడెవ్వఁడు, నీకు నీవే ప్రయత్నపడి నాశముఁపొందవలయునని కోరి యహితవాదియై యీబుద్ధి నుప

దేశించినాఁడు? రావణా! లోకశాస్త్రవిరుద్ధమగుమార్గమును ద్రొక్కిన నిన్ను నీమంత్రులెవ్వరును నిగ్రహింపకున్నారే! కావున, వారలందఱును వధ్యులు. వారల నేల వధింపకున్నావు. రాజు తనయిచ్ఛకు వచ్చినట్లు నడచుచు, దుర్మార్గమునకుఁ బూనునేని సత్పురుషు లగుమంత్రు లతని నన్నివిధముల నిగ్రహింపవలయును. అట్లు దుర్మార్గము నొంది నిగ్రహింపవలసియున్న నిన్నువా రేల నిగ్రహింపకున్నారు? జయించువారలలో మేటివి.! రాజు దోషములులేనివాఁడై సుగుణములు గలిగియుండునేని మంత్రులకును ధర్మమును గామమును కీర్తియును గలుగును. రావణా! రాజు దుర్గుణుఁడగునేని మంత్రులకు ధర్మము మొదలైన వొక్కటియుఁ గలుగదు. అన్నియు వ్యర్థములేయగును. మంత్రులేకాదు, రాజునకు గుణములేనందున నితరజనులుగూడ వ్యసనముపాలగుదురు. జయశీలతిలకా! ధర్మమునకును జయమునకును రాజే మూలముసుమీ! కావున సర్వావస్థలయందును రాజులను రక్షింపవలయును. రావణా! క్రూరుఁడగువాఁడుగాని, ప్రజలకు ప్రతికూలుఁడగువాఁడుగాని, ఇంద్రియనిగ్రహము లేనివాఁడుగాని, రాజ్యము నెంతమాత్రము పాలింపఁజాలఁడు. గుఱ్ఱములు పటుత్వములేని సారథి తోలఁగా, మిట్టపల్లములుగానుండు ప్రదేశమున మిక్కిలి వేగముగాఁబోయి యాసారథితోఁగూడఁ గూలునట్లు, వేండ్రములైన యుపాయములను ప్రయోగించు మంత్రులు అసమర్థుఁడగుటచేఁ దమయాలోచనలు వినురాజుతోఁగూడ భగ్నులగుదురు. లోకమునందు నీతిమార్గనిష్ఠులై ధర్మము తప్పక యనుష్ఠించు ధర్మజ్ఞు లగుసత్పురుషులు పెక్కండ్రు, ఇతరులను నమ్మి, వారలయపరాధమువలనఁ దాముసుపరివారసహితముగా నాశమునొందియున్నారు. మేఁకలు తమకుఁ బ్రతికూలమై క్రూరముగాఁ బెఱికి తిను నక్కరక్షణములో నుండునేని పెంపులేక క్షీణించునట్లు, ప్రజలకు విరోధియు క్రూరుఁడునగురాజుచే రక్షింపఁబడువారు పెంపునొందరు; మఱి క్షీణింతురు. రావణా! నీవును క్రూరుఁడవై యింద్రియలోలుఁడుగా నుండుటచే, నీవు రాజుగాఁగలరాక్షసులందఱును తప్పక నాశమునొందఁగలరు. నాకు దైవికముగా భయంకరమగు నీకార్యము, ఈవిపత్తు గలిగినది. నేను గావలయునని దీనిఁ దెచ్చుకొనలేదు గావునను పరాకునఁ గలుగుటవలనను నాకొక్కనికి నాశము గలుగుటనుగుఱించి దుఃఖింపవలసిన పనియేమి? ఏమియులేదు. నీవో యీవిపత్తును బుద్ధిపూర్వకముగా నిట్టిది దెచ్చుకొన్నవాఁడవు; మఱియొక్కఁడవుగావు నీ బంధుపరివారములతోఁగూడ నశించెదవే! కావున నిన్నుఁగూర్చియే దుఃఖింపవలసియున్నది.*'నీవులేదా' యందువా? రాముఁడు నన్ను వధించినపిదప శీఘ్ర

---

* ఇట మారీచుఁడు విశ్వామిత్రయాగరక్షణము మొదలుగా ఖరాదివధమువఱకును రాముఁడు చూపిన అతిమానుషచారిత్రమును దలఁచుకొని అతఁడసాధారణమహిముఁడనియుఁ గావున పరమపురుషుఁడనియు నిశ్చయించి యతనిచేతులార వధింపఁబడుట పరమపురుషార్థమని చెప్పినాఁడు. కావుననే నృసింహపురాణమున 'రామాదపిహి మర్తవ్యం మర్తవ్యం రావణాదపి। ఉభయోరపి మర్తవ్యే పరంరామాన్నరావణాత్' అని రావణునిచేఁ జచ్చుటకంటె రామునిచేతఁ జచ్చుటే మేలన్నాఁడు.

ముగానే నిన్నువధించును. నిన్నుఁజంపునట్టి రామునిచేతఁ జచ్చుటవలనఁ గృతార్థుఁడ నయ్యెదను. రామునిఁ జూచినంతనే నేను హతుఁడనైతినని నిశ్చయించుకొనుము. సీత నపహరించినంతనే నీవును నీబంధువులతోఁగూడ హతుఁడవౌదువని తెలియుము. నీవు నన్నుఁగూడి యాశ్రమముననుండి సీతను దెత్తువేని, యిఁక నీవు బ్రతికియుండఁ బోవుటలేదు. నేనును లేదు; లంకయు నశింపక మానదు. రాక్షసులును జీవించియుండఁబోవరు. రావణా! నేను నీమేలుఁగోరి వలదని యెంతదూరము వాదించుచున్నను, నామాటను పాటిగా విమర్శింపకున్నావు. ఆయుస్సు ముగియునప్పుడు, మరణము దాపింపఁగా, మనుష్యులు పీనుఁగులతో సాటియే యగుదురుగావున, పీనుఁగువలెనే స్నేహితులు చెప్పునట్టి హితమును నాలకింపరు" అని మారీచుఁడు చెప్పెను. ఇది నలువదియొకఁడవసర్గము.

మారీచుఁడు రావణునితోఁగూడ రథమున నానానగరాదు లనుసూచుచు దండకారణ్యమందలి రామాశ్రమమునకుఁ బోవుట. విచిత్రమృగరూపమును దాల్చి మెలఁగుట. అప్పుడు పువ్వులు గోయ వచ్చినసీత దానిం జూచి యాశ్చర్యపడుట.

అంత మారీచుఁడు రావణునితో నిట్లు చెప్పి యంత రాక్షసరాజగు రావణునకు భయపడి, దుఃఖితుఁడై 'పోవుద' మని 'వానితో వింటిని బాణములను గత్తిని దాల్చి నన్నుం జంపుటకై బాణము దీసినరామునికంటియెదుట నేను బడవలసినదంతే! రాముఁడు బాణము వేయవలసినదిగూడ నక్కఱలేదు. నా ప్రాణములు తీఱినది సుమీ! రాముని యెదుట పరాక్రమమును జూపి యెట్టివాఁడును ప్రాణములతో మరలి రాలేఁడు. నీ వొక్కఁడు యమదండమునఁ గొట్టువడి చావనున్నవాఁడవు. నీవలెనే వీఁడు నొక్కఁడు నున్నాఁడు. నీకిట్లు దుర్బుద్ధి కలిగియుండఁగా నేనేమి చేయఁగలను. నే నిదిగో పోవుచున్నాను. నీకు మంగళమగుఁగాక!' అని చెప్పెను. ఆరావణుఁడు వాఁడు చెప్పినమాటలకు మిగుల సంతుష్టుఁడై వానిని మిక్కిలియు బిగ్గఁ గౌఁగిలించుకొని*'నీ విట్లు వీరత్వము గులుకఁ జెప్పినమాట నను బోఁటి చెప్పినట్లేయున్నది. ఇప్పుడు నీవు మారీచుఁడవు. ఇంతకు మునుపు మఱియొక రాక్షసుఁడుగా నుంటివి. రత్నాలంకృతమై పిశాచముఖము లగు ఖరములు పూన్పఁబడి యున్న యీరథమును శీఘ్రముగా నాతోఁగూడ నారోహింపుము. నీవు సీతకు మిక్కిలి యాసకొలిపి యంత యథేచ్ఛముగాఁ బొమ్ము. నేను రామలక్ష్మణులవ్వలికి తొలఁగి యెవ్వరు లేనప్పుడు సీతను దీసికొని వచ్చెదను' అనెను. అంత రావణుఁడును మారీచుఁడును, విమానమువలె నున్న యీరథము నారోహించి, ఆయాశ్రమపదమునుండి శీఘ్ర

* లేక 'ఏత చ్ఛౌండీర్యయుక్తం తే మచ్ఛందాదివ భాషితమ్' 'నాయిచ్చనుబట్టి చెప్పినమాటగా నున్నదిగాని వీరత్వముతోఁగూడి యుండుటచూడఁగా నీవై చెప్పినమాటయే యగు' ననియు అర్థము.

ముగాఁబోయిరి. వారిద్దఱు నట్లు రథగతులై *పట్టణములును ఉద్యానములు నెఱసి యున్న పురములను పర్వతములను సమస్తము లయిననదులను రాజ్యములను జిన్నపత్తనములను జూచుచుఁబోయిరి. అంత రాక్షసవిభుఁ డగురావణుఁడును మారీచుఁడును అట్లు దండకారణ్యమునకు వచ్చి రామునియాశ్రమమును జూచిరి. అంత రావణుఁడు బంగారుచే సింగారింపఁబడియున్నయారథమును డిగ్గి మారీచుని చేయిఁబట్టుకొని 'చెలికాఁడా ! అరఁటిచెట్లు చుట్టు పెనఁగొని యున్నరామాశ్రమ మిదిగో కనఁబడుచున్నది చూడుము. ఇఁక మన మెందులకై వచ్చితిమో దానిని శీఘ్రముగాఁ గావింపుము. అప్పుడా మారీచుఁడు రావణుఁడు చెప్పినమాటవిని జింక రూపము దాల్చి, రామునియాశ్రమపుద్వారమున సంచరించుచుండెను. వాఁడు దాల్చినయారూపము చూపఱకు మిక్కిలి యాశ్చర్యము గలిగించుచుండెను. వాని కొమ్ముల కొనలు ఇంద్రనీలమణిమయములు; మొగమునందు శోభారేఖలు, కొన్ని తెల్లగను గొన్ని నల్లగను నుండెను. వాని ముఖపుటములలో నొకటి యెఱ్ఱదామర వన్నెగలిగియుండెను; మఱొకటి నల్లకలువరంగు గులుకుచుండెను. చెవులు కలువ పూవువలె రూపుతీరి యింద్రనీలమువలె నల్లనై నిగనిగ లాడుచుండెను. కుత్తుక కొంచెము ఎత్తుగానుండెను. పెదవులు ఇంద్రనీలమణిపలుకులవలె వన్నె గులుకుచుండెను. వాని కడుపు మొల్లలవలెను చందురునివలెను మగరాలవలెను దెల్లగా మిక్కిలి మెఱయుచుండెను. వాని పార్శ్వమొకటి యిప్పపూవన్నెగలిగి యుండెను. తక్కిన యవయవములన్నియు తామరయకరువులవలె వన్నెగలిగి యుండెను. గిట్టలు వైడూర్యమణులం బోలుచుండెను. పిక్కలు సన్నగా నుండెను. సంధిబంధములు మిక్కిలి దృఢముగానుండెను. వాని తోఁక పలుచెల నింద్రధనుస్సుపలువిధములయిన రంగులు రంగారుచుండెను. వాఁడు మనోహరముగాఁ బొడకట్టి నిద్దపుఁగాంతులు

* నగరములకును పత్తనములకును పురములకును భేదమెట్లనఁగా 'గ్రామశ్చ నగరంచైవ పత్తనం ఖర్వటంపురం। ఖేటకం కుసుమంచైవ శిబిరం రాజవాసికం। సేనాముఖ మితిత్వేవం దశధాకీర్తితంబుధైః' అని పదివిధములు. అందు 'విప్రాణాంచ సభృత్యానాం వాసోగ్రామ ఇతీరితః' భృత్యులతోఁగూడ బ్రాహ్మణులు వాసముండుదానికి గ్రామమని పేరు. 'సఏవ విప్రైరాకీర్ణ స్త్వగ్రహార ఇతిస్మృతః' అదియే బ్రాహ్మణులు నెరసియుండిరేని అగ్రహారమగును. 'కుటుంబభేదై రేకోనత్రింశద్భిశ్చ సమన్వితః' అందు ఇరువది తొమ్మండ్రు వేఱువేఱు కుటుంబములవారగుబ్రాహ్మణు లుండవలయును. 'అనేకనారీసంబద్ధం నానాశిల్పిజనైర్వృతం। క్రయవిక్రయికైఃకీర్ణం సర్వదేవైస్సమన్వితం। నగరం త్వితి విఖ్యాతం' అనేకస్త్రీలతోఁగూడి నానాశిల్పులచే నావరింపంబడి, క్రయవిక్రయికులు నెఱసి సమస్తదేవతలుగలిగి యుండునది నగరము. 'పత్తనంశృణుసాంప్రతం। ద్వీపాంతరాగతద్రవ్యక్రయవిక్రయికైర్యుతం। పత్తనం త్వబ్ధి తీరే స్యాత్' సముద్రతీరమునం దెగుమతి దిగుమతులును క్రయవిక్రయములును జరుగుచుండునది పత్తనము. 'యోతన్మిశ్రంతు ఖర్వటం' నగరలక్షణములును పత్తనలక్షణములును గలిగియుండునది ఖర్వటము. 'క్రయవిక్రయికైర్యుక్తం నానాజాతిసమన్వితం। తంతువాయసమాయుక్తం తత్పురం త్వితికథ్యతే' క్రయవిక్రయికులతోఁగూడి నానాజాతులునుగలిగి సాలెవాండ్రచే నొప్పునది పురము.

దొంతరగొన, నానావిధములయిన రత్నములవంటి బిందువులు మేన నందగింప,నొప్పు చుండెను. అట్లు మారీచుఁడు రమణీయ మగునవ్వనమును రాముని యాశ్రమ పద మును వెలింగించుచు క్షణమాత్రమునఁ బరమసుందర మగుమృగరూపమును ధరి యించెను. వాఁడట్లు మనంబున కింపై కన్నులకుసొంపై నానావర్ణములచే చిత్రి తమై యొప్పు రూపమునుదాల్చి సీతాదేవిని మోసపుచ్చుటకై పచ్చికలు మేసవుచు, నల్లల్లఁ గ్రేళ్లుఱుకుచును బోయెను. వాఁడు, వెండిచుక్కలు వందలకొలఁదిని మేన వింతలు గులుకుటచే కన్నులకుఁ బండువుగాఁ గనుపట్టుచు, చెట్ల చిగుళ్లుం గొఱికి దినుచు సంచరించెను. వాఁడు గృహమువలెఁ బన్నియున్న యరఁటిచెట్లకుఁ బోయి, కొండగోఁగుచెట్లను దాసి,మెల్లని యడుగుల నిటునటుతిరిగి, సీతను జూడ నవకాశము గలుగునట్టిస్థలమును జేరి యల్లల్ల చెరలాడుచుండెను. ఆ వెనుమృగము దామర యకరువులవన్నె గులుకువెన్ను మీఁఱు మురువు గులుకుచు రామాశ్రమపదమునకు దాపున సుఖముగా విహరించుచుండెను.ఆమేటి మృగమ మరలినుండి యవ్వ లికిఁ బోయి మరల వచ్చి విహరించుచు, మరలఁ గొంతసేపు ఆవలఁబోయి తోడనే మరలి పాఱివచ్చుచు, నిట్లు నానావిధముల రాక పోకలు సలుపుచుండెను. వాఁడట్లు క్రీడించుచుండి నేలపై నొకచోటఁ గూర్చుండును. ఆశ్రమద్వారమునకుఁబోయి యందలి మృగముల కదుపులను జేరఁజూచును. మృగరూపమునుదాల్చి సీతాదర్శన మును గోరుచున్నయామారీచుఁడు మృగములకదుపులు తన్ను వెంట నంటుటఁ జూచి మరల తొలఁగి వచ్చును. మఱి చిత్రము లగుమండలాకారములుగా నుఱికొని తిరుగుచుండును. అడవియందుఁ గలయితరమృగములన్నియును ఆచిత్రమృగమును జూచి దాపునకుఁబోయి మూర్కొని తమ్ముం దిను రాక్షసుఁడని తెలిసి భయమున దశ దిశలకుఁ బాఱిపోయినవి. ఆరాక్షసుఁడును మృగములను జంపి తినుటయే స్వభావ మయ్యును తన భావము గప్పిపుచ్చుటకై యాయడవిమెకములను ముట్టియు భక్షిం పఁడయ్యె. చెలువంపుగన్నులు పన్నెగులును సీత,యంత నపుడే పువ్వులుగోయఁగోరి యావృక్షమునొద్దకు వచ్చెను. ఆ మదిరేక్షణ, యా సుందరానన, పువ్వులుగోయుచు కొండగోఁగుచెట్లు అశోకవృక్షములు మామిడిచెట్లు మొదలగువానికడకుఁ బోయెను. ఆ యుత్తమనాయికారత్నము, అడవిలో వసింపఁ దగనియాసుకుమారి, నానారత్న మయమై ముత్తెపుబిందువులచే చిత్రింపఁబడినమొడలు బెడఁగారునామృగమును గాంచెను. మంచి పలువరుసయుఁ బెదవులును గలయామగువ, యబ్బురపాటున తనకన్నుఁగవ వికసిల్లఁగా, వెండియు గైరికము లగురాగి మొదలగువాని వన్నెలును గలవెండ్రుకలతో నొప్పుచున్న యాజింకను నెయ్యముదొలఁకఁ గాంచెను. జనకరాజ సుత యాసీత మున్నెప్పుడును జూడఁబడనిదై లోకోత్తరమై, పలువిధములయిన రత్నములవంటి బిందువులచే నందముచూపుచున్నయాసుందరమృగమునుజూచి పర మాశ్చర్యము నొందెను. ఇది నలువదిరెండవసర్గము.




687 సీత మాయామృగమును జూచికోరుట. లక్ష్మణుఁడు మారీచుఁడు మాయవన్ని
అట్లు మృగరూపియై వచ్చెనని చెప్పుట.

సీత మాయామృగమునుజూచి రామలక్ష్మణులఁ బిలిచి దానినిబట్టి
యియ్యవేఁడుట. లక్ష్మణుఁ డది మారీచునిమాయ యనఁగారాముఁ
డెట్లైనియుఁ బట్టఁదగు నని చెప్పి సీతను గాచి యుండు మని
యానతిచ్చి దానిని బట్ట బయలువెడలుట.

మేలి బంగారుచాయగలిగి యవయవములందు కందేమియు లేనియాసుందరి యాసీత,బలితంపు బిఱుందు లందముగులుకఁ బువ్వులుగోయుచుండి,యొక్క ప్రక్క బంగారువన్నెయును మఱియొక ప్రక్క వెండివన్నెయుఁ గలిగి చెన్నారుచున్న యామృగమును జూచి పరమసంతుష్టయై పెనిమిటి యగురామునిని లక్ష్మణునిని ఆయుధములతో 'రం'డని బిగ్గఱగాఁ బిలిచెను. అట్లా చెలువ పిలువఁగాఁ బురుషసింహులగురామలక్ష్మణులు వచ్చి యా ప్రదేశమును నలుప్రక్కలంజూచుచు నామాయజింకను గాంచిరి. లక్ష్మణుఁడుమాత్రము దానిని జూడఁగానే సందేహపడుచు రామునితో 'ఈమృగమే యా మారీచుఁ డనురాక్షసుఁడని నాకుఁ దోఁచుచున్నది. రాజా ! కామరూపియగు మారీచుఁడు మ      యీ పాపపురూపము కారణమున వనమునందు సంతోషముతో వేఁటాడ వచ్చినరాజులను జంపినాఁడు. పురుషసింహమా ! వాఁడు బహుమాయలనెఱింగినవాఁడు. కాన వానిమాయయే యిట్లు కాంతిదొలఁకుచు గంధర్వనగరమువలెఁ గల్లయై మిక్కిలి వింతగొలుపుచునున్న యీ మృగరూపముగా నయినది. జగతీనాథా ! రతనపుబిందువులచేఁ జిత్రితమై విచిత్రముగానున్న యిట్టిమృగము ప్రపంచమునం దెచ్చటను లేదుసుమీ!కాన నిది మాయయే. సందేహము లేదు'అనెను. తెలిచిఱునవ్వు మొగమున మొలకొత్తుచుండు సీత యట్లు చెప్పుచున్న లక్ష్మణునివారించి యామృగముతోలు మేలిమికి బుద్ధి మునింపఁగా,మిక్కిలి నంతసమున రామునిఁజూచి 'ఆర్యపుత్రా! మహాబాహూ!ఈమృగము మిక్కిలి సుందరముగానున్నది.కాన నామనస్సు దీనియందు మిక్కిలియుఁ దగిలియున్నది. దీనింబట్టితెమ్ము; మన కాటలాడుకొనుట కుపయోగించును.ఇచట మన యాశ్రమపదమునందు అతిసుందరముగాఁ గనఁబడునట్టి మృగములును సృమరములును చమరములును పెక్కులు గుంపులు గుంపులుగాఁ దిరుగుచున్నవి.మహాబాహూ!అట్లే మే లయినరూపులు గలిగి మనస్సునుహరించునట్టి యెలుఁగుబంట్లును బింపుమృగములును గోఁతులును గిన్నరమృగములును మనయాశ్రమమునఁ దిరుగుచున్నవి. రాజా! ఈమేటిమృగమునం దెట్టి రంగును తిన్నందనమును మేనినిగ్గును కనఁబడుచున్నవో యట్టిరంగు మొదలైనవి గలిగి దీనికి సాటియైయున్న మృగమును నింతవఱకు మనము చూచినది లేదు. ఇఁకమీఁదను జూచుటలేదు. పలువిధములయిన రంగులచే విచిత్రములగు నంగములు గలిగి రతనంపుబొట్లు మేనెల్ల నెరసి యీమృగము చందురుని వలెఁ గన్నులకుఁ జల్లనై యీవనమునంతయు వెలిఁగించుచున్నది. ఔరా ! ఇది యేమివర్ణము ! ఇదేమికాంతి ! దీనికంఠధ్వనియేమి ! మెచ్చులుగులుకు

దీనియవయవములసిరియొప్పిద మేమి! విచిత్రము లగునంగములుగలిగి వింతలు గొలుపుచున్నయీమృగము నామనస్సు నెంతయు నాకర్షించుచున్నది. ఈమృగము ప్రాణములతో నీకుఁ బట్టువడునేని యిపుడు మన కందఱికి నాశ్చర్యముగలిగించును. ఇఁక వనవాసము తీరి మరలరాజ్యమున నుండునపుడును నాశ్చర్యము గలిగింపఁగలదు. ఇంతేకాక యపుడు మన యంతఃపురమున కలంకారముగాను నుండఁగలదు. ప్రభూ! ప్రశస్తమైన యీ మృగమురూపము అయోధ్యలో భరతునకును నీకును నాయత్తలకును నాకును వ్యక్తముగా నాశ్చర్యము గలిగించుచుండఁగలదు. ఈ మేటి మృగము, ప్రాణములతో నీ పట్టునకుఁ జిక్కదేని చచ్చినదీని చర్మమేనియు నాకు నింపు గూర్చుచుండఁగలదు. దీనిని జంపి తెత్తువేని బంగారువన్నె గులుకు దీనిచర్మమును లేఁతగఱికల బ్రసియాసనముపైఁ బఱచుకొని దానిపయిని నీతోఁగూడ నుండఁగోరెదను. స్త్రీలిట్లు స్వేచ్ఛగా భర్తలను ప్రేరేపించునడత భయంకరము. ఇది స్త్రీలకెంతమాత్రము దగదు. అయినను, ఈమృగముదేహమును జూడఁగా నాకెక్కడ లేనికుతూహలము కలుగుచున్నదే! తెమ్మనరాదు; నీకుఁగూడ గుతూహలమేని తెమ్మా' యనెను. ఇంద్రనీలములవంటి కొమ్ములుగలిగి బంగారువన్నె గులుకువెండ్రుకల నిగనిగలచే బాలసూర్యునివంటి వన్నెఁ దేజరిల్లుచు తలతలలాడుచుక్కలు గలఛాయాపథమువలె మినుక్కురను తెల్లనిబిందువులతోఁ గూడియున్న యీ మృగమును జూడఁగా రామునిమనమునకు నాశ్చర్యము గలిగినదయ్యె. ఇట్లు సీత వేడుకొన్నది వినియు తానే యద్భుతమైన యీమృగమునుజూచియు రాముఁడు దానిరూపమున కాశపడి,సీతయుఁ బురికొలుపఁగా,సంతుష్టుఁడై తమ్ముని లక్ష్మణునిం జూచి'లక్ష్మణా!సీతకు నీమృగముపై నెంత యాశగలిగినదో చూడుము. ఇంతమేలయినరూపము గలయిటువంటి మృగ మెందునులేదు. కావున నిపు డీవనమునను దొరకదు. లక్ష్మణా! దీనికి సాటియైనమృగము నందనవనమందును చైత్రరథవనమునందును దొరకదు. ఇఁక భూమియందు దొరకుట యెక్కడిది? మేనియం దెదురుమొగముగాఁ దిరిగియు నొక్క మొగముగాఁ జాఁగియు నున్న వెండ్రుకలు బంగారుబిందువులచే చిత్రితములయి మృగమురూపున కెంతయు మురువుగూర్చుచు నొప్పుచున్నది. ఈ మృగ మావులించునప్పుడు దీనినాలుక నోటనుండి వెడలి యగ్గిజ్వాలవలె వెలుఁగుచు, మబ్బునుండి వెడలునట్టి మెఱుఁగుదీఁగకైవడి మెఱయుచున్నది చూడుము. ఇంద్రనీలపు గిన్నెవలె నున్న మొగము ముట్టెగలిగి, సంకువువలెను ముత్తెములవలెను తెల్లనై కడు పుల్లసిల్లఁ, జెలువుఁ గులుకుచు నిట్టి దట్టి దని వర్ణింప నలవికాకున్నయీమృగముపయి నెవ్వనిమనస్సు దగులువడదు? ప్రభూ! (సమర్థా)బంగారుమయమై పలువిధములయినరత్నములబిందువులచే సుందర మైనదీనిదివ్యరూపమును జూచి యెవ్వనిమనస్సున కబ్బురము గలుగదు. లక్ష్మణా! రాజులు మహారణ్యమున మాంసముకొఱకును,విలువిద్య మెఱయించుచు విహరించుకొఱకును, వేటయందు మృగమును జంపుదురు.మఱి యిట్టి విచి

త్రవస్తువునకై చంపుట చెప్పవలయునా? రాజులు మహావనమున వేటాడుచు [illegible] చే నేనుఁగుల [illegible] త్రెంచు [illegible] మేలయిన [illegible] రమును [illegible] ధాతువులును సంగ్రహించుకొందురు. ఇదియు నీవనమున మహాధనమే కావున దీనిని వేటాడి సంగ్రహించుట దగునే కదా! *లక్ష్మణా! మనుష్యులు మనస్సున గొంతెమకోర్కులు కోరుధనమంతయును శుక్రుని కోశమును నిండించునట్లు, వనమందు దొరకెడి నానావిధములయినధనములలో మేలయి నవన్నియు రాజులకోశమును జేరి నిండించును. 'అయినను విచారించి యేపనియైనఁ జేయఁ దగు'నందువా? వస్తువును గోరువాఁడు, ఏవస్తువు మేలిమికిని మురువునకు లోనయి ముందు వెనుక విచారింపక దానిని సంపాదించుటకుఁ దుకతుక పడునో, నీతిశాస్త్రజ్ఞులును అర్థవంతులును దానినే అర్థము-అనఁగా ఆశింపఁదగినవస్తువు అనిచెప్పుదురు. ఇదియు నట్టిదే కాన విచారింప వలదు. ఈమృగలలామమున మిక్కిలి విలువగల బంగారుచర్మమునందు, సీత లేఁగొఁదిఁగ వన్నెగులుక నాతోఁగూడఁ గూర్చుండఁగలదు. వల్లచారిలయిఱ్ఱిగాని, బొట్లయిఱ్ఱిగాని, ప్రవేణీమృగముగాని, ఆలిమృగముగాని, మృదువైన స్పర్శమున, దీనికి సాటిగానేరవని నాకుఁదోఁచుచున్నది. కాంతి దళుకొత్తుచున్న యీమృగమును, ఆకాశమునఁ జరించుమృగశీర్షమనుదివ్యమృగమును, ఈభూమృగనక్షత్రమృగములు రెండును, ఉత్తమములయిన మృగములు. లక్ష్మణా! నీవు నాతోఁ జెప్పినట్లు ఇది మారీచునిమాయయే యగునేని, యప్పటికిని దీని నవశ్యము చంపవలసినదియే. మున్ను క్రూరుఁడును దుష్టభావుండునై నయీమారీచుఁడు, ఈవనమునం దిరుగుచుఁ, బెక్కుమునివరులను జంపియున్నాఁడు. ఇది వేటకై వచ్చిన గొప్పవిలుకాండ్రగు రాజులఁ బెక్కండ్ర జంపి యున్నది గాన దీని నవశ్యముఁ జంపవలయును. మున్నీదండకారణ్యమున వాతాపి యనురాక్షసుఁ డొకఁడు ఋషులను నిరాకరించి తాను మేకరూపున వారలకు భోజ్యమై వారియుదరమును జేరి, యశ్వతరి యీను

*ఇందులకు 'ధనాని వ్యవసాయేన విచీయన్తే మహావనే। ధాతవో వివిధాశ్చాపి మణిరత్నసువర్ణినః॥ తత్సారమఖిలం నృణాం ధనం నిచయవర్ధనమ్ ॥ మనసాచింతితం సర్వం యథా శుక్రస్య లక్ష్మణ॥' అనిమూలము. శుక్రుఁడు మనస్సున చింతించువస్తువు లట్లే నిజముగాఁ గలిగి యతనికోశము నిండించునట్లు అడవులయందలి ధనములలో మే లయిన వెల్ల రాజులకోశమును నిండించునని యర్థము.—టీక:—భారతమునం దుద్యోగపర్వమున 'మనుష్యైశ్వ స్సమాదత్తే శుక్ర శ్చిన్తార్జితం ధనమ్' అనిమనుష్యులగొంతెమకోర్కులన్నియు శుక్రుని కోశము నిండించునని యున్నది. కావున 'మనుష్యులు గొంతెమకోర్కులు కోరువస్తువు లట్లే యుప్పతిల్లఁగా శుక్రుఁడు తనకోశము నిండించుకొనునట్లు, అడవులందలి వస్తువులలో మేలయినవానిచే రాజులు తమకోశము నిండించుకొందురని యర్థాంతరము. టీక:—(ధనినాం) రాజాదులైన ధనికులకు, (కోశవర్ధనం) కోశమును పెంచునట్టి, (ధనం) అవన్యముగుధనము, (నారం) [illegible] జానపదాదులిచ్చు ధనముకంటె [illegible] - అపూర్వమగుట [illegible] నని భావము. కాఁబట్టి వనవాసమువిడిచిపోవునప్పుడు మనము వన్యమగు నీమృగచర్మము అపూర్వధనగాఁ బట్టణమునకుఁ గొనిపోవం దగు ననియు భావమావ్యాము.

నప్పుడు దూడ గర్భమును జీల్చుకొనివచ్చి దానిం జంపునట్లు, ఆఋషుల కడుపు చించి చంపుచుండును. వాఁడట్లు బహుకాలమునకు పిదప నొకప్పుడు మాంసము నందలి పేరాసవలన ప్రభావసంపన్నుఁడగునగస్త్యమహామునియొద్దకుఁ బోయి యాహార మయ్యెను. భగవంతుఁడగునగస్త్యుఁడు శ్రాద్ధముకడపట తనకడుపు ప్ర చ్చుకొని యావాతాపి నిజరూపము ధరింపఁగోరఁగాఁజూచి యల్లనవ్వి వానిం జేర్కొని 'వాతాపీ! నీవు భూలోకమున పాప మనికూడ విచారింపక పెక్కు బ్రాహ్మణోత్తములను జంపితివి. అందువలన నీవు నాయుదరమున జీర్ణుఁడ వయితివి' అనెను. లక్ష్మణా! ధర్మమునం దెడతెగక నిలిచి యింద్రియముల నడఁచి యుండునాయట్టివాని నతిక్రమించునేని యీ మారీచుఁడు వాతాపివలెనే పుడమి నుండఁడు. అగస్త్యునిచేత వాతాపిహతుఁడయినట్లు వీఁడు నాచేత హతుఁడగును.లక్ష్మణా! నీ విచ్చట సన్నద్ధుఁడవై జాగ్రత్తతో సీతను రక్షించుచుండుము. మనకుఁ జేయవలయు కార్యములన్నియు నీపడఁతియందే యాయత్తములై యున్నవి. మనకార్యము లన్నియు దీనిరక్షణముకొఱకేచుమీ. లక్ష్మణా! నే నీమృగమును బట్టనైనఁ బట్టెదను; లేక చంపనైనను జంపెదను. నే నిదిగో మృగమును దీసికొని రాఁబోయెదను. లక్ష్మణా! ఈ మృగచర్మమున సీత కాశగలిగియుండుట గనుము. కాఁబట్టి, ముఖ్యముగా దీని చర్మమునుబట్టియే యిది బ్రతుకదు. నే నొక్క బాణమున నీ మృగమును వధించివచ్చువఱకు నీవు సీతకుఁగా నాశ్రమముననే నిలిచియెంతమాత్రమేమఱక కాచియుండవలయును.లక్ష్మణా! నేను మృగచర్మమును దీసికొని శీఘ్రముగా వచ్చెదను. లక్ష్మణా! మహాసమర్థుఁడును అతిబలవంతుఁడును బుద్ధిమంతుఁడు నగుజటాయువుతోఁగూడ నీవు నలుగడల సీతను నండ నుంచుకొని రాక్షసాదులవలన నేమి గలుగునోయని ప్రతిక్షణమును శంకించుచు నేపరాకులేక కాచుచుండుము.' అనెను. ఇది నలువదిమూఁడవసర్గము.

✣

రాముఁడు మాయామృగమును వెంబడించిపోయి యదిచిక్క నందున బాణము వేయుట. అది 'సీతా! లక్ష్మణా!' యని యఱచుచుఁ గూలుట. రాముఁ డాశ్రమమునకు వేగిరపడి వచ్చుట.

మహాతేజుం డగురాముఁ డాప్రకారమునఁ దమ్ముని కానతిచ్చి బంగారుమయముగుపిడి గలకత్తిని నడుమునఁ గట్టుకొనెను. అంత నాచండపరాక్రముఁడు తన కలంకారముగా మువ్వంకలు గలిగి యున్న శార్ఙ్గధనువుం దీసికొని యమ్ములపొదులను రెంటిని మూఁపులఁ గట్టుకొని పోయెను. రాజశ్రేష్ఠుఁ డారాముఁడు తన పయినెత్తివచ్చుచుండుటంజూచి,మారీచుఁ డతనిమోసపుచ్చువాఁడై భయమునఁ గొంతసేపు మఱుఁగుపడియుండి మఱల నతనికిఁ బొడకట్టెను. రాముఁడు కత్తి నడుమునఁగట్టికొని విలుగొని, మృగము పోయినదారిని పరుగునఁబోయెను. అంత నామృగము కాంతి వెల్లున ముందఱ మెఱయుచున్నట్లుండి మహారణ్యమున రాముని జూచిచూచి పరుగిడుచు విల్లు



691 మాయజింకపై రాముఁడు బాణము వేయుట. జింక మారీచునిరూపమును దాల్చి నేలఁగూలుట.

ల్చినయతనిం జూచి జంకులేకుండియు, ఇతరమృగములవలె జంకక మూఁగుచు వేయు బాణము గులకుండునట్లు తప్పించుకొని దవ్వుల జంగలించుచు నొకప్పుడు చేతికిఁ జిక్కవచ్చునట్లు లాసకొలువుచు, ఒకప్పుడు తొట్రుపడి పాఱుచు, ఆకాశమున కెగసిపోవునట్లు ట్లుపై చుచు, శరత్కాలమునందు మబ్బుతునుకలనడుమఁ జిక్కి యప్పుడప్పుడు కనఁ ఁను మఱుఁగుపడుచు నుండుచంద్రమండలమువలె, వనప్ర లందుఁ గొన్నిటఁ గనఁబడుచును గొన్నిట నంతర్హిత మగుచునునుం గానిపించెను. అది ముహూర్తమాత్రమున దాపునఁ గనఁబడును. మరల ముహూర్తమునకు దూరమునఁ దోఁచును. ఇట్లు మారీచుండు మృగరూపుండయి యొకప్పుడు కనఁబడుచును నొకప్పుడు మఱుఁగుపడుచును నిట్లు రాముని నాశ్రమమునకు మిక్కిలి దూరముగాఁ గొనిపోయెను. రాముఁ డామృగముచేష్టలకుఁ గొంత సేపు కుపితుఁడగును. దానిరూపునకు వంచితుఁడై కొంత సేపు కుతూహలమునకు వశుఁడగును. ఇట్లతఁడు పోయి యంత తొట్రిలఁబడుచు, ఒక చెట్టునీడయందుఁ బచ్చికపట్టున నిలుచుండెను. మృగరూపుఁడగు నామారీచుఁడు రాముని బహుదూరము దీసికొనిపోవుటవలన మనస్సు తబ్బిబ్బుపడునట్లు గావించెను. అది, మరల నతఁడాశ గలిగి తన్ను వెంబడించుటకై, యడవిమృగములు చుట్టు బలసియుండ, దాపుననే పొడచూపెను. అట్లు దాపుననుండుటచే రాముఁడు తన్నుఁ బట్టుకొన నుంకింపఁగా మరలఁ జిక్కక పరుగెత్తెను. అంత నాక్షణముననే మరల బెదరుగొని మఱుఁగయ్యెను. అంత మరల నది యొకవృక్షసమూహము నుండి వెడలుటం జూచి మహాతేజుఁ డగురాముఁడు దానిని జంపవలయునని నిశ్చయించెను. రాముఁడట్లు బాణంబెత్తి మిక్కిలియుఁ గుపితుండై యుండెను. అంత శత్రుమర్దనుఁ డగునాబలవంతుఁడు, సూర్యరశ్మివలె జ్వలించుచున్న బాణమును మిక్కిలి దృఢంబగుధనుస్సున సంధించి యాకర్ణాంతముగా నారి దివిచి భయమున సర్పమువలె నిట్టూర్పులు పుచ్చుచున్నయామృగమును గుఱిపెట్టి బ్రహ్మనిర్మితమై ధగధగ మెఱయు చున్నయాదివ్యాస్త్రముం బ్రయోగించెను. పిడుగువంటి యాదంటతూపు, మొదట మారీచుఁడు ధరించినమృగశరీరమును భేదించి, యంత దానిలో నున్నవాని శరీరమును భేదించెను. అంత వాఁడు బాణపీడితుఁడై తాటిచెట్టంతపొడ వెగసి బెట్టిదముగా నఱచుచు జీవము సురుఁగ నేలంబడెను. మారీచుండు మృతిబొందువాఁడై (కృత్రిమ మగునామృగరూపమును విడిచి రావణుఁడు చెప్పినమాటను దలంచుకొని) తనలో 'సీత లక్ష్మణుని నిచటికిఁ బంపుట కేమి యుపాయము? అట్లుపంపిన నే, ఎవ్వరు లేనప్పుడు రావణుఁడు సీతను హరింపఁగలఁ'డని యాలోచించెను. ఆమారీచుఁడు సమయమిది యని తెలిసికొని రామునికంఠధ్వని వంటియెలుంగున 'అయ్యో! సీతా! లక్ష్మణా!' యని యఱచెను. రాముండేసినయెన లేనిబాణము మర్మము నాటఁగా, మహాకాయుఁడా మారీచుఁడు మృగరూపమును విడిచి తనరాక్షసరూపమును గయికొని ప్రాణములు విడిచెను. అంత రామబాణమునఁ గొట్టువడ్డయామృగము విచిత్రము లగుబాహు

పురులు వఱల, సర్వాభరణభూషితుఁడై బంగరుమాల దాల్చి బెడిదము లగుకోఱలతో గండు మీఱునొక రాక్షసుఁడయ్యెను. రాముఁడు, నేలంబడి నెత్తుట నంగములు దోఁగి, పొరలాడుచున్న భయంకరాకారుని రాక్షసునింజూచి లక్ష్మణుఁడు చెప్పినమాటఁ దలంచుకొనుచు సీతాదేవిపై మనస్సుపోవఁగా తనలో 'ఇది మారీచునిమాయయే మఱియొకటి గాదని లక్ష్మణుఁడు పూర్వము చెప్పినాఁడు.' అది యట్లే యైనది. నే నిప్పుడు వధించినయీరాక్షసుఁడు మారీచుఁడే. ఈ రాక్షసుఁడు నా యెలుంగున 'అయ్యో! సీతా! హా లక్ష్మణా! అని మిగుల బిగ్గఱగా నాక్రోశించి ప్రాణములు విడిచినాఁడు. ఇది విని సీతయెట్లగునో! మహాబాహుఁ డగులక్ష్మణుఁ డేమియవస్థనుబొందునో!'యని మిక్కిలి చింతించుచుండఁగా నాధర్మాత్మునికి భయమువలన దేహము గరుపాటెను. అట్లు రాక్షసుఁడు మృగరూపమున రాఁగాఁ దానుజంపుటయు, వాఁ డాయెలుంగునఁ బలికినది వినియు "ఇది యంతయు నేమో దుఃఖమునకుఁగాఁ బొడసూపిన'దని మిక్కిలియు తీవ్రభయ మావేశించినవాఁడయ్యె. రాముఁ డంత మఱియొక మృగమును జంపి దానిమాంసమును దీసికొని త్వరితుఁడై జనస్థానమున నున్న తనయాశ్రమము దారిం బట్టి దానికభిముఖుఁడై పోయెను. ఇది నలువదినాలుగవ సర్గము.

— { సీత మారీచునియఱపు విని లక్ష్మణుని రామునియొద్దకుఁబొమ్మని పురికొలుపుట. లక్ష్మణుఁడు రామున కేభయమును గలుగ నేరదని చెప్పి పోవకుండుట. సీత దుర్భాషలాడుట. దానికి సైఁపక లక్ష్మణుఁడు రామునికడకు బయలుదేఱుట. }

సీత తనపెనిమిటియెలుఁగువలె నున్న యా యార్తధ్వనిని విని లక్ష్మణునిం జూచి 'సౌమ్య, రామునికేమయ్యెనో తెలిసికొనుము. రాముఁడు మిక్కిలి యార్తుఁడై యఱచుచున్నధ్వనిని వింటిని. ఇఁక నామనస్సుగాని ప్రాణములుగాని కుదుటనుండవు గదా! అడవియందు దిక్కులేక యాక్రందించుచున్న నీయన్నను రక్షింపుము. అది నీకు వలయును. సింహమునకుం జిక్కినయాఁబోతువలె రాక్షసుల చేతం జిక్కి కాచు దిక్కులేక నవయుచున్న నీయన్నయొద్దకు శీఘ్రముగాఁ బరుగిడుము!' అనెను. సీత యట్లెంత చెప్పియు నతఁడన్నయాజ్ఞనుఁదలఁచి పోవలేడయ్యె. అంత సీత కంపితయై యతనిం జూచి "లక్ష్మణా! నీయన్న కిట్టిదురవస్థవచ్చినపుడును అతని రక్షింపఁబోవకున్నావే! కావున నీవు నీయన్నకు పయికిమిత్రునివలె నగపడుచున్నావుకాని నిజమునకు శత్రుఁడవే! లక్ష్మణా! నీవు, నాకుఁగా, రాముఁడు నశింపవలయునని కోరెదవు. నాయందాశపడియున్నావు. గాన నన్నుఁబట్టి రామునిజాడను దెలియఁబోవకున్నావు. ఇది నిజము. రామునకుఁ గష్టమువచ్చుటే నీకుఁ బ్రియమని నాకుఁ దోఁచుచున్నది. నీ కన్నయం దెంతమాత్రమును నెయ్యము లేదు. కావున నమ్మహాతేజున కాపదగలిగినను పోయిచూడక నెమ్మదిగా నున్నాఁడవు. 'నిన్నుఁ గాచుట విడిచి యెట్లుపోదు' నందువా? ని

ముఖ్యముగా రామునిఁబట్టి యిట వచ్చినవాఁడవు గాని నన్నుబట్టిఁ కాదు ! అట్టి రాముఁడు ప్రాణసందేహము నొందిన పిదపనే నియ్యాశ్రమమున నుండిచేయవలసిన పని యేమున్నది. కాఁబట్టి నన్ను రక్షింప నీ విచట నుండవలసినది లేదు'' అనెను. ఇట్లు పలుకుచు బాష్పములం దోఁగి రోదనము సేయుచు బెదరిన యాఁడుజింక కైవడి చపలయై యున్న సీతంజూచి లక్ష్మణుఁడు ''వైదేహీ! పన్నగులుగాని యసురులుగాని గంధర్వులుగాని దేవతలుగాని మనుష్యులుగాని రాక్షసులుగాని నీభర్తను రాముని జయింపఁ జాలరు ! ఇందులకు సందియము లేదు. దేవీ ! మంగళరూపిణీ ! యుద్ధమున దేవేంద్రునితో సాటి యగురామునితో మార్కొనువాఁడు దేవతలలోఁగాని మనుష్యులలోఁగాని గంధర్వులలోఁగాని పక్షులలోఁగాని రాక్షసులలోఁగాని పిశాచములలోఁగాని కిన్నరులలోఁగాని మృగములలోఁగాని భయంకరాకారు లగు దానవులలోఁగాని కలుగఁడు. రాముని యుద్ధమున వధింప నెట్టివారికి నలవిగాదు. కావున నీవిట్లు చెప్పవలదు. రాముఁడు లేకుండునపుడు ని న్నీవనమున నొంటిగా విడిచిపోవ నాకుఁ దెంపు గలుగదు. మిక్కిలి బలవంతు లగువారు బలములతోఁ గూడివచ్చినను, ఇంతేల ! దేవేంద్రునిని దేవతలనుంగూడి ముల్లోకములును సన్నద్ధములై యొక్కపెట్ట నెత్తి వచ్చినను రామునిబలిమిని వారింప నలవిగాదు. మనస్సున నూఱట నొందుము. ఈసంతాపమును దిగవిడువుము. నీ వెనిమిటి యామేటిమృగమును జంపి శీఘ్రమున వచ్చును. మనమువిన్నధ్వనియు రామునికంఠస్వరము గాదు. ఎవఁడో యొకఁడు మాయచేత నిట్లు గావించినాఁడనుట నిజము. ఎవఁడో కాఁడు. *గంధర్వనగరమువలె విచిత్రముగా వ్యామోహము గలిగించునది యారాక్షసుని మారీచునిమాయయే. వైదేహీ ! నీవు నాకిల్లడ వైతివి. 'ఎవ రిల్లడపెట్టి' రందువా! వరారోహా! మహాత్ముఁడగు రాముఁడు నిన్ను నావశమునం దిల్లడగా నుంచినాఁడు. కాన ని న్నీవనమున నొంటిగా విడిచిపోవఁ జాలను. వైదేహీ! మఱియు, నిందలి రాక్షసులు తమస్వామి యగుఖరుని జంపినందువలనను జనస్థానమునందు జరిగినవధమునుగూర్చియు అందఱును మన మీఁదఁ బగఁగొనియున్నారు. వారు హింసావిహారులు. మనల హింసింపఁ గోరి మోహముగొలుపుటకుఁగాను ఇమ్మహావనమున పలువిధములయినమాటలను గావించుచున్నారు. ఇది యాలోచింప నేరకున్నావే'' అనెను. లక్ష్మణుఁ డిట్లు చెప్పఁగా సీత కుపితయై మిక్కిలియుం గన్నెఱ్ఱఁ బాఱి సత్యవాది యగునతనింజూచి పరుషవాక్యముల †'చేయరానిపనిని జేయ మొదలుపెట్టితివా ? క్రూరుఁడా ! కులపాంసనుఁడా ! రామునికి మహావ్యసనము గలిగినదియు నీకుఁ బ్రియమే యని నాకుఁ దోఁచుచున్నది. కావు

* గంధర్వనగరమనఁగా మేఘాదులందు ఆరోపితములగు ప్రాసాదములు వనములు మొదలగునవి. ఇవి యొకానొకప్పుడు విచిత్రముగాఁ గనఁబడుచు క్షణభంగురములైయుండును.

† ఇందులకు 'అనార్యాకరుణారంభనృశంస' అని గోవిందరాజీయపాఠము. అప్పుడు 'దుశ్శీలుఁడా ! నీవు దయాప్రసక్తి లేనివాఁడవు. క్రూరుఁడవు' అని యర్థము.

ననే రాముని కిట్టివ్యసనము గలిగియుండుట చూచియు నతనిని రక్షింపఁబోక యీ మాటలనెల్ల నాడుచున్నావు. లక్ష్మణా ! పైకి మిత్రులవలె కపటప్రవర్తనమునఁ దిరుగుచు శత్రువులును గూ్రరులు నై యుండు నీయట్టివారల కిట్టి పాపబుద్ధిగలుగుట యొక యాశ్చర్యముగాదు. నీవు మిక్కిలి దుష్టుఁడవు. కాన నీయంతనో, లేక భరతుఁడు ప్రేరించివంపుటచేతనో,నానిమిత్తమై కపటవేషమున నీ వొక్కఁడ వందఱినిని విడిచి రాము నొక్కని నడవియందు వెంబడించివచ్చుచున్నావు. లక్ష్మణా ! నన్నుఁబొందవల యునని యాపూన్కి నీకుఁగాని భరతునికిఁగాని సిద్ధింపదు. నల్లఁగలువలవంటి చామనిచాయగలిగి తామర రేకులవంటి కన్నులు వన్నెగులుకు చున్న రాముని భర్తగాఁ జేపట్టి మఱియొకయల్పపురుషు నెట్లు కామింతును? సౌమిత్రీ ! నీయెదుటనె ప్రాణములు విడుతును. ఇందులకు సందేహము లేదు. రాముని విడిచి క్షణమైనను భూతల మందు బ్రతికి యుండను జుమీ!' యనెను. సీత యిట్లు మేను గగ్గురుపాటునట్లు లాడిన పరుషవాక్యమును వినియు లక్ష్మణుఁడు జితేంద్రియుఁడు గావునఁ గలంగక యంజలి గీలించి 'నేను నీకు బదులు చెప్పఁ బూనను.నీవు నాకు దేవతవు. మైథిలీ! ఇట్లు మిక్కిలి యనుచిత మైనమాట చెప్పుట స్త్రీలయం దొకచిత్రముగాదు. స్త్రీల కిది స్వభావమే. లోకములందంతయు నిట్టే యగపడుచున్నది. స్త్రీలు వినయాదిధర్మములను వదలిన వారు; చంచలచిత్తలు. క్రూరహృదయలు. ఎట్టిస్నేహితుల కేని విరోధముగలిగింతురు. వైదేహీ నీవు జనకరాజుకడుపునఁబుట్టియు నిట్లాడినమాట నాచెవులు రెంటను నిప్పునఁ గాచిననారసమువలె నున్నది. ఇటువంటిమాటను నేను సహింపఁజాలను. న్యాయవాది నగునన్నుంజూచి నీ వెట్లన్యాయముగాఁ బరుషములాడితివో సాక్షులై యీవనచరదేవతలందఱు విందురుగాక. పెద్దయగు నన్నయాజ్ఞయందు నిలిచియున్న నన్నుఁ గూర్చి యిట్లు సందేహించుచున్నావే! ఇసీ ! నీవేమి ! ఇప్పుడే నశించిపొమ్ము. స్త్రీత్వము స్వభావముననే దుష్టమైనది. వరాననా ! నేను రాముఁడున్నచోటికిఁ బోయెదను. నీకు శుభమగుఁగాక. విశాలాక్షీ! నిన్ను వనదేవతలందఱును నెచ్చరికను రక్షింతురుగాక. జానకీ ! ఇప్పుడు నాకుఁ బొడసూపుచున్నదుర్నిమిత్తములు భయంకరములుగా నున్నవి. కాన నేను మరలవచ్చి రామునితోఁగూడ నిన్నుఁ జూతునో(చూడనో ఇది యెఱుఁగను)' అనెను. లక్ష్మణుఁ డిట్లుచెప్పఁగా సీత రోదనముసేయుచుఁ గన్నీళ్లఁదొప్పదోఁగుచు నతనిం జూచి తీక్ష్ణముగా 'లక్ష్మణా! రామునింబాసి నిమిషముండలేను; గోదావరిలోఁబడి ప్రాణములు విడిచెదను.అట్లుగాదేని యురిమైననుబోసికొనెదను. ఒడుదొడుకైన యెత్తునుండి పడియైనను దేహమును విడిచెదను. వేండ్రమగు విషమునైనను త్రాగెదను. నిప్పునైన నుఱికెదను. కాని ప్రాణములు పెట్టుకొనను. నేను రాముని దక్కఁ దక్కినవానిని వ్రేలితోనైనముట్టను'అనెను. ఇట్లు సీత లక్ష్మణుని నిందించి దుఃఖితయై యాదుఃఖాతిశయమున రోదనముసేయుచుఁ జేతులతో కడుపు మోఁదికొన్నదయ్యె. విశాలము లగుకన్నులు గలయాసీత యార్తయై కనుప

ట్టుచు రోదనము సేయుచుండుటఁజూచి చిత్తమునఁ దత్తఱపడుచు లక్ష్మణుఁ డూఱడించెను. కాని యాబిడ యూఱడించు నెపమున పోక జాగు సేయుచున్నాఁడని కుపితయై మఱఁదితో నేమియుఁ బలుకదయ్యె. అంత ధీరుఁ డగు లక్ష్మణుఁడు సీతకభివందనము గావించి యంజలిగీలించి కోపవశమున నించుకయే నమస్కరించి యొంటిగా నెట్లువిడిచిపోదునని మాటి మాటికి నాబిడనుఁ దిరిగి తిరిగి చూచుచు రామునియొద్దకుం బోయెను. ఇది నలువదియైదవసరము.

{ లక్ష్మణుఁడు తరలిపోఁగా రావణుఁడు పరివ్రాజిక వేషమున సీతకడకువచ్చి యామె సౌందర్యాదులను బొగడుట. సీతను వృత్తాంత మడుగుట. సీత చెప్పుట.

రాముని తమ్ముఁడు లక్ష్మణుఁడు, సీతయట్లు పరుషముగాఁ బలుకఁగా, ఎంతమాత్రమును విడిచిపోవ నిచ్ఛలేనివాఁడయ్యును సీత నొంటిగావిడిచి పోవలయునేయని కాళ్లు వెనుక కీడ్వఁగా రాముని త్వరితముగాఁ జేరవలయునని వేగిరపడునట్లున్నవాఁడై రామునికొఱకు బయలుదేఱెను. రావణుఁడును అవకాశము నెదురుచూచుచుండెను. కావున లక్ష్మణుఁడుగూడ తరలిపోవుటచే సీత యొంటిగ నుండుటఁ జూచి సమయము దొరకెనని శీఘ్రముగా సన్యాసిరూపము దాల్చి సీతాదేవింగూర్చి పోయెను. ఆ రావణుఁడు సన్నకావివస్త్రమును ధరించి మంచిజుట్టు దలయందు నట్టుకొని) గొడుగునుబట్టి పావలదొడిగి, యెడమమూఁపునఁ దత్రిదండమునకు గమండలువుఁదగిల్చి యుంచుకొని, యిట్లు సన్యాసిరూపమున సీతయొద్దకుఁ బోయెను. సూర్యచంద్రులు లేకుండునపుడు బెడిదంబగు చీఁకటి సంజను గ్రమ్మినట్లు, మహాబలుఁ డా రావణుఁడు అన్నదమ్ములు రామలక్ష్మణులు లేకుండునపుడు సీతయొద్దకుం బోయెను. అంత మిక్కిలి దారుణమైనయంగారక గ్రహము* చంద్రునిఁ బాసి యున్నప్పుడు రోహిణిని జూచునట్లు, మహాభయంకరుఁడగు రావణుఁడు రామునిం బాసియున్న యాబాలను యశస్విని రామపత్నిని గాంచెను. రావణుఁడు బెడిదంబగు తేజమును భయంకరకృత్యములును గలవాఁడు గావున వానిం జూచి జనస్థానమునం గలవృక్షములన్నియు గడగడవడఁకెను వాయువును జక్కఁగా వీవఁడయ్యె. శీఘ్రముగాఁ బ్రవహించునట్టి గోదావరీనదియు. ఆరావణుం డెఱ్ఱని కన్నులతోఁ జూడఁగా భయంబున చలనము మాలి మెల్లమెల్లనఁ బోవసాగెను. రాముఁడు పాసిపోవు సమయము చూచుచుండిన రావణుఁడు, అతఁడు లేనియా యవకాశమున సన్న్యాసిరూపమున సీతను సమీపించిపోయెను. ఆ దుర్జనుఁడు సుజనవేషుఁడై, వెనిమిటినిం గూర్చి పల్లటిలుచున్న సీతయొద్దకు, చిత్రానక్షత్రమునకుఁ జంద్రుఁడు పోవునట్లు పోయెను. వాఁడు పచ్చికచేఁ గప్పఁబడిన బావివలె లోపలం బాపాత్ముండై పైకి

* క్రూరములగు నంగారకాదిగ్రహములు రోహిణిని వీక్షించుటవలన లోకానర్థముగలుగునట్లు రావణుఁడు సీతను వీక్షించుటవలనను గలుగునని భావము.

మంచివానివేషము వేసికొని మహాకీర్తిమతి యగురామునిపత్నిని సీతనుజూచి నిలుచుండెను. మంగళస్వరూపిణియై, మంచి పలువరుసయు మించుకెమ్మోవియు నెమ్మెలు గులుకఁ పున్నమచందురునివంటి నెమ్మొగముగలిగి, తామర రేకులవంటి వాలుఁగన్నులు వన్నెచూప, పచ్చని పట్టుపుట్టముగట్టి, రామునియార్తస్వరము విన్నందున లోపల మనము కుదురులేక వెలుపలఁ గన్నీళ్లు దొరుగంగఁ, బర్ణశాలయందుఁ గూర్చుండియున్న యాసీతకడకు దుష్టాత్ముఁడారావణుఁడు పోయెను. ఆరాక్షసవిభుఁడు మన్మథబాణములు మదినిగాఁడ వేదపఠనమున బ్రహ్మఘోషముసేయుచు, ఎవ్వరులేనపుడు సీతను జూచి సవినయముగా నిట్లనియె. లోకమునందెల్ల మేలుబంతి యగునాయింతి రామునిఁ బాసియుండుటచే, తామరను బాసినలచ్చికైవడిఁ జూపట్టుచు, దేహకాంతులఁ దుఱంగలించుచుండఁగా వాఁడుచూచి పొగడువాఁడై 'బంగారువన్నెగలిగి పచ్చని పట్టుపుట్టముగట్టియున్నయోచిన్నారీ! కమలమువంటి మొగమును కన్నులును చేతులును చరణములును గలదానవుగావున కమలమాలికను దాల్చిన తామరతీఁగవలెనున్నావు. నీవెవ్వతవు? శుభాననా? నీవు భూదేవివా? కీర్తివా? శుభాత్మురాలగు శ్రీదేవివా? కాంత్యధిష్ఠానదేవత యగులక్ష్మివా? అప్సరసవా? భూత్యధిష్ఠానదేవతవా? వరారోహా! స్వతంత్రురాల యినరతీదేవివా? నీపండ్లు ఒండొంటికి సమములై మల్లెమొగ్గలవలె నిగ్గయిన మొనలుగలిగి నునుపై తెల్లగా నుల్లసిల్లుచున్నవి. నీకన్నులు విశాలములై నిర్మలములై యెఱ్ఱని కొలుకులును నల్లనిపాపలును గలిగి వెలుఁగుచున్నవి. నీకటియు మిక్కిలి విశాలమై బలుపుగలిగియున్నది. నీతొడ లేనుఁగుతొండములవలె గండుమీఱినవి. నీచన్నుగుబ్బలు పొడవులై వట్రువలగుచు నొండొంటితోఁ గ్రిక్కిఱిసి మిక్కిలి బరువులై నిక్కుటచే కొంచెము మల్లలాడునట్లు గనుపట్టుచున్నవి. మఱియు నవి కొనలయందును నిక్కియుండుటే కాక బలుపు సైతముగలిగి మదికిఁ గోర్కుల నూరించుచు నిద్దములై నునుపారి తాలఫలములంబోలి, మేలయినమణులు గూర్చినహారముల నలంకృతములై యెంతయు మురువు గులుకుచున్నవి. సొగసైన చిఱునవ్వుదోలఁక చెలువంపుఁబలువరుస ముద్దుగులుకఁ గన్నుంగవ వన్నె చూపునో విలాసినీ! కాంతా! నది తన ప్రవాహముచే గట్టును హరించుచున్నట్లు నీవు నీచక్కఁదనముచే నామనస్సును హరించుచున్నావు. నీనడుము పిడికిటికొలఁది. నీకురులు నల్లనై సిరులు గులుకుచున్నవి. నీబలితంపుగుబ్బలు నొండొంటి నొరసి గ్రిక్కిఱిసియున్నవి. నీయందమేమందును! నీ యట్టిరూపము గలస్త్రీని దేవతలలోఁగాని గంధర్వులలోఁగాని కిన్నరులలోఁగాని భూతలమున మనుష్యస్త్రీలలోఁగాని యిదివఱ కెన్నఁడును జూచినదే లేదు. లోకమునందెల్ల వాసిగన్ననీ లావణ్యమును, నీ సౌకుమార్యమును, నీ ప్రాయంపువయస్సును, వీనికెల్లను విరుద్ధముగా నీవీ యడవియందు వాసము సేయుటయుం, జూడఁగా ఇట్టిలక్షణవతి యీ యడవికి రానేల? యని నామనస్సు నిశ్చయింపలేక తబ్బిబ్బు గొనుచున్నది. ఇట్టిసుకుమారివి, ఇట్టి ప్రాయ

వుదానవు. నీ వీ యడవియం దుండఁదగదు. నీ యింటికి మరలిపొమ్ము. ఇది భయంకరాకారులును కామరూపులు నగురాక్షసులు వాసముసేయుస్థలము. నీవు సమృద్ధములును సుగంధయుక్తములును రమణీయములు నగుప్రాసాదాగ్రములందును, నగరోపవనములందును సంచరింపఁదగినదానవు. మంగళరూపిణీ! అసితేక్షణా! *మేలయిన పూదండలును, మీటయిన భోగ్యద్రవ్యములును, మంచివస్త్రములును,మిక్కిలి కన్నాకయినపురుషుఁడునే నీకుఁ దగునని తలంచెదను. వరాననా! వరారోహా! నిన్నుఁజూడఁగా నాకు దేవతాస్త్రీయని తోఁచుచున్నది. నీవు రుద్రులతో సంబంధించినదానవా? లేక మరుత్తులలోఁ జేరినదానవా? కాదేని వసువులలోఁ గలయోక్కతివా? లేక ఆదిత్యులలోనిదానవా? గంధర్వులుగాని దేవతలుగాని కిన్నరులు గాని యిచ్చటికిరారు. ఇది రాక్షసులు వసించుప్రదేశము. నీ వెట్లిచటికి వచ్చితివి? ఇందు కోఁతులును సింహములును చిఱుతపులులును పులులును జింకలును ఎలుఁగుబంట్లును, బెబ్బులులును రాఁబులుఁగులును సంచరించుచుండును. వానింజూచి నీకు భయ మెట్లు కలుగకున్నది? వరాననా! ఈ మహారణ్యమున మిక్కిలి మత్తిల్లి భయంకరములై బలవంతము లగునేనుంగులకు నీవొక్కతెవు భయపడకెట్లున్నావు? కల్యాణీ! నీవెవ్వతెవు? నీ పేరేమి? ఎవ్వరిదానవు? ఎందుండివచ్చితివి? భయంకరమై రాక్షసులు మెలఁగుచుండుదండకారణ్యమున నొంటిగా నేల సంచరించుచున్నావు?' అని యడిగెను. దురాత్ముఁ డగురావణుఁ డిట్లు ప్రశంసచేయఁగా, సీత బ్రాహ్మణసన్యాసివేషముతో వచ్చినవానినిఁ జూచి నిజ మగుసన్యాసియని భ్రమిసి సమస్తపూజాద్రవ్యములతో వాని కతిథి సత్కారము లిట్లు గావించెను. ఆబిడ రావణునకు మొదటఁ బీఁట తెచ్చి వైచి, పాద్యమొసఁగి, యంత సౌమ్యవేషమునఁ బొడసూపుచున్నయా రావణునిఁ జూచి? 'పక్వాన్నము సిద్ధమయ్యెను; భుజింపుఁ'డని చెప్పెను.అట్లు బ్రాహ్మణవేషము వేసికొని సొఱకాయపాత్రఁగొని కుసుమయద్దిన కావివస్త్రమును గట్టవచ్చిన రావణుఁ డాబిడ నపహరించుటయందే కన్ను గలిగియుండుటవలన వానిని భోజనమునకై యియ్యకొలుపుట సీత కలవిగాదు.అట్టివానినిజూచి సీత బ్రాహ్మణునింబోలె నపుడు భుజింపఁ బిలిచెను 'బ్రాహ్మణా! ఇదిగో బ్రస్యాసనము. యథేచ్ఛముగాఁ గూర్చుం

* లేక 'లోకోత్తరయగు నిన్నుఁ బొందినమాల్యాదులును భోజ్యద్రవ్యములును వస్త్రములును మిక్కిలి ప్రశస్తములగుననియు అట్లెనిన్ను భార్యగాఁ బడసినపురుషుఁడే సర్వోత్తముఁడనియు తలంచెదను' అని యునర్థము. లేక 'ద్విజాతివేషేణ సమీక్ష్యమైథిలీ సమాగతం పాత్రకుసుంభ ధారిణమ్।అశక్య ముద్ద్వేష్టు మపాయదర్శనమ్। న్యమంత్రయద్బ్రాహ్మణవత్తదాంగనా' అని మూలము. ఇట(మైథిలీ)యనుటచే ఆచారప్రధానమగు జనకకులమున జనించినదిగావున రావణుని చేష్టలవలన వాఁడు కపటవేషధారియని తెలిసినదయ్యు పైకి కేవలము సన్న్యాసివేషమును ధరించినమాత్రమున, (ఉద్వేష్టుం) ద్వేషించుటకు (అశక్యం) అలవిగాకున్న యారావణుని- 'కాషాయదణ్డమాత్రేణ యతిపూజ్యో నసంశయ' అనువచనముంబట్టి ద్వేషింపలేక బ్రాహ్మణునివలెనే నిమంత్రించినదని యర్థాంతరము.

డుము. ఇదిగో పాద్యము; ప్రతిగ్రహింపుము. ఇవిగో నీకుఁగాను మేలయినకందమూలాది వన్యపదార్థములు పక్వముచేయఁబడియున్నవి; ఇచ్చట వీనిని గొఱంత లేకుండునట్లు భుజింపుము' అని యిల్లు సర్వమన్నము సంపన్నమని యతిథికిఁ జెప్పవలయుమాటలాడుచు నిమంత్రించుచున్నయా రాజేంద్రుని రామునిపత్నిని సీతను బొఱఁజూచి వాఁడు తన చావుకొఱకై, తెగుదారితనమున, బలాత్కారమున నపహరించుటకు మనస్సు గొన్నవాఁడయ్యె. అంత నప్పుడాసీత వేఁటకుఁ బోయి యున్న సుందరాకారుని తనపతిని రామునిని, లక్ష్మణునిని ఎదురుచూచుచు నానావిధముల వారు పోయినదిక్కు నెంత చూచినను నాచెలువకు పట్టి యరణ్యమే కానవచ్చెనుగాని రామలక్ష్మణులు గానరారైరి. ఇది నలువదియాఱవసర్గము.

⁂

{ తనవృత్తాంతమును రావణునకుఁ జెప్పుట. రావణుఁడు తన్నుఁ దెలిపి చేపట్టుమని సీతకుఁ జెప్పుట. సీత పరుషోక్తుల నిరాకరించుట. }

సీత, తన్నపహరింపఁగోరి యట్లు రావణుండడుగఁగా, వాని యతివేషమును బట్టి, యాయంగన తనవృత్తాంతము నిట్లు చెప్పఁదొడఁగెను. ఆబిడ తనలో 'ఇతఁడు బ్రాహ్మణుఁడు. అందును అతిథి. అడిగినది చెప్పనియెడల నన్ను శపించును' అని కొంచెము సేపాలోచించి వానితో "బ్రాహ్మణోత్తమా! నేను మహాత్ముఁడగు మిథిలదేశాధిపతికి జనకునికి గూఁతురను; నాపేరు సీత. నీకు శుభం బగుఁగాక. రాముని భార్యను. నేను పెండ్లియైనపిదప మామగారగు నిక్ష్వాకులయింటఁ బండ్రెండుసంవత్సరములు సమస్తమైనభోగపదార్థములును సమృద్ధముగాఁ బడసి పతితోడ * మనుష్యులనుభవించు భోగములనెల్ల ననుభవించుచుంటిని. అంతఁ బదుమూఁడవసంవత్సరమున సమర్థుఁడగు మామామ దశరథమహారాజు సామంతరాజులతోను మంత్రులతోను గలసి రామునకుఁ బట్టాభిషేకము సేయవలయునని యాలోచించెను. అట్లు రామునకుఁ బట్టాభిషేకము నారంభించుచుండఁగా నాయత్తగారు కైకయను నామె పెనిమిటిని వరమడిగెను. ఆ కైకేయి సత్యసంధుఁడగు రాజశ్రేష్ఠుని నా మామగారిని, తా నతనికి మున్ను చేసియున్న యుపకారమున వశము చేసికొని, సత్యముమీఁద నొట్టుపెట్టి, నా పెనిమిటిని రాముని నూరినుండి వనమునకుఁ బంపుటయు తన కొడుకు భరతునిఁ బట్టము గట్టుటయునని రెండువరము లడిగెను. ఆ కైక తన పెనిమి

* ఇందులకు 'భుంజానా మానుషాన్ భోగాన్ సర్వకామసమృద్ధినీ' అనిమూలము. (మానుషాన్ భోగాన్) మనుష్యులు భోగించురతిక్రీడాదులు; రతిక్రీడ లనుట గ్రామ్యమని తలఁచి మానుషభోగము లనిచెప్పినదని భావము. లేక (అమానుషాన్ భోగాన్) అని ఛేదము చేసినయెడల మనుష్యులకు దుర్లభములైన భోగములని యర్థము - లేక వాస్తవమునకుఁ దాను దివ్యభోగపరురాలుగావున, (మానుషాన్ భోగాన్) అని యవశయై తన కేవలభోగములను చెప్పినదనియు గ్రాహ్యము - లేక (మానుషాన్) మనుష్యుఁడై యవతరించిన రామునితోఁ గావించిన భోగములనియు నర్థము గ్రాహ్యము.

టితో 'నీవు మఱేమిచేసినను నే నిపుడు భోజనముసేయను, కన్నుమూయను, నీళ్లు త్రాగను. రామున కభిషేకముసేయుదువేని యిపుడే నాప్రాణములు విడుతును' అని చెప్పుచుండఁగా బహుమానప్రదుఁ డగునామామగారు కైకను తమ కోరికిం దగినట్లు మిక్కిలిమేలయి యనుభవింప నర్హమై యొప్పు సువర్ణరత్నాద్యర్థములు, ఆవరములకు బదులుగా నిచ్చి యెంత యడుగుకొన్నను ఆబిడ వాని నంగీకరింపదయ్యె. అప్పుడు మహాతేజమున రాజిలుచున్న నా పెనిమిటికి వయస్సు *ఇరువదియైదేండ్లు. నేను బుట్టి యప్పటికిఁ బదునెనిమిదేండ్లు లెక్కయగుచున్నవి. నా పెనిమిటి రాముఁడను పేర లోకమునఁ బ్రసిద్ధుఁడు, గుణవంతుఁడు, సత్యసంధుఁడు, పరిశుద్ధుఁడు, విశాలములైన కన్నులును నిడుదలయిన బాహువులును గలవాఁడు, సర్వభూత హితపరాయణుఁడు. రాముఁ డడవికిఁ బంపరానియిట్టి ప్రియమును నిట్టిగుణములుగలవాఁడు. మహాతేజుఁ డతనితండ్రి, కామార్తుఁడగుటచే కైకకు 'నీవు చెప్పినట్లు చేసెద'నన్న ప్రతినచేసి ప్రియమును గావింపఁగోరినవాఁడై యట్టిగుణవంతునికి రామునికిఁ బట్టాభిషేకము సేయుట మానెను. కైకయు, పట్టాభిషేకమునకై తండ్రి కడకు వచ్చిన నా పెనిమిటిని రామునిఁజూచి తెగుదెంపుగా 'రామా! నీకు మీతండ్రి నాతో నిట్లాజ్ఞాపించి యున్నవాఁడు. అది చెప్పెద వినుము. అకంటకమైనయీ రాజ్యమును భరతున కియ్యవలయును. రామా! నీవుమాత్రము పదునాలుగేండ్లు అడవిలో వాసము సేయవలయును. కాఁబట్టి యూరు వెడలి యడవికిఁ బొమ్ము. నీతండ్రిని అసత్యదోషమునుండి తప్పింపుము' అనెను. రాముఁడు దేనికిని భయపడనివాఁడు; మఱియు దృఢవ్రతుఁడు కావున నా పెనిమిటి యపుడు కైకతో 'అట్లు చేసెద'నని చెప్పి యామెమాట చొప్పున వనమునకు వచ్చెను. బ్రాహ్మణా! రాముఁడు దృఢవ్రతుఁడు గాకేమి? ఒకరి కిచ్చునుగా

* ఇప్పుడు రాముని వయస్సును సీతవయస్సును విచార్యములు:—రాముఁడు పుట్టిన పండ్రెండేండ్లకు విశ్వామిత్రుని రాక. పిదప సీతతోఁగూడ నయోధ్యలో పండ్రెండేండ్లు వాసము. ఆవాసమునకుఁ బదుమూఁడవయేఁట రాజ్యాభిషేక మారంభించుట కాఁబట్టి వనప్రవేశసమయమున రామునికి ఇరువదియైదేండ్లు సీత చెప్పినట్లు సరిపోవుచున్నది. పిదప వనవాసపు పదునాలుగేండ్లలో ఋష్యాశ్రమములఁ బదియేండ్లును పంచవటియందు మూఁడేండ్లును గడవఁగా పదునాలుగవయేట సీతాపహరణము. కాఁబట్టి యిప్పటికి రామునకు ముప్పదియెనిమిదేండ్లగుచున్నవి. సీతకు భూమినుండి పుట్టి మిథిలయందు జరిగినవి యాఱేండ్లు. అంత పెండ్లియైనపిదప నయోధ్యయందు వాసము పండ్రెండేండ్లు. కాఁబట్టి వనప్రవేశసమయమున సీతకు పదునెనిమిదేండ్లు సరిపోవుచున్నది. ఇప్పటికి వనవాసము పదుమూఁడేండ్లు గడచి పదునాలుగవయేఁడు జరగుచుండుటచే సీతకు ముప్పది యొక్కటవయేఁడు గడచి ముప్పదిరెండవయేఁడు జరుగుచున్నదని తెలియునది.

'మమభర్తా మహాతేజా వయసా పంచవింశకః। అష్టాదశహి వర్షాణి మమ జన్మనిగణ్యతే' అనిమూలము. ఇట 'మమ భర్తా' అనుచో భ కారము గాయత్రితొమ్మిదవయక్షరము. కాన తొమ్మిదవసహస్రమారంభింపఁబడెనని తెలియునది.

ని తాను ప్రతిగ్రహింపఁడు; సత్యమేచెప్పును. అబద్ధము నెంతమాత్రమును బలుకఁడు. ఇది రాముని మొనలేనివ్రతము. దీని నెప్పుడు వదలఁడు. రాముని సవతితల్లికొడుకు లక్ష్మణుఁ డనుతమ్ముఁడు గలఁడు. అతఁడు మహావీర్యవంతుఁడు;యుద్ధమున నెట్టిపగవారిని దుదముట్టించువాఁడు. రామున కెల్లప్పుడు నతఁడు సహాయుఁడై యుండును. పరమధార్మికుఁడును దృఢవ్రతుఁడు నగునాలక్ష్మణుఁడు, రాముఁడు నాతోఁగూడ వనమునకు రాఁగా, తాను విలుదాల్చి యతనిని వెంటనంటివచ్చెను.రాముఁ డెప్పుడునుధర్మమును దప్పక జితేంద్రియుఁడై యుండువాఁడుగావున తాపసవేషముదాల్చి, జటలను ధరించి, నేనును లక్ష్మణుఁడును వెంబడింపఁగా, ఈదండకారణ్యమునకు వచ్చెను. బ్రాహ్మణోత్తమా! అట్లు కైకనిమిత్తమై రాజ్యభ్రష్టుల మయినమేము మువ్వురమును,అతిభయంకర మగునీయరణ్యమున ప్రతాపమున సంచరించుచున్నాము. కొంచెముసేపు నిలిచి యిట శ్రమముతీర్చుకొనుము. ఇచ్చట నుండుట నీకుఁ గష్టముగానుండదు.నాభర్త జింకలను ఉడుములను పందులను జంపి పలువిధములైన మాంసములను పెక్కుదక్కినవన్యపదార్థములను దీసికొని శీఘ్రముగావచ్చును. బ్రాహ్మణా! *ఇంక నీవును నీగోత్రమును ఉన్నదియున్నట్టుగా చెప్పుము. ఇట్లొంటిగా నీ దండకారణ్యమున నేల తిరుగుచున్నావు?" అనెను. రామునిపత్ని యాసీత యిట్లు చెప్పఁగా నంత మహాబలుఁ డగురాక్షసవిభుఁడు రావణుఁడు తీవ్రముగా నుత్తరమునిచ్చువాఁడై 'సీతా! దేవాసురులును పన్నగులును మున్నుగా సమస్తలోకములు నెవ్వనికి వెఱచియుండునో యట్టి రాక్షసగణప్రభుం డగురావణుఁడనువాఁడు నేనుజుమా! †పొగడ్తకెక్కినదానా! బంగారువంటి మేనిచాయగలిగి పట్టుపుట్టముగట్టి యొమ్మెగులుకుచున్న నిన్నుఁ జూచినదిమొదలుగా నాభార్యలయందు నాకెంతమాత్ర మింపుగలుగకున్నది. ‡ అయ్యై స్థలములనుండి నేను పెక్కుస్త్రీలను బట్టితెచ్చియున్నాను. నీకు శుభంబగునుగాక. వారి యందఱిలోప

---

* యతిని కులగోత్రములడుగరాదు. మఱియొంటిగా నడవిలో సంచరించుట యతికి ధర్మమే కాదు. ఒంటిగా నిందేల సంచరించెదవని యడుగుటయు తగదు. అయినను సీత యిట పూర్వాశ్రమమందలి నామగోత్రములను అడిగినదనియు 'భిక్షార్థం గ్రామం ప్రవిశేత్' అని శ్రుతినిబట్టి గ్రామసమీపమందలి యరణ్యముననుండి భిక్షార్థము గ్రామములకుఁ బోవుట యతికి చెల్లునుగావున 'గ్రామములకు దూరమై కావున భిక్షపెట్టు జనులులేకుండునట్టి యీమహారణ్యమున నేలతిరుగుచున్నావు' అని యడిగినదనియు నూహించుకొనునది.

† ఇందులకు "త్వాంతు కాంచనవర్ణాభాం దృష్ట్వా కౌశేయవాసినీం । రతిం స్వకేషు దారేషు నాధిగచ్ఛామ్యనిందితే' అనిమూలము. ప్రాతీతికార్థము స్పష్టము-వాస్తవార్థము:—(త్వాం)నా యిష్టదేవతవైన నిన్ను, (దృష్ట్వా)చూచి, (స్వకేషు) నావారైన పుత్రమిత్రాదులందును,(దారేషుచ) భార్యలందును (రతిం) ఇచ్ఛను, (నాధిగచ్ఛామి) పొందను-నాయిష్టదేవత వగునిన్ను దర్శించుటవలన ఆనందపూర్ణుఁడనై యన్నిటియందు విరక్తినొందినవాఁడనైతినని భావము.

‡ ఇందులకు 'బహ్వీనా ముత్తమస్త్రీణామాహృతానా మితస్తతః। సర్వాసామేవ భద్రం తే మమాగ్రమహిషీ భవ' అనిమూలము.వాస్తవార్థము:—(ఆహృతానాం ఉత్తమస్త్రీణాం సర్వాసాం)నేను పట్టి

ల నీవు నాకుఁ బట్టపుదేవిగా నుండుము. సముద్రమునడుమ నున్నయొకపర్వతముకొన పయిని నా మహాపట్టణము ఏర్పఱుపంబడియున్నది. దానికి లంకయని పేరు. అది చుట్టును సముద్రముచే నావరింపఁబడియుండును. సీతా! నీ వాలంకయందు నాతోఁ గూడ నుద్యానవనములందు విహరింపఁగలవు, అట్లు విహరింతువేని యపుడు నీ వీ యరణ్యమందలి వాసమును ఎంతమాత్రమును నొల్లవు. *సీతా! నీవు నాకు భార్య వగుదువేని సమస్తాభరణభూషిత లగునైదువేలదాసీలు నీ కెప్పుడును బరిచర్య సేయుచుందురు' అనెను. ఏ కంఁదును లేనియవయవములపొందు గలయాజనక రాజసుత యాసీత రావణుం డిట్లు చెప్పఁగా విని మిక్కిలి కుపితయై, యా రాక్షసు నెంతమాత్రము సరకుసేయక 'మహాపర్వతమువలె నెట్టివారికిని గదల్పరాని వాఁడును,మహేంద్రునికి సాటి యగుపెనిమిటియును, స్వామియును,మహాసముద్రము వలె కలఁచి పుచ్చరానివాఁడునయి యొప్పరామునికి నే ననువ్రతయైనదానను. ఇట్టి నన్నా యిట్లాడెదవు? నేను సర్వలక్షణసంపన్నుఁడై †మఱ్ఱివృక్షమువలె పఱపైనమేని కట్టుదిట్టముగలిగి సత్యసంధుఁడును మహాభాగుఁడు నై బాగుమీఱురాముని కనువ్రతయైనదానను. ఇట్టి నేను నిన్నుఁ గంటనైనఁ జూతునా? నిడుదలగు బుజములును వెడఁదఱొమ్మును గలిగి సింగంబువలె బీరంపునడలు నడచు పురుషసింహునికి సింహసమానునికి రామునికి నేను అనువ్రతను. తప్పుడుమాటలాడకు. నిండుచందురునివంటి నెమ్మొగము గలవాఁడును, జితేంద్రియుఁడును, మహాకీర్తిమంతుఁడును మహాత్ముఁడు నగురాజకుమారునికి రామునికి ననువ్రతయైనదానను. నీవు నక్కవు; నీ కెంతమాత్రముపొందరాని యాఁడుసింగమును నన్నుఁ గోరెదవు. సూర్యునిఁ గాంతి వాయనట్లు,రామునిఁ బాసియుండనినన్ను నీకు స్పృశింప నలవిగాదు. రావణా! రాముని మక్కువయిల్లాల నగునన్నుఁ గోరుచున్నావే! ఇట్టి మందభాగ్యుఁడ వగునీవు నింక ‡బం

తెచ్చిన మేటి స్త్రీలందఱిలోపల, (మమ) నాకు, (అగ్రమహిషీయా) ఎవ్వతి పట్టపుదేవియో, (తస్యాశ్చ మమచ) దానికిని నాకును, (భవ) (ఈశ్వరీ) అని శేషము - ఏలికసానివి కమ్ము.

* ఇందులకు 'పంచదాస్య స్సహస్రాణి సర్వాభరణభూషితాః। సీతే పరిచరిష్యన్తి భార్యాభవసి మే యది' అని మూలము. వాస్తవార్థము:—(పంచసహస్రాణిదాస్యః) ఐదువేలదాసీలు, (మే) నాతోఁ గూడ - వారును నేనును గూడి యనుట, (పరిచరిష్యంతి యది) (తవ) అని శేషము - నీకు పరిచర్య సేయుదుమేని, అపుడు, (భార్యా - భ + ఆర్యా; భయా - కాంత్యా, ఆర్యా - పూజ్యా) కాంతిచేత పూజ్యురాలవు. (భవసి) అగుదువు - పూజ్యకాంతిని దళుకొత్తుదువనుట.

† ఇందులకు 'న్యగ్రోధపరిమండలమ్' అనిమూలము. మఱ్ఱిచెట్టునకు బహుశాఖలవలె బహుబంధువులుగలవాఁడనికాని లేక దానివలె సర్వసమాశ్రయణీయుఁడనికాని,లేక 'కూపోదకం వటచ్ఛాయా యువతీనాం స్తనద్వయమ్। శీతకాలే భవత్యుష్ణ ముష్ణకాలేచ శీతలమ్' బావినీరు మఱ్ఱినీడ యౌవనవతులచన్నుఁగవ శీతకాలమున వెచ్చగాను ఉష్ణకాలమున చల్లగాను నుండునట్లు సమస్తకాలములందు సర్వజనానుకూలుఁడనికాని యర్థాంతర మూహ్యము-

‡ మరణము సమీపించినవారికి బంగారుమయము లగుచెట్లు కనఁబడునని ప్రసిద్ధి. నన్నుఁ గోరితివిగావున నీవు తొడనే చావఁ గలవనిభావము.

గారు వృక్షములను జెక్కఁజూతువు. ఇది నిశ్చయము. ఆఁకలిగొని మిక్కిలి యుఱవడించుచున్న సింగమునోటనుండియు, అల్లి చిందఱ రేఁగుచున్న సర్పము నోటనుండియు, కోఱ పెఱుకఁగోరుచున్నావు. నీవు పర్వతోత్తమమయిన మందరమును చేతంబట్టుకొని పోవఁగోరుచున్నావు. అది యలవిగానట్లే నన్నుఁ గొనిపోవుట చుమీ! మఱియుఁ గాలకూటమును ద్రాగి సుఖముగా నింటికిఁ బోవఁజూచెదవు. నీవు రాముని ప్రియభార్యయగు నన్నుం బొందఁగోరుచున్నావే. సూదితోఁ గన్ను తుడుచుకొన్నావు; నాలుకతో కత్తిని నాఁకుచున్నావు. పిమ్మటి నాశము దెలియవు. రాముని ప్రియకాంత నగునన్ను నిరసింపఁజూచుచున్న నీవు కుత్తుకకు రాయిఁగట్టుకొని సముద్రమును దాటఁగోరుచున్నవాఁడవు. సూర్యచంద్రుల నిద్దఱిని చేతఁబట్టుకొన నుంకించుచున్నవాఁడవు. ఇది తరముగాదని తెలియవో! శుభాచార యగు రామునిభార్యను నపహరింపఁగోరుచుండుట చూడఁగా మండుచున్న నిప్పును గుడ్డలోఁగట్టుకొని పోవఁగోరుచున్నట్లున్నది. రామునికిఁ దగినట్టిభార్య యగునన్నుఁ బొందఁగోరెదవు. ఇది యుక్కు మొనలు గలశూలములపై నడవఁ గోరునట్లే యున్నది. అపాయము తెలియవు. అడవిని సింహమునకు నక్కకు నెంత భేదమో, చిన్న చెలమకును సముద్రమునకు నెంత వాసియో, మేలయిన మద్యమునకును కడుగునీళ్లకును నెంత యంతరమో, రామునకును నీకును అంత తారతమ్యమున్నది. బంగారమునకును సీసమునకును ఎంత భేదమో, చందనపుముద్దకును బురదకును నెంత భేదమో, ఏనుఁగునకును పిల్లికిని నెంత భేదమో, దశరథకుమారుఁడు రామునికిని నీకును నంత భేదమున్నది. కాకమునకు గరుత్మంతునికిని, నీరుకాకికిని నెమలికిని, గద్దకును హంసకును నెంత భేదమో రామునికిని నీకును నంత భేదమున్నది. దేవేంద్రునికి సాటి యగు ప్రభావముగలిగి ధనుర్బాణంబులు కేలందాల్చి రాముఁడుండఁగా, నీవు నన్నపహరించినను, *ఈఁగ బియ్యపుగింజయని వజ్రపుపలుకు మ్రింగినను అది దానికి జీర్ణముగానట్లు, నేను నీకు వశముగాను; మఱి మరణమే కలిగింతు'ననెను. పరిశుద్ధహృదయ గునా సీత యిట్లతిధీరముగా రావణునకుఁజెప్పి యంత భయమున గాలిచే నల్లలాడునరఁటిచెట్టువలె గడగడ వడంకసాగెను. మృత్యువునకుం బోలుమహాప్రభావము గలయా రావణుఁడు అట్లు సీత భయముగొని వడఁకుచున్నదని యెఱిఁగి, మఱియును భయమును గలిగించుటకై, తనకులమును బలమును బేరును దాను గావించినమహాకార్యములను జెప్పవాఁడయ్యెను. ఇది నలువది యేడవ సర్గము.

* ఇందులకు 'వజ్రం యథా మక్షికయావగీర్ణమ్ అనిమూలము. ఇందులకు, (మక్షికయాసహ ) ఈఁగతోఁగూడ (అవగీర్ణం) మ్రింగఁబడిన, (వజ్రం) 'వజ్రోవా అజ్యమ్' అనిశ్రుతిచెప్పిన నెయ్యి, (యథా నజీర్ణం భవతి) జీర్ణముగానియట్లు, నీవు నన్నపహరించినను నీకు లోఁకువగాను; నీకు మరణమే కలిగింతునని యర్థాంతరము నూహ్యము.

( రావణుఁడు నిజరూపమును జూపి తనపరాక్రమాదులు పొగడి వరింపుమని సీతతోఁ జెప్పుట. సీతదూఱుట )

సీత యిట్లు చెప్పుచుండఁగా రావణుఁడు కుపితుఁడై నొసట బొమముడి గీలుకొలిపి పరుషవాక్యముల 'వరవర్ణినీ! నేను కుబేరునికి తమ్ముఁడను; అతనికి సవతితల్లికొడుకను. పదితలలుగలిగి మహాపరాక్రమశాలియగువాఁడను. నన్ను రావణుఁ డండ్రు. మృత్యువును జూచి పాఱుప్రజలవలె నన్నుఁజూచి దేవతలును గంధర్వులును బిశాచోరగపన్నగులును భయమున నెప్పుడును బాఱిపోవుచుందురు. మున్ను ఒక కారణమునుబట్టి నా సవతితల్లికొడుకగుకుబేరునకును నాకును యుద్ధముకలిగెను. అప్పుడు, నేను పరాక్రమము నెఱపి యతనిని గెలిచియున్నాను. ఆకుబేరుఁడు, నావలనిభయమునఁ బీడితుఁడై సర్వవస్తుసమృద్ధమైనతనపట్టణమును లంకను వదలి, కైలాసపర్వతము శివస్థానము గావున నచ్చట నేను తొందరచేయలేనని తలఁచి యాపర్వతోత్తముపై వసించియున్నాఁడు. కల్యాణీ! ఇప్పుడు నేను దేనినెక్కి యాకాశమున సంచరించుచున్నానో కామగమనమును శుభమునైనయాపుష్పకవిమానము నా కుబేరునియొద్దనుండి పరాక్రమబలమున గెలిచి సంపాదించినదే! నాకు కోపముకలిగియున్నప్పుడు నింద్రుఁడు మొదలగుదేవతలును నా మొగమును జూచి రేని తక్షణమే భయముగొని పాఱిపోవుదురు. నే నెచ్చటనుందునో యచట నంతయు వాయువు భయమున మెల్లగావీచును. సూర్యుఁడు వేఁడికిరణములు గలవాఁడయ్యును భయమున జల్లనికిరణముల నిగిడించును. ఎందెందు నేను నిలుచుందునో, ఎచ్చటెచ్చట సంచరింతునో, యందందెల్ల చెట్లు ఆకులుగూడఁ గదలకుండును. నదులు నీళ్లుపాఱక నిలిచియుండును. నాకు, సముద్రమునకు పారమువలె నుండుత్రికూటపర్వతముపయిని, భయంకరులగురాక్షసులు నిండియున్న లంక యనుమంచిపట్టణము, ఇంద్రునకమరావతివలె విలసిల్లుచుండును. ఆపట్టణమునకుఁ జుట్టును వెండిమయమై తెల్లగా నుల్లసిలుచున్న గొప్పప్రాకార మొకటి యుండును. అందు మేడలు ముంగిళ్లు మొదలయినవి బంగారుమయములై యుండును. బయిటిద్వారములు వైడూర్యమణిమయములై యుండును. అందు రథములును గజములును గుఱ్ఱములును క్రిక్కిఱిసియుండును. ఎప్పుడును వాద్యధ్వనులు బోరుకొనుచుండును. సమస్తకాలములందు వృక్షములు ఫలించుచుండునుద్యానవనములు గండరించుచుండును. సీతా! రాజపుత్రీ! నీవట్టిపట్టణమునందు మనస్సుతగిలి నాతోఁగూడ వసించుచుందువేని, మనుష్యస్త్రీల నెంతమాత్రము స్మరింపకుందువు. *వరవర్ణినీ! అచ్చట నీవునాతోఁగూడ మనుష్యలోకపుభోగములను దేవలోకభోగములను

*ఇందులకు 'తత్ర త్వం వసతీ సీతే రాజపుత్రి మయా సహ। న స్మరిష్యసి నారీణాం మానుషీణాం మనస్విని' 'భుంజానా మానుషాన్ భోగాన్ దివ్యాంశ్చ వరవర్ణిని। న స్మరిష్యసి రామస్య మానుషస్య గతాయుషః' అనిమూలము. వాస్తవార్థము. (తత్ర)(వసతీ) ఆలంకయందు వసించుచున్నదానవై, (మయా) భృత్యుఁడనగునాచేత, (సమర్పితాన్) అని శేషము- సమర్పింపఁబడిన, (మానుషాన్ దివ్యాంశ్చభోగాన్

అనుభవించుచుందువేని కేవల మొకమనుష్యుఁడై అల్పాయు వగురాముని నెంత మాత్రమును స్మరింపవు. ¶దశరథమహారాజు, తనకుఁ బ్రియపుత్రుఁ డయినభరతుని రాజ్యమున నిలుపుకొని రాముఁడు జ్యేష్ఠకుమారుఁడయ్యును, వీర్యహీనుఁడు గావున రాజ్యమునుండి యడవికిఁబంపినాఁడు. అట్టిరాముఁడెక్కడ నేనెక్కడ? ‡విశాలాక్షీ! అట్లు రాజ్యముదూలి యడవిపాలగుటచే పరాక్రమముడింది బుద్ధియుచెడి తాపసుఁడగుటచే శూరత్వమును బ్రుంగి, మెచ్చుకొనుటకుఁగాక మిక్కిలిజాలిపడుటకే తగియున్నరామునిఁ బెట్టుకొని నీవేమి చేయఁగలవు*నేను సమస్తరాక్షసులకును ప్రభుండను. ఇట్టి నన్ను, నీవె ప్రార్థింపవలసి యుండఁగా నేనే మన్మథశరపీడితుఁడనై నాయంతట

---

భుంజానా) మానుషభోగములను దివ్యభోగములను అనుభవించుచున్నదానవై, (మానుషీణాం నారీణాం) ఇట ద్వితీయార్థమందు షష్ఠి-మనుష్యస్త్రీలను, (న స్మరిష్యసి) స్మరింపవు. మఱి, (మానుషస్య) మనుష్యరూపమున నవతరించినవాఁడును, కావున నే(గతాయుషః—గతః=ప్రాప్తః, ఆయుషః=ఏకాదశసహస్రవత్సరాయుః) పదునొకండువేలయేండ్ల యాయుఃవును బొందినవాఁడును, అగు (రామస్య) భగవంతుఁడగు శ్రీమన్నారాయణునియొక్క, (సంబంధినః) అని శేషము-సంబంధులగు (నః) మమ్ము, (స్మరిష్యసి) స్మరింతువు. మనుష్యులను స్మరించుటమాని నారాయణుని సంబంధుల మగురాక్షసుల మమ్ము స్మరింతువనుట-మహేశ్వరతీర్థులు.

¶ఇందులకు 'స్థాపయిత్వాప్రియం పుత్రం రాజ్ఞా దశరథేనయః।మన్దవీర్య స్సుతో జ్యేష్ఠస్తత్ర ప్రస్థాపితోహ్యయమ్' అనిమూలము. వాస్తవార్థము:—(మందవీర్యః) వీర్యహీనుఁడును,(అప్రియమపి) అప్రియుఁడయినవాఁడు నయ్యును (పుత్రం భరతం) పుత్రుఁడగు భరతుని, (రాజ్ఞా) అంతర్యామివైన నీచే ప్రేరితుఁడైన రాజుచేత, (స్థాపయిత్వా) రాజ్యమందు నిలుపునట్లుచేసి, (రాజ్ఞా) ఆయంతర్యామిచేత నే ప్రేరితుఁడైన యారాజుచేత, (జ్యేష్ఠః) 'జ్యేష్ఠః శ్రేష్ఠః ప్రజాపతిః' అను సహస్రనామోక్తినిబట్టి శ్రీమన్నారాయణుఁ డగుశ్రీరాముఁడు సర్వరాక్షససంహారముకొఱకు,(వనం) (ప్రస్థాపితః) అడవికిఁ బంపఁబడినవాఁడు-మహేశ్వరతీర్థులు.

‡ఇందులకు 'తేన కిం భ్రష్టరాజ్యేన రామేణ గతచేతసా।కరిష్యసి విశాలాక్షి తాపసేన తపస్వినా' అనిమూలము. వాస్తవార్థము:—(భ్రష్టరాజ్యేన-భ్రష్టం అరీణాం రాజ్యం యేన తేన)పగవారిరాజ్యములను భ్రంశముచేసినవాఁడును, (గతచేతసా) మాయోపాధిమూలమున ఈశ్వరుఁడైనశ్రీరామునికి అంతఃకరణము గలుగదుగావున అంతఃకరణములేనివాఁడును,ఇందులకు 'నతస్యకార్యం కరణంచవిద్యతే' అని శ్రుతి, (తాపసేనతపస్వినాం-తాపస+ఇన+తపస్వినామ్)తాపసులకు ఇనుఁడును అనఁగా ప్రభువును తపస్వియును అగు, (రామేణ-సహ) రామునితోఁగూడ, (త్వం) నీవు,(అయం)(విజ్ఞాపనమ్)అని శేషము-ఈవిజ్ఞాపనమును (కరిష్యసి కిం) చేయుదువా?

*ఇందులకు 'సర్వరాక్షసభర్తారం కామాత్స్వయమిహాగతమ్ । న మన్మథశరావిష్టం ప్రత్యాఖ్యాతుంత్వమర్హసి' అనిమూలము వాస్తవార్థము:—(సర్వరాక్షసభర్తారం) సమస్తరాక్షసులకు భర్తయును, (కామాత్) నీకుభృత్యుఁడనగుదునను మనోరథమునుబట్టి,(ఇహాగతం) ఇక్కడవచ్చినవాఁడును అగునన్ను. (మన్మథ శరావిష్టం ప్రతి)-ప్రతి ఇచట ఇవార్థకము-మన్మథశరపీడితుఁడైనవానినిబోలె,(స్వయం) నాయిష్టదేవతవైననీవు, ఇట్లు (ఆఖ్యాతుం నార్హసి) చెప్పఁదగదు.



705 రామాశ్రమమునకు రావణుఁడువచ్చి సీతను కామించుట. సీత రావణుని దూఱుట.

నీయొద్దకు వచ్చి వేఁడుకొనుచుండఁగా నీవు నిరాకరించుట దగదు. ¶పిరికిదానా! ఒకవేళ రామునికి భయపడి నన్నిపుడు తిరస్కరించినను, ఊర్వశి మొదట చరణావహతుఁ డైన పురూరవునిఁ గాలం దన్ని యవ్వల నతనిని బొంద పరితపించినట్లు, నాకొఱకై యని పశ్చాత్తాపము నొందఁగలవు, *వరవర్ణినీ! కేవల మొక మనుష్యమాత్రుఁ డారాముఁడు. యుద్ధమున నాయొక వ్రేలికి సాటిగాఁడు. కాన వానికి భయపడవలదు. నీభాగ్యమున నేను నీకుఁ బ్రాప్తించితిని. ఇఁక నన్నుఁ బొందుము' అనెను. రావణుఁ డిట్లు చెప్పఁగా, కోపాతిశయమున కన్ను లెఱ్ఱఁబాఱ, సీత, విజనప్రదేశమయ్యు, అంతటివాఁడు తన్ను వరించియు, మనస్సు గలఁగనియామహాపతివ్రత, పరుషవాక్యముల నారాక్షసప్రభునిం జూచి "సర్వభూతములును మ్రొక్కునట్టి దిట్టదేవుం డగు కుబేరుఁడు నాకన్నయని చెప్పికొనుచు, ఎట్లు ఇట్టిపాపమున కొడిగట్టఁ బూనితివి? రావణా! నీ విట్లు క్రూరుఁడును దుర్బుద్ధియునై యింద్రియలోలుఁడుగా నున్నావు. కాన నీవు రాజుగా నుండుదోషమున నీక్రింది రాక్షసు లందఱును దప్పక నాశము నొందుదురు. దేవేంద్రునిభార్యను శచీదేవిని అపహరించియైనను బ్రాణములతో నుండవచ్చును; కాని రామునిభార్య నగున న్నపహరించిననో, ఎంతమాత్రము బ్రతుకు దక్కదుసుమీ. అప్రతిమాన మైనరూపసౌందర్యము గలశచీదేవిని తిరస్కరించి వజ్రాయుధధరుం డగు దేవేంద్రునిచేతినుండియైనను తప్పించుకొని చిరకాలము జీవింప వచ్చునుగాని, రాక్షసా! నాయట్టిదానిని దూషించి, నీవు అమృతము నే త్రాగినను, చావునుండి తప్పించుకొనఁజాలవు' అనెను. ఇది నలువదియెనిమిదవ సర్గము.

---

¶ఇందులకు 'ప్రత్యాఖ్యాయహి మాం భీరు పరితాపం గమిష్యసి। చరణే నాభిహత్యేవ పురూరవస మూర్వశీ' అని మూలము. వాస్తవార్థము:—కాముకుఁడగు పురూరవుని ఊర్వశి కాలితోఁదన్ని పశ్చాత్తాపమును బొందెననుట యుక్తమే. అకాముకుఁడును భృత్యుఁడునగు నన్ను, నాకు మాతృరూపవగు నీవు, (చరణే నాభిహత్య) కాలితోఁదన్ని - అనఁగా తిరస్కరించి, (పరితాపం గమిష్యసి) పరితాపమును బొందఁగలవనుట యుక్తము గాదు.

*ఇందులకు 'అంగుళ్యా న సమో రామో మమ యుద్ధే స మానుషః। తవ భాగ్యేన సంప్రాప్తం భజస్వ వరవర్ణిని' అని మూలము. వాస్తవార్థము:—రాముని విడిచి లంకకు రాను సీత యొల్లకుండఁగా ప్రార్థించుచున్నాఁడు. (యుద్ధే) యుద్ధమందు, (యస్య అంగుళ్యా సమః కోఽపి నాస్తి) ఎవ్వని వ్రేలికి సాటియైనవాఁడును లేఁడో, ఏలనఁగా, (యస్సరామః) ఏ శ్రీమన్నారాయణుఁడే, (మానుషః) మనుష్యరూపమున నవతరించినవాఁడో, (తం) అట్టినారాయణుని, (మమభాగ్యేన) నాభాగ్యముచే, (సంప్రాప్తం) ఆలంక యందే ప్రాప్తించినవానిని - నాభాగ్యవశమున నే రాముఁడును లంకకు వెంచేయఁగా అట్లు వచ్చినసీపతి (భజస్వ) సేవింపుమని సంబంధము తెలియునది - మహేశ్వరతీర్థులు.

రావణుఁడు నిజరూపమును దాల్చి సీతనపహరించికొనిపోవుట. సీతప్రలాపము.

మహాపరాక్రమశాలి యగు రావణుఁడు సీత చెప్పినమాటవిని, §కోపమున చేతిపై చేతినిగొట్టి, భయంకరాకార మగు పెనురూపమును దాల్చెను. ఆరావణుఁడంత మరల సీతను జూచి మఱింత బిరుసుగా ‡'సీతా! నీవు పిచ్చిదానవు: కావున నాబలపరాక్రమములను, నేను మున్ను చెప్పినప్పుడు, నీవు వినలేదని తోఁచుచున్నది. నేను ఆకాశమున నిలిచి రెండుచేతులతో నీభూమినంతయు నెత్తుదును. సముద్రమునంతయు ద్రావివైతును. యుద్ధమున మృత్యువునుగూడ వధించిపుత్తును. వాఁడిబాణములచే సూర్యు నడ్డగింతును. భూమినంతయు భేదింతును. పిచ్చిదానా! నాసంగతి నీకుఁ దెలియలేదు. నేను కామరూపిని. మఱి కోరినవాని నెల్ల నొసఁగువాఁడను. నీకుం దగిన పెనిమిటిని. నారూపమును జూడుము' అనెను. రావణుఁడట్లు చెప్పినంతనే వానికన్నులు సూర్యునివలెఁ దేజరిల్లుచు, అగ్నివలె వేఁడినిప్పుక లురులుచు, చివరలందు గోరోచనపువన్నెగలిగి క్రోధవశమున మిక్కిలి యెఱ్ఱఁబాఱెను. కుబేరునితమ్ముఁడా రావణుఁడు, ఆక్షణమే సౌమ్యమై చూచువారిమదికి నొప్పిదమై యుండినభిక్షురూపము విడిచి యమునిరూపమువలె నతిభయంకర మగునిజరూపమును ధరించెను. విచిత్రశక్తిసంపన్నుఁ డగు నారాక్షసుఁడు మిక్కిలియు కోపము పయికొనఁగా కన్నులు మిక్కిలియు నెఱ్ఱఁబాఱ మంచి బంగారుకుండలములు చెవులఁ దులకింప నీలమేఘమువంటి చాయగలిగి పదితలలు వెలుఁగ విల్లును బాణములును దాల్చి పొడసూపెను. మహాకాయుఁ డగు నారాక్షసరాయుఁడు రావణుఁడు ఆ సన్న్యాసివేషమును విడిచి నిజరూపమును దాల్చి కోపమున కన్నులు మిక్కిలియు నెఱ్ఱఁబాఱ మేఘసమూహములవంటి నల్లనికాంతి వెల్లివిరియ రక్తవస్త్రమును ధరించి యాస్త్రీరత్నమును సీతను జూచుచు, ఇట్టినారూప

§ హనుమంతుఁడు ఆగ్రహమును ముందు తెచ్చుకొనియే రూపాంతరమును స్వీకరించినట్లు తెలియుచున్నది. కావున ఆగ్రహములేక క్రూరరూపమును స్వీకరించుట పొసఁగదు గావున రావణుఁడును దేవిమొద్ద కపట మచితముగాదని తనసామర్థ్యమును జెప్పుచు తనరూపమును స్వీకరించినాఁడని తెలియునది:—మహేశ్వరతీర్థులు.

‡ ఇందులకు 'నోన్మత్తయా శ్రుతౌ మన్యే మమ వీర్యపరాక్రమౌ' అనిమూలము-వాస్తవార్థము; నావీర్యపరాక్రమములు, (ఉన్మత్తయా మత్తజనాత్ ఉద్గతా ఉన్మత్తభిన్నా తాదృశయా) ఉన్మత్తురాలవు కానట్టి నీచేతను, (న శ్రుతౌ మన్యే) వినఁబడలేదని తలఁచెదను-జాగరూకయగు నీకును వినికి లేదని తోఁచుచున్నదనుట. అని యిట్లుచెప్పి భూమినెత్తుట మొదలైన తనవీర్యాదులు ప్రశంసించి 'కామరూపిణ మున్మత్తే పశ్యమాం కామదం పతిమ్' (కామదం పతిం) రాక్షసులకుఁ గోరినవెల్ల నొసఁగునట్టి ప్రభుఁడవగు నన్ను, (పశ్య) చూడుము, అని చెప్పెనని పూర్వముతో నన్వయము. ఇచ్చటఁగల 'ఉన్మత్తే' అనుదానిని మీఁది శ్లోకములో 'ఏవ ముక్తవత స్తస్య సూర్యకల్పే శిఖిప్రభే । క్రుద్ధస్య హరిపర్యన్తే రక్తే నేత్రే బభూవతుః' అని యిట నేత్రములకు విశేషణముగా గ్రహించునది; మత్తిల్లిన కన్నులనుట- మహేశ్వరతీర్థులు.

మును జూచియైనను నన్ను చేపట్టునా యనుతలంపున నిలుచుచుండెను. నెఱి కురులు చివరలందు నల్లనై నిగనిగలాడ, సూర్యునిప్రభవలెఁ దేఱిచూడ నలవిగానిదై మేలయిన వలువగట్టి యాభరణంబులం దాల్చి పొల్చుచున్న యాసీతంజూచి రావణుఁడు *'సుందరములైన పిఱుందులుగలదానా! ముల్లోకములందును మిక్కిలి ప్రసిద్ధిగాంచిన పెనిమిటి కావలయునని కోరుదువేని నన్ను చేపట్టుము. నీకు సరియైన పెనిమిటిని నేను. కల్యాణీ! చిరకాలమునకు నీకు పొగడ్తకెక్కిన మంచిమగఁడు నేను దొరికితిని. కాన నన్నుఁబొందుము. నీకు నే నెచ్చటఁగాని యొకయప్రియమును జేయనే చేయ

*ఇందులకు 'త్రిషు లోకేషు విఖ్యాతం యది భర్తార మిచ్ఛసి।మా మాశ్రయ వరారోహే తవాహం సదృశః పతిః॥ మాం భజస్వ చిరాయ త్వ మహం శ్లాఘ్యః ప్రియ స్తవ। నైవ చాహం క్వచి ద్భద్రే కరిష్యే తవ విప్రియమ్॥ త్యజ్యతాం మానుషేభావో మయి భావః ప్రణీయతాం।రాజ్యాచ్చ్యుత మసిద్ధార్థం రామం పరిమితాయుషమ్। కైర్గుణై రనురక్తాసి మూఢే పండితమానిని।యస్త్రీవచనాద్రాజ్యం విహాయ ససుహృ జ్జనమ్॥ అస్మిన్వ్యాళానుచరితే వనే వసతిదుర్మతిః'అనిమూలము.వా.స్తవార్థము:—(యది అహం పతిః)రక్షసామితి శేషః- నేనురాక్షసులకు ప్రభుఁడనయ్యును,(తవసదృశః) (కిం) భృత్యఇతి శేషః—నీకుఁ దగిన భృత్యుఁడ నా-తగినభృత్యుఁడను గాననుట. అయినను నీవుభృత్యునిగా నన్నుఁగోరుదువేని, (త్రిషులోకేషు విఖ్యాతం యథాతథా) ముల్లోకములందు ప్రసిద్ధమగునట్లుగా, (మా)నన్ను,(భర్తారం - శుశ్రూషాదినాస్వామినం బిభర్తీతిభర్తా భృత్యఇత్యర్థః) భృత్యునిగా, (ఆశ్రయ) అంగీకరింపుము, ఏలనఁగా-(చిరాయ) చిరకాలమునుండి, (తవ) నీకు (శ్లాఘ్యః) పొగడఁదగిన, (ప్రియః—ప్రీణయతి శుశ్రూషాదినా స్వామిన మితి ప్రియోభృత్యః)భృత్యుఁడను-వైకుంఠద్వారపాలకుఁ డగుజయుఁడే కదా రావణుఁడైపుట్టెను. కాన చిరకాలముగా శుశ్రూషాదులచే ప్రీతిని బుట్టించు భృత్యుఁడనని భావము. కాఁబట్టినన్ను భృత్యుఁడని, (భజస్వ) తెలియుము. కాఁబట్టియే, (నైవచాహం...విప్రియం) నీకొకప్పుడును అప్రియము చేయను (మానుషే భావస్త్యజ్యతాం) మనుష్యుఁడే రక్షింపఁదగినవాఁడు అనెడి యభిప్రాయమును విడువుము-అయితే పురాతనముగానున్న నాయందలి కృపచే, (మూఢేపండితమానిని) మూఢుఁడును పండితమానియు నగు రాక్షసుఁడనైన, (మయి) భృత్యుఁడనగు నాయందు, (భావః ప్రణీయతాం) వీఁడుగూడ రక్షింపఁదగినవాఁడని యనుసంధింపుము. మఱియును; (రాజ్యాత్ చ్యుతం) రాజ్యభోగమును తుచ్ఛముగా నెంచినవాఁడును, ఏలనఁగా (అసిద్ధార్థం-అశ్చ అసౌ సిద్ధార్థశ్చ అసిద్ధార్థః) అః అనఁగా విష్ణువు; సిద్ధార్థుఁడైన-అనఁగాఅవాప్తసమస్తకాముఁడైన-విష్ణుదేవుఁడుగాన రాజ్యమును తుచ్ఛముగాఁ దలఁచినాఁడనుట, (పరిమితాయుషం-పరిగతం-త్యక్తం, మితం-అల్పం, ఆయుః యేన తం) అపరిమితాయుష్యుఁడైనవాఁడును, మఱియు (కైర్గుణైః)కైః=అనిర్వచనీయములైన, (గుణైః) - యుక్తమితి శేషః-అనంతకల్యాణగుణములతోఁ గూడినవాఁడును అగు వానినిగూర్చి,(అనురక్తాసి)అనురక్తిగలదానవగుదువు.-ఏలనఁగా నతఁడు,(దుర్మతిః-దుష్టేష్వపి, మతి అనుగ్రాహికా బుద్ధిః యస్య సః)దుష్టులైనవారియందును అనుగ్రహబుద్ధిగలవాఁడు,కావుననే (స్త్రీయావచనాత్) ఆఁడుదానిమాటనుబట్టి,(ససుహృజ్జనంరాజ్యం విహాయ వనేవసతి) సుహృజ్జనులను రాజ్యమునువదలి అడవిని వసించుచున్నాఁడు.అట్టివానియెడల అనురక్తిఁ గలిగి యుండుటంబట్టి నీవు సర్వోత్తమురాలవగు లక్ష్మివి. కాఁబట్టియే నన్ను భృత్యునిగా సంగీకరింపు మని తాత్పర్యము-మహేశ్వరతీర్థులు.

ను. నీవు మనుష్యుఁడగురామునిపై మనస్సువిడిచి నాయెడ స్నేహబంధము నంపుము. సీతా! నీకేమియుఁ దెలియదు. అయినను అన్నియును దెలిసినపండితురాలుగా మాత్రము నిన్ను నీవే తలఁచుకొనుచున్నావు. ఒకయాఁడుదానిమాటకు నెమ్మదియైన రాజ్యమును విడిచి సుహృజ్జనులను విడిచి క్రూరమృగములు చెరలాడునీయరణ్యమునఁ ద్రిమ్మరుచున్నాఁడే! ఇట్లు రాజ్యభ్రష్టుఁడై యేకార్యము నొడఁగూడక యల్పాయుష్కుఁడై యున్న యాదుర్మతియందు ఆరాముని యందు ఏగుణములను చూచి నీవనురక్తి కలిగియున్నావు?' అనెను. *'కొంతసేపుండుము మరల సత్కరించెద' నని ప్రియోక్తులాడినదిగాన ప్రియమునే చూపఁదగినట్టియాసీతను, ఆరాక్షసుఁడు రావణుఁడు, మిక్కిలియుదుష్టాత్ముఁడు గావున నిట్టిపరుషవాక్యము లాడి యంత కామమోహితుఁడై దగ్గఱకుఁబోయి, బుధుఁ డాకాశమున సుఖముగఁ దిరుగురోహిణిం బట్టునట్లు, తాను సీతను బట్టుకొనెను. వాఁడు తనకుఁ గలతొంటిశాపమువలని భయమున †సీతదేహము తనకుఁ దగులకుండునట్లుగా నెడమచేత నాబిడ వెండ్రుకలను గుడిచేతఁ దొడలను బట్టుకొనెను. మృత్యువువలె భయంకరాకారుఁడై పెనుఁగొండవలె గండుమీఱుచు వాఁడికోఱలు మెఱయ నిడుదబుజములతో రాజిల్లునారావణుఁడు సీతను బట్టుకొను చుండుటం జూచి వనదేవతలందఱును భయపీడితలై పాఱిపోయిరి. అంతర్ధానాదులకుఁ దగినదిగాన ఆశ్చర్యమయమై, గాడిదములు పూన్పఁబడి, బిట్టుగా మ్రోఁగుచు, బంగారుచక్రములతో రంగారురావణునిమహారథము పూర్వము గుప్తమైయుండి యప్పుడు పొడసూపెను. ఆరావణుఁడు మహాధ్వని మీఱఁగాఁ బరుషవాక్య

---

*ఇందులకు 'ఇత్యుక్త్వా మైథిలీం వాక్యం ప్రియార్హాం ప్రియవాదినీం। అభిగమ్య సుదుష్టాత్మా రాక్షసః కామమోహితః॥ జగ్రాహ రావణస్సీతాం బుధః ఖే రోహిణీమివ' అనిమూలము. వాస్తవార్థము:— రావణుఁడు, (సుదుష్టాత్మా) ఇతరులయెడ దుష్టాత్ముఁడైనవాఁడును, (కామమోహితః) కామమోహితుఁడును అయినను, సీతయెడల నిట్టివాఁడు గాఁడు. కావుననే (బుధః రోహిణీమివ జగ్రాహ) బుధుఁడు తనతల్లియైన రోహిణిని బూజార్థము గ్రహించునట్లె రావణుఁడును తన్ను గ్రహించినాఁడు-తనగృహమం దుంచుకొని తనయిష్టదేవత యనుబుద్ధితోఁ జూచుటకే గ్రహించినాఁడనియర్థము. ఇట రావణుఁడు సీతనుబట్టికొన్నాఁడనియున్నది. నలకూబర వేదవతులశాపమున బలవంతముగా పరభార్యను బట్టుట యెట్లు చెల్లునని యడుగవచ్చును. ఇది నిజమే కాని, రావణుఁడు సీతను సాక్షాత్తుగా ముట్టినవాఁడు గాఁడు. రాక్షసులు నీడలను బట్టుటగలరు గావున సీత మోఁకాళ్లు కురులు మొదలగువాని నీడనేపట్టి యామెనుగొనిపోయినాఁడు. స్కాందమున 'ఛాయాగ్రాహిత్వమప్యస్తి సర్వవిద్యావిశారదే కేశచ్ఛాయాం పరామృశ్య జానుచ్ఛాయాం తథైవచ। గృహీత్వా జానకీం హృష్టో లంకాం ప్రాయాత్సరావణః' అనిజానుకేశచ్ఛాయలను బట్టియే సీతను రావణుఁడు కొనిపోయినాఁడనియున్నది.—మహేశ్వరతీర్థులు.

† సీత రావణుఁడు తోడనే చచ్చునట్లు శాపము పెట్టఁజాలినదయ్యును, వేదవత్యంశమున దాను జేసినప్రతిజ్ఞ చొప్పునను ఋషులకును దేవతలకును ముందు రాముఁడు చేసిన ప్రతిజ్ఞచొప్పునను రావణుని మూలముగా నాశము చేయవలయునని వానిని శపింపదయ్యెనని తెలియునది.

ముల నాసీతను బెదరించుచు తొడలు చేతంబట్టి యెత్తుకొని యపుడు తనరథము పైఁ గూర్చుండఁబెట్టెను. *పాతివ్రత్యమున మిక్కిలి కీర్తిగాంచినయాసీత యట్లు రావణునిచేతఁ బట్టువడినదై యడవియందు దూరమున నున్నరామునిఁగూర్చి 'రామా'యని పేర్కొని యెంతయుఁ బలవించెను. కామార్తుఁడగునారావణుఁడు, తన్నంతమాత్రము నొల్లనిదై, కావున, తనతోఁగూడ రానొపక నాగరాజకన్యకయుఁబలె రథంబు మొఱలఁబడి పొరలాడుచున్నయాసీతను మరల తొడలంబట్టికొని యెత్తికొని రథముతోఁగూడ నాకాశమున కుద్గమించెను. అట్లారాక్షసవిభుఁడు ఆకాశమునఁ దన్నపహరించికొని పోవుచుండఁగా నాసీత యాతురయై మత్తుగొన్నదాని వలెను మనస్సు తడఁబడ్డదానివలెను మిక్కిలియు నిట్లాక్రోశించినదయ్యె "అయ్యో! లక్ష్మణా! మహాబాహూ! అన్నమనస్సు నెప్పుడు నుల్లసిల్లఁజేయువాఁడా! ఖరవధముంబట్టి రాక్షసుఁడు కుపితుఁడై నన్నిపుడపహరించుకొని పోవుచున్నాఁడని నీకుఁదెలియదే! రఘుకులదీపా! రామా! ఆశ్రితుల రక్షించుట నీకు ధర్మమే! ఆ ధర్మమునకై ప్రాణములను సుఖమును ధనములను పరిత్యజించునట్టివాఁడవే. ఇట్టినీవు, నిన్నాశ్రయించిన నన్నొకఁడధర్మముగాఁ బట్టికొనిపోవుచుండఁగాఁ జూడకున్నావే! పరంతపా! నీవు దుర్జనులనెల్ల శిక్షించువాఁడవేకదా! ఇట్టివాఁడవయ్యు, నీ విటువంటిపాపిష్ఠుని రావణుని శిక్షింపకున్నావేల? ఔను. శిక్ష తోడనే యెట్లు కలుగును. ఓరిదుర్జనుఁడా! ఈదుష్కార్యము చేసినయెడల, ఈపాపకర్మమునకు ఫలము తోడనే కనుపట్టదు. పైరు తోడనే పండదుగదా. కాలమువచ్చిననే యది పరిపక్వమగును. అట్లే యిదియు ఫలించుటకు కాలము సహాయముగా కారణమైయున్నది. అది కూడిరావలయును. అట్టి దుర్జనుఁడ వగునీవు, కాలవశమున బుద్ధిచెడి ఈ దుష్కార్యమును జేసితివి. కాన నీవు ప్రాణాంతకర మయినభయంకర విపత్తు రామునివలనఁ బొందుదువు. రాముఁడు ధర్మకాముఁడు;మహాకీర్తిమంతుఁడే!అట్టివానికి ధర్మపత్ని నగునన్ను,అయ్యో!రాక్షసుఁడపహరించుకొని పోవుచున్నాఁడు కావున,ఇపుడు కైకయు నామెచుట్టాలును తమకోర్కి యీడేఱి యుబ్బుదురుగాక!జనస్థానమునఁ జక్కఁగాఁ బూచియున్న యోకొండగోఁగువృక్షములారా!మిమ్ముఁబిలిచి వేఁడుచున్నాను.రావణుఁడుసీతను దొంగిలికొని పోవుచున్నాఁడని శీఘ్రముగా రామునకుఁజెప్పఁడీ. మంచి పూవులు పూచి మేలయినశిఖరములు గలిగి వెలుఁగు నోప్రస్రవణపర్వతమా! నీకు మ్రొక్కెద. నీవు,రావణుఁడు సీతనపహరించుకొని పోవుచున్నాఁడని శీఘ్రముగా రామునకుఁ జెప్పుమీ! హంసలును

---

*ఇందులకు "వామేన సీతాం పద్మాక్షీం మూర్ధజేషు కరేణచ|ఊర్వోస్తు దక్షిణేనైవ పరిజగ్రాహ పాణినా" అని మూలము. వాస్తవార్థము. (మూర్ధజేషుకరేణ=మూర్ధజ+ఇషు+కరేణ)మూర్ధజ=శ్రేష్ఠములయిన, ఇషు=బాణములుగల, కరేణ దక్షిణేన=కుడిచేతను, వామకరేణచ=ఎడమచేతను (ఊర్వోః నపరిజగ్రాహ) ఊరువులనఁగా పాదములను గ్రహించునది. రెండుచేతులతో సీతపాదములను బట్టి లంకకు రమ్మని ప్రార్థించినాఁడనుట.

సారసములును గొలకొల కూయుచున్న యోగోదావరీనదీ ! నీకు వందనము చేసెద. రావణుఁడు సీత నపహరించుకొని పోవుచున్నాఁడని శీఘ్రముగా రామునకుఁ జెప్పుమా. నానావిధవృక్షములు నెరసి యున్న యీవనమందుఁ గలదేవతలారా! మీకెల్ల నమస్కరించెదను. నేను పట్టుపడి పోవుచున్నానని నా పెనిమిటికిఁ జెప్పుదురుగాక. ఈ వనమునందు నివసించుజంతువులను, ఇందుఁ గల మృగపక్షిసమూహములనుగూడ అన్నింటిని శరణమొందెదను. పెనిమిటికి మిక్కిలి ప్రియురాలనై ప్రాణములకంటెనెక్కుడై యుండియు,నిట్టు పట్టువడి పోవుచున్న నన్నుఁగూర్చి 'సీత పరవశురాలై రావణునిచే నపహరింపఁబడినది'అని రామునకుఁ బోయి చెప్పుఁడు. ఆమహాబాహుఁడు,మహాబలుఁడు గావున,నాసంగతి తెలిసెనేని నేను స్వర్గలోకముననున్నను,యముఁడు పట్టుకొనిపోయినను,పరాక్రమము నెఱపి నన్నుఁ బట్టిదెచ్చుకొనును''అని బిగ్గఱ నఱచినది.అట్లప్పుడు సీత వినువారికిఁగూడ జాలిఁబుట్టించుమాటల మిక్కిలిదుఃఖమునఁబలవించుచుఁ బోవుచుండఁగా నొకవృక్షమున గృధ్రుని జటాయువునిం గన్నులు వెడ వికసిల్లఁ గాంచినదయ్యె. రావణుని బారిం బడినయాసుశ్రోణి యాజటాయువును జూచి దుఃఖమున పలుకులు తొట్రుపడ భయంబు పైకొని హా యని పేర్కొని 'ఆర్యా ! జటాయూ ! నన్నుఁజూడుము. దిక్కులేనిదానింబోలె నీపాపకర్ముఁడు రావణుఁడు చూపఱకును జాలిపుట్టఁ బట్టుకొని పోవుచున్నాఁడే చూడుమీ! ఈరాక్షసుఁడు క్రూరుఁడు, బలవంతుఁడు,జయశీలుఁడు, ఆయుధమును జేతఁగలదు. మఱియుఁ గపటయుద్ధములు సేయు దుర్బుద్ధి; నీకు వీని నడ్డగింపనలవిగాదు. మఱేమిచేయవలదు. జటాయూ ! ఇట్లుగావున నీవు పోయి రావణుఁడు నన్నపహరించినవృత్తాంతమునంతయు జరిగినరీతిగా నొకటియు మిగులకుండునట్లు రామునకును లక్ష్మణునకును దప్పక చెప్పవలయును' †అనెను. ఇది నలువదితొమ్మిదవ సర్గము.



‡ జటాయువు రావణు నడ్డగించి సీతను విడుచునట్లు హితోక్తులుచెప్పుట.

ఆవృక్షముమీఁదఁ గొంత నిదురించుచుండినజటాయువు సీత తన్ను పిలిచినది విని మేల్కని యరంత సీత యాక్రోశించి చెప్పిన వాక్యములను విని పెద్దకాయము గల వాఁడుగావున మొదట వేగ రావణునిఁ జూచి యంత సీతను గాంచెను. పిదప పర్వత శిఖరాకారుఁడై వాఁడి నఖములు గలిగినశ్రీమంతుఁడాపక్షిరాజు, చెట్టుమీఁదనుం

† ఇట సీత యాక్రోశించుట మొదలయినవి లౌకికరీతి ననుసరించి యభినయించినవ్యాపారములుగాఁ దెలియునది-మహేశ్వరతీర్థులు.

‡ ఈసర్గమున, దాసుఁడైనవాఁడు తనస్వామికి తనచేత నైనంతవఱకును క్షేమవృత్తిని అవశ్యము చేయవలయునని జటాయువృత్తాంతముచే సూచితమగుచున్నది.

డియే శుభవాక్యముల రావణునిఁజూచి * 'రావణా! నేను సనాతన ధర్మమును దప్పనివాఁడను, సత్యసంధుఁడను. నాపేరు జటాయువండ్రు. గృధ్రములకు నాథుఁడను, మహాబలుఁడను. కాన సడ్డచేసి నామాట వినుము. దశరథకుమారుఁడు రాముఁడు సమస్తలోకములకును ప్రభుండు; దేవేంద్ర, వరుణులతో సమానుఁడు; సమస్తలోకములకును హితము సేయువాఁడు. నీ నపహరింపఁ దలఁచుచున్న యీబిడ, యాలోకనాథుని రాముని ధర్మపత్ని; మహాకీర్తిమతి. ఈయమ పేరు సీత. మహాబలా! ధర్మమును దప్పక నమ్మింపుచుండు నీయట్టి రాజు పరస్త్రీల నెట్లు దాఁకవచ్చును? అందును స్త్రీలను విశేషించి రక్షిఁ [illegible] నే! రాముఁ [illegible] మానెఁగాక. పరదారసంటుట దగదుగదా. పరదార నంటఁ [illegible] లఁ [illegible] అట్టిబుద్ధి ము. పండితుఁడైనవాఁడు ఇతరులు నిందించునట్టి కార్యమును ఎంతమాత్రమును జేయఁడు. తన భార్యను పరపురుషు లంటకుండ నెట్లు రక్షింపవలయునో యట్లే యితరులభార్యలను గూడ రక్షింపవలెను. నీవు పౌలస్త్యునికడుపునఁ బుట్టినవాఁడవు. శిష్టులగు రాజులు శాస్త్రమునందుఁ బ్రతిపాదింపఁబడని ధర్మమునుగాని యధర్మమునుగాని కామమునుగాని యెంతమాత్రమును గోరరు. తక్కిన లోకు లెట్లయినను నగుదురుగాక; నినుబోఁటిరాజుల కిది మిక్కిలి యనుచితము. † రాజే ధర్మమునకు ప్రవర్తకుఁడు; కామమునకుఁ బ్రవర్తకుఁడు; అర్థములకును మే లయినయాటపట్టు. ధర్మ

* ఇందులకు 'పశ్రగీపః స్థితో ధర్మే పురాణే సత్యసంశ్రయః। జటాయుర్నామ నామ్నాహం గృధ్రరాజో మహాబలః' అనిమూలము - వాస్తవార్థము. పురాణేధర్మే) సనాతనధర్మమందు - దాస్యవృత్తియందనుట, (స్థితః) ఉన్నవాఁడను - తదేకపరాయణుఁడ ననుట, (సత్యసంశ్రయః) - (సత్యం) 'సత్యంజ్ఞానమనన్తంబ్రహ్మ' అనఁబడు పరమాత్మయే, (సంశ్రయః) ఆలంబనముగాఁ గలవాఁడను - భగవదేకోపాయనిష్ఠుఁడననుట, జటాయువని ప్రసిద్ధుఁడను. భగవద్దాసుఁడనగు నేనుండఁగా సీతనపహరించుట అయుక్తమనుట. ఇట్లు తనస్వరూపమును జెప్పి తనస్వామి స్వరూపమును జెప్పుచున్నాఁడు 'రాజాసర్వస్యలోకస్య మహేంద్రవరుణోపమః' ఇట ఏకదేశసామ్యమునుబట్టి మహేంద్రవరుణులతో ఉపమ చెప్పఁబడినది. (సర్వలోకస్య రాజా) సమస్తలోకములకును స్వామి కావున నీకును స్వామియగునని యర్థము.

† ఇందులకు 'అర్థంవా యదివా కామం శిష్టాశ్శాస్త్రేష్వనాగతం। వ్యవస్యన్తి న రాజానో ధర్మం పౌలస్త్యనందన' అనిమూలము. వీనికి 'ధర్మమర్థంచ కామంచ... వ్యవస్యన్త్యనురాజానధర్మం' అని పాఠాంతరము. అప్పుడు, (శాస్త్రేషు అనాగతం) శాస్త్రములందు తెలియరాని - రహస్యములగుటచే శాస్త్రములను బర్యాలోచించినను సూక్ష్మదృష్టి లేనివారికిఁ దెలియరానివైనయనుట, ధర్మమును అర్థమును కామమును, (శిష్టాః) రాజు తక్కతక్కినజనులు, (రాజానమను) రాజుననుసరించి, (వ్యవస్యన్తి) చేయుదురు. రాజునకు సూక్ష్మధర్మాదులను దెలిసికొను పటిమగలదుగావున అట్టి రాజుననుసరించి యతఁ డుపదేశించినధర్మాదులు శాస్త్రములందు చక్కఁగా తేటపడకపోయినను ప్రజలు ఆచరింతురని భావము. కాఁబట్టి ధర్మోపదేశపరుఁ డగురాజునకు అధర్మమునఁ బ్రవర్తించుట అనుచితమని తాత్పర్యము - మహేశ్వరతీర్థులు.

‡ ఇందులకు 'రాజాధర్మశ్చకామశ్చ ద్రవ్యాణాంచోత్తమోనిధిః' అనిమూలము. 'రాజాధర్మస కామస్య' అని పాఠాంతరము. అప్పుడు ధర్మార్థకామములు మూటికిని స్థానమైనవాఁడనియర్థము.

మునకుఁగాని శుభమునకుఁగాని పాపమునకుఁగాని రాజే మూలము. రాజువలననే యవి ప్రవర్తించును. రాజునుజూచియె లోకులు ధర్మాధర్మములం బ్రవర్తింతురు; కాని రాజు తన్నుఁబట్టి కాకపోయినను లోకమునుబట్టియేని పాపమును విడిచి ధర్మాదులనే యాచరింపవలయును. రాక్షసవీరా! నీకు పాపమే సహజస్వభావము. కాఁబట్టి విషయలోలుఁడవు. ఇట్టి నీకు, దుష్కర్మునికి దేవార్హమగు విమానమువలె, ఐశ్వర్యమెట్లు యోగ్యమగును. ఇట్లు విషయలోలుఁ డగుదువేని నీయైశ్వర్యముదూలును. ఔను. ఎవని కేది పుట్టుకతో వచ్చినస్వభావమో దానిని ఉపదేశాదులచేఁ బోఁగొట్టుట కెంతమాత్రమును శక్యముగాదు. మంచి యుపదేశము దుష్టాత్ములహృదయమున చిరకాలముండదు. 'శత్రుభార్యల నపహరించుట నాస్వభావ' మనెదవా? మహాబలవంతుఁడును ధర్మాత్ముఁడు నగురాముఁడు నీరాజ్యమునందుఁగాని పట్టణమందుఁగాని నీకేవిధమైన యపరాధమును జేయఁడే! శత్రువే కానియట్టివానికి నీ వేల యపరాధము చేసెదవు? 'రాముఁ డెవ్వరికిని దుఃఖము కలిగించుకార్యములు చేయనివాఁడయ్యును, మున్ను శూర్పణఖనిమిత్తమై మితిమీఱి నడచుకొన్నఖరునివధించినాఁడు. అందులకై రామునిభార్యను అపహరించుకొని పోయెద'నందువా? మంచిది. ఈవిషయమునందు రాముని తప్పేమున్నది? యథార్థము చెప్పుము. తప్పున్నదని యాలోకనాథుని భార్య నపహరించుకొని పోవుచున్నావే! శీఘ్రముగా సీతను విడువుము. ఇంద్రునివజ్రాయుధము వృత్రుని రూపుమాపినట్లు, రాముఁడు భయంకర మగుకంటిచిచ్చున నిన్నుఁ గాల్పకుండుఁగాక. మహావిషము గలసర్పమును కొంగునఁ గట్టుకొని దాని నేమియుఁ దెలియకున్నావు, కుత్తుకకుఁ గాలపాశము దగులుకొని యుండుటను చూచుకొనకున్నావు. సౌమ్యా! ఎంతమోసినచో మనుష్యునికిఁ బీడగలుగదో యంత బరువునే మోయవలయును. ఏది తెవులు పుట్టింపక సుఖముగా జీర్ణమగునో యా యన్నమును భుజింపవలయును. దేనిని జేసినచో ధర్మముగాని కీర్తిగాని గలుగదో, దేహమునకు దుఃఖముమాత్రము కలుగునో, అట్టికార్యము నెవ్వఁడుసేయును? మూఢుఁడే చేయును. 'నన్ను ముదుకఁ'డందువా? రావణా! నేను బుట్టి, తండ్రి తాతలనుండి వచ్చినగృధ్రరాజ్యమును క్రమముగాఁ బరిపాలించుచుండి, యింతకు నలువదివేలయేండ్లు అయినది. మఱి విల్లు మొదలగునాయుధములును నాకు లేవు. నేను ముదుకఁడను. నీవు వయసుకాఁడవు. మఱి విల్లును బాణములను దాల్చియున్నావు. కవచమును దొడిగియున్నావు. రథము నెక్కియున్నావు. అయినను సీతను దీసికొని నీవు సేమముగాఁ బోనేరవు. నిన్నుం బోనిత్తునా? వేదవిత్తముఁడైనవాఁడు చూచుచుండఁగా న్యాయశాస్త్రసిద్ధము లయినయనుమానాదులచేత చలింపరానిప్రామాణ్యము గల వేదశ్రుతిని బ్రతిపక్షికి అన్యపరముగా నర్థముసేసి తీసికొన శక్యముగానియట్లు, నేను జూచుచుండఁగా సీతను బలవంతముగాఁ గొనిపోవ నీ కెంతమాత్రము నలవిగాదు. రావణా! నీవు శూరుఁడవైతేని నాతో నిలిచి యుద్ధముసేయుము; లేదా రా

ముందు వచ్చువఱకుఁ గొంతసేపాగుము. మున్ను ఖరునివలె, నీవును హతుఁడవై నేలం బరుండుదువు. ఎవ్వఁడు యుద్ధమున బలుమాఱు దైత్యదానవులను జంపినాఁడో, ఆ వల్కలధారి యారాముఁడే శీఘ్రముగానే నిన్ను యుద్ధమున వధించివుచ్చును. పాఱిపోవుచున్నావేమి ? నీచుఁడా ! ఆరాజకుమారులు బహుదూరము పోయియున్నారు. నేనేమిసేయఁగలను. వారలను శీఘ్రముగా బిలుచుకొని రాఁజాలను. ఇంతలో నీవు వారలవలని భయమున త్వరితముగాఁ గంటఁబడకమఱుఁగయిపోదువు.సందేహము లేదు. వారు రాకున్ననేమి? నేను ప్రాణములతోనుండఁగా నీవు తామరపూఱేకులవంటి కన్నులు గలయీకల్యాణిని రామునిమక్కువరాణిని సీతను గొనిపోవంజాలవు.'నీ వేమి చేయనేర్తు' వందువా? నేను నా యుసురునయిన నిచ్చి మహాత్ముఁడగురామునకును నతనితండ్రియు నాచెలికాఁడు నగుదశరథునకును ప్రియము సేయవలయును. రావణా! నిలునిలు. కొంతసేపుచూడుము.నాబలముకొలఁదిని నీకు యుద్ధమనెడి యతిథిసత్కారము గావించెదను. రాక్షసా! నిన్నూరక పోనీయను. పండును తొడిమనుండి పడఁగూల్చునట్లు, నిన్నీమేటి రథమునుండి నేలం బడఁద్రోసెదను" అనెను. ఇది యేఁబదియవసర్గము.

---

### జటాయు రావణులయుద్ధము.జటాయువు హతుఁడగుట.

ఇట్లాజటాయువు న్యాయయుక్తముగాఁ జెప్పఁగానే రావణునకుఁ గోపము రేఁగి యిరువదికన్నులును నిప్పులవలె వెలింగినవి. ఆ రాక్షసవిభుఁడు కోపమున కన్నులు మిక్కిలియు నెఱ్ఱఁబాఱ, చెవులందు మంచి బంగారుపోఁగులు చౌకళింప,నామాటలకు సైఁపక యాపక్షివిభునిపై కురవడించెను. ఆకాశమున మేఘములు ప్రతికూలవాయువులచేఁ జిమ్ముంబడి యొండొంటిని బిట్టొరయునట్లు, ఆ [illegible]మందు ఆ రావణజటాయువు లొండొరులం దాఁకి తుములముగా పోరిరి.అప్పుడు రెండుమాల్యవంతమహాపర్వతములు ఱెక్కలనొంది పోరునట్లు ఆపక్షిరాజ రాక్షసరాజులు ఆశ్చర్యకరముగా యుద్ధముసేసిరి. అంత మహాబలుఁడగురావణుఁడు మహాభయంకరములై వాఁడిమొనలు గలనాళమాత్రబాణములను, ఇనుపబాణములను, అంకుసపువాఁతులు గలబాణములును జడివలె నాపక్షిరాజుచుట్టును వర్షించెను. పక్షీంద్రుఁడగునాగృధ్రమును రావణుఁడు ప్రయోగించినయాబాణజాలములనెల్లను సరకుసేయక సహించెను. మహాబలుండగునాపక్షితిలకుఁడు ఆరావణుని దేహమునంతయుఁ గఱకుగోళ్లు గలకాళ్లతోఁగీఱి పెక్కుగాయములు గావించెను. అంత రావణుఁడు క్రుద్ధుఁడై తనపగవానిని మర్దింపఁగోరి బెడిదములై కాలదండములంబోని పదిబాణములనెత్తికొనెను. మహావీర్యుఁడగురావణుఁడు చక్కఁగా తీడంబడి మిక్కిలి వాఁడులై వాతులం దలుఁగులు గలిగి బెడిదములై చక్కఁగుఱి దాఁకం బోవునాపదిబాణములను ఆకర్ణాంతముగా వింటిని దిగిచివైచి జటాయువును భేదించెను. ఆజటాయువు నా

బాణములతాఁకున నొచ్చియు, ఆ రాక్షసునిరథమునఁ గన్నీళ్లు
జూచి, వానిని సరకుసేయక మరల రావణునిపై కడరెను. అంత మహాతేజుఁ డగు
నాపక్షిరాజు, ముక్తామణులచే రాణించుచున్న బాణములు గూర్చియున్న యారావ
ణునివింటిని తనకాళ్లచే బ్రల్లన విఱిచెను. రావణుఁడు కోపమున మెమఱచి మఱి
యొక వింటి నెత్తికొని జటాయువుపయిని నూఱునూఱుగాను వేలకొలఁదిని బాణములు
గురియించెను అప్పుడు యుద్ధమున జటాయువు, రావణుఁడు వైచినబాణములు
తన్ను చుట్టును నిమ్ములఁ గ్రమ్ముకొనఁగా, వానినడుమ గూఁటిలో నుండుపక్షివలె మిక్కి
లియు నొప్పెను జటాయువు మహాతేజుఁడు గావున నా బాణముల నన్నింటిని ఱెక్క
లచేఁ దట్టి దూల్చి కాళ్లచే రావణునిగొప్పధనువును ద్రుంచెను. ఆ పక్షివర్యుఁడు
మిక్కిలియు వీర్యము సెలఁగ నా రావణుని కవచమును నిప్పులవలె ధగధగ మెఱయు
చున్నదానిని తనఱెక్కలచేఁ దునిఁగి తూలునట్లు జిమ్మివైచెను. మఱియు నాబలవం
తుఁడు యుద్ధమున బంగారుకవచములుగలిగి దివ్యములై పిశాచముఖములఁ గ్రాలు
చు, మిక్కిలి వేగవంతములైనరావణునిఖరములను గూడఁ బొరిపుచ్చెను. ఉత్త
మమై మంచినొగతోఁగూడి కామగమనమై, అగ్నివలె జ్వలించుచు, బంగారుచేతను
మణులచేతను చిత్రితమై యున్నచక్రము గలిగినవానిమహారథమునుగూడ జటా
యువు విఱిచెను. మఱియుఁ బూర్ణచంద్రునివలె వెలుఁగుచునున్నరావణుని శ్వేతచ్ఛ
త్రమును వింజామరలను వానిం బట్టుకొనియుండిన రాక్షసులను తుండముచేఁ బడఁ
గూల్చెను. మఱియును శ్రీమంతుఁడును బలవంతుఁడు నగునాపక్షికాంతుఁడు మరల
నాతుండముచేతనే వేగమున నా రావణుని సారథిపెనుతలను ద్రుంచివైచెను. ఆరావ
ణుఁ డట్లు విల్లు విఱిగి, రథము గూలి, గుఱ్ఱములు ద్రెళ్లి, సారథియుఁ జచ్చినవాఁడై
సీతను జంక నెత్తుకొని నేలకు దూఁకెను. రావణుఁడు వాహనమువిఱిగి నేలకుఁ బడుటం
జూచి సమస్తభూతములును జటాయువును బాగుబాగని మనస్సునఁ బూజించినవి.
అంత నాపక్షిరాజు జటాయువు ముసలితనమున నలసియుండుటంజూచి, రావణుఁ
డుబ్బి మరల సీత నెత్తుకొని యాకాశమున కుద్గమించెను. మహాతేజుఁ డగునాగృధ్ర
రాజు రావణుఁడు తన్ను తృణీకరించి సంతోషమున సీతను జంక నెత్తుకొని పోవుచుండు
టనుజూచి, పయికెగిరి రావణునిఁ దఱుముకొనిపోయి వాని తోవ నడ్డగించి వానిఁ
జూచి 'ఓరీ! అల్పబుద్ధీ! రాముఁడు వజ్రములుంబోలె నాటుమేటిబాణములు గల
వాఁడే; అట్టి రామునిభార్యను, నీవు, రాక్షసవధార్థమే అపహరించుకొనిపోవుచున్నా
వుచుమీ! దప్పిగొన్నవాఁడు జలమును ద్రాగునట్లు నీవు సీతాపహరణ మనెడియీ
విషమును ద్రాగుచున్నావు. ఇది నీకుమాత్రమే కాదు; నీ మిత్రులకును బంధువుల
కునుమంత్రులకును బలములకును పరివారములకును అందఱికిని నాశము గలిగిం
చును. మూఢులు తాము చేయుకార్యమునకు వెంబడిని దప్పక వచ్చుఫలమును
దెలిసికొననివారై, నీయట్లు, శీఘ్రముగానే వినాశము నొందుదురు. కాలపాశము



714 రావణజటాయు యుద్ధము. రావణునికుడి చేతులను జటాయువు తనముక్కు చేత ఖండించుట

నీకుఁ గట్టఁబడియున్నదే. చేఁప తన్నువధించుటకై యెరగ్రుచ్చి యున్నగాలమును మ్రింగి తప్పించుకొనిపోయినను దానిని వీడలేకచచ్చునట్లు, నీ వీపాశమును చావునకై తగుల్చుకొని యెక్కడికిపోయినను, అది వీడదు; కావున నెక్కడికిఁబోయి దానినుండి విడివడఁగలవు? రావణా! యెట్టివారికి నెదిరింపరాని యీ కాకుత్స్థకుల తిలకులు రామలక్ష్మణులు, నీ విపుడు వారియాశ్రమమునకుఁ గావించిన యీ యవమానమును ఒకప్పుడును క్షమింపరుసుమీ; నిన్నుఁ దప్పక వధింతురు. నీ విప్పుడు పిఱికివై యెవరులేని తెఱపిచూచి లోకనిందిత మగుకార్యమును జేసితివే! ఇది దొంగలు చేయురీతి. వీరు లెంతమాత్రము నిట్టి దారిం ద్రొక్కరు. రావణా! నీవు వీరుఁడవయితివేని యుద్ధముసేయుము. రామలక్ష్మణులు వచ్చువఱకు గడియసేపు నిలిచియుండుము. అప్పుడు నీతమ్ముఁడు ఖరునియట్లు నిహతుఁడవై నేలమీఁదఁ బరుండుదువు. మృత్యుకాలమువచ్చినప్పుడు పురుషుఁడు తనవినాశమునకై యెట్టి యధర్మకార్యమును జేయునో యట్టి యీ యధర్మకృత్యమునకు నీ వొడిగట్టితివి. నీకు మరణము దాపించినది. ఏకార్యమునకు పాపఫలము సంబంధించియుండునో యట్టి కార్యమును ఎవఁడుచేయును? సమస్తలోకాధిపతియు భగవంతుఁడు నగుబ్రహ్మదేవుఁడు గూడఁ జేయఁడు' అనెను. ఇట్లు వీర్యశాలి యగునాజటాయువు మేలుగూర్చువాక్యమును జెప్పి యంత నారావణుఁడు తన్నుఁ బాటింపక పాఱిపోవుచుండుటను జూచి దెప్పరముగా వాని వీఁపుపయిని దూఁకి వ్రాలెను. ఆ జటాయువు వాని నిట్లుపట్టి బలవంతముగా పోవక నిల్పి, మావటీఁడు దుష్టగజము నెక్కి యంకుసముచే దానిని పరిపరి విధములఁ బొడుచునట్లు, రావణుని పై వ్రాలి వాఁడు లగుగోళ్లచే వాని వీఁపునంతటను గీఱెను. ఆ జటాయువునకు గోళ్లును ఱెక్కలును ముక్కునే యాయుధములుగాని వేఱుగావు. కాన తుండమును వానివీఁపుపై నిగిడ్చి గోళ్లతో వానిని జీఱి వెండ్రుకలను బెఱికివైచెను. ఆ గృధ్రరాజు అట్లు తన్ను మాటిమాటికి నలఁచుచుండఁగా సహింపలేక యారావణుఁడు పెదవులదర వానింగొట్టుటకై మరలంబడెను. ఆరావణుఁడు కోపమున నోడలెఱుఁగక యెడమచంకను సీతను నిఱియఁబట్టి, శీఘ్రముగా జటాయువు నఱచేతఁ జఱిచెను. పగవారిని పీఁచమడఁచునట్టి యాపక్షిరాజు జటాయుఁడు వాని చుట్టుఁ దిరిగి తెఱపిచూచి మూఁతిచేత వానియెడమచేతులు పదింటిని చెండివైచెను. రావణునిబాహువు లిట్లు దెగిపడఁగా తోడనే, పుట్టనుండి విషజ్వాలలపంక్తులతోఁ గూడ సర్పములు వెడలునట్లు, త్రుంపఁబడినచోటనుండి యాయుధముల మెఱుఁగులతోఁగూడ మరల బాహువులు పొడమినవి. అంత కోపమున రావణుఁడు సీతను విడిచి యాగద్దలరాయని పిడికిళ్లం గ్రుమ్మి గాళ్లం దన్నెను. అంత నసమానపరాక్రములైన యారాక్షసముఖ్యునకుఁ బక్షిప్రవరునకును గడియసేపు మహాయుద్ధము జరిగినది. ఆపక్షి యట్లు రామునికొఱకై శ్రమంపడి పోరాడుచుండఁగా, రావణుఁడు ఖడ్గమునెత్తి వాని ఱెక్కలను ప్రక్కలను పాదములను ఛేదించివైచెను. రౌద్రక

ర్ముఁ డగు నారాక్షసుఁ డట్లు ఱెక్కలు ద్రుంపఁగా, ఆగృధ్రము క్షణమే హతుఁడై యొఱలు చున్నకొఱప్రాణములతో భూమిపైఁబడెను. సీత, యట్లు జటాయువు నెత్తుటఁదోఁగి నేలం బడియుండుటఁ జూచి,తనబంధు వొకఁడుగూలినప్పటివలెనే పరమదుఃఖితయై యతనియొద్దకుఁ బరుగెత్తిపోయెను.నల్లనిమేఘమువలె కాంతిఁదేజరిల్లుచు తెల్లనై యుక్కు నుల్లసిల్ల, మేటి వీర్య మెస లారునాజటాయువు నేలంగూలి చల్లారినదావాగ్నివలె లంకేశ్వరునకు రావణునకుఁ జూపట్టెను. అంత నపుడు చందురునివలె కాంతి దళుకొత్తుమొగము గలయాజనకరాజసుత సీత రావణునియురవడికి నలఁగి నేలంబడి యున్నయాపక్షినిజూచి మాటికిని చేతులం దడవుచుఁ గవుఁగలించుకొని రోదనము గావించెను. ఇది యేఁబదియొకఁడవసర్గము.

— సీతను మరల రావణుఁడెత్తికొనిపోవుట. పోవువేగమున నాబిడ పూదండలు సొమ్ములు మొదలగునవి క్రిందఁబడుట. జగమంతయు నందులకు వికృతపడుట.

రాక్షసవిభుఁ డగురావణుఁడు, కొఱప్రాణములతో నిట్టట్టు గదలుచును రాముని యాశ్రమమునకు సమీపమున నేలంబడి యున్నజటాయువును జూచెను. ఆచంద్రబింబానన సీతయో, రావణునిచే నిహతుఁడైనయాగద్దలరాజుం జూచి మిక్కిలి దుఃఖితయై విలపింపసాఁగెను. ఆచంద్రవదన బలవంతుఁ డగురావణునిచే హతుఁడైన యా గృధ్రమును చేతులందడవుచు మిక్కిలియు కొందలమునఁ గుందుచు నిట్లు పలవించెను. 'కన్నదురుట మున్నగు లక్షణములును నెఱుఁగుటయు పక్షిస్వరములును పింగళి మొదలగు నాడుల నెఱుఁగుటయును తప్పక సుఖదుఃఖములయందు మనుష్యులకు సూచకములుగానుంట గానంబడుచున్నవి. రామా ! నీకిప్పుడు గలిగినమహావ్యసనము నింకను నెఱుఁగకున్నావా ? మీఁదిశకునములచేఁ దెలియవయ్యెనా ? ఈమృగపక్షులు నాకోసమై కాకుత్స్థకులునికి నీకుఁ దెలుప పరుగెత్తుచున్నవే. నన్నుఁ గాపాడుటకై వచ్చిన యాజటాయువును, నా దౌర్భాగ్యముచే,పాపిష్ఠుఁడగు రావణుని చేత నిహతుఁడై భూమియందుఁ బండియున్నాఁడు. రామా! లక్ష్మణా!కావుమీ నన్నిప్పుడు' అని యివ్విధమున నాయుత్తమకాంత, వినుచున్నవారి మ్రోలనఱచునట్లు, దూరమున నేదియు వినరాకనున్నరామలక్ష్మణులం బేర్కొని యాక్రందించెను.పుష్పమాలికలును భూషణములు నలఁగి యనాథయుంబోలె విలపించు చున్నయాసీతయొద్దకు రాక్షసవిభుఁడు రావణుఁడు పోయెను. అంతకునితో సాటి యగునారాక్షసుల మేటి, తీఁగవలె భూమిపై చుట్టుకొనుచును, పెద్దవృక్షములను గవుంగలించుకొనుచును, మహారణ్యమున రామునిఁబాసి యొంటిమెయిని 'రామా!రామా!' యని యఱచుచు నున్నయాసీతను'విడువు విడువు' మని పలువిధములఁ జెప్పుచు తన జీవితము తుదముట్టుటకై కేశములం బట్టికొనెను. సీత కిట్టి తిరస్కారము గలుగఁగానే

చరాచరములతోఁగూడిన ప్రపంచమంతయు కొంకదులుతప్పి సత్వప్రకృతిచెడి చిమ్మ చీఁకటిగ్రమ్మినట్టు లేమియుఁ దోఁచకుండెను. అప్పుడు వాయువు వీసదయ్యె. సూర్యుఁడును గాంతి మాసి చూపట్టె. శ్రీమంతుఁ డగు బ్రహ్మదేవుఁడును,సీత రావణునిచే నపహృతయై దీనత్వ మొందుటను దివ్యదృష్టిచేతఁ జూచి 'కార్యమయినది' యని చెప్పకొనెను. దండకారణ్యవాసు లగుమహర్షులందఱును సీతను రావణుఁడు దొంగిలి కొనిపోవుటకును దుఃఖమును, దైవికముగా నట్లు రావణునకు వినాశము దాపించినది యెఱింగి సంతోషమును, బొందినవారైరి. రాక్షసేశ్వరుఁ డారావణుఁడు 'రామా రామా' యనియు'లక్ష్మణా'యనియు రోదనముసేయుచున్న యాసీతను జేకొని యాకాశమార్గము నొందెను. * మేలి బంగారుసొమ్ములవంటివన్నె గులుకుమేను గలిగి పసుపుపట్టు వలువ గట్టియున్నయారాజకుమారి మేఘమునందు మిక్కిలియు ధళధళలాడు మెఱుపువలె నారావణుని యంకమునం బ్రకాశించినది. †ఆబిడ గట్టిన పచ్చని వస్త్రము గాలిచే పైకెగురఁగా దానిచే రావణుఁడు అగ్నిరాజి ప్రకాశించుచున్న పర్వతమువలె మఱియు నెచ్చుగా ప్రకాశించెను. పరమకళ్యాణి యగునాసీతమేనినుండి తావులు బుగులుకొనుచున్న యెఱ్ఱని తామరపూరేకులు చుట్టు రావణుని యంకమునఁ జెదరిపడినవి. బంగారుకాంతి కలిగి యాకసమున గాలి కెగురుచున్న యాబిడ పట్టువలువ, మధ్యాహ్నమందు సూర్యునికాంతిచే ‡ ఎఱ్ఱఁబాఱినమేఘమువలె వెలిఁగినది.చక్కఁగా దీరియున్న ముక్కుగల యాసీత ముద్దునెమ్మొగము §రావణునియంకమునం జిక్కి, రాముఁడు లేకుండుటంజేసి, తూఁడులేని తామరవలె నెంతమాత్రము ప్రకాశింపదయ్యె. సుందరమైన నెన్నుదురును నెఱికురులచివరలును చెలువుగులుక,విరిదమ్మివలె నెమ్మెలుచూపుచు, ఏకందును బొందనిదై, మిక్కిలియు నిగనిగలాడు నచ్చంపుఁ దెలి పలువరుసలు మురువుగూర్ప,మిక్కిలి తేటయైన నీటు గులుకునాబిడ నెమ్మొగము, రావణుని యంకమునంజేరి, నల్లనిమబ్బునందు తెలుపిఁ జేసికొని పొడసూపి ¶ప్రకాశించుచుండు చందురునివలెఁ గనుపట్టెను. మఱియు తీరిచినముక్కును జక్కనైనయెఱ్ఱనివెదవులును గుదిరి బంగరువన్నెతో మెఱయుచు చందురునివలెఁ జూచుట కింపైయుండినయానెమ్మొగము, రోదనమువలనఁ గన్నీరు విడువక దొరుఁగు

* దీనివలన మెఱుపు మేఘమున క్షణకాలముండునట్లె సీత రావణునియొద్ద నుండుననుట సూచితము.

† కొండకు నిప్పువలె రావణునకు సీతవలువను రూపించుటచే వానికి సంతాపము గలుగు ననుట ధ్వనితము.

‡ సీత వస్త్రమును రక్తవర్ణమగుమబ్బుగా వర్ణించుటచే ఎఱ్ఱనిమబ్బులు ఉత్పాతసూచకములుగావున రావణవినాశము సూచితము.

§ ఇట సీత ముఖవైవర్ణ్యమువలన దుఃఖాతిశయము దెలియునది.

¶ చంద్రుఁడు రెండవవాఁడు గనఁబడుట ఉత్పాతసూచకము. సీతమొగము ప్రతిచంద్రుఁడుగా రూపితమగుటచే రావణనాశము సూచితము.

చుండుటచే నెంతయు పస గుందినదయ్యె. ఆ రాక్షసునివలని భయమునఁ గంపితమై
యాబిడ ముద్దునెమ్మొగము రాముఁడు లేకుండుటంజేసి పగట నుదయించిన చందురుని
వలె నెంతమాత్రమును పసగులికినదిగాదు. బంగారువన్నెగలయాబిడ నీలాంగుఁడైన
రావణునం దుండుటవలన * నీలమణిని బొందినబంగారుమొలనూలువలెఁ బ్రకాశిం
పదయ్యె. తామరవలె నవకంపుఁబసిమివన్నెగలిగి బంగారుచాయతోఁగూడి మేలి బం
గారుసొమ్ములు దాల్చి యున్నయాజనకరాజకుమారి, రావణునిఁజొచ్చి † మేఘమునం
దు వెలయు మెఱుపువలె నెంతయు బ్రకాశించినది. ఒకానొకచెట్టుచిగురువలెఁ బచ్చ
వన్నె గలయాసీత, యేనుఁగునకు బంగారునడికట్టుత్రాడుంబోలె, నీలదేహుఁడయిన
యారావణునిం జేరి వానిని బ్రకాశింపఁజేసినదయ్యె. ఆరాక్షసవిభుఁ డాసీతను ధరిం
చియు నాబిడ యాభరణధ్వనులతోఁగూడియునుండుటచే వాఁడు మెఱుముతోను ఉ
ఱుముతోను గూడినమేఘమువలెఁ బ్రకాశించెను. సీత నపహరించుకొని పోవుచుం
డఁగా, ఆ వేగమున నాబిడ శిరస్సునుండి పువ్వులు సోనవలెఁ దొరఁగి యచట భూమి
యంతటను బడినవి. ఆపువ్వులసోన రావణుఁడు పోవునురవడిచే నంతటను జిమ్మంబడి
వానికి ముందుగాఁ బోయినదికాని మరలి వాఁడు వేవేగ దాపింపఁగా వానిచుట్టునే
పొడకట్టినవి. ఉన్నత మగు మేరుపర్వతముచుట్టు విమల మగునక్షత్రమాల యావరిం
చునట్లు, రావణునిచుట్టును నాపువ్వులబంతి పరివేష్టించినది. సీత వామపాదమునుండి
రత్నములు దాపఁబడి మెఱపులమండలి వలె ధగధగ మెఱయుచుఁ జూపట్టుచున్న యం
దె యూడి యింపారుధ్వనితో నేలంబడినది. కుబేరునితమ్ముఁ డారావణుఁ డాకాశమున
‡ మహోల్కవలె వెలుంగుచున్నసీతాదేవిని జేకొని యాకాశమార్గమునకుఁ బోయె
ను. అగ్నివలె ధగధగ నిగ్గులుచూపుచున్న వయినయాసీత యితరాభరణములు మి
క్కిలి చప్పుడుతో, ఆకాశముననుండి నక్షత్రములవలె, నేలంబడినవి. అప్పుడు చందు
రుని తెల్లనిమెఱుఁగులు దుఱఁగలించుచు సీతచన్నుగుబ్బలనడుమనుండి, ముత్తెపు

---

* వెండియే నీలమునకు శోభాకరముగాని బంగారుగాదు. ఇట బంగారును జెప్పుటచే బంగారు నీల
మునకు శోభాకరముగానట్లు సీత ప్రకాశింపలేదని వ్యతిరేకోక్తి గ్రాహ్యము. ఇందులకు 'శుశుభే కాంచనీ
కాంచీ నీలం మణిమివాశ్రితా' అని గోవిందరాజపాఠము. 'గజం మణిమివాశ్రితా' అని మహేశ్వరతీర్థపా
ఠము. అప్పటికి 'బంగారుమొలనూలు ఏనుఁగు నాశ్రయించినట్లు' అనియర్థము. ఇది మఱింత సరసముగాను
న్నదిగాని యిందేమీఁద 'ప్రాశోభయత వైదేహీ గజం కక్ష్యేవ కాంచనీ' అనుదానితోఁ బునరుక్తమగుచు
న్నది. అయిన నీశ్లోకము మహేశ్వరతీర్థులపాఠమున మఱింత యప్పులగాఁ గానిపించుచున్నది. ఇందు
లకు 'కక్ష్య గజమును పొంది మావటివానిచే దానిని నిగ్రహింపఁదగినదిగాఁ జేయునట్లు, సీతయు రావణు
నిఁజేరి రామునిచే వానిని నిగ్రహింపఁ దగినవానినిగాఁజేసిన' దని భావము. గోవిందరాజులు.

† ఇందులకు, మెఱుపు మేఘమునందుంబోలె సీత క్షణకాలము రావణునం దుండియు వాని సా
హ్వాదమును గోరని దయ్యె ననుట సూచితము.

‡ ఉత్పాతమును సూచించెడు నక్షత్రము మహోల్క యనఁబడును.

సరి పతితమై,యాకాశముననుండి పడుగంగానదియుంబోలెఁ దులకించినది.వృక్షములు, రావణునివేగమునం బుట్టినవాయువుచేఁ గొట్టువడి శిరములు గదల్చుచు నానావిధము లగుపక్షులధ్వనులతోఁ గూడినవై, సీత నూఱడించుకొఱకు తలలు గదల్చుచు భయ పడవల దని పలుకునట్లు చూపట్టినవి. తామర కొలఁకులు, కాంతిమాసిన తామరలనె డి మొగములతోఁగూడి,కలఁత నొందినచేఁప లనెడికన్నులు గలిగినవై, ఆపన్నురాలై నతమ చెలిం జూచి దుఃఖపడునట్లు, సీతంజూచి దుఃఖించినవిగాఁ దోఁచినవి.అప్పుడు సిం గములు పులులు మొదలయిన మృగములును, పక్షులును, నలుగడలనుండి వచ్చి రా వణునిపయి కోపంబున నీడ ననుసరించి సీత వెంటం బరుగెత్తినవి. పర్వతములు, ము ఖంబులందు కన్నీళ్లవలె జలప్రవాహము లొప్ప, పయికెత్తఁబడిన చేతులవలె శిఖ రంబులుమీఱ, సీతాదేవి నపహరించుకొనిపోవుచుండుటం జూచి,రోదనము సేయుచు న్నట్లు చూపట్టినవి. సీత యపహృతయై పోవుచుండుటఁ జూచి శ్రీమంతుఁడు సూర్యుఁ డును దీనుఁడై ప్రభదూలి బింబము వెలువెలఁబాఱినవాఁడయ్యెను. సమస్తభూత ములును గుంపులుగుంపులుగాఁ జేరి 'రామునిభార్యను సీతను రావణుఁ డపహరించు కొనిపోవుచున్నాఁడే! కాన ధర్మమే లేదు. మఱి సత్యమెక్కడిది? నిష్కాపట్యమును దయయును లేవు!' అని విలపించినవి. చిన్నజింకపిల్లలు మిక్కిలి దిగులొంది మొగ ములు విన్ననై, దూరంగు చున్నకన్నీళ్లచే కలఁగినచూడ్కులతో కన్నెత్తి చూచి చూచి రోదనము గావించినవి. అట్లు ఇంతింతనరానిదుఃఖముపాలై బిగ్గఱగా నాక్రో శించుచు 'లక్ష్మణా! రామా!' యని యింపారుస్వరమున నేడ్చుచు రామలక్ష్మణులు వ త్తురో యని మాటిమాటికిని భూమిని జూచుచునున్న సీతంజూచి, వనదేవత లందఱి కిని మేనులు గడగడ వడంకినవి.ముంగురులు చెల్లచెదరై, తిలకము మాసి గాసిలుచున్న యాపతివ్రతను సీతను, ఆరావణుఁడు తన వినాశముకొఱకే తెలియక యపహరించె ను. సొగసైన పలువరుసగలిగి సహజముగా దెలినవ్వు దులకించు చుండినయాసీత యపుడు బంధుజనులకుఁ బాసి రామలక్ష్మణుల నిరువురినిం గానక భయము వెల్లువ పల్ల టిల్లుచు మొగము విలవిలపోయినదయ్యె. ఇది యేఁబదిరెండవసర్గము.

సీత రావణుని చౌర్యాదులను బలువిధముల నిందించుట.

జనకరాజసుత సీత రావణుఁడు తన్నుఁ గొని యాకాశమునఁ బోవుచుండు టం జూచి, మిక్కిలి భయమునొంది మిక్కుటముగా వడఁకుచు దుఃఖించినదయ్యె. రావణుఁ డట్లుగొనిపోవుచుండఁగా సీత వినువారికి జాలిపుట్టునట్టు లేడ్చుచు రోదనము నను రోషముననుు గన్నులెఱ్ఱఁబాఱ భయంకరాక్షుఁడైనయారాక్షసేశ్వరునిఁ జూచి "ఓరీ రావణా! నీ వెంత నీచుఁడవురా? ఎవ్వరును లేకుండుసమయమునుజూచి నన్నుదొం గలించుకొని పరుగెత్తుచున్నావే! ఇట్టికార్యమునకు నీకు సిగ్గులేదా? దుష్టాత్మా! నీవే నన్న పహరింపఁగోరి, పిఱికివిగావున రామునకు భయపడి, మాయచే మృగరూపముదాల్చి

వంచనమై రాముని దొలఁగఁదీసికొని పోయితివి.ఇది నిజము.నన్ను రక్షించుటకై పూ
ని వచ్చినయాగృధ్రరాజు మిక్కిలి వృద్ధుఁడు, ముదుకని జంపితి వెంతశూరుఁడవురా!
నామామగారి మిత్రుఁడు, జటాయువుగూడఁ గూల్పంబడినాఁడు. రాక్షసాధమా!
నీవు 'నేను రావణుఁడను' అని నీపేరువాడి *నన్ను యుద్ధమున గెలిచితివిగదా! అ
హాహా! నీ పరాక్రమము మిక్కిలి గొప్పదిగా! నీచుఁడా! స్త్రీని, ఎవ్వరు లే
కుండునప్పుడు, అందును పరునియిల్లాలిని, హరించితివే! ఇట్టి యేవపుకార్యమును
జేసినందులకు లజ్జపడకున్నా వేమి? శూరుఁ డని యెన్ను కొనుచుందునీవు, నింద్యము
ను అతిక్రూరమును మిక్కిలి యధర్మమునైనకార్యమును ఇపుడు చేసితివే లోకము
లందెల్లపురుషులు, దీనినిజెప్పకొనఁగలరు. అప్పుడు,నన్నపహరించు నప్పుడు,నీవు చెప్పకొ
న్న శౌర్యమును నీబలమును,'ఇసీ' కాలిపోవుఁ గాక. కులమున కంతయు దూఱు తె
చ్చు నీ యీ నడత ఇసీ! పాడైపోవుఁగాక.నీవిట్లు మిగుల వేగముగ బరుగెత్తి పోవుదు
వేని యెవ రేమిచేయ వచ్చును. ఒకగడియయైన నిలిచియుండుము.ప్రాణములతో మర
లిపోనవు.చచ్చియే తీఱుదువు.నీవు, నీ రాక్షససైన్యముల నన్నింటినిగూడి వచ్చినను, ఆ
రాజకుమారుల కన్నులబారిం బడుదువేని ముహూర్తకాలమైనను జీవింపనేరవు.
అడవియందు రాఁజి మంటలెగయు చున్నకారుచిచ్చుసోఁకును, పిట్ట సైఁపఁజాల
నట్లు, ఆరామలక్ష్మణుల బాణముల తాఁకును నీవెంతమాత్రమును సహింపఁజాలవు.
రావణా! నీకు హితమును జక్కఁగా విచారించి నన్ను మలఁకలుమాని చక్క విడిచి
పెట్టుము. నీవు నన్ను విడిచిపెట్టవేని, నన్నిట్లు తిరస్కరించి నందులకు రోషావిష్టుఁడై
నా పెనిమిటి రాముఁడును అతనితమ్ముఁడును నిన్ను వధించుటకై పూనును జుమీ!
'రాముఁడు చంపినను జంపునుగాక నీతోడినాకోర్కి నెఱవేఱినఁ జాలు' నందు
వా! †నీచా! నీవు నాతో నేమిపూన్కి గావించుటకై నన్నిట్లు బలవంతముగా నప
హరింపఁగోరెదవో యాపూన్కియంతయు వ్యర్థమేయగును. నేను దేవేంద్ర సమా
నుఁ డగునాప్రాణేశ్వరుని రాముని జూడలేక పగవానిపాల నిప్పుడు బ్రతికియున్నను,
ఇట్లు చిరకాలము ప్రాణములు పెట్టుకొనియుండనేరను జుమీ! మనుష్యుఁడు
మరణకాలమున విపరీతములు గావించునట్లు నీవును,నీకు హితమేదియో మేలెద్దియో
తెలిసికొనవు; విపరీతము లాచరించుచున్నావు. చావఁబోవువారి కందఱికిని హిత
మేదో యది రుచింపదు. నీ విప్పుడు కంఠమున కాలపాశమును దగుల్చుకొని యుం
డుటను జూచుచున్నావుగదా. కనుక చావ నున్ననీకు నేను జెప్ప పథ్యము రుచిం
పదు. రావణా!ఇది భయపడవలసినతఱి; నీవు భయపడకున్నావు. కాఁబట్టి నీకు చావు

---

* లేక 'యుద్ధేనాస్మి జితాత్వయా' అనుటకు (యుద్ధే)యుద్ధమందు,(త్వయాజితా న అస్మి) నీచే
త గెలువఁబడిన దానను గానుగదా! యనియు నర్థాంతరము.

† 'నాతో భోగించుటకై నీవు పూనితివి' అని చెప్పట గ్రామ్యముగావున 'నాతో నేమిపూన్కి'
అని అగ్రామ్యముగా సీత చెప్పినదని తెలియునది.

దాపించుటచే, నింక శీఘ్రముననే బంగారుమయము లగువృక్షములను జూడఁ గలవు. ఇది స్పష్టము. ఇంక శీఘ్రముగానే బెడిదము లైననెత్తురు ప్రవాహములతోఁ గూడిన వైతరణీనదిని అసిపత్రవనమునుగూడ యమలోకమునఁ జూడఁగలవు. కాఁచంబడి క్రాఁగుచున్న బంగారుపువ్వులుగలిగి, యట్లె కాఁచంబడి మేలి వైడూర్యముల మించెడియాకులతోఁగూడి, యినుప ముండ్లతోనిండి, తీక్ష్ణమైయుండు నరకమందలి శాల్మలీవృక్షపుఁగంబమును జూడఁగలవు. 'కాలాంతరమున నట్టిగతి రానీ' ఇప్పుడు సుఖమబ్బినదిగదా యందువేని, దయమాలిన నీవు మహాత్ముఁడై నయారామునకు నిట్టి యపకారము గావించితివి. కావున విషము త్రాగినవానివలె నింక బహుకాలము బ్రతికి యుండఁజాలవు. 'నిన్నుఁగొని దేశాంతరమునకుఁ బోయెద. అప్పుడు రాముఁ డేమిచేయు'నందువా? రావణా! మహాత్ముఁడగునాభర్త రాముఁ డుండఁగా త్రోసి పుచ్చరానికాలపాశమును మెడకుఁ గట్టికొని యున్నట్టయినదే! ఎక్కడికిఁ బోయి సుఖము పడెదవు? 'రాముని కిట్టిశక్తి యె'ట్లందువా? ఎవ్వఁడు తమ్ముఁడుగూడ లేక తానొక్కండే మహారణ్యమునందు నిమేషమాత్రమున పదునాలుగు వేల మహారాక్షసులఁ బొరిపుచ్చెనో అట్టి మహాపరాక్రమశాలియు సర్వాస్త్రకుశలుఁడును బలవంతుఁడు నగురాముఁడు తనమక్కువయిల్లాలి నపహరించినట్టి నిన్ను, వాఁడి బాణముల వధించి పుచ్చక విడుచునా?" అనెను. సీత రావణుని యంకమున నుండి భయమును దుఃఖమును ముంచుకొన పరుసఁగాను జాలిపుట్టునట్టుగాను విలపించుచు నీమాటలను మఱియుఁ దక్కిన మాటలను జెప్పెను. అట్లు సీత పరమ దుఃఖితయై పలవించుచు జాలిపుట్టునట్లు పరిపరివిధములఁ జెప్పుచున్నను,దుఃఖమునఁ బొరలుచున్నను, మేనంతయు గడగడవడఁకుచున్నను, ఆ పాపాత్ముఁడు దాని నంతయుఁ బాటింపక యాబిడం గొనిపోయినవాఁడయ్యె. ఇది యేఁబదిమూఁడవ సర్గము.

---

కొన్ని సొమ్ములు కొంగులోముడిచి కట్టి దారిని గనఁబడ్డ
వానరులకు రావణునికిఁ దెలియనట్లు విసరివైచుట. రావణుఁడు
నశోకవనమునుంచి జనస్థానమునకు రాముని వధింప
రాక్షసులను గొందఱిని బంపుట.

రావణుఁడట్లు అపహరించి కొని పోవుచుండఁగా సీత యెందును దిక్కు గానక యొక పర్వతశిఖరమున నున్నవానరశ్రేష్ఠు లేవురిని గాంచెను. వాలుఁగన్నులును వలుఁదపిఱుఁదులును గలయాయువిద 'ఈ వానరోత్తములు రామునిద్దైవికముగాఁ జూచిరేని నా సంగతిని జెప్పినను జెప్పుదు' రని తలఁచి బంగారువన్నె గలతన యుత్తరీయమునం దాభరణములను మూటఁగట్టి వారి నడుమఁ బడునట్లు పాఱవైచినది. భూషణములు గట్టినవస్త్రమునుజించి దానిని దారినడుమ సీతవైచినకార్యమును, రావణుఁడు సీతను గొనుపోవుసంభ్రమమున నెఱుంగఁడయ్యెను. గోరోచనపు

వన్నెకన్నులు గలయావానరులో కేవలురు కారు; వానరశ్రేష్ఠులు. వారట్లు 'రామా రామా'యని యాక్రోశించుచున్నయా విశాలాక్షిని సీతను తమ కన్నుల ను దేఱకొన విచ్చి ఱెప్పపాటు లేనివారుంబోలె ఱెప్పల నల్లార్పక చూచుచు నుండిరి. ఆ రాక్షసేశ్వరుఁడు, సీత యట్లు రోదనము సేయుచుండఁగాఁ గొని పంపాసరస్సును గడచి యింతవఱకు రామాశ్రమము వంక నిగుడుచుండిన చూపును మరల్చి లంకాభిముఖముగా నిచ్చలుపోయెను. రావణుఁడు తనకు మృత్యుహేతువైన యా సీతను, వాఁడికోఱలు గలిగి వెనువిషము గ్రక్కెడి యాఁడుసర్పమును గొని పోవునట్లు, చంకలోఁగొని మిక్కిలియు నుబ్బునఁ బోయెను. వాఁడు, వింటినుండి విడువంబడినబాణమువలె, అతివేగమున ఆకాశమార్గమున వనములను నదులను పర్వతములను కొలఁకులను గడచి పోయెను. వాఁడు, తిమి మకరములకు నివాసమై వరుణున కాటపట్టయి యక్షయ్యమై నదులకెల్లను శరణమయి యొప్పుసముద్ర మును జేరి దానిని దాఁటెను. సీతను గొని పోవుచుండఁగా రావణునిఁ జూచి భయ మున సముద్రము తొట్రువడుచు, అల లడంగి, మత్స్యములును మహాసర్పములును వెలికి రాక లోపలనే ముడుంగుకొన, నుండెను. అప్పు డాకాశమున నున్నచారణు లును జూచి 'రావణుఁ డింతటితో సరి' యనుపలుకు లాడిరి. సిద్ధులు నవు డట్లే యనిరి. ఆ రావణుఁడు రూపు దాల్చినతనమృత్యువై, భయశోకముల నంగములు సు డిగొనుచునున్నసీతను, చంక నెత్తుకొని లంకాపురిం బ్రవేశించెను. రావణుఁడు, చక్క గా రాజమార్గము లేర్పడి యున్నలంకాపురిని జేరి పెక్కు జనులునిండియున్న కక్ష్యలు క్రిక్కిఱిసియుండు తనయంతఃపురమును బ్రవేశించెను. రావణుఁడు, * మయుఁ డాశ్చర్యశక్తియుక్తయగుస్వయంప్రభను బిలమున నుంచినట్లు, నల్లని కన్నులు వన్నెగులుకుచు శోకమోహములపాలయి యున్నసీత నచ్చట నుంచెను. అంత రావణుఁడు పిశాచములవలె భయంకరముగాఁ గనఁబడు రాక్షసస్త్రీలం జూచి 'నాయనుజ్ఞ లేకపురుషుఁడుగాని స్త్రీ గాని యీసీతను జూడఁ గూడదు; ఇట్లు మీరు కావలి యుండవలయును. ముత్తెములుగాని రత్నములుగాని సువర్ణముగాని వస్త్ర ములుగాని యాభరణములుగాని సీత యేదేది గోరునో యదంతయు నా చెలువకు, నాకిచ్చునట్లే, యియ్యవలయును. ఎవ్వతి, తెలిసియో తెలియకయో సీతకు కొంచె మేదేని యప్రియము చెప్పునో దానికి ప్రాణములు తీపిగావు. దానిని వధించిపుత్తును?' అనెను. ప్రతాపవంతుఁ డారాక్షసప్రభుఁడు ఆ రాక్షస స్త్రీలకిట్లు

*ఇందులకు 'తత్ర తా మసితాపాంగాం శోకమోహపరాయణామ్। నిదధే రావణ స్సీతాం మయో మాయామివ స్త్రియమ్'. అని గోవిందరాజపాఠము 'మాయా మివాసురీం' అని తిలకపాఠము. మయుం డాసుర మాయనువలె' నని యిందులకర్థము. లంకకు ముఖ్య యగుసీత రాలేదనియు మాయారూప యగుసీతయే వచ్చిన దనియు నిట ధ్వనించుచున్నది. ముఖ్యసీత అగ్నిని బ్రవేశించెనని పూర్వమే ధ్వనితము. మాయారూప కా వుననే రావణుఁడె త్తికొని రాఁగూడినదయ్యె. మాయాత్వమునుబట్టియే రావణున కది తెలియదయ్యె.

చెప్పి యంతఃపురముననుండి వెడలి యింకేమి చేయవలయునని యాలోచించి మహావీర్యులును మాంసాహారులు నగురాక్షసుల నెనమండ్రను జూచెను. మహాపరాక్రముఁ డగునారావణుఁడు బ్రహ్మవరదానమున మైమఱచి వారలబలపరాక్రమములను బేర్కొని పొగడి వారితో “మీరలు నానావిధము లైనయాయుధములుగొని యిచటనుండి శీఘ్రముగాఁ గదలుఁడు. పూర్వము జనస్థానము ఖరునికి వాసస్థానమైయుండినది. అదియిపుడు సన్ని వేశములన్నియుశూన్యమై పాడుపడియున్నది. అచటికిఁబొండు. మీరలు కేవలనీతిబలమునే కాక పౌరుషబలమునుగూడ నాశ్రయించి, బెదరును దూరమునఁబాఱఁదోలి, రాక్షసులందఱును హతులగుటచే శూన్యమై యున్నయాజనస్థానమునఁ గాఁపుండుఁడు. ‘పౌరుషబలము నాశ్రయింపనేల’యందురా? నేను ఖరదూషణుల నాయకులుగా నేర్పఱచి మిక్కిలియు గొప్పసైన్యమును జనస్థానమున నుంచియుంటినే! ఆసైన్యమునంతయు ఖరదూషణసహితముగా యుద్ధమున రాముఁడు బాణముల రూపుమాపెను. ఆనిమిత్తమై నాకుఁ దాళలేకుండుటవలన ధైర్యమును మించి క్రోధము విజృంభించుచున్నది. ఇట్లు కోపావేశమున దేహము తెలియకున్నదిగావున నేను బోవుటకు లేదు; కాని, నేను పోకుండుటకు భయము హేతువుగాదు. ఇంతేకాక నాకు రామునిపై మిక్కిలి బెట్టిదమగు గొప్పవైరమును గలిగియున్నది. కనుక నాపగవానిపై పగ తీర్చుకొనఁ గోరుచున్నాను. పగవానిని యుద్ధమునఁ జంపకున్నచో నాకు నిదురపట్టదు గదా. అందులకే పౌరుషబలమును బూనియుండుఁ డనిచెప్పితిని. ఖరదూషణులను క్రూరముగాఁ జంపిన యా రామునిఁ జంపుదునేని, పేదకు పెనులిబ్బిదొరికినట్లు, సుఖము నొందుదును. మీరుమాత్రము జనస్థానమున నుండుచు రామునివలని పోకడలన్నియు ఉన్నది యున్నట్లుగాఁ దెలిసికొని యాసంగతి నాకుఁ బంపుచుండవలయును. మీరలందఱు నెంతమాత్రమును పరాకు లేకపోవలయును. రామునివధమును గుఱించి యెడతెగక ప్రయత్నము చేయుచునేయుండవలయును. ‘ఖరాదు లుండినట్టిచోట మముబోఁటు లెట్లుండఁగల’మందురా? నేను యుద్ధాగ్రములందు పెక్కుమాఱులు మీబలములను కనుఁగొనియున్నవాఁడను. కావుననే యీ జనస్థానకార్యమునందు మిమ్ము నియోగించితిని!” అనెను. అంత నారాక్షసు లెనమండ్రును, మిక్కిలియు సంగతులుచెప్పి యా రావణుఁడు ప్రియవాక్యములు పొగడఁగా, అతనికి నమస్కరించి వేగాతిశయమునఁ దమరూపములు దేఱిచూడరాకుండఁగా, లంకనుండి జనస్థానముం డుచక్కటికిఁ బోయిరి.*అంత రావణుఁడో, సీతనుజూచి మిక్కిలి కామవికారము నొంది

*ఇందులకు ‘తతస్తు సీతా ముపలభ్య రావణ స్సుసంప్రహృష్టః పరిగృహ్య మైథిలీం। ప్రసజ్య రామేణ చ వైరముత్తమం బభూవ మోహా న్ముదితస్స రాక్షసః’ అని మూలము. దీనికి వాస్తవార్థము— రావణునకు రామునితోడివైరము లోకదృష్టికి అనర్థముగాతోఁచినను, నాఁడు, సీతాపహరణముద్వారా శ్రీరామహస్తమువలన తనకు వధముగలుగుట మిక్కిలి యిష్టమగుటచే రామునితోఁబగగొని సంతోషించెనని భావము.

యాబిడను బట్టి తెచ్చి దానిచే రామునితోఁ బగఁగొన్నందులకు దుఃఖపడవలసియుండియు, అజ్ఞానమున సంతోషము నొందినవాఁ డయ్యెను. ఇది యేఁబదినాలుగవసర్గము.

{రావణుఁడు సీతకుఁ దనభోగసాధనములు చూపి తన్ను వలచునట్లు చేయఁ గోరుట.

రావణుండు భయంకరాకారులును మహాబలశాలురు నగురాక్షసుల నెనమండ్ర జనస్థానమునకుఁ బంపి, బుద్ధిపాటవము లేనివాఁడు గావున నంతటికిఁ దాను గృతార్థుఁడైనట్లు తలంచుకొనెను. రాక్షసవిభుఁడా రావణుఁడు అంతఃపురమందిరమును ప్రవేశించి యచట రాక్షసస్త్రీలనడుమ శోకమునం బొక్కుచున్న సీతం గాంచెను. మొగమునిండఁ గన్నీళ్లు గాఱుచుండఁగా విన్ననై దుఃఖభారమునకు సైఁపలేక పల్లటిల్లుచు, వాయువేగము పయికొనఁగా సముద్రమున మునుఁగుచున్న యోడవలె, వ్యాకులయై మృగములకదుపులకుఁ దప్పి కుక్కలనడుమం జిక్కిన లేడివడువున రామలక్ష్మణులం బాసి రాక్షసులనడుమం జిక్కి తత్తఱిల్లుచు, తలవాంచి దుఃఖము బారింబడి, యేదియుఁ జూడఁగోరక యున్న సీతకడ కా రాక్షసవిభుఁడు చేరి యాబిడ దుఃఖమునఁ బొక్కుచు దీనయై వలదని యెంతమాఱాడినను బలాత్కారమునం దీసికొనిపోయి దేవతాగృహమునకు సాటివచ్చు తనమేటిగృహమునంతయుఁ జూపెను. అందు విమానములును కుఱుచలైనవియు పొడవులైనవియును క్రిక్కిఱిసియుండెను. వేవురకొలఁదిని స్త్రీలు మెలఁగుచుండిరి. మఱి పలువిధములైనపక్షులు పెక్కులు కొలకొలమనుచుండెను. అనేకవిధరత్నములు నొప్పుచుండెను. మఱి దంతములతోను అపరంజితోను పటికపురాలతోను వెండితోను వజ్రవైడూర్యములతోను రచితములై వింతలుగులుకుచు కన్నులకును మనస్సునకును విందులుగూర్చు కంబములు, అందు డంబుమీఱుచుండెను. దానిని జూపి రావణుఁ డంత సీతం దీసికొని, దివ్యదుందుభుల శబ్దముగలిగి మంచిబంగారుమయమైనద్వారముతోఁ గూడి, వింతలుగూర్చుచున్న పసిండిసోపానముపయి నెక్కెను. ఆసోపానపంక్తియందు దంతపుఁగిటికీలును వెండిగవాక్షములును చూచుటకు మనోహరములై యుండెను. ఆ సోపానపంక్తిపయిని బంగారుకిటికీలు వరుసగా నీటు గులుకుచున్న మేడలవరుసలు చూపట్టెను. ఆ కిటికీలమూలమున రావణుఁడు సీతను గచ్చుపూసినవియు రత్నములు పొదిగినవియునై విచిత్రములుగానున్న యమ్మేడప్రదేశముల నన్నింటిని తనయింటను జూపెను. శోకంబున గ్రుంగియున్న యా సీతకు రావణుఁడు నడబావులను నానావిధవృక్షములతోఁ గూడినకొలఁకులను జూపెను. ఆపాపాత్ముఁడు యుత్తమమైన తనగృహమునంతయు సీతకుఁ జూపి ఆబిడకు తనయందు వలపుగొలుపుటకై కోరి 'సీతా! పదికోటులరాక్షసులును ఇంక నిరువదికోటులరాక్షసులును నున్నారు. వా రందఱును భయంకరకర్ములు. వారలకం దఱికిని నేను ప్రభుండను. వృద్ధులును బాలురును దప్ప నాయొక్కనికిమాత్రము పరి

చారకులు వేయిమందియున్నారు. నాకు రాజపరికర మేదేదియున్నదో అదంతయు నీ యధీనము. నాప్రాణముగూడ నీయధీనమే! విశాలాక్షీ! నీవు నాకుఁ బ్రాణములకంటె నెక్కుడైనదానవు. ప్రియురాలా! నీవు నాకు భార్యవగుము. * అప్పుడీయంతఃపురమునం గలపెక్కండ్రు ఉత్తమకాంతలలో నాభార్యలెవ్వరెవ్వరున్నారో వారలకందఱికిని నీ వేలికసాని వగుదువు. నేను చెప్పినమాట కయికొనుము. ఇదియె మంచిది. †రాముఁడని నీకు వేఱుబుద్ధివలనఁ బ్రయోజనమేమి. కాఁబట్టినన్నుఁ జేపట్టుము. మన్మథతప్తుఁడ నగునామీఁద ననుగ్రహ ముంపఁదగును. అందుకుఁ దగవా ? ఈ లంక నూఱుయోజనముల విఱివి గలసముద్రముచే చుట్టును పరివేష్టింపఁబడియున్నది. దేవతలును అసురులును ఇంద్రునితోఁ గూడివచ్చినను దీనిని మార్కొన నలవిగాదు. వీర్యమున నాకు సమానుఁడైనవాఁడు ఏలోకమునను దేవతలయందుఁగాని యక్షులందుఁగాని పక్షులయందుఁగాని యెవ్వఁడును లేఁడు. ‡ రాజ్యభ్రష్టుఁడై దీనుఁడును తాపసియునై యల్పాయుష్కుఁడును నల్పతేజస్కుఁడు నగు కేవలమనుష్యునితో రామునితో నీ కేమిపని ? § సీతా! నీవు నన్నే చేపట్టుము. నేనే నీకుఁ దగిన పెనిమిటిని. పిఱికిదానా! యౌవనము సతముగాదుగదా. నాతోఁగూడి యిచటఁ గ్రీడిం

*ఇందులకు 'బహూనాం స్త్రీసహస్రాణాం మమ యోఽసౌపరిగ్రహః। తాసాం త్వమీశ్వరాసీతే మమభార్యా భవ ప్రియే॥' అనిమూలము-వాస్తవార్థము:—(భార్యా అభవప్రియే)అనిఛేదము,(అభవప్రియే) మోక్షప్రియమైనదానా! (భార్యా-భా+ఆర్యా-భా=చిద్రూపిణీ, ఆర్యా=శ్రేష్ఠా) చిద్రూపిణివై శ్రేష్ఠురాల వగునీవు, నాకును నాభార్యలకును ఈశ్వరి వగు మని భావము.

† ఇందులకు 'సాధు కిం తేఽన్యయా బుద్ధ్యా రోచయస్వ వచో మమ। భజస్వ మాభితప్తస్య ప్రసాదం కర్తుమర్హసి' అనిమూలము. వాస్తవార్థము—(కామ+అభితప్తస్య) కామ=నీభృత్యుఁడను అగుదునను మనోరథముచేత, అభితప్తుఁడనైన నన్ను,(భజస్వ) భృత్యునిగాఁ జేపట్టుమనుట.

‡ ఇందులకు 'రాజ్యభ్రష్టేన దీనేన తాపసేన గతాయుషా। కింకరిష్యసి రామేణ మానుషేణాల్పతేజసా॥' అనిమూలము. వాస్తవార్థము:—(రాజ్యభ్రష్టేన-రాజ్యాద్భ్రష్టా రిపవో యస్మాత్తేన) రాజ్యమునుండి శత్రువులను తొలఁగించినవాఁడును, (దీనేనతాపసేన గతాయుషా) ఇది యేకపదము-'దీన+ఇన+తాపస+ఇన+గత+ఆయుషా' అనిఛేదము. ఇనుఁడనఁగా ప్రభువు-దీనులకు ప్రభుఁడును, తాపసులకు ప్రభుఁడునై, (గత+ఆయుషా) ప్రాప్తించిన యేకాదశ సహస్రసంవత్సర పరిమితమైన ఆయువ్వుగలవాఁడును-దీనజనులనును తాపసులనును రక్షించుటకై యవతరించినవాఁడనుట, (మానుషేణ) మనుష్యరూపమున అవతరించినవాఁడును, (అల్పతేజసా-అల్పమితరేషాం తేజో యస్మాత్తేన) ఎవనివలన ఇతరులతేజస్సులు అల్పములగునో యట్టివాఁడును- ఇందులకు 'తమేవభాంతమనుభాతిసర్వం తస్యభాసా సర్వమిదం విభాతి' అనుశ్రుతి.(రామేణకిం) ఇటువంటి పరమపురుషుఁ డగురామునిగుఱించి యేల విలాపముచేసెదవని భావము.

§ ఇందులకు 'భజస్వనీతేమామేవ భర్తాహం సదృశస్తవ। యౌవనం హ్యధ్రువం భీరు రమస్వేహ మయాసహ' అనిమూలము. 'మామేవ' అనుచో 'మే+అవ' అనిఛేదము, 'యౌవన' శబ్దముచే నిట బాల్యావార్ధకాద్యవస్థలుగూడ లక్షితములు -అనఁగా ఆయువ్యమంతయు దీనిచే లక్షితమగుచున్నది.(యతః)

పుమా! *వరాననా! రాముని జూడవలయుననిగూడ మనస్సు నాశ యుంపకుము. వానికి నిచ్చట రావలయునని మనస్సునఁ దలంచుటకుఁగూడ శక్తి యేమున్నది? మహావేగము గలవాయువును ఆకాశమునఁ ద్రాళ్లంబట్టి కట్టనలవిగాదు. మండుచున్న యగ్ని పొగలేనిసెగనుగాని బట్టఁదరముగాదు. కల్యాణీ! నాభుజములచేఁ బాలింపం బడు చున్న నిన్ను, పరాక్రమమున నిచ్చటనుండి కొనిపోవఁజాలినవాఁడు ముల్లోకము లందును నాకుఁ గానంబడఁడు. నీవు లంకయందు మిక్కిలియు గొప్పదయిన యీ రాజ్యమునంతయుఁ బాలించుచుండుము. †ఇఁకను నాయట్టివారును దేవతలును జంగమస్థావరములును నీకుఁ బరిచారకుల మగుదుము. నీవు నాకుఁ బట్టమహిషిగా నభిషేకజలంబులం దోఁగి, సంతోషమున నన్ను రమింపఁజేయుమీ. ‡నీవుమున్ను గావించిన పాపకర్మము వనవాసముచే తీఱిపోయినది. ఇఁక నీవు చక్కఁగా నాచరించిన

ఎందువలన - ఇది అధ్యాహార్యము, (మే) నాయొక్క, (యౌవనం) నీకు సేవచేయుట కనుకూలమైన ఆ యుష్యమంతయును, (అధ్రువం) స్థిరమైనది కాదో, (యతం) ఎందువలన, (అహం) నేను, (తవ) నీకు, (సదృశః) తగినవాఁడైన, (భర్తా- బిభర్తి శుశ్రూషాదినా స్వామిన మితిభర్తాభృత్యః) భృత్యుఁడనో, (అతః) అందువలన, (మా) నన్ను (భజస్వ) భృత్యునిగాఁగైకొనుము. (అవ) రక్షింపుము. అందులకై యీలంకయందు (మయాసహ- మా=లక్ష్మీ-రాజ్యలక్ష్మీ) రాజ్యలక్ష్మితోఁగూడ, (రమస్వ) క్రీడింపుము.

*ఇందులకు 'దర్శనే మాకృథా బుద్ధిం రాఘవస్య వరాననే। కాస్య శక్తిరిహాగన్తుమపి సీతే మనోరథైః। నశక్యో వాయు రాకాశే పాశైర్బద్ధుం మహాజవః। దీప్యమానస్య వాప్యగ్నే ర్గ్రహీతుం విమలాం శిఖామ్॥ త్రయాణామపి లోకానాం న తం పశ్యామి శోభనే। విక్రమేణ నయే ద్యస్త్వాం మద్బాహుపరిపాలితామ్॥' అనిమూలము. వాయువును ద్రాళ్లంగట్టుటకును అగ్నిశిఖను బట్టుటకును అలవిగానట్లు తలంపుచేతఁగాని యీలంకకు వచ్చుటకు ఎవ్వనికిని శక్యముగాదు. (రామం వినా) రాముఁడుతప్ప అనిశేషము. రాముఁడుతప్ప మఱెవ్వనికిని శక్యముగాదనుట. అట్లె నాబాహువులచేఁ బరిపాలింపఁబడుచున్న నిన్ను హరించువానిని రామునిఁ దప్ప మఱెవ్వనిని జూడలేను అనియర్థము. రాముఁడుగోరినా రాను శక్తుఁడగును; నిన్నుఁగొనిపోవను శక్తుఁడగును. కాఁబట్టి యతఁడు తానేవచ్చి నిన్నుఁబొందఁగలఁడు. నీవో, (దర్శనే మాకృథాబుద్ధిం రాఘవస్య) రాముని ఎప్పుడు చూతునో 'యని తహతహపడవలదు అని యర్థము.

† ఇందులకు 'లంకాయాం సుమహ ద్రాజ్య మిదం త్వ మనుపాలయ। త్వత్ప్రేష్యా మద్విధాశ్చైవ దేవాశ్చాపి చరాచరాః॥' అని మూలము. ఇది మొదలుగా రావణుఁడు తనకులదేవతయగు సీతాదేవి కన్నును తనసొమ్మును సమర్పణము చేయుచున్నాఁడు.—(మద్విధాః) నవుబోఁటివారు నీకు పరిచారకు లగుదురనుటచే ఆత్మ సమర్పణమును, (లంకాయాం రాజ్య మనుపాలయ) లంకయందు రాజ్యము పాలింపుమనుటచే ఆత్మీయసమర్పణమును, తెలియుచది.

‡ ఇందులకు, 'దుష్కృతం యత్పురా కర్మ వనవాసేన తద్గతం। యశ్చ తే సుకృతో ధర్మ స్తస్యేహ ఫల మాప్నుహి' అని మూలము. వాస్తవార్థము:—(వనవాసేన) వనమునఁగా జలము-జలమధ్యమునందు లంకాద్వీపమున వసించువాఁడ నగు, (మయా) అని శేషము- నాచేత, (పురా యద్దుష్కృతం కర్మ) కృతం అని శేషము-పూర్వమేదుష్కర్మము చేయఁబడినదో, (తద్గతం) అది (నా యుష్మ

ధర్మమునకు ఫలము నిచట ననుభవింపుము. *సీతా! నీ విచట నాతోఁగూడ దివ్యగంధము లగునవు మాలికలను ఉత్తమము లైనభూషణములను అనుభవింపుము. † సుశ్రోణీ! నాయన్న కుబేరునికి పుష్పక మనువిమానము గలదు. అది సూర్యునివలె ధగధగ మెఱయుచుండును. నేను భుజబలమున జయించి దానిని గయికొంటిని. ఆ విమానము ఎందఱికేని కూర్చుండుటకుఁ జాలినంతవఱపై రమణీయముగానుండును. దానికి సాటి వేఱొద్దియుఁ గలుగదు. సీతా! ఆ విమానమందు నన్నుఁ గూడి సుఖము విహరించుచుండుము. వరారోహా! తామరవలెఁ దులకించుచుఁ జూచుటకు ముద్దులుగులుకుచుండుమేలయిన నీ నెమ్మొగము దుఃఖమునఁ గంది కుంది ప్రకాశింపకున్నదే. కాన దుఃఖము వదలుమా!" అనెను. రావణుఁ డిట్లు చెప్పుచుండఁగా నాకాంతారత్నము సీత, చీరకొంగునఁ జందురునివలె సుందర మగు మొగమును గప్పుకొని కన్నీళ్లు మిక్కిలియుఁ గార్చినదయ్యె. పాపాత్ముం డగు నా రాక్షసవిభుఁడు రావణుఁ, డట్లు రామునే ధ్యానించుచు భూతముపట్టినట్లు నెఱిఁదప్పి విన్ననై చింతచే వన్నెగుంది కొందలపడుచున్న సీతం జూచి ‡'సీతా! వెసిమిటిని దిగవిడిచి మఱొకనిఁ జేపట్టినచో ధర్మము

---

దేవత యగునిన్ను దర్శించినమాత్రనె) నశించినది. (పురా మయా సుకృతో యోధర్మః) పూర్వము నేను జక్కఁగా ఏ ధర్మమును జేసితినో, (తస్యఫలం) దానిఫలమును, (తే) నీకు నివేదించుచున్నాననుట, (అప్నుహి) దానిని గయికొనుము. అని యిట తన సుకృతఫలమును సమర్పించినాఁడని తెలియునది.

* ఇందులకు 'ఇమామాల్యాని సర్వాణి దివ్యగంధాని మైథిలి। భూషణానిచ ముఖ్యాని సేవస్వచ మయాసహ' అని మూలము, వాస్తవార్థము:—(మయా) నాచేత, (సమర్పితాని) అనిశేషము-సమర్పింపఁబడిన వగుమాల్యభూషణములను, (సహ = ఏకదైవ) ఒక్కసారిగనే, (సేవస్వ) అనుభవింపుమనుట.

† ఇందులకు 'పుష్పకం నామ సుశ్రోణి భ్రాతుర్వైశ్రవణస్య మే। విమానం సూర్యసంకాశం తరసా నిర్జితం మయా। విశాలం రమణీయంచ తద్విమాన ముత్తమం। తత్రసీతే మయాసార్ధం విహరస్వ యథాసుఖమ్' అనిమూలము-వాస్తవార్థము.—(మయా) నాచేత, (సమర్పితే) అనిశేషము - సమర్పింపఁబడిన దగుపుష్పకమునందు, (సార్ధం)సర్వసంపద్భిః అనిశేషము- సమస్తసంపదలతోఁగూడ, (విహరస్వ)విహరింపుము. అనియర్థము.

‡ ఇందులకు 'అలం వ్రీడేన వైదేహి ధర్మలోపకృతేనచ। ఆర్షోఽయం దైవనిష్యందో యస్త్వామభిగమిష్యతి' అనిమూలము-వాస్తవార్థము:—(అలం వ్రీడేన)సిగ్గుచాలును-భృత్య రక్షణవిషయమందు సిగ్గుదగదనుట-దీనివలన ధర్మలోప మేమి కలుగదనుట-ఏలనఁగా,(అయం దైవనిష్యందః)మన కిరువురకును దైవముచే సంపాదితమై దాసదాసవద్భావరూపమైన యీసంబంధము,(ఆర్షః)అనాదిసిద్ధము-అనాదిగా నేను దాసుఁడుగాను నీవు స్వామినివిగాను ఉన్నార మనుట,ఇట్టిసంబంధమే,(త్వామభిగమిష్యతి)నీకుఁ గలుగుచున్నది- క్రొత్తదియు నేమియుఁ గాదు. కనుక సిగ్గువలదని భావము-మహేశ్వరతీర్థులు.

నారదుఁడు 'పరపూర్వాః స్త్రియస్త్వన్యాః సప్తప్రోక్తాః స్వయంభువా। పునర్భూస్త్రివిధా తాసాం స్వైరిణీతు చతుర్విధా। కన్యా వాక్షతయోనిర్యా పాణిగ్రహణదూషితా। పునర్భూః ప్రథమాప్రోక్తా పునస్సంస్కారకర్మణా। దేశధర్మానవేక్ష్య స్త్రీ గురుభిర్యాప్రదీయతే। ఉత్పన్నసాహసాన్యస్మై సాద్వితీయా ప్రకీర్తితా। మృతే భర్తరికు ప్రాప్తా దేవరాదీనపాస్య యా। ఉపగచ్ఛేత్పరం కామా

లోపించునే యని సిగ్గుపడవలదు. దైవగతిచే నీకు నాతోడఁ గలుగనున్న యీ సంబంధము అధర్మముగాదు; ఋషులచే ననుమోదించి చెప్పఁబడినదియే. సుందరములైన నీచరణములను నాతలలుసోఁకి నలఁగువనొందునట్లు పలుమాఱు మ్రొక్కితిని. నామీఁద ననుగ్రహ ముంపుమీ. నీకు నేను లోనైతిని. నీ దాసుఁడనైతిని. నేను మన్మథతాపమునఁ బొక్కుచు నా పరువునకుఁ దగని నీచము లైనయీ మాటలం జెప్పితిని. రావణుఁ డింతవఱకు నెట్టిస్త్రీకిఁగాని తలవంచి మ్రొక్కి యెఱుఁగఁడే' అనెను. రావణుఁడు జనకరాజసుత యగుసీతతో నిట్లు చెప్పి కాలునిబారిం జిక్కి 'ఈసీత నెట్లయినను నాది గావించుకొనవలయు' ననితలంచినవాఁడయ్యె. ఇది యేఁబదియేనవసర్గము.

---

సీత రావణుని నిరసించి పలుకుట. సీతను మరల నశోక వనమునకుఁ గొని పోవుట.

శోకంబునఁ గంది కుందియున్న సీత, 'రావణుఁడట్లు చెప్పినదివిని భయమువిడిచి, పతివ్రత పరపురుషునితోఁ జక్కఁగా మాటలాడరాదు గావున రావణునకును దనకును నడుమ తృణము నుంచుకొని రావణునిం జూచి "దశరథుఁ డనుమహారాజొక్కఁ డుండెను. అతఁడు సేతువువలె ధర్మమర్యాదను వ్యవస్థాపించువాఁడు; స్థిరుఁడు; సత్యసంధుఁడని ప్రసిద్ధిగన్నవాఁడు, అతని కుమారుఁ డా రాముఁడు. ఇట్టి కులమును మెట్టి నది తప్పినడచునా? రాముఁ డనునాతఁడు ధర్మాత్ముఁడు, ముల్లోకములందుఁ బ్రఖ్యాతిగన్నవాఁడు, ఆజానుబాహుఁడు, విశాలనేత్రుఁడు, సర్వలోకములకును దైవతమైనవాఁడు. అతఁడే నా పెనిమిటి; కావున నాకును దైవము. అట్టి పతిని చేపట్టినదయు తప్పినడచునా? అతఁ డిక్ష్వాకువంశమునఁ బుట్టినవాఁడు. సింగంబునకుంబోలె నున్నతము లగుభుజశిఖరములుగలవాఁడు, మహాతేజుండు. అతనికి లక్ష్మణుఁ డనుతమ్ముండు గలఁడు. ఆరాముఁడే తమ్మునితోఁగూడి వచ్చి, నీప్రాణములను బుచ్చుకొనఁగలఁడు.

---

త్స్వైరిణీ తృతీయా ప్రకీర్తితా। ప్రాప్తా దేశాద్ధనక్రీతా క్షుత్పిపాసాతురాచ యా। తవాహమిత్యుపగతా సా చతుర్థీ ప్రకీర్తితా॥ అక్షతయోనిగానైన కన్య ఒకరిని పెండ్లాడినపిదప మఱొకరిని పెండ్లాడునది పునర్భువు అనఁబడును. ఎవ్వతి వ్యభిచారముగలదై యుండుటఁజూచి దేశధర్మములచొప్పున దాని పెద్దలు మఱొక్కని కిత్తురోయది రెండవది; భర్తృమృతుఁడు కాఁగా మఱఁదులను మొదలైన వారినినిరాకరించి కామమువని మఱొకనిని బొందునదిమూఁడవది; ధనముచేతఁ గొనఁబడినదిగాని క్షుత్పిపాసలకు సైఁపక 'నేనునీదానను' అని యొకనిని జేపట్టునది నాలుగవది. ఈనలువురును ఋషిప్రోక్తలే కనుక అందు పునర్భువు విధిచొప్పున నీవు నన్నుఁ జేకొనవచ్చునని రావణుని అభిప్రాయము-గోవిందరాజులు. క్షత్రియులకు బలాత్కారమున రాక్షసవివాహము ఋషిప్రోక్తమే కావున ఆవిధిని నన్నుఁ జేకొనవచ్చునని రావణుని యభిప్రాయము. అయినను కన్యను బలాత్కారమున గ్రహించుటయే రాక్షసవివాహమని స్మృతి చెప్పుచున్నది; వివాహిత నట్లు గ్రహించుటను గాదు. కాఁబట్టి యిది తమోగుణప్రాధాన్యమునుబట్టి యిట్లు రావణునిచే పొరపాటుగ చెప్పఁబడినదని గ్రహించునది-మహేశ్వరతీర్థులు.

'అయితే నింతకు నూరకున్నాఁ డేమి'యందువా? నీవు రాముని యెదుటమాత్రము నన్ను బలాత్కారమున హరించి యుందువేని యింతకు ఖరునివలె యుద్ధమున హతుఁడవై జనస్థానంబునఁ బరుండి యుందువు. భయంకరాకారులును మహాబలవంతులు నగు రాక్షసు లున్నారని చెప్పితివే. గరుత్మంతునిదెస సర్పముల విషము పనిమాలి నట్లు రామునిదెస వారలవీర్య మెంతమాత్రము పనికిరాదు. ఆరాముని వింటినుండి వెలువడి బంగారుచే రంగారుచుండు బాణములు,అలలు గంగాతీరమును గలఁచునట్లు నీశరీరమును దూలఁగొట్టును. రావణా! నీవు దేవతలకుఁగాని రాక్షసులకుఁగాని యవధ్యుఁడవయ్యును ఆరామునికి నీవయిని మిక్కిలి వైరము గలుగునట్లు చేసికొంటివి. కాన నీవు ప్రాణములతోనుండి యతనితూపులతాఁకును తప్పించుకొనఁ జాలవు. నీ కింక బ్రతుకవలసినదినములు మిగిలి యుండునేని,వానిని రాముఁడే తుదముట్టించువాఁడు. యూప స్తంభంబునఁ గట్టఁబడినపశువునకు నింక జీవితాశ లేనట్లు నీకింక బ్రతుకు నాశ యెంతమాత్రము లేదు. రావణా! రాముఁడు నిన్నిపుడు రోషంబున వెలుంగు వేఁడికంటఁ జూచునేని నీవు తోడనే దగ్ధుఁడవై పరాభవమునొందుదువే. రాముఁడు ఆకాశమునుండిచంద్రుని నేలం బడవైవఁజాలును; నాశమునొందింపను జాలును.సముద్రమునంతయుఁగాని శోషిల్లఁజేయఁజాలును. అట్టి రాముఁడు తనసీత నిచ్చటినుండి కొనిపోఁగలఁ డనుట చెప్పవలయునా? నీకు ఆయువు తుదముట్టినది. నీసిరియు దూలఁగలదు. నీ బలమును గ్రుంగఁగలదు. నీ యింద్రియములు నశించును. నీవు పరస్త్రీస్పర్శము చేసినపాతకమున లంకయు వైధవ్యము నొందఁగలదు. అడవియందు నన్ను నాపెనిమిటిప్రక్కను నెడఁబాపితివి. ఇట్లు దెచ్చి నాయెడల నీ నీచాపకార్యమున కొడిగట్టితివే; ఇది నీకు సుఖము దేరదు! దుఃఖమునే కలిగించును. 'రాముఁడు దీనుఁడు తాపసుఁడు'నంటివి. నా పెనిమిటి యా రాముఁడు దైవబలముగలవాఁడు,మహాతేజస్వి; కావున నే,తనపరాక్రమము నండగొని శూన్యంబగుదండకారణ్యంబున నిర్భయుఁడై యున్నాఁడు; నిన్ను వదలఁడు. ఆరాముఁడు యుద్ధమున బాణవర్షముం బరపి నీయవయవములందుఁ గలమదమును బలమును వీర్యమును మిడిసిపాటును మఱియట్లున్న వానినెల్లఁ దీసివేయగలఁడు. దైవకృతిచే భూతములకు వినాశము కనుపట్టుకాలమున మనుష్యులు కాలవశంగతులై యపుడు పరాకుపడి విపరీతముగా కార్యములు చేయుదురు. రాక్షసాధమా! నీవు నన్నిట్లు నిరసించితివి కావున, ఇప్పుడు నీవును నీరాక్షసులందఱును అంతఃపురజనమును వధమునుబొందునట్టి కాలము నీకు దాపరించియున్నది. యాగశాలనడుమ స్రుక్స్రువాద్యుపకరణములతోఁ గూడినదై బ్రాహ్మణులు పఠించుమంత్రంబుల పరిశుద్ధమై యుండుయాగవేదికను జండాలుఁడు కాలం ద్రొక్కఁజాలఁడుగదా. రాక్షసాధమా! అప్రకారమునఁ బరమధార్మికుఁ డగురాముని ధర్మపత్నియు బతివ్రతయు నగునన్నుఁ బాపిష్ఠుఁడ వగునీకు స్పృశింప నెంతమాత్రము నలవికాదు. ఎప్పుడును తామరవనమునందు రాజహంసముతోఁ గ్రీడించుచుండు

హాంసి. గడ్డితంపరలం దిరుగునీరుకాకిని కన్నెత్తియు నెట్లుచూచును ? రావణా ! ఈ దేహము తనంతటనే జడమైనది; మఱి చేష్టలు దక్కియుండునది. ఇట్టి దీనిని బంధించినను బంధించుము; భక్షించినను భక్షించుము. నాకు ఈదేహమునుగాని ప్రాణమునుగాని రక్షించుకొనవలసిన దెంతమాత్రము లేదు. కాన నీ వలని భయములేదు. నేను 'సీత పాతివ్రత్యము వీడినది' అను నపవాదమునుమాత్రము భూమియందుఁ గలిగించుట కెంతమాత్రమును సైఁపను'' అని చెప్పెను. సీత క్రోధవశమున నిట్లు పరుషోక్తులాడి యంత రావణునితో మరల నేమియు పలుకక నూరకుండెను. సీత యిట్లు పరుషముగా చెప్పినందులకు రావణుఁడు కోపవశమున మేను గరుపొడువ సీతం జూచి భయమును బుట్టించు వాక్యమున*'సీతా! నేను జెప్పు మాటను వినుము. ఇఁకఁ బండ్రెండునెలలు ఎదురుచూచెదను. చిఱునగవు సొగసు గులుకుదానా ! ఇంతకాలములో నీవు నన్నుఁ జేపట్టవేని యంత మఱునాటి ప్రాతఃకాలపు భోజనమునకై నిన్ను నా వంటవాండ్రు తునుకలు తునుకలుగా ఛేదింతురు'అనెను. రావణుఁడో పగవారిని ఏడిపించువాఁడు; కాన సీతతోడ నిట్లు పరుషముగాఁ జెప్పి యంత కుపితుఁడై రాక్షసస్త్రీలం జూచి, '†మాంసరక్తాహార లగురాక్షసస్త్రీలారా! మీరలు శీఘ్రముగా వికృతము లయినభయంకరాకారములను దాల్చి యీ సీతకావరమును అడంతురుగాక' అనెను. మిక్కిలియు భయంకరాకృతులు గలయారాక్షసీతతులు రావణునిమాట మాత్రమున అంగీకారసూచకముగా చేమోడ్పులు గీలించి సీతచుట్టును బరివేష్టించి నిలిచిరి. భయంకరాకారుఁడగు రావణుఁడును భూమిని బ్రద్దలు వాఱించునట్లుంబోలె నడుగులం దాటించుచు లేచి యాస్త్రీలంజూచి'ఈ సీతను అశోకవనమునడుమఁ దీసికొనిపోయి యుంపుఁడు.అచట నీ పడఁతిని చుట్టుమీరు పరివేష్టిం

*ఇందులకు శృణు మైథిలి మద్వాక్యం మాసాన్ ద్వాదశ భామిని। కాలేనానేన నాభ్యేషి యది మాం చారుహాసిని॥ తత స్త్వాం ప్రాతరాశార్థం సూదా శ్ఛేత్స్యన్తి లేశశః' । అనిమూలము- వాస్తవార్థము:— సీతా నావాక్యమును వినుము. పండ్రెండు నెలలవఱకు గాచియుందును ఇంత కాలములో, (న అభ్యేషి) భృత్యుని అనుగ్రహించుటకై యిచటనుండుటకు అంగీకరింపవేని, (తతః) అంతట, (త్వాముద్దిశ్య) నిన్నుగూర్చి, (ప్రాతః) మఱునాఁటి వేకువనే, (ఆశార్థం) ఆశయనఁగాదిక్కు - దిక్కులందుండు గద్దలు మొదలైనవానికొఱకు, (సూదాః)వంటవాండ్రు, (ఛేత్స్యంతి)నన్ను తఱుఁగుదురు - నాయాజ్ఞ చొప్పున అని శేషము. దేవీ! నీవు నన్ను భృత్యుఁడుగా నంగీకరింపవేని, నేనిఁక మీఁద జీవింపనోల్లను. వంటవాండ్రతో నన్ను శస్త్రములతో ఛేదించి కాకి గద్దలు మొదలైనవానికి వేయుండని నేనే యాజ్ఞ సేయఁగా వా రట్లు చేయుదురని భావము.

†ఇందులకు 'శీఘ్రమేవహి రాక్షస్యో వికృతా ఘోరదర్శనాః। దర్పమస్యాం వినేష్యధ్వం మాంసశోణితభోజనాః' అనిమూలము- వాస్తవార్థము.—(మాంసశోణితభోజనాః ఘోరారాక్షస్యః) మాంసరక్తాహారలును భయంకరాకారలు నగునోరాక్షసస్త్రీలారా!మీరు శీఘ్రముగా, (అవికృతాః)అవికారరూపలై, (దర్పంవినా+ఇష్యధ్వం) (దర్పంవినా) గర్వముమాలి, (అస్యాస్సమీపే) ఈమెయొద్ద, (ఇష్యధ్వం) సేవార్థమై యుండఁగోరుఁడు.

చియుండి,రహస్యముగా దీనిని రక్షించుచుండవలయును. *అయశోకవనమున, మీరలు కెడిదముగా బెదరించుచును,మిక్కిలి భయమున ప్రాణములుపోవును గాన మరలఁ దిన్ననిమాటలఁ దేర్చుచును, అడవిలోని యేనుఁగుగజమును వశమునకుఁ దెచ్చునట్లు ఈ సీతను వశమునకుఁ దెండు' అనిచెప్పెను. రావణుఁ డి ట్లాజ్ఞాపింపఁగా, ఆరాక్షసస్త్రీలు సీతను దీసికొని యశోకవనమునకుఁ బోయిరి. అందలివృక్షములు సర్వకాలములందును బండ్లు పండుచు పలువిధములైనపువ్వులతోను బండ్లతోను నావృతములై యొప్పుచుండును.అందలి పక్షులును సర్వకాలములందును క్రొవ్వి కేరుచుండును. జనకరాజసుత యగునాసీత యారాక్షసీజనులబారిం జిక్కి, పులులనడుమం జిక్కిన లేడివలెను, దుఃఖముననను భయముననను సంగము లెల్ల విరవిరఁబోవుచు నుండెను. †జనకరాజకుమారి యాసీత సహజముగా స్త్రీత్వమువలన భయస్వభావముగలదిగావున, త్రాళ్లం గట్టఁబడినలేడి కైవడి, మిక్కిలియు దుఃఖముగ్రమ్ముకొనఁగా, ఎంతమాత్రమును సుఖము నొందదయ్యె. అప్పుడు సీత వికృతనేత్ర లగురాక్షసస్త్రీలు మిక్కిలియు బెదరింప నచట సుఖమెంతమాత్రమును గాననిదై తనకు దైవత మగు

---

*ఇందులకు'తర్జైస్త్రీవాం తర్జనై ర్ఘోరైః పునస్సాంత్వైశ్చ మైథిలీం'అనిమూలము-వాస్తవార్థము:-(తర్జనైః ఘోరైః)వినా అనిశేషము. ఘోర తర్జనములుమాని సాంత్వములచేత నే వశముగావించుకొనుఁడని యర్థము.

ఇట సీత దుఃఖముచే ప్రలాపించినట్లు తోఁచెడువాక్యములు లోకరీతి ననుసరించి చెప్పఁబడిన వని తెలియునది-మహేశ్వరతీర్థులు.

† 'సీతాలక్ష్మీర్భవాన్విష్ణుః' అని మీఁదను, విష్ణుపురాణమున'రాఘవత్వేభవత్సీతా రుక్మిణీకృష్ణజన్మని' అనియుఁ జెప్పఁబడుటంబట్టి సీత లక్ష్మి యవతారమేయని సిద్ధము. యుద్ధభూమిని కేవలము మూర్ఛితుఁడైనలక్ష్మణునిని 'హిమవాన్మన్దరో మేరుః త్రైలోక్యం వా సహామరైః।శక్యం భుజాభ్యాముద్ధర్తుం నసంఖ్యే భరతానుజమ్' అని లేపనెత్తుటకుఁగూడ సమర్థుఁడుగాని రావణుఁడు ఇట్టి సీతనెట్లు బలాత్కరింపఁజాలెనని యడుగవచ్చును.సీత వేదవతిగానుండిన పూర్వజన్మమున ఇట్లురావణునిచే బలాత్కారమునొందునట్లు తానే సంకల్పించుకొన్నది. ఉత్తరకాండమందు 'యస్మాత్తు ధర్షితా చాహం త్వయా పాపాత్మనా వనే।తస్మాత్తవవధార్థం హి ఉత్పత్స్యేహం మహీతలే'అని దేవకార్యము నిర్వహించుకొనుటకు తానే తన్నుధర్షించుట నంగీకరించినది. బిడ్డ బావిలో పడఁగా తల్లి తానును దానిపై వాత్సల్యాతిశయముచే నూతిలోఁ బడునట్లు రావణుఁడు చెఱపెట్టిన దేవస్త్రీలను రక్షించుకొనుటకు తానును వానిచే చెఱఁబడివచ్చుటకు అనుమతించినదయ్యె.ఇదియే సుందరకాండమున'నాపహర్తు మహం శక్యా తస్యరామస్యధీమతః।విధిస్తవ వధార్థాయ విహితో నాత్రసంశయః''బుద్ధిమంతుఁ డగునారామునిభార్యను నన్ను నపహరించుట నీకలవిగాదు. అయితే నీవధముకొఱకు విధి యిట్లేర్పడియున్నదిగాన యిట్లు చేయఁజాలితివి. ఇందుకు సందేహములేదు.' అనిచెప్పఁబడియున్నది. అయితే ప్రలాపాదులు ఏలచేసినదన్నచో పతిని బాసినప్పుడు పతివ్రత యిట్లే వర్తింపవలయునని తెలిపి లోకహితమును బరపుటకై యట్లు గావించెనని తెలియునది-గోవిందరాజులు.

ప్రాణవల్లభుని రామునిఁ దలఁచుకొనుచు భయమును దుఃఖమును పల్లటిల్లఁజేయఁగా నెఱుక తప్పి మూర్ఛిల్లిన దయ్యెను. ఇది యేఁబదియాఱవసర్గము.

రాముఁడు మృగరూపుఁ డగుమారీచునిఁ జంపి మరలుట. మార్గమున దుశ్శకునములు. దారినడుమ వచ్చులక్ష్మణునిం జూచుట. మరల దుశ్శకునములం జూచి శోకించుచు వచ్చుట.

రాముఁడు మృగరూపమునఁ దిరుగుచున్న కామరూపి యగుమారీచుని వధించి శీఘ్రముగా తన యాశ్రమము దారింబట్టి పోయెను. అతఁడు సీతను జూడఁ గోరి వేగిరమునఁ బోవుచుండఁగా, అతని వెనుక నొకనక్క భయంకరధ్వనితో నఱచెను. రాముఁడు పూర్వమే మారీచునిస్వరముచే నేమి గలుగునో యని శంక నొంది యున్నవాఁడు. మఱియు బెడిదమై గగుర్పుట్టించు నట్లానక్కయు నఱవఁగా విని మిక్కిలియు శంకితుఁడై తనలో "నక్కయఱచుచున్న విధముఁ జూడఁగా ఏమో యశుభము కలుగు నని నాకుఁ దోఁచుచున్నది. అకటా! సీత రాక్షసులచే భక్షింపఁ బడక క్షేమముగా నుండునా! మృగరూపుఁడైనమారీచుఁడు నాస్వరమును దెలిసి కొని యా స్వరమునే పూని 'హా సీతా! లక్ష్మణా!' అని బిగ్గఱగా వేసిన కేకను లక్ష్మణుఁడు వినునేని, వాఁడు నాస్వరమును విని యూరకుండఁడు; అట్లు దానిని విన్నసీతయు నిచ్చటకిఁ బొమ్మని పంపక మానదు; కాన యా పడఁతిని విడిచి నన్ను వెదకుకొని శీఘ్రముగా నిచ్చటికి రాఁ గలఁడు. మారీచుఁడు బంగారుజింకయై నన్నాశ్రమమునుండి దూరము దీసికొని పోయి తుదకు నా బాణమునఁ గొట్టువడి కూలి మరల రాక్షసుఁడై నాఁడు; మఱియు నూరక చావక 'అయ్యో లక్ష్మణా! హతుఁడనైతినే' అని నా యెలుఁగున నీ మాట చెప్పినాఁడు. ఈ కారణములవలన రాక్షసులందఱును జేరి సీతను జంపి వేయవలయునని కోరిరనుట నిజము. జనస్థానవాసము నిమిత్తముగా రాక్షసులతో వైరము పెట్టుకొంటిని. మహారణ్యమున నెవరు లేక యొంటిగా నున్నయా సీతాలక్ష్మణులు క్షేమముగా నుందురా? మఱియు నిప్పుడు భయంకరము లయినదుర్నిమిత్తములుగూడఁ బెక్కులు చూపట్టుచున్నవే' అని రాముండు చింతించెను. ఇట్లు రఘువంశ్యుఁ డారాముఁడు ఆ నక్క యఱచుట విని, మృగరూపమున మారీచుఁడు తన్నాశ్రమమునుండి తొలఁగ దెచ్చుటం జూచి, సంశయము నొందిన వాఁడై యిట్లు చింతించుకొనుచు జనస్థానమునఁ దన యాశ్రమముఁ గూర్చి వచ్చుచుండెను. మృగములును పక్షులును మనసున దీనములై, దీనుఁడైనరాముని చెంతకు వచ్చి మహాత్ముఁ డగునతనికి ప్రదక్షిణముగాఁ దిరిగి భయంకరముగాఁ గూఁతలిడినవి. రాముఁడు మహాభయంకరములైనయీదుర్నిమిత్తములను జూచి మనంబు తొందరపడ మరల వేగమున తనయాశ్రమము దారింబట్టి నడచెను. ఆ రాఘవుఁడు అందము లగుపిఱుందులు గలసీతను మహాబలవంతుఁ డగులక్ష్మణునిని

తలఁచుకొనుచునే జనస్థానమున తన యాశ్రమమునకు నచ్చుచుండెను. అంత నతండు, తనయొద్దకు లక్ష్మణుండు, వన్నెదప్పి మోము వెలువెలఁ బాఱ వచ్చుచుండఁగాఁ జూచెను. అట్లు చూచినపిదప, ఆ లక్ష్మణుఁడు దిగులొంది దుఃఖించుచు, తనవలెనే దిగులొంది దుఃఖముపాలం బడియున్న రామునిసమీపమునఁ బోయి కలిసికొనెను. అంత, అన్న యగురాముఁడు, నిర్జనంబై రాక్షసులు తిరుగుచుండునట్టియడవిలో సీత నొంటి విడిచి లక్ష్మణుఁడు వచ్చినందుల కతనిని నెంతయు నిందించెను. ఆ రఘునందనుఁడు రాముఁడు లక్ష్మణుని యెడమచేతినిబట్టుకొని మొదట బిరుసుగాను తుదకు మధురముగాను నుండుపలుకులు నార్తి దోఁక 'అయ్యో! లక్ష్మణా! నీవు ఆ మన సీత నొంటిగా విడిచి యిట వచ్చితివే! ఔరా! నిందింపఁదగిన పనిచేసితివి, పోనీ! సౌమ్యా మన కిచట క్షేమమే యగునుగదా. వీరా! ఇప్పుడు నాకశుభ శకునములే మిక్కిలిగాఁ గనఁబడుచుండుటను జూడఁగా అన్నివిధములను సీతను వనచరు లగురాక్షసులు అపహరించుకొనియైనను బోయి యుందురు; లేదా భక్షించియైన నుందురు. నాకు సందేహము లేదు. పురుషతిలకా! జనకరాజుకూఁతురు సీత బ్రతికి క్షేమముతో నుండుట మనము చూడఁగందుమా! ఏలనఁగా జింక కదుపులును నక్కయును పక్షులును సూర్యునిచే వెలుఁగుచుండుదిక్కు మొగమై భయంకరముగా నఱచుచున్నవి. మహాబలా! ఆ రాజకుమారికి సీతకు క్షేమమగునా యేమి? మున్ను మృగమువలెఁ దోఁచిన యారాక్షసుఁడు తన్ను వెంబడించుచున్న నన్ను మోసపుచ్చి బహు దూరము కొనిపోయి యెంతో శ్రమమున గుఱికిఁ జిక్కక తుదకు నాచే హతుఁడై చచ్చుచునే రాక్షసరూపము నొందెను. ఇప్పుడు సీతను గూర్చి నామనస్సు విన్ననై సొంపు లేకున్నది. నా యెడమకన్ను దరుచున్నది. కావున లక్ష్మణా! సీత రాక్షసులచే నపహరింపఁబడినదో మరణమునొందినదో మార్గమునఁ గొంపోవఁ బడుచున్నదోఁ గాని యాశ్రమమునం దుండదు. ఇందులకు సందేహము లేదు' అని చెప్పెను. ఇది యేఁబదియేడవసర్గము.

రాముఁడు సీతను బడయుట సందేహమని తోఁపఁగా
శోకమునఁ బ్రలాపించుట.

దశరథకుమారుఁ డా రాముఁడు, శూన్యం బగుమహారణ్యమున సీతను విడిచి వచ్చి విన్ననై యున్నలక్ష్మణునిం జూచి 'లక్ష్మణా! భయంకర మైనదండకారణ్యామునకు నేను బయనమైనను నన్నుఁ బాయక వెంబడించివచ్చినదే! అట్టి సీతను విడిచి నీ విచ్చటికి వచ్చితివే! ఆ సీత యిపు డెక్కడనున్నది? నేను రాజ్యమును బోఁగొట్టుకొని దీనుఁడనై దండకారణ్యమునఁ గ్రుమ్మఱుచుండఁగా నాతోడ సమానముగా ఆ దుఃఖములను దానును అనుభవించుచు నాకుఁ దోడై యున్నయాసీత, యా సన్ననినడుము గలచిన్నారి యెక్కడనే వీరా! ఎవ్వతిని విడిచి నేను ముహూర్తకాల

మైనను బ్రతుక నొల్లనో, నా ప్రాణములకుఁ దోడయినయాసీత, దేవకన్యవలెఁ దళుకొత్తు నా సొబగులాఁడి, యెక్కడ? లక్ష్మణా! బంగారు వన్నెవంటిమేనిచాయ గల యా జనకరాజకుమారి సీత లేనిచో దేవతాపతిత్వముగాని భూమండలాధిపత్యమును గాని నే నెంతమాత్రము నొల్లను. సౌమ్యా! నాకుఁ బ్రాణములకంటెను నింపయినసీత బ్రతికియున్నదే గదా? అట్టి సీతను బాసితినేని నాకిప్పుడే ప్రాణములు పోవును. కనుక నా వనవాసవ్రతమును పదునాలుగేండ్లు తుదముట్ట జరుపక పోవుదును. ఇట్టి విపత్తికలుగమిచే నా వ్రతము పొల్లుగాఁ బోవదుగదా? దానిని జరిపియేలీర్తునా? లక్ష్మణా! సీత నశింపఁగా దానింబట్టి నేను మరణమునొంది నీ వయోధ్యకుఁ బోఁగానే * ఆ కైకేయి నిన్నుఁజూచి తనకోర్కి యీడేఱినదై యెంతయు హాయిగా నుండునే కదా. అట్లు పుత్రుఁడనైననేను మృతినొందఁగా నాతల్లి కౌసల్య మిక్కిలి జాలిపడవలసినదశ నొందినదై, కొడుకుతోను దొరతనముతోను గూడియు కోర్కులన్నియు నొడఁగూడియు నున్నకైకను మెలుపున కొలువఁగలదే కదా? లక్ష్మణా! సీత బ్రతికియుండునేని మరల నాశ్రమమునకు వత్తును. ఆ చెలువ మేలైననడవడి గలది. అట్టిది మృతిబొంది యుండెనేని, యాశ్రమ మెందుకు? ప్రాణములనే విడుతును. లక్ష్మణా! నే నాశ్రమమునకు రాఁగానే, సీత మొగంబున తెలినవ్వు మొలకొత్త, నాతో మాటాడుచు నెదురురాదేని, తోడనే నశింతును. లక్ష్మణా! సీత బ్రతికియున్నదేని చెప్పుము. అది బ్రతికి యున్నదా? లేదా? లేక నీవు పరాకున నుండఁగా రాక్షసులు చూచి దిక్కులేకున్న సీతను భక్షించివైచిరా? ఆ సీత సుకుమారి; మఱి పసిది; ఎప్పుడునుదుఃఖము నెఱుఁగనిది. అది నన్నెడఁబాసినందులకు నుల్లము తల్లడిల్ల దుఃఖపడుచుండును. ఇది నిజము. కపటియు మిక్కిలి దురాత్ముఁడు నగునారాక్షసుఁడు 'లక్ష్మణా' యని బిగ్గఱ నఱచుటచేత శూరుఁడ వగు నీకుఁగూడ నన్నివిధముల భయముగలిగినది. నా కంఠధ్వనివలె నున్న యారాక్షసుని యెలుఁగు విని నీవు వచ్చితివి గావున అది సీతయు విని యుండుననియు కావుననే యది భయపడి నిన్నుఁ బంపగా నన్నుఁజూచుటకై శీఘ్రముగా వచ్చితివనియు శంకించుచున్నాను. అడవియందు సీత నొంటిగావిడిచి వచ్చితివి కావున అన్నివిధముల నీవు చాలఁ గష్టముగావించితివి. క్రూరు లగు రాక్షసులకు మనపై పగదీర్చుకొనుట కవకాశము లేకుండినది. ఇప్పుడు నీవు అవకాశమునుగలిగించితివే. రాక్షసులు, నేను ఖరునివధించుటచేత చాల దుఃఖితులై యున్నారు. భయంకరాకారులగు వారు, ఆదుఃఖమునుబట్టియు, అందును మాంసాహారులు గావునను, సీతను వధించియుందురు. ఇందులకు సందియము లేదు. శత్రుసూదనా! నే నన్ని విధముల నిప్పుడే వ్యసనములో మునిఁగితిని. ఏమి చేయఁగలను. ఇట్టి వ్యసనమున మునుఁగవలయునని విధి యున్నదని తలఁచుచున్నాను' అనెను.

---

* రామునకు, తానువశించుటకే కైక తన్ను వనమునకుఁబంపిన దనుఅభిప్రాయము మనస్సునం దెప్పుడు నున్నది. అది యిట్టిపారవశ్యమునందు అవశపై బయలుపడెనని తెలియునది

రాముఁడిట్లు సుందరము లగుపిఱుందులు గలసీతనే తలఁచుకొనుచు లక్ష్మణునితోఁ గూడ వేగముగా జనస్థానమునకుఁ బోయెను. ఇట్లావీరుఁడు రాముఁడు ఆర్తరూపుఁడగు తన తమ్ముని నిందించుచు, ఆఁకలివలనను బహుదూరము పోయి వచ్చిన శ్రమమువలనను,దప్పి వలనను, నిట్టూర్పులు పుచ్చుచు,నోరెండ మొగము వెలువెలఁబాఱ తనయాశ్రమము సమీపమునకుఁ బోయి యచ్చట సీతంగానక యంత నాశ్రమముం జొచ్చి యచ్చటను సీతం గానక సీత విహరించు కొన్నిస్థలంబులందును బోయి యచ్చట నున్నక్రీడాస్థానమున ఇది యిట్టిది అట్టిదని చెప్పుచు మేనుగగుర్పొడువ సీతం గానక మిక్కిలియు దుఃఖితుఁడయ్యె. ఇది యేఁబది యెనిమిదవ సర్గము.

{ *రాముఁడు సీతను గానక యామెను విడిచివచ్చినకారణమును లక్ష్మణు నడుగుట. లక్ష్మణుఁడావృత్తాంతమును జెప్పుట. }

అంత నా రఘునందనుఁడు రాముఁడు,ఆశ్రమముననుండి వచ్చి మిక్కిలి దుఃఖమునఁ దల్లడిల్లుచున్న లక్ష్మణుని దారినడుమంజూచి మరల నతనితో 'నేను నీవు గాపుగా నున్నాఁడవే; వాని యేమి' యనునమ్మికతో సీతను వనమును విడిచి పోయియుండఁగా, నీ వాపదఁతిని విడిచి యెందుకు వచ్చితివి?లక్ష్మణా! సీత నడవిలో విడిచివచ్చిన నిన్నుఁ జూడఁగానే,సీత కేమో యనిష్టము గలిగియుండు నను జంకునొంది,నామనస్సు వాస్తవముగా మిక్కిలియు వ్యథనొందినది. లక్ష్మణా! సీతను విడిచివచ్చుచున్న నిన్ను దారిలో దూరముననుండి చూచినంతనే నాయెడమకన్నును ఎడమబుజమును, నడిఱొమ్మును అదరుచున్నవి!' అనెను. ఇట్లు రాముఁడు చెప్పఁగా, శుభలక్షణుఁడా సుమిత్రాపుత్త్రుఁడు లక్ష్మణుఁడు, సీత యాడినమాటలకు పడ్డదుఃఖముతోఁ గూడ, తగనిపని చేసితివని రాముఁడన్నందులకు మఱియు దుఃఖము పయిఁకొన్నవాఁడై యన్నతో 'నేనై, సీతను అచ్చట విడిచి యిట వచ్చినవాఁడనుగాను. మిక్కిలి క్రూరములైన మాటలాడి, ఆయమయే పొమ్మని తొందరపెట్టఁగా నీయొద్ద కిచ్చటికి వచ్చితినిగాని వేఱుగాదు. 'అయ్యో సీతా! లక్ష్మణా!' అనియు 'రక్షింపుము' అనియు నీవు చెప్పినట్లే నీ యెలుఁగున నారాక్షసుఁ డఱచినవాక్యమును సీత చెవి సోఁకెను. ఆ యేడ్పుగొంతును విన్నంతనే యాసీత నీయందలి నెయ్యముచేత నీకేమో విపత్తు కలిగెనని భయమున నంగములు విరవిరఁబోవ రోదనము సేయుచు, నీయొద్దకు 'పొమ్ము పొమ్ము' అని బలవంతపెట్టెను. అట్లాయమ,మాటికి నన్నుఁబొమ్మని ప్రేరింపుచుండఁగా నేను,నీ వీర్యమెదిరింపరానిదనియు, నీకు దీనత్వముగలుగదనియును దృఢవిశ్వాసము గలవాఁడ నగుటచే, ఆబిడంజూచి 'రామునకు భయముగలిగించునంతటి రాక్షసుని నేను జూడనేలేదు. నీవు ఊఱటగా నుండుము. ఇది రాముని యఱపుగాదు; ఎవ్వఁడో యిట్లు అఱచినాఁడు. రాముఁడు, దేవతలనైనను భయము

* పూర్వసర్గమున సంగ్రహముగాఁ జెప్పఁబడినవిషయములే యీసర్గమున సవిస్తరముగాఁ జెప్పఁబడినవి.

గలిగినప్పుడు రక్షించునట్టివాఁడు. 'సీతా! రక్షింపుము' అనునీమాటమహాకులమునం బుట్టినశూరునకు నిందితంబును, అందును ఆపత్కాలమున ఆఁడుదానిం బిలుచుట చే అతినీచమును నగు.ఇట్టిది రాముఁ డెట్లు చెప్పును?కల్యాణీ! ఎవ్వఁడో యొక రాక్షసుఁడు, ఏదో యొక ప్రయోజనము నుద్దేశించి, నా యన్న కంఠస్వరమువంటి యెలుంగు గయికొని 'రక్షింపుము రక్షింపుము' అని యఱచినాఁడే కాని వేఱు కాదు. 'లక్ష్మణా! నన్ను రక్షింపుము'అని చెప్పినవాక్యమున ధ్వనిమాత్రము వేఱువిధముగా నుండినది. కాఁబట్టి యీవిశేషమును బరిశోధింపఁగా నది రామధ్వని యే కాదు. కాన నినుబోఁటి కిట్లు దుఃఖించుట తగదు; కుత్సితస్త్రీలకే యిట్లు దగును. చాలును;విలవిలఁబోవకు. నన్నుఁబంపుటకై తహతహపడక నెమ్మది నుండుము.యుద్ధమున రాముని గెలువఁజాలినట్టి పురుషుఁడు మూఁడులోకములం దెచ్చటఁగాని యిదివఱకుఁ బుట్టినది లేదు. ఇంకఁ బుట్టుటయు లేదు. దేవేంద్రుని పురస్కరించుకొని దేవతలందఱును పైనెత్తివచ్చినను యుద్ధమున రాముని జయింపఁజాలరు.''అని చెప్పితిని. ఇట్లు నేను జెప్పఁగా సీత,బుద్ధి కలంగి యుక్తాయుక్తము దెలియక కన్నీళ్లు విడుచుచు బెడిదంపుమాటల నన్నుఁ జూచి 'అన్న యెట్లో నాశము నొందినంత నన్నుఁ బొందవలయునని నీవు నా యందు మిక్కిలియు పాపపుతలంపు నుంచియున్నావు. ఊరక వట్టితలంపు నుంపవచ్చునే కాని నీవేమో నన్నుఁ బొందఁజాలవు. ఇట్లు రాముఁడు బిగ్గఱఁగా నఱచుచున్నను, అతనియొద్దకుఁ బోకున్నావే ! కావున భరతుఁడు సంకేతము చేసి పంపఁగా తెలిసి చూచి రామునిఁ జంపవలయునని యతని వెంబడి వచ్చుచున్నావు కాని వేఱు కాదు. నీవు పగవాఁడవు. కపటవేషము చేసికొని యున్నాఁడవు. నాకొఱకై రాముని వెంబడించి వచ్చుచున్నాఁడవు. కాన రామునియందు సందు వెదకుచున్నావు. ఇప్పుడది దొరికినదిగాన మునుపటివలె నతనికిఁ బోయి తోడుపడకున్నావు' అని చెప్పెను. సీత యిట్లు చెప్పఁగా నేను తొందరపడి కన్నులెఱ్ఱఁబాఱ కోపంబున పెదవులదుర, ఆశ్రమము వెడలి నిన్నెదుర్కొని వచ్చితిని'అనెను. లక్ష్మణుఁ డిట్లు చెప్పుచుండఁగా రాముఁడు వగలం బొగులుచు మైమఱచి యతనితో 'సౌమ్యా! సీతను విడిచి నీవు వచ్చుట మిక్కిలి యకృత్యము. నేను రాక్షసులను వారించుటయందు సమర్థుఁడనని నీ వెఱింగియు సీత యీ కోపవాక్యములాడినంతకు దానిని విడిచి బయలు వెడలితివే! నీవు సీతను విడిచివచ్చినందులకు నిన్నుఁ జూడ నాకు సంతోషము కలుగలేదు. స్త్రీ వివేకము లేనిది. అందును కోపమునొందినది. అది యేమో పరుషముగాఁ జెప్పితే అంతటితో దానిని విడిచి వచ్చితివే. ఇది యెంతమాత్రము యుక్తముగాదు. సీత నన్నుని ప్రేరింపఁగా యీఁడుది చెప్పినదని యోర్చుకొనవలెను. ఓర్పు లేనిచో మఱుఁగుననైన నుండి కాచుచుండవలెను; కాని యది బలవంత పెట్టినంతనే కోపము బారిం జిక్కి నా యాజ్ఞను జేయవైతివి. అన్ని విధములఁ జూచినను ఇది నీమీఁద గొప్ప యపనీతి.

ఎవ్వఁడు మృగరూపము దాల్చి వంచించి నన్నాశ్రమమునుండి దవ్వుగ తొలఁగఁదీసికొని పోయినాఁడో యా రాక్షసుఁ డిదిగో నాబాణముచేఁ ద్రెళ్లి నేలంబడియున్నాఁడు. నేను వింటియందు సలీలముగా బాణముఁగూర్చి యాకర్షించి యవలీల నేయఁగా వాఁడు దానిచేఁ గొట్టుపడి మృగదేహమును వదలి, బాహుపురులతో నొప్పుచున్న రాక్షసరూపము నొందెను.అప్పుడు నాబాణమునఁ గొటువడఁగానే యారాక్షసుఁడు ఆర్తస్వరమున నాయెలుఁగు గయికొని బహుదూరము చక్కఁగా వినవచ్చునట్లు మిక్కిలి బెడిదమయిన యామాట నఱచినాఁడు. దానిని విని నీవు సీతను దిగవిడిచి వచ్చితివి' అనెను. ఇది యేఁబది తొమ్మిదవ సర్గము.

---

## రాముఁడాశ్రమంబున సీతనుగానక దుఃఖించుట.

అట్లు రాముఁ డాశ్రమమునకు వచ్చుచుండఁగా *అతని యెడమకంటి క్రింది ఱెప్ప మిక్కిలియు నదిరినది. అతనినడ తొట్రుపడెను. దేహమునందు వడఁకును పుట్టెను. అతఁడు మాటిమాటికిని దుర్నిమిత్తము లెచ్చుగా నగపడుటంజూచి 'సీత క్షేమముగ నుండునా' యని యనుకొనెను. అంత సీతం జూడవలయునని యువ్విళ్లూరుచు మిక్కిలి వేగమున నడచి యాశ్రమమునకుఁబోయి యందు గృహమున సీత లేకయుండుటం జూచి యుల్లము మిక్కిలి పల్లటిల్లినవాఁడయ్యె. రాముఁడు వేగమున నెగురువానింబోలె నవయవము లిటునటు విదుర్చుచు,పర్ణశాలయం దచ్చటచ్చట సీత యుండునట్టిస్థానముల నన్నింటినిం గలయఁజూచెను. ఆపర్ణశాల యపుడు సీత లేకుండుటచే మంచుకాలమున సిరిమాలి దూలి యున్న తామరకొలంకువలె, రామునకుఁ జూపట్టెను. అయ్యాశ్రమమున వృక్షములందు హీనస్వరములతో తుమ్మెదలు రొదలుసేయుచుండఁగా, అది రోదనము సేయుచున్నట్లు చూపట్టుచు,సిరి పెంపుదూలి,కలఁగి నలంగి, వనదేవతలచే విడువంబడియు నుండెను. అందు సీత రావణునకుఁ దెచ్చివైచుటచే కృష్ణాజినమును దర్భలును తమ యెపుటిచోట లేక వెచినచోట చెల్లచెదరుగాఁ బడియుం 1. రావణుఁడుపట్టికొన్నప్పుడు సీత పెనఁగుచు ముని బ్రసిని, చాపను బట్టుకొనఁగా అవి తాఱుమాఱై యుండెను. ఇట్లు చిన్నవన్నెకుంది శూన్యమై యున్న తనస్థానమును జూచి రాముఁడు 'సీత భయశీలురాలు;అది యెవరిచేనైన నపహరింపఁబడినదో! మరణము నొందినదో! మఱి యాదృచ్ఛికముగాఁ గానరాకున్నదో! భక్షింపఁబడినదో! లేక యెందేని వేడుకకు మఱఁగియున్నదో! కాదేని యెవ్వరును లేకుండుటచే భయపడి గూఢముగా వనమునకే పోయియున్నదో! సీత పువ్వులనుగోయనో పండ్లను దేరనో పోయియుండునా! లేక స్నానార్థము తామరకొలనునకే పోయినదో! లేక జలము తెచ్చుటకు నదికే పోయెనో!' అని మాటిమాటికి విలపించెను. రాముం డెంతో ప్రయత్న

---

* కంటిక్రింది ఱెప్ప యదరుటయు, అడుగులు తొట్రుపడుటయు, దేహమున వడఁకుపుట్టుటయు అశుభశకునములని తెలియునది.

పడి వెదకుచున్నను నరణ్యమునం బ్రియురాలిం గానఁడయ్యె. *అతఁడు శోకమునఁ గన్ను లెఱ్ఱఁబాఱ, ఆశోకమువలన పిచ్చిగొన్నవానివలె చూపట్టెను. రాముఁ డొక చెట్టునుండి చెట్టునకు, కొండనుండి కొండకును, నదమునుండి మఱొకనదికిని, పరుగిడుచును పలవించుచును శోకం బనుకలుషసముద్రమున మునింగినవాఁడయ్యె. అట్లతఁడు ఒక్కొక్కవృక్షముకడకుం బోవుచు 'కదంబవృక్షమా! నా ప్రియురాలు సీత యనునొకానొకతిని నీవుచూచితివా? ఆచెలువకు కడిమిపువ్వులయందుఁ బ్రీతి; కనుక నీకడకు రాఁగా చూచియుండవచ్చును. మఱి దాని మొగము సొగసుగానుండును. నీ వెఱుఁగుదువేని అది యెక్కడనున్నదో నాకుఁ జెప్పుమా. బిల్వమా! నునుఁజిగు

*ఇందులకు 'శోకరక్తేక్షణశ్శోకా దున్మత్తఇవలక్ష్యతే। వృక్షాద్వృక్షంప్రధావన్ స గిరేశ్చాద్రిం నదాన్నదీం। బభూవవిలపన్ రామ శ్శోకార్ణవపరిప్లుతః' అనిమూలము. ఇచ్చట ఇవశబ్దము శ్లోకమునం దంతటను 'శోకరక్తేక్షణఇవ శోకాదున్మత్తఇవ శోకాత్ప్రపతన్నివ విలపన్నివ శోకార్ణవపరిప్లుతఇవ లక్ష్యతే' అని సంబంధింపఁజేయవలయును. రాముఁ డిట్లు వాస్తవముగా శోకాదులు గలవాఁడు కాఁడు. కావున నే సీత మొదలైనవారిం గూర్చి విలాపాదులు సేయుటయు సీతను వెదకునప్పుడు వృక్షములను మృగాదులను సీతకై యడుగుట మొదలైనవియు సర్వము రాముఁడు లోకశిక్షార్థముగా నటించినాఁడని తెలుపుకొఱకే సర్వజ్ఞుం డగువాల్మీకి 'ఉద్భ్రమన్నివ' 'ఉన్మత్తఇవ' ఇత్యాదులయందు, అచ్చటచ్చట ఇవశబ్దమును ప్రయోగించియున్నాఁడు. కావుననే శ్రీశుకులును 'రక్షోధమేన వృకవ ద్విపినే ఽసమక్షం। వైదేహరాజదుహితర్యపి యాపితాయామ్। భ్రాత్రావనే కృపణవత్ప్రియయా వియుక్తః। స్త్రీసంగినాం గతి మితి ప్రథయం శ్చచార॥ మర్త్యావతార స్త్విహ మర్త్యశిక్షణం। రక్షోవధాయైవ న కేవలం విభోః। కుతోఽన్యథా స్యా ద్రమత స్స్వ ఆత్మని సీతాకృతాని వ్యసనా నీశ్వరస్య। స వై న ఆత్మా త్మవతా మధీశ్వర స్సక్తస్త్రిలోక్యాం భగవాన్ వాసుదేవః। న స్త్రీకృతం కశ్మలమశ్నువీత న లక్ష్మణం చాపివిహాతు మిచ్ఛతి' 'రాక్షసాధముఁ డగుమారీచుఁడు రాముఁ డెదుట లేనప్పుడు అరణ్యమునందు తోఁడేలువలె సీతను తోలఁగఁదీసికొనిపోవఁగా, అంత రాముఁడు ప్రియురాలిని బాసిదీనునివలె తమ్మునితోఁగూడ 'స్త్రీసంగము గలవారిగతి యిట్లు' అని ప్రకటించువాఁడై, యరణ్యమునఁ దిరిగెను. ఆ విభుఁడు భూలోకమున మనుష్యుఁడై యవతరించుట కేవలము రాక్షసవధముకొఱకే కాదు; మనుష్యుల కాయావిషయములు గఱపుటకును నగును. అట్లు గాదేని తనయాత్మస్వరూపమునందే రమించుచుండు నీశ్వరునికి సీతవలన వ్యసనములు గలుగుటయెట్లు? ఆత్మవంతుల కెల్ల నధీశ్వరుఁడును పరమాత్మయు భగవంతుఁడునగు నా వాసుదేవుఁడు ముల్లోకములందును తగులువడ్డవాఁడుగాఁడు. కాన స్త్రీవలనఁ గలిగిన కాలుష్యమును బొందఁడు. లక్ష్మణుని విడువఁగోరినదియు లేదు' అని చెప్పియున్నారు. అట్లె స్కాందమున ఉమాసంహితయందు దేవతలతో విష్ణువు 'అహం దాశరథిర్భూత్వా హన్మిరావణ మాహవే। శ్రీమద్రామావతారే స్మిన్ స్నజ్ఞవత్క్రియతే మయా। తత్ర శంకా న కర్తవ్యా సర్వజ్ఞేనాపి మాయయా। మన్మాయామోహితం రక్షో మనుష్యం మా మవేక్ష్యతి। అన్యథా తస్య సాన్నానం నభవే ద్యత్రకుత్రచిత్' నేను దశరథునికి పుత్రుఁడనై పుట్టి రావణుని యుద్ధమునఁ జంపెదను. నేను సర్వజ్ఞుఁడనయ్యును ఈరామావతారమందు నా మాయనుగొని అజ్ఞానివలె కార్యములు చేయుదును. ఈవిషయమై సందేహపడవలసినదిలేదు. రావణుఁడు నామాయచేత మో

రాకువంటి నెమ్మేను గలిగి పచ్చపట్టువలువ గట్టినదై బిల్వఫలములవంటి పాలిండ్లు గల సీతను జూచియుందువేని, యెచ్చటనున్నదో చెప్పుము. అటుగాదేని, అర్జునవృక్షమా! నీయందు మిక్కిలి ప్రీతిగలదిగాన దానిసంగతి నీకుఁ దెలిసియుండును. కాన నీవైనం జెప్పుము. భయశీలురాలాజనకరాజపుత్త్రి బ్రతికియున్నదా లేదా? ఈ కకుభవృక్షము సీతను జూచియుండును. కావుననే చిగుళ్లతోను బువ్వులతోను బ్రకాశించుచున్నది. కనుక దీనికి తనవంటితోడలు గలసీతసంగతి స్పష్టముగాఁ దెలిసియుండును. ఈతిలకవృక్షము దాపున తుమ్మెదలగీతములతో నొప్పుచున్నది. కాఁబట్టి యిది మేటివృక్షము. అందును సీత,తిలకమునందు ప్రీతిగలది కావున దీనికి సీతసంగతి చక్కఁగాఁ దెలిసియుండును. అశోకవృక్షమా ! నీ వెప్పుడును శోకమును బోఁగొట్టుదువు. శోకమున మనస్సు పల్లటిల్లియున్న నాకు, నాప్రియురాలిం జూపి శీఘ్రము నన్నును శోకము లేనివానిగాఁ జేయుమీ. తాలవృక్షమా ! పండినతాలఫలములవంటి గుబ్బచన్నులు గలసీతను నీవు చూచియుందువేని,నాయందు నీకు దయగలపక్షమున,సుందరములగుపిఱుందులు గలయావెలంది యెచటనున్నదో చెప్పుము.జంబూవృక్షమా!నీవు సీతను జూచియుందువేనిఁ జెప్పుము. నీ జంబూఫలములవలెనె నిద్దమై నిగనిగలాడుచుండు నునుమేనుగలది, నాప్రియురాలు. ఈచిన్నెచే నీవు దానిని దెలిసియుందువేని జంకువిడిచి నాకుఁ జెప్పుము. కర్ణికారవృక్షమా! నీ విపుడు మంచిపువ్వులచే మిక్కిలియు, ఔరా! నివ్వటిల్లుచున్నావు. పతివ్రత యగునాప్రియురాలు నీ పువ్వులమీఁద మిక్కిలి మక్కువగలది. కాన నీయొద్దకు వచ్చియుండవచ్చును. దానిని జూచియుందువేని యెచ్చటనున్నదో చెప్పుము' అని చెట్టుచెట్టునకుఁ బోయి సీతనడిగెను. మహాయశుం డగునారాముఁడు మామిళ్లను, కడపచెట్లను, పెద్దమద్దిచెట్లను, పనసలను, గోరంటచెట్లను, చండ్రచెట్లను, దానిమ్మచెట్లను, వేఁగిసచెట్లను, మల్లెలను, పువ్వుగురివెందలను, సంపెఁగచెట్లను, అల్లె మొగిలిపొదరులను, గూర్చి పోయి వానింజూచి సీత నడుగుచు వనంబున నలుగడలఁ ద్రిమ్మరుచు చిత్తభ్రమము గలవానివలె చూపట్టుచుండెను. మరల రాముఁడు మృగములదెసఁ జూచి 'మృగమా! ఈవృక్షము లెంత

హితుఁడై నన్ను మనుష్యునిగాఁ జూచును. మఱియొకవిధమున వానికివచ్చటఁగాని మరణమాత్రమును గలుగదు' అని చెప్పియున్నాఁడు; మఱియు బహువిధదుఃఖప్రలాపాములు దేహాదులయందు ఆత్మబుద్ధి సేయుటవలననే కలుగుచున్నవి. అట్టిబుద్ధికిమూలము అజ్ఞానము.అట్టియజ్ఞాన మీశ్వరునికిఁ గలుగదు. మఱియు సచ్చిదానంద ఘనవిగ్రహుండును, పరమాత్ముండును, శ్రీరామరూపుఁడును,మాయాధిష్ఠాతయు నగుపరమేశ్వరుఁడు తాను జేయులీలలు వినుటవలన సర్వలోకులకును ముక్తినొసంగుకొఱకు మనుష్యరూపమున నవతరించినాఁడుగాన నట్టివానికి తనంతటఁ గాకపోయినసుభృగుశాపాదులవలనసైనను అజ్ఞానము, మిక్కిలిగాకున్నను లేశమైనను,కలుగునని చెప్పుట కలవిగాదు. కనుక శ్రీరాముఁడు ఇట్టి విలాపాదులెల్ల అజ్ఞానమువలనఁగాక లోకశిక్షార్థమే కావించినాఁడని తెలియునది. తక్కినయెడల నిట్టిపట్టులం దీరీతినే యర్థమును అనుసంధింపవలయును-మహేశ్వరతీర్థులు.



741 రాముఁడు సీతనుగానక లక్ష్మణుని 'సీత యెక్కడ' నని యడుగుట.

యొక్కచో సీతపోల్కి గలఁగలుమొదలై నవానిం జూచి యాపోలికబలిమివలన సీత యని భ్రమియించుచును, ఇంకొక [illegible] న్నవానివలె మార్గామార్గవివేకము [illegible] పరిభ్రమించుచ [illegible] ట్లు నిలుకడలేక యొకచోటను గాలూనక [illegible] యడవులను [illegible] ణ్యములను నదులను పర్వతములను, సెలయేళ్లను [illegible] మఱొకటికిఁ దిరుగుచుండెను. రాముం డట్లు మిక్కిలి వితివి హైనయా దట్టంపుమహారణ్యంబునొంది యంతటను మాటిమాటికిఁ జుట్టితిరిగి సీతంగానక సీత దొరకు ననియాశ గలుగని వాఁడై మరలఁ దనప్రియురాలిని వెదకుటకై మిక్కిలియు శ్రమము పుచ్చుకొన్నవాఁడయ్యె. ఇది యఱువదియవసర్గము.

రాముఁడు సీతనుగానక పలవించుట. లక్ష్మణుం డూఱడించుట.

దశరథకుమారుఁడు రాముఁడు సీత లేనందునఁ బాడుపడియున్న యాశ్రమమును, శూన్యమైయున్న పర్ణశాలను, చెల్లచెదరై యున్నయాసనములను జూచి యంతటను వెదకి యచ్చట సీతం గానక 'సీతా!' యని పేరుకొని బిగ్గఱగానఱచి యార్తి పట్టలేక తనచేతులు పిసికికొని 'లక్ష్మణా! సీత యెక్కడ? ఇక్కడనుండి యెచ్చటికిఁ బోయినది. లేక, లక్ష్మణా! ఎవ్వఁడపహరించినాఁడు? లేక ఎవ్వఁడు భక్షించివేసినాఁడు? సీతా! నీవు చెట్టుమఱుఁగున దాఁగి నన్ను 'నేను దాఁగియుండఁగా నీవు తెలిసి పట్టలేకపోతివి' అని నవ్వులాటఁబెట్టఁ గోరుదువేని, యింక నీ నవ్వులాట చాలును. నేను మిక్కిలి దుఃఖితుఁడై యున్నానే. నాయొద్దకు రమ్ము. సీతా! సౌమ్యురాలా! బహుకాలము లాలించుచుండుటంజేసి నీపట్ల జంకుమాలి మరిఁగియుండు నీ జింకపిల్ల లిప్పుడు నీవు లేకుండుటచేఁ గన్నుల నీళ్లుగాఱ నిన్నే చింతించుకొనుచున్నది. లక్ష్మణా! నేను సీతను విడిచి బ్రతుకఁజాలనుగదా! సీతాపహరణము వలనఁ గలిగినమహాదుఃఖమువలన నేను మృతిఁబొందఁగా నన్ను స్వర్గమున నా తండ్రి దశరథమహారాజు చూడఁగలఁడు. ఇది నిశ్చయము. పరలోకమున నాతండ్రి నన్నుఁ జూచి 'నే నాజ్ఞసేయఁగా నీవు నాయాజ్ఞచొప్పున పదునాలుగు సంవత్సరములు వనవాసము గావించెదనని ప్రతిజ్ఞసేసి యాగడువుకాలము నిండుటకుఁ బూర్వమే, యిచ్చటికి నాయొద్దికెట్లువచ్చితివి? నీవు విచ్చలవిడిగా నడచుకొను వాఁడవు. దుర్జనుఁడవు. అబద్ధ మాడువాఁడవు. ఇసీ పో' అని నిందించునే. సందేహము లేదు. సుందరములైన పిఱుందులును నన్నని కౌనునుగలిగి వెలుఁగుచుండువు గదే! సీతా! పరవశుండును, మిక్కిలి దుఃఖితుఁడును, దీనుండునై, మనోరథము భంగమొందియున్న నన్ను, కపటాచారుని కీర్తి విడుచునట్లు, విడిచిపెట్టి నీ వెచ్చటికిఁ బోవుచున్నావు. జాలింబడి నన్ను విడిచి పోకువే? నిన్ను విడిచి నిమిషమేని జీవించియుండఁజాలనే. ప్రాణములు విడిచెదను' అని రాముండు పలవించెను. రాముఁడు సీతం జూడ నువ్వి

ళ్లాడుచు మిక్కిలి దుఃఖమునఁ బల్లటిల్లుచు నింత విలపించియు సీత గానరాదయ్యె. లక్ష్మణుఁ డట్లు, వెనుబురదలోఁ బడి నవయుచున్న యేనుఁగువలె సీతంగానక దుఃఖ సముద్రంబున మున్నుంగుచున్న దశరథకుమారుని రామునిం జూచి మిక్కిలియు నతని హితముంగోరి 'మహాబాహూ! నీవు శూరుండవు. దుఃఖింపకుము, నేను సీతాదేవిని వెదకఁ బ్రయత్నించెదను. నీవును నాతోఁగూడఁ బ్రయత్నముసేయుము. ఈయడవి, గుహాలవంటి వెనుఁబొదరిండ్లు పెక్కులు గలది. కావున సీత యిం దెందేనియు నుండవచ్చును. సీత, అడవులం దిరుగుటయందు మిక్కిలి ప్రియముగలది. జలములందు క్రీడించుటకును మిక్కిలి పిచ్చిగలది. కావున, ఆయమ వనములోనికిఁ బోయియుండును. లేక చక్కఁగాఁ బుష్పించియున్న తామరకొలంకునకుఁగాని పోయి యుండును. సీత, జలకమాడుటకై, చేపలు చెరలాడ, ప్రబ్బలితీఁగ లల్లిబిల్లిగాఁ బెనఁగి యున్న నదికిఁ బోయియో, నవ్వులాటలకుఁగా వనమునం దొక్కచో డాఁగియో, యుండును. పురుషతిలకా! సీత మనల భయపెట్టఁగోరియో, లేక మన సామర్థ్యము నెఱుంగఁదలంచియో, వనమునం దొక్కచో నెందేని దాఁగియుండును. శ్రీమంతుఁడా! ఆమెను వెదకుటకు శీఘ్రముగాఁ బ్రయత్నింతము. రామా! నీ కిష్టముండునేని, సీత యుండుచోటు దెలియుటకై యీవనమంతయు వెదకుదము. మనమున దుఃఖ ముంచుకొనకుము' అనెను. రాముఁడు స్నేహమున లక్ష్మణుఁడు చెప్పినమాటల విని, మనస్సున సమాధానము నొంది లక్ష్మణునితోఁగూడ సీతను వెదక నారంభించెను. దశరథకుమారు లారామలక్ష్మణులు అరణ్యములను, పర్వతములను, నదులను, గొలఁకులును అంతటను సీతను వెదకిరి. ఆ రామ లక్ష్మణులు ఆ ప్రస్రవణ పర్వతమందలి సానువులను గుహాలను శిఖరములను అంతటను ఎంత వెదకినను సీత కనఁబడినదిగాదు. రాముఁ డాప్రస్రవణపర్వతము నంతయు వెదకి లక్ష్మణుం జూచి 'లక్ష్మణా! ఈ ప్రస్రవణపర్వతమునందు కల్యాణి యగుసీత కనఁబడినదికాదు' అనెను. అంత దండకారణ్యమున సీతను వెదకుచు లక్ష్మణుఁడు పరమదుఃఖితుండై మహాతేజుం డగురామునిం జూచి 'మహాప్రాజ్ఞా! మహాబాహుం డగువిష్ణువు బలిచక్రవర్తిని బంధించి యీ భూమిం బొందినట్లు నీవు నిస్సందేహముగా సీత నపహరించినవానిని శిక్షించి యీ జనకమహారాజపుత్రిని బొందఁగలవు' అనెను. రాముఁడు, లక్ష్మణుండు నెయ్యము దొలఁక చెప్పిన పలుకులు విని, దుఃఖమున నుల్లము తల్లడిల్ల, లక్ష్మణునిం జూచి, దన వాక్యంబుల'మహాప్రాజ్ఞా! ఈయడవి యంతటను, తామరలు వికసించియున్న తమ్మి కొలంకులను, పెక్కు గుహాలును సెలయేళ్లును గల యీ ప్రస్రవణ పర్వతంబునను, చక్కఁగా వెదకితిమి. నాకుఁ బ్రాణములకంటె నెక్కుడయినసీత యింకను నగపడకున్నది గదే' అనెను. రాముఁడు సీత యపహృత యగుటం జేసి మిక్కిలియు నలఁగి, దీనుండును దుఃఖితుండు నై, యిట్లు విలపించుచు దుఃఖాతిశయంబున మూర్ఛితుండయ్యెను. రాముఁడు సంతాపము నొంది, అవయవ

ములు కృశింప, సంజ్ఞ తప్పి, చేష్టలుడిగి యాతురుఁడై దుఃఖమునఁ బొక్కుచు వేఁడి నిట్టూర్పులు పుచ్చుచు, ఏమియుఁ జేయఁజాలక కూర్చుండెను. కమలముల వంటి కన్నులు గలరాముఁడు అట్లు బిట్టుగా నిట్టూర్పులు నిగిడించుచు, కంఠమున మిక్కిలి యుడగ్గుత్తికగదుర 'అయ్యో! ప్రియురాలా!' యని పేర్కొని పిలిచి బిగ్గఱగా నేడ్చెను. అంత బంధుప్రియుండును ధర్మజ్ఞుండు నగులక్ష్మణుఁడు, చేమోడ్పు గీలించి నానావిధంబుల సవినయముగా, ఆరాముని మంచిమాటలతో నూఱడించెను. ఆ రాముఁడు, లక్ష్మణుఁడు చెప్పెడునాశ్వాసవచనములను ఎంతమాత్రము సరకు సేయక ప్రియురా లగుసీతం జూడరాకున్నందున మాటి మాటికి రోదనము సేయుచుండెను. ఇది అఱువది యొకటవ సర్గము.

## రామునివిలాపము.

* నిడుదబుజములును తామరరేకులవంటికన్నులును గలయామహాబాహుఁడు రాముఁడు సీతంగానక యా విరహముచే యెఱుక తప్పి యిట్లు మిక్కిలియు విలపించెను. రాముఁడు, సీత యెదుట లేకుండుటవలన, ఆచెలువను జూడకున్నను, మన్మథుని బారింబడి పరవశుఁడై, సీతను కట్టెదుటఁ జూచుచున్నవానివలెనే, విలాపముచే డగ్గుత్తిక గలిగి పలుకు లుచ్చరింప నలవి గాకుండఁగా 'ప్రియురాలా! నీవు పువ్వులయందు మిక్కిలి ప్రీతిగలదానవు గావున † పువ్వులు పూచి బంగరువన్నెగులుకుచున్నయశోకపురెమ్మలచే నీదేహమును, నాదుఃఖమును పయి బయిఁబెంచుచుఁ, గప్పికొనుచున్నావు. నిన్నుఁ జూచియైనదే. ఈ కప్పుకొను టేల? ‡ దేవీ! నీతొడలు అరఁటిబోదియలతో సాటిగానుండును గాన నరఁటిచెట్టుచే మాటుచేసినను ఆ రెండును నాకుఁ గనఁబడుచునున్నవి. నీవు చక్కఁగా మఱుఁగుఁజేసికొననేరవు. దేవీ! కల్యాణీ! నీవు నవ్వులాటకై కొండగోఁగులతోఁపులోఁ దిరుగుచున్నావు. నీనవ్వులాట

---

*ఇందులకు 'సీతా మపశ్యన్ ధర్మాత్మా కామోపహతచేతనః। విలలాప మహాబాహూ రామః కమలలోచనః' అనిమూలము. ఇట (ధర్మాత్మా)(కామోపహతచేతనః) అని రెండును జెప్పుటచే ధర్మమునకు విరుద్ధముకాని కామము అనింద్యమని చెప్పఁబడినది. (మహాబాహుః)చేతు లెత్తికొనుట సూచితము. (కమలలోచనః) అను పూఁదెసెతొయుగు తామరలతోడి సామ్యముచే కన్నులు కన్నీళ్లచే కలఁకఁబాఱియుండుట తెలియునవి.

† పూచియున్న యశోకపుకొమ్మలు బంగారుచాయగలిగి యుండునుగాన బంగారుచాయగలసీతదేహమువలె కనుపట్టఁగా రాముఁడు వానిని సీతదేహముగాఁదలఁచి 'సీతా! నీవశోకపుకొమ్మలతో మాటుచేసికొన్నను నాకుఁ గనఁబడితివి. కాన యిఁక మాటుచేసికొననేల' యని చెప్పెనని తెలియునది.

‡ తొడలు అరఁటిబోదెలవలెనుండునుగాన అరఁటిబోదియలను చూచి సీతతొడలుగా శేభ్రమించి 'సీతా నీ వరఁటి బోదెమఱుఁగున దాఁగినను నీతొడలు నాకుఁగనఁబడుచున్నవి గావున నీవు చక్కఁగా దాఁగుటకు తెలియనిదానవు' అని చెప్పినట్లు తెలియునది.

వలన నాకు మిక్కిలి బాధ గలుగుచున్నదే. ఇట్టి నవ్వులాట యెందులకే? ఇఁకఁ జాలుఁ జాలు. సీతా! ప్రియురాలవుగదే. నన్నిగతాళి సేయుటవలన నీకేమి ప్రయోజనము. మునుపు నాకీపరిహాసము ఇంపుగానే యుండినను ఇపుడు మిక్కిలి బడలియున్నాను. కావున నది నాకెంతయు నింపుగాకున్నది. ప్రియురాలా! పరిహాసము విశేషించి యాశ్రమములందు మంచిదిగాదు. పరిహాసమునందే నీకు ప్రీతియని నీ స్వభావము నాకుఁ జక్కఁగాఁ దెలియుచున్నది. విశాలాక్షీ! ఇంక నీవు రమ్మా! నీవు లేకుండు టచే నీపర్ణశాల పాడుపడి యున్నదే! లక్ష్మణా! రాక్షసులు సీతనుబట్టి భక్షించియై నను౦దురు; లేక యపహరించుకొని పోయి యైన నందురు. ఇది స్పష్టము. కాదేని నే నెంత పలవించినను, అది నాయొద్దకురాక నన్నుపేక్షించియున్నదే. ఇట్లుండునా? లక్ష్మణా! ఈమృగములకదుపులు కన్నీళ్లుఁ గార్చుచుండుటఁ జూడఁగా సీత రాక్షసులచే భక్షింపఁబడినదని చెప్పునట్లు చూపట్టుచున్నది. అయ్యో! నా ప్రియురాలా! లోకమునకెల్లఁ బూజ్యురాలా! ఓ పతివ్రతామణీ! వరవర్ణినీ! ఎక్కఁడికిఁ బోయితివే! అయ్యో! నీ విట్లు నశించుటచే కైకేయీదేవి కోర్కె యీడేఱినదయ్యెనే. సీతతోఁగూడ వెడలివచ్చి యిఁక సీతి లేకయే యూరికిఁబోయి పాడుపడియుండు నంతఃపురమును మఱల నెట్లని యడుగు పెట్టుదును? లోకు లింక నన్ను వీర్యహీనుఁడనియు దయాశూన్యుఁడనియుఁ జెప్పదురే. సీత దొంగిలఁబడి పోవఁగా నేను ప్రాణములు పెట్టుకొని యుండనోపను గాన నాయధైర్యము బట్టబయలగును గదా? సీత అపహరింపఁబడి పోవుటచే నాపిఱికితనము వెల్లడియైనదిగదా! నేను వనవాసము ముగించి మరలి యూరుచేరఁగానే మిథిలాధిపతి జనకుఁడు వచ్చి నన్ను క్షేమ మడుగునపుడు, అతని మొగ మెట్లు చూతును? జనకమహారాజు సీతి లేక నేనుమాత్రము వచ్చియుండుటను జూచి కూఁతునందలి గారాబముచే పురపురఁ బొక్కుచు మూర్ఛనొందును. ఇది నిజము. లేక అయోధ్యకు, అది భరతుని పాలనమువలన సమస్తపదార్థములు సమృద్ధముగాఁ గలిగియున్నదయినను, నేను పోవను. వేయేల! సీత లేనియెడల, స్వర్గము కూడ నాకుఁ బాడుపడియున్నట్లే యుండును. లక్ష్మణా! నీవు నన్నిచట నడవిలోనే విడిచిపెట్టి శుభమైన యయోధ్యాపురమునకుఁ బొమ్ము. నేను సీతనువిడిచి యేవిధమునఁగాని యెంతమాత్రమును జీవింపలేను. నీవు పోయి భరతుని బిగ్గఁ గౌఁగిలించుకొని వానితో 'రాముఁడు నీకనుజ్ఞ యిచ్చినాఁడు. యథేచ్ఛముగా భూమిని పాలింపుము' అని నేను జెప్పినట్లు చెప్పవలయును. మాతల్లిగారు కైకేయికిని, సుమిత్రకును, కౌసల్యకును, నీవు నే నానతిచ్చినట్లు న్యాయముచొప్పున నమస్కరింపవలయును. అందులకు నీవు సమర్థుఁడవే కదా. నీవు చెప్పినట్లు చేయువాఁడవు. కావున నాతల్లి కౌసల్యను, పాటుపడి రక్షించుచుండవలయును. పగవారిని మ్రుక్కించు లక్ష్మణా! ఇట్లు సీత వినాశము పొందుటను, నేనును నశించుటను, సవిస్తరముగ నాతల్లి కౌసల్యకుఁ జెప్పవలయును" అని విలపించెను. ఇట్లు రాముఁడు నెఱికురులు ముడువుచూపుసీతను

వనంబున వెదకి, యందుఁ గానకపోవఁగా మిక్కిలియుదీనుఁడై పలవించుచుండఁగా లక్ష్మణుఁడును భయమున మొగము వెలువెలం బోవ, ఉల్లము మిక్కిలియు పల్లటిల్ల మేనెల్ల మిగుల పురపురఁబొక్కుచు నున్నవాఁడయ్యె. ఇది యఱువదిరెండవసర్గము.

రామునివిలాపము.

రాజకుమారుఁ డా రాముఁడు ప్రియురాలిని బాసి, యా చెలువను దలంచుకొనుటచే మోహామును, ఎడఁబాసినందున దుఃఖమును మిక్కిలియు దన్నుఁ బీడించుచుండఁగా, తమ్మునికి మీఁదు మిక్కిలి విషాదముఁ బుట్టించుచు, ఒడలు తుందుడుకువడ, మరల మునుపటికంటెను వేంద్రమగువిషాదమును బొందినవాఁడయ్యె. లక్ష్మణుఁడు శోకముబారికిం జిక్కి స్రుక్కుచుండుటం జూచి, రామునికి సీతనుబాసిన శోకము మిక్కిలి విపులముకాఁగా, అతఁడు దాని యందు మునింగి, వ్యసనము ప్రసక్తించినపుడు లోకులు గావించునట్లు, వేఁడి నిట్టూర్పులు నిగిడించుచు రోదనముసేయుచు దుఃఖయుక్తం బగువాక్యంబున నాలక్ష్మణునిం జూచి 'నావలె పాపకార్యములు చేసినవాఁడు, నేను దప్ప మఱి యొకఁడు భూలోకములో లేఁడని తలఁచెదను. ఏలనఁగా, పరంపరగా దుఃఖమువెంట దుఃఖము నా మనస్సును గుండెకాయను భేదించుచు నాకు సంభవించుచున్నదే! ఇట్లెవరికిఁ గలుగును? నేను పూర్వజన్మమున కావలయునని కోరి పెక్కు పాపములు పలుమాఱు చేసియున్నాను,ఇదినిజము.దుఃఖముపై దుఃఖమును బడుచున్నానే, ఇది యా పాపముల ఫలమే; ఇప్పుడు నాకుఁ గుడువ వచ్చినది. ఔను, దుఃఖముపై దుఃఖమే! లక్ష్మణా! రాజ్యముపోవుట, బంధువులను బాయుట, తండ్రిని దారపోసికొనుట, తల్లిని విడిచి వచ్చుట, ఇవన్నియును, ఒక్కొక్కటిని తలంచు కొనఁగా, నా దుఃఖరాశిని నిండించుచున్నది లక్ష్మణా ! నేను జనశూన్యమైనయీయరణ్యమునకు వచ్చిచేరి సీత మొగము చూచుచుండుటచేతను, ఇచ్చటఁ గలదేహప్రయాసముచేతను, ఈ దుఃఖమునంతయు మఱచి యుంటిని. ఇప్పుడు సీత నెడఁబాసినంతనే, కట్టెలనుండి నిప్పు తటాలున ప్రజ్వలించినట్లు, ఆ దుఃఖమంతయు మరల పయికి రేఁగినది. లోకపూజ్యురాలగు నా ప్రియురాలు భయశీలురాలు. రాక్షసుఁడు బలాత్కారమున నపహరించుకొని యాకాశమునకుఁ గొనిపోవఁగా, మిక్కిలి బిగ్గఱగా పలవించుచు భయమున తన తీయనియెలుఁగు మాలి వికృతస్వరమున మిక్కుటముగా రోదనముచేసి యుండును. ఇదినిశ్చయము. కన్నుల విందులుసేయుచు మిక్కిలి మేలయిన మెట్టనిచందనమునకు నెల్లపుడుఁ దగినవై, వటువులై, యొప్పునా ప్రియురాలి గుబ్బచన్ను లిపుడు, రాక్షసుఁడు భక్షించుటకై త్రుంపఁగా నెత్తుటిరొంపిం దోఁగి నలువు చూపకుండును.ఇది నిశ్చయము. మునుపు తీయనై తేట నీటుగులుకు మెత్తని ముద్దుఁబలుకులును నెరుఁబుగొన్న దట్టంపుకురులును గలిగి వెలుగుచుండు దాని

నె మ్మొగము, ఇప్పుడు రాక్షసునిచేతికిం జిక్కిన దగుటచే, రాహువు వాతనున్న చందురుని వలె నెంతమాత్రము ప్రకాశింపకుండును. ఇది నిశ్చయము. నన్నుఁ దప్ప మఱియొక్కని ముట్టుటకుఁ గోరని యాపతివ్రతామణి యా ప్రియురాలి కంఠము ఎప్పుడును హారముచే నలంకృతమై యుండఁదగినది. అట్టి కంఠమును రాక్షసులు శూన్యమైన యరణ్యమున ఎవ్వరును దిక్కులేనందున, తప్పక విఱిచి నెత్తురులు త్రావియుందురే! నిర్జనమైన యరణ్యమున,సీత,నేను లేకున్నందున రాక్షసులు తన్నుఁ దొంగిలి యీడ్చుకొని పోవుచుండగా, దుఃఖితయై తళతళలాడుకన్నులు మిక్కిలియు విచ్చి నేను వచ్చుమార్గమును జూచుచు క్రౌంచపిట్టవలెఁ బెరెలుంగున విలపించి యుండును.* లక్ష్మణా ! గొప్పస్వభావము గలదై చిఱునవ్వు మురువు గులుకుచుండు నాసీత, యీ నిర్జనప్రదేశమున మున్ను ఈ ఱాతిబండమీఁద నాతోఁగూడఁ దాపునఁ గూర్చుండి నవ్వులు మొలకొత్తి నన్నుఁ జూచి పెక్కుమాటలఁ జెప్పుచుండెను. నదులలో

*ఇందులకు 'అస్మిన్మయాసార్ధముదారశీలా | శిలాతలేపూర్వముపోపవిష్టా | కాంతస్మితాలక్ష్మణ జాతహాసా | త్వామాహ సీతా బహువాక్యజాతమ్' అనిమూలము. విశేషార్థము:— రాముఁడు పూర్వము గోదావరియందు సీతతోడ సరసలీలావిహారములు సల్పినప్రదేశమునకుఁబోయి దానిని జూచునపు డావిహారములు తలంపునకురాఁగా లక్ష్మణునిఁజూచి చెప్పుచున్నాఁడు. (అస్మిన్) ఇట్లు శూన్యముగానున్న యీప్రదేశమునందేకదా పూర్వము నాకొక లిబ్బిదొరకెను. (మయాసార్ధం) ప్రణయపుచిన్నెలు ఎడతెగకపచరించుటయందు నన్నుఁ బండితునిగాఁ దలంచుకొనియుంటిని. అట్టినేను, ఆసీత మిక్కిలి జాణతనముతోఁ గావించునట్టి వ్యవహారములందు అప్రధానుఁడనైపోయితిని, (ఉదారశీలా) పూర్వము పట్టణమందుండునపుడు అత్తమామలు మొదలగువారిసన్నిధానమగుటచే సీత విహారములను సంకుచితము చేసి యుండినది. కాన,యపుడు సీతకు, 'సీతయా సార్ధం విజహారబహూనృతూన్' అనుచో 'సీతయా సార్ధమ్' 'సీతతోడ' అని తృతీయచే అప్రాధాన్యమును రామునికి ప్రథమచే ప్రాధాన్యమును చెప్పఁబడినది. ఇప్పుడు రాముఁడు అప్రధానుఁడగుటచే (మయాసార్ధం) 'నాతోడ' అని తనకు తృతీయచే అప్రాధాన్యమును సీతకు ప్రాధాన్యమును చెప్పినాఁడు. ఇప్పుడు ఏకాంతస్థలమగుటచే సరసభోగములందు సర్వస్వమును దానొసంగినదయ్యెను. (శిలాతలే పూర్వ ముపోపవిష్టా) గోదావరీజలములందు చాలసేపు జలక్రీడజరుగఁగా రాముఁడు బడలి దానినుండి వెడలుటకు మఱియొకచోటు పొసఁగనందున ఒకానొక ఱాతిపట్టుమార్గముగా బయలువెడలుటకు దానిపైఁ దృష్టినిలిపెను. సీత పెనిమిటిదృష్టియొక్క యభిప్రాయమును దెలిసికొని యతనిని మరల నలయించుటకు నాఱాతిని తానే ముందుగా నెక్కినదై (ఉపోపవిష్టా) ఇట, ఉప+ఉప అని వీప్సచే, అందు రాముఁ డేయేమూలలనుబట్టుకొని యెక్కఁగోరెనో ఆయామూలలను దానాక్రమించుకొని మొగమునసీళ్లు చల్లుచునున్నది, (కాంతస్మితా) సహజముగామధురమైన చిఱునవ్వుగలది. (జాతహాసా) తాను గెలుచుట వలనియుబ్బుచేఁ బుట్టినట్టి నవ్వుగలది. స్మితమనఁగా నిశ్శబ్దమైననవ్వనకును హాసమనఁగా కొంచముశబ్దముతోఁ గూడిన నవ్వనకుఁబేరు. (త్వాం) నిన్ను-ఇంతకుమునుపు రాముఁడెచ్చటను పరాజయము పడకుండుటవలన ఇప్పుడు స్త్రీవలన క్రొత్తగా నపజయముకలిగినందులకు సిగ్గున మోముమాంచియుండఁగా, ఆరామునిని విడిచినదై,యున్నను పలువిధములపొగడుచున్న లక్ష్మణునిఁజూచి, (బహువాక్యజాతం) అనేక ముఖములైనమాటలు—అనఁగా 'మీరిద్దఱు తలఁచుకొన్న దానినెల్ల నిర్వహించినట్టివారు; మీరిరువురును,

మిన్నయగుగోదావరియెడల నా ప్రియురాలి కెప్పుడును మిక్కిలి ప్రీతి. ఒకవేళ నచ్చటికిఁ బోయియుండునా అని తలంచెదను. పోయి యుండదు. నన్ను విడిచి యాపడఁతి యెప్పుడుగాని యొంటిగాఁ బోయినది లేదు. కాన యట్లు తలఁప రాదు. కమలమువంటిమొగమును తామరరేకులవంటి వాలుఁగన్నులు వన్నెగలుకు నా చిన్నెలాఁడి యొకవేళ తామరలు గోసి తెచ్చుటకై పోయినదో యేమో! ఆ! అట్లనుట సరికాదు. అది యెప్పుడుగాని నన్నువిడిచి తామరలు గోయుటకుఁబోవునదే కాదు. ఈవనమునందు వృక్షసమూహములు మిక్కిలియుఁ బుష్పించియున్నవి. పలువిధములైనపక్షులు గుంపులుగొని యిందు విలసిల్లుచున్నవి. ఇంతరమణీయముగా నుండుటచే ఈవనమున కేమైనను బోయెనా? అట్లు చెప్పుటయు యుక్తముకాదు. అది పిఱికి. ఒంటిగా నుండుటకు మిక్కిలియు భయపడును. ఓసూర్యుఁడా! నీవు లోకమున నేమిజరుగుచున్నవో యేమి జరుగఁగలదో యవన్నియుఁ దెలిసినవాఁడవు; లోకులాచరించు పుణ్యపాపకర్మములకు సాక్షివి. నా ప్రియురాలు ఎక్కడికిఁ బోయెను? ఎవరైన నపహరించికొనిపోయిరా? ఎప్పుడును దుఃఖమే నాపాలు. ఇట్టి నాకింత మాత్రము చెప్పుము. వాయూ! సమస్తలోకంబులందును నీకు నిత్యమును దెలియని దేదియు నెప్పుడును లేదు. సత్కులప్రసూత యగునాయిల్లాలిసంగతిని జెప్పుము. ఎవరేని దాని నపహరించుకొని పోయిరా? లేక తాను మృతిఁబొందినదా? మ ఊదారిలోనైనను,ఉన్నదా?' అని యడుగుచు రాముఁడు విలపించెను. ఇట్లు విలపించుచు,శోకపరవశుఁడై సంజ్ఞతప్పి యున్నరామునిఁజూచి లక్ష్మణుఁడు ధైర్యము గుందనివాఁడుగావున న్యాయమునూని యప్పటి కుచితము లగువాక్యముల 'ఆర్యా! శోకము ). ధైర్యమును దెచ్చుకొనుము. సీతను వెదకుటకై యుత్సాహము గయికొనుము. లోకమునం దుత్సాహముగలవారు మిక్కిలి దుష్కరములైనకార్యములందును వెంపు దూలరుగదా? అనెను. ఇట్లు మహాపరాక్రముఁ డగులక్ష్మణుఁ డెంత యూఅట చెప్పుచున్నను, రఘువంశవర్ధనుఁ డారాముఁడు ఆర్తుఁడై యామాటలను బాటింపక, యున్నధైర్యమునుగూడ దిగవిడచి*మరలను మహాదుఃఖముపాలు పడినవాఁడయ్యెను. ఇది యఱువది మూడవసర్గము.

---

అతిబలపరాక్రమశాలు రగుపురుషధౌరేయులరు. మేము అబలలము.మీరు వేఁటకనియు శత్రులవధించుటకనియు బయలువెడలిపోవువారలు. మేము ఇంటవాకిటదాఁటి పోవము. మీరిద్దఱికి తలఁచుకొన్నదెల్ల చేసి తీర్పశక్తిగలదు. ఇట్టి మీయిద్దఱిలో నీయన్న గెలువఁబడెనుగా' అని యిట్టి పలువిధములైన మాటలను. (ఆహా) చెప్పినది. తనిశ్లోకి.

* రాముఁడిట్లు శోకపడుటయెల్ల, రావణుఁడు చారులమూలముగా విని తన్ను మనుష్యుఁడేయు దృఢముగా నమ్మి దానిచే తనకు వధ్యుఁ డగువట్లు గావించుటకే యని తెలియునది.ఇదియే బ్రహ్మాండపురాణమున ' స్త్రీ పుమ్సలానుషంగాత్తు దేహోనాస్య విజాయతే। కింతు నిర్దోషచైతన్యం సుఖనిత్యం స్వకాం

దారియందుఁ గనఁబడినచిహ్నవిశేషములచేత సీత యపహరింపఁబడినదని నిశ్చయించుట.

రాముఁడు దీనుఁడై దీనవాక్యమున లక్ష్మణుం జూచి 'లక్ష్మణా! సీత తామరలుగోయుటకై గోదావరినది కేమైనఁ బోయియుండునో. నీవు శీఘ్రమున గోదావరికిం బోయి తెలిసికొనిరమ్ము' అనెను. శత్రువీరుల నుఱుమాడులక్ష్మణుఁడు, రాముఁడిట్లు చెప్పఁగానే, అడుగులు చుఱ్ఱుకా వడిగా నిడుచు రమణీయమైనగోదావరీనదికిఁ బోయెను. లక్ష్మణుం డా నదిలో రేవులనంతటను సీతనువెదకి రామునియొద్దకు వచ్చి, గోదావరి రేవులం దెచ్చటను నాకు సీత కనఁబడలేదు. నేనెంత పిలిచినను నామెకు వినఁబడినదిగాదు. సీత, దుఃఖములనెల్లఁ దూలించునట్టిసీత, యెచ్చటికిఁబోయినదో!

లక్ష్మణుఁడు చెప్పినది విని రాముఁడు దీనుఁడై సంతాపమున యుక్తాయుక్తములు దెలియక తానే గోదావరినదికిఁ బోయెను. రాముఁడట్లానదికడకుఁబోయి 'సీత యెక్క

తనుం । ప్రకాశయతి నైవేయం జనిర్విష్ణోర్నచాపరా । తథాప్యసురమోహార్థం పరేషాం క్వచిత్క్వచిత్ । దుఃఖాజ్ఞానశ్రమాదీంశ్చ దర్శయేచ్ఛుద్ధసద్గుణః । క్వ ప్రణాది క్వచాజ్ఞానం స్వతంత్రాచింత్యసద్గుణే । మోక్షాభావాయ తేషాంతు దర్శయత్యానజోహరిః॥ 'స్త్రీపురుషమలసంబంధమయమైనదేహము భగవంతునికిఁగలుగదు. అయితే విష్ణుదేవుని మఱియవతారమును గాక యీయవతారమే, దోషరహితమైన చైతన్యమే స్వరూపముగాఁ గలిగి నిత్యసుఖాత్మకమైయున్న నిజశరీరమును ప్రకాశింపఁజేయుచున్నది. అయినను, అసురులను, ఒక్కొక్కచోట నితరులను, మోహింపఁజేయుటకై దుఃఖము అజ్ఞానము శ్రమము మొదలైనవానిని, శుద్ధసత్త్వగుణుఁడైనభగవంతుఁడు చూపించును. కాని స్వతంత్రుఁడై అచింత్యుఁడైనట్టి సత్త్వగుణుఁడగు భగవంతునియందు గాయములు మొదలైనవి యెక్కడివి? అజ్ఞానమెక్కడిది? జన్మరహితుఁడైనవాని ఆరాతిసాదులకు మోక్షములేకుండుటకై వానినెల్లఁజూపెడిని. ఇంతేకాని'అనియున్నది. దీనిచేత రావణునికి రామునియందు ఈశ్వరుఁడను బుద్ధి కలుగకుండునట్లుచేసి దానిచే వానికి మోక్షములేకుండునట్లుగావించుటయే రాముఁడుశోకించినందులకు ఫలమని చెప్పఁబడినది. ఇట్లే రావణునిమూలముగా సీతాపహరణము కలిగించుటయు వాని పుణ్యాతిశయమును నశింపఁజేసి తనకు వధింప నర్హుఁడైనవానినిగాఁ జేసికొనుటకే. ఇట్లనియే కేదారఖండమున 'మహతా తపసా లబ్ధబలో రావణ స్తదధిక తపోబలం వినా జేతు మశక్యో దేవాశ్చ స్వయం తదధిక తపం కర్తుమక్షమా అతి స్తేషాం కార్య మత్యంతానుచితసీతానురాగ మోహానువృత్తి సంపాదనేన రావణస్య తపోవీర్యభ్రంశం సంపాద్యకర్తవ్యమితి లక్ష్మ్యా సహవిచార్య తదర్థం విష్ణుస్సీతయా బ్రహ్మవిద్యయాసహావతీర్ణః' 'రావణుఁడుమహాతపస్సుచేసి బలము బొందినవాఁడుగావున వానికంటె నెక్కువ తపోబలములేక వానిని జయింపశక్యముగాదు. దేవతలును తమంతట వానికంటె నెక్కువతపమును చేయ శక్తులుగారు. కాఁబట్టి విష్ణువు, రావణునికి సీతయందనురాగమును మిక్కిలి యనుచితమైనదానిని బుట్టించి దానిచే వాఁడు మోహితుఁడై యామోహమును అనువర్తించునట్లు చేసి, దీనిచే వాని తపోవీర్యమును దూలించి దేవతలకార్యము తీర్పవలయునని లక్ష్మితోఁగూడ నాలోచించి యందులకై సీతతోడను బ్రహ్మవిద్యతోడను గూడి అవతరించినాఁ'డని యున్నది- మహేశ్వరతీర్థులు.

డ? నని యడిగెను 'వధ్యుఁడగు రాక్షసప్రభుఁడు రావణుఁడు సీత నపహరించినాఁ'డని రామునకు మున్ను వనంబునందలి సత్వము లొక్కటియుఁ జెప్పినవికావు. అట్లే యిప్పుడు గోదావరీనదియుఁ జెప్పదయ్యె. రాముఁడు దుఃఖించుచు నట్లడుగఁగా, ఆ నది, తానై చెప్పకుండుటయేకాక యంత సమస్త భూతములును మాకుఁగా నీవు రామునకతనిప్రియురాలివార్తం జెప్పుమని ప్రేరించినను సీతావృత్తాంతము నెంతమాత్రమును జెప్పకపోయెను. ఆ నది దురాత్ముఁడగు రావణుని భయంకరరూపమును వాని బెడిదంపుకార్యములను తలఁచుకొని భయపడుటంజేసి, రామునకు సీత పోకడ చెప్పదయ్యె. రాముఁడు సీతం జూడకుండుటచే మిక్కిలియు స్రుక్కుచు, గోదావరి బదులేమియుఁ జెప్పక సీతను జూడవచ్చు నను విషయమున నాశ పోఁగొట్టఁగా, లక్ష్మణునిఁజూచి, 'సౌమ్యా! ఈ గోదావరి యెంతమాత్రమును అడిగినందులకు బదులు సెప్పకున్నది. నేను సీతలేక, జనకమహారాజు నొద్దకును, మనతల్లి కౌసల్యయొద్దకును, బోయి, సీతంగూర్చి వారి కప్రియమును ఏమని చెప్పుదును. నేను రాజ్యమును బోఁగొట్టుకొని యడవియందు ఆకు లలుము లేరి యుబుసుపుచ్చుచు, మిక్కిలి దుఃఖపడుచున్నను, సీత నా శోకమునంతయుఁ దూలఁబుచ్చునే. అట్టి సీత యెక్కడికిఁ బోయినది? సహాయు లగు బంధువులను బాసితిని. వారు లేకున్నను సీతయేని తోడ నున్నదిగదా యనుకొన్నచో ఆ రాచకుమారిని గానకైతిని. ఇఁక నింటికి నిదురపట్టకున్న నాకు ఒక్కొక్కరాత్రి యొకయుగముగా నుండునని తలఁచెదను. ఇప్పుడు సీత యగపడునేని, నేను దానింగూడి, గోదావరినదీతీరములను, జనస్థానమునను, ఈ ప్రస్రవణ పర్వతమునను, వీనియందెల్లను విహరింతునే. మహావీర్యా! ఈ మృగములు మాటిమాటికి నన్నుఁ జూచుచున్నవి. ఇవి నాకు సీతసంగతి చెప్పవలయునని యున్నట్లు, వీని యింగితములవలనఁ దెలియవచ్చుచున్నది' అని చెప్పి యంత పురుషతిలకుఁడా రాముఁడు వానిపై జూడఁగానే కన్నీళ్లు గ్రమ్మిన చూడ్కులు నిగిడించుచు, 'సీత యెక్కడ' నని యడిగెను. రాముఁ డట్లడుగఁగానే యామృగములన్నియు తోడనే లేచి దక్షిణాభిముఖము లయి, యన్నియు నాకాశతలమును జూచుచు, నాసీత యపహృతయై యేమార్గంబునం బోయినదో యామార్గమును బట్టి పరుగెత్తుచు రామునిఁ జూచుచుండినవి. ఆ మృగములు ఆకాశమార్గమును దక్షిణపు భూమియుఁ జూచుచు మరల నాదక్షిణమార్గముననే పోవుటకుం గోరుచుండుటఁ జూచి వానిచేష్టల యభిప్రాయమును లక్ష్మణుఁడు దెలిసికొనెను. లక్ష్మణుఁడు బుద్ధిమంతుఁడుగావున, ఆ మృగములు గావించినచేష్టలు, అవి చెప్పవలసిన మాటలన్నియుఁ జెప్పినట్లుంబోలె నుండఁగా, ఆచేష్టలవలన మాటలవలనంబోలె నభిప్రాయము దా నూహించి, మిక్కిలి యార్తితో అన్నను జూచి 'దేవరా! నీవు సీత యెక్కడ నని యడుగఁగానే యీ మృగములు వేగమున లేచి దక్షిణపుదిక్కును భూమినిని జూపుచున్నవి. కావున మనము దక్షిణ పశ్చిమముగా రాక్షసులుండు నైరృతి దిక్కుంబట్టియే చక్కంబోవుదము.

ఒకవేళ సీతను గనుఁగొనునుపాయ మదేని దొరకవచ్చును. కాదేని పూజ్యురాలగు నా సీతయే దొరకినను దొరకవచ్చును' అనెను. శ్రీమంతుఁడా రాముఁడు వల్లెయని, లక్ష్మణుఁడుతోడ వెంబడింప, తలవంచి నేలంజూచుచు దక్షిణదిక్కుంబట్టి పోయెను. ఆ యన్నదమ్ములిట్లొండొరులతో మాటలాడుకొనుచుఁ బోయి మార్గమున భూమిపై పువ్వులు రాలియుండుటం జూచిరి. వీరుఁడా రాముఁడు నేలపైని వానవలె పయినుండి దొరిఁగియున్న యాపువ్వులంజూచి దుఃఖితుఁడై, తనవలె దుఃఖమొందియున్న లక్ష్మణునింజూచి 'లక్ష్మణా! నే నీ పువ్వుల గుఱుతెఱుంగుదును. నేనే యడవిలో నీపువ్వులనుగొని సీతకియ్యఁగా నా యొయ్యారి గొప్పునం దుఱుముకొన్నది. నాకు ప్రియము గావించువారై యీ పువ్వులను వాడనీయక సూర్యుండును, ఎగఁజిమ్మక వాయుదేవుఁడును, వయినిదాల్చి యశస్విని యగుభూదేవియు, రక్షించుచున్నారని తలంచెదను' అనెను. పురుషతిలకుఁడగు నా ధార్మికుఁడు రాముఁడిట్లు మహాబాహుండగు లక్ష్మణునకుఁ జెప్పి ప్రస్రవణపర్వతముంజూచి *'పర్వతశ్రేష్ఠమా! సర్వాంగసుందరియై నాతోడు మాలి కుందుచున్నయొక్క రమణిని రమణీయమగువనప్రదేశమునఁజూచి యేమైననుందువా?' యని రాముఁడడిగెను. అంతఁ బర్వతము మాఱుపలుకకుంటఁ జూచి రాముఁడు, సింహము క్షుద్రమృగమునుంబోలె, అప్పర్వతంబును కుపితుఁడై బెదరించుచు 'పర్వతమా! నేను నీ చఱులనన్నిటిని నుగ్గునూచ చేయుటకు మును పె బంగారుచాయ గలిగి బంగారుబొమ్మవలె నెమ్మెగులుకు నాసీతం జూపు'మనెను. అంతనా పర్వతము రాముఁడిట్లు చెప్పినదివిని ప్రతిధ్వనిచే సీతనుగూర్చి చెప్పినట్లుండినది; కాని రాముఁడు తానాడినమాటలనే బదులు ప్రతిశబ్దించి యనాదరము సేసినదని తలఁచుటచే, అది రామునకుఁ జెప్పియుఁ దుదకు సీతను జూపనిదేయయ్యెను. అంత దశరథకుమారుఁడు రాముఁడు మరలఁ గొండఁజూచి 'బాణాగ్నిచే నిన్నుఁ గాల్చి నీఱుచేసెదను. అంత నీయందుఁ బచ్చికగాని చెట్లుగాని చిగుళ్లుగాని లేకుండునుగాన నిన్నెవ్వరు సేవింపరు సుమా'అని మరలలక్ష్మణునితో 'లక్ష్మణా! లోకమునం బూజ్యురాలై చం

* రాముఁడు 'కచ్చిత్క్షితిభృతాంనాథ దృష్టా సర్వాఙ్గసున్దరీ। రామా రమ్యే వనోద్దేశే మయా విరహితా త్వయా' అని రాముఁడు పర్వతమునడిగెను. పర్వతము ఈ శ్లోకమునే ప్రతిశబ్దించి సీతను దాను జూచినట్లు బదులుచెప్పెను. ఎట్లన; (క్షితిభృతాంనాథ) రాజశ్రేష్ఠా; (త్వయావిరహితా) నీవుపాసినట్టి, (సర్వాంగసున్దరీ రామా) సర్వాంగసుందరియైన యొక స్త్రీ, రమణీయమైన వనప్రదేశమునందు, (మయా దృష్టా ఇతి కచ్చిత్) ఇట కచ్చిత్ 'కామప్రవేదనే' అని అభిమతము దెలిపెడి. నేనుజూచితి నను నిది మిక్కిలి నాకభిమతము; అని పర్వతపరమైనయర్థము. అయినను 'ఏవముక్తస్తు కామేన వీర్యలో మైథిలీం ప్రతి శంసన్నివతత స్సీతాం నాదర్శయత రాఘవే' 'రాముఁడు తన్నడిగినమాటలనే ప్రతిశబ్దించినదిగాన బదులుచెప్పక యనాదరముసేసినదని తలంచుటచే అది చెప్పియుఁ దుదకు చెప్పనట్టిదే యయ్యెనని' యర్థము. గోవిందరాజులు. ఈ రెండవశ్లోకమునకు 'రాముఁడిట్లుచెప్పఁగా నాపర్వతము సీతను గూర్చి ప్రతిధ్వనిచే సెమిచెప్పినట్లు చూపట్టెనుగాని రామున కాసీతను జూపలేదు' అని మహేశ్వరతీర్థుల యర్థము.

ద్రుని బోలునెమ్మొగముగలిగి వెలుఁగునా సీతసంగతి యీ నది గనుక నాకుఁజెప్పదేని దీని నిప్పుడే శోషిల్లఁజేసెద ననెను. ఇట్లతఁడు రోషావేశమున చుఱచుఱ వేఁడిచూడ్కుల దహింపం దలఁచినట్లుండఁగా, ఒకానొక రాక్షసుని పెద్దయడుగులును, వానికిభయపడి రామాశ్రమమునకుఁబోవఁగోరినదై యా రాక్షసుఁడు వెంటనంటఁగా నిటునటు పరుగిడు సీతయడుగులును, ఇంతవఱకు నగపడకుండుటచే, అప్పుడు భూమినుండి వెలికుబ్బినట్లు కానఁబడినవి. రాముఁడు సీతయడుగులును రాక్షసునియడుగులునుం జూచి మఱియు నందందు దునిసిపడియున్న వింటిని, అమ్ముల పొదులను, నానావిధముల ఛిన్నభిన్నమై యున్న రథమునుఁగని తొట్రుపడుచు తన గారాబుతమ్మునిం జూచి 'లక్ష్మణా! ఇటు చూడుము. సీత భూషణములనుండి బంగారుదునుకలు రాలియున్నవి. మఱియు పలువిధములైన పుష్పమాలికలును రాలియున్నవి. లక్ష్మణా! బంగారుబిందువులంబోలి చిత్రములై యున్న రక్తబిందువులు భూమియందంతటఁ గ్రమ్మియున్నవి చూడు. లక్ష్మణా! కామరూపులగు రాక్షసులు సీతను ఛేదించి ఛేదించి, చెఱికొంచెము పంచుకొనిరైనను, లేక భక్షించిరైనను, ఉందురు. లక్ష్మణా! ఆ సీతనిమిత్తమై రాక్షసులిద్దఱు వివాదమాడి, యిచ్చట భయంకరమైనయుద్ధము గావించిరి. సౌమ్యా! ముత్తెములచేతను మణులచేతను బొదుఁగంబడి, బంగారుచే రంగారుచు విఱిగి నేలంబడియున్న యీ పెనువిల్లు, ఎవ్వనిది? బాలసూర్యునివలె మెఱయుచు వైడూర్యమణులు పొదిగినదై విఱిగి, నేలం ద్రెళ్లియున్న యీ బంగారుకవచమెవ్వనిది? నూఱుకమ్ములుగలిగి, దివ్యమాలికలతోఁ గ్రాలుచున్న యీ గొడుగుదండము నూఱు పఱియలుగా విఱిగి నేలం ద్రోయఁబడియున్నదే! ఇది యెవ్వనిది? బంగారుటొమ్ముకవచములును పిశాచముఖములును భయంకరాకారములును గలయీ ఖేచర గాడిదలు యుద్ధమున హతములై యున్నవే! ఇవి యెవ్వనివి? మిక్కిలి కాంతినిధగధగలాడుచు మండుచున్న యగ్నివలెఁ బ్రకాశించుచున్నవై యుద్ధమున నాయకుని గుఱుతై సూచించెడి యీ ధ్వజమును దునిసిపడియున్నది. యుద్ధార్థమైన రథమొకటియు నిదె విఱిగి కూలియున్నది. ఇది యెవ్వరిది? తేరుకాఁడియంత నిడుదలై, బంగారుచే రంగారుచు మొనలు విఱిగి ముక్కవడియున్న యీ బాణములు చెల్లచెదరై పడియున్నవే! ఇవి యే భయంకరకర్మునివి. లక్ష్మణా! బాణములు నిండియున్న తూణీరములు రెండును, నుగ్గునూచ గావింపఁబడియున్నవి చూడు. ములుకోలయు పగ్గములును చేతఁ బట్టికొని చచ్చిపడియున్నవీఁ డెవ్వనిసారథి? పురుషతిలకా! సౌమ్యా! ఇదిగో యిద్దఱు తెలగుడ్డలతోను రత్నకుండలములతోను యుద్ధమున హతులై పడియున్నారే. వీరలిద్దఱును ఎవ్వని చామరగ్రాహులు? ఈ మార్గము(పోకడ) ఎవ్వఁడో యొక రాక్షసునిది. సందేహము లేదు. ఇంతవఱకు రాక్షసులమీఁద నాకంతగా వైరము గలుగలేదు. కాఁబట్టి వారియపరాధముల కోర్చియుంటిని. ఇప్పుడు నాకెంతయు వైరముకలిగినది. ఇఁక వారి ప్రాణములనెల్ల తుదముట్టించెదను చూడుము. సౌమ్యా! దిక్కుమాలి జాలికిఁ దగి

యున్న సీతను మిక్కిలి ఘోరహృదయులును కామరూపులు నగురాక్షసులు అపహరించిగాని లేక చంపిగాని భక్షించిగాని యుందురు. మహారణ్యమున సీత యపహృతయై పోవుచుండఁగా ఆపదలందు ధర్మము రక్షించునందురే ! ఆ ధర్మమైనను దానిని రక్షింపదయ్యెనే. సౌమ్యా! లక్ష్మణా! రాక్షసులు సీతను భక్షించిగాని యపహరించిగాని నైనసిడప నాకు దేవతు లెవరు ప్రియము సేయఁజాలువారు? ప్రియము సేయువారేని మునుపే సీతను రక్షించియుందురే! లక్ష్మణా! లోకముల సృజించునంతవాఁడైనను శూరుఁడైనను, దయాళువైనచో, అట్టివాని సామర్థ్యము దెలియమింజేసి సమస్తభూతములు నతని నవమానించును. ఇది లోకస్వభావము. నేను, లోకహితమునందాసక్తుఁడ నగుటచే మెత్తని మనస్సుగలవాఁడనై దయాపరుఁడనై విషయచాపలము లేకయుండుటఁజేసి దేవతలందఱును నన్ను వీర్యహీనునిగాఁ దలఁచుచున్నారు. ఇది నిశ్చయము. లక్ష్మణా ! నన్నుఁ బొందిన కారుణ్యాది సద్గుణముగూడ దోషమైనది చూడుము. (అవమానము దెచ్చుటచే దోషమే యైనగుణముచే ప్రయోజనమేమి?) రాక్షసుల కనుకూలములై యుండు సమస్తభూతములకును రాక్షసులకును, ఇపుడే నాశముకొఱకే గుణము నాయందు దోషమైనది. దయను దిగవిడిచి కోపముఁ బూనెదను. గొప్పవాఁడగు సూర్యుఁ డుదయించి చంద్రుని వెన్నెలనంతయు సంహరించియే యెట్లు ప్రకాశించునో యట్లే నా తేజము మృదుత్వము మొదలైనగుణముల నెల్ల నడఁగఁద్రొక్కియే ప్రకాశించెడిని. లక్ష్మణా! దేవతలేకాదు. ఇఁక వారిని జేరిన యక్షులుగాని, గంధర్వులుగాని, పిశాచములుగాని, రాక్షసులుగాని, కిన్నరులుగాని, మనుష్యులుగాని సుఖంబు నొందరుసుమా. లక్ష్మణా! బ్రహ్మాస్త్రము మున్నగు దివ్యాస్త్రములచేతను బాణములచేతను ఆకాశమునంతయు నిండించెదను చూడుము. ఇప్పుడు ముల్లోకములందును ఎవ్వరికిఁగాని సంచరించుటకుఁ దెఱపి లేకుండునట్లు గావించెదను. ఇప్పుడే గ్రహగణములసంచారము లరికట్టి, చంద్రునిఁ గప్పివుచ్చి, అగ్నిని జలమును వాయువును నాశము సేసి, సూర్యుని మఱుఁగుపఱిచి, కొండకొమ్ముల వమ్ముగాఁజదిపి, కొలంకులనెల్ల నెండించి, చెట్లు చేమలను తీఁగలను తుత్తుమురుగావించి, సముద్రమును రూపుమాపి యిట్లు ముల్లోకములును నాశము నొందించెదను జూడు. ఇప్పుడు దేవతలు నాసీతను కనుగొందక కుశలముగా మునుపున్నట్లే నా కొసఁగకున్నారుగదా. కాఁబట్టి లక్ష్మణా ! ఈ రెండుగడియలలోపలనే నాపరాక్రమమును వారు చూడఁగలరు. లక్ష్మణా నావింటినారినుండి విడువంబడిన బాణజాలములు ఆకాశమునంతయు నెంతమాత్రము! తెఱపి లేకుండునట్లు దట్టముగాఁ గ్రమ్ముకొనఁగా సమస్తభూతములును తప్పించుకొనుటకై యాకసమునకును నెగురఁజాలవు. లక్ష్మణా ! నాబాణములచే నీజగమంతయు కలఁగినలఁగి, పక్షులును మృగములును చెల్లాచెదరై చీకా

---

'ఇందులకు 'కోహి లోకే ప్రియం కర్తుం శక్తాస్సౌమ్య మమేశ్వరాః!' అని మూలము. దీనికి 'దేవతలెవ్వరు నాకు అప్రియము సేయఁజాలువారు' అని గోవిందరాజులు.

కుపడ, తక్కినవన్నియు నాశులపడ, అవియవి తమతమ మేరలుమీఱి రూపఱఁగలవు చూడుము. ఇప్పుడు, సీతానిమిత్తముగా, వారింప నలవిగానిబాణముల నాకర్ణాంతముగా విలుదివిచి ప్రయోగించి బ్రహ్మాండమునందు పిశాచములుగాని రాక్షసులుగాని యూచముట్టుగ లేకుండునట్టు గావించెదను. ఇప్పుడు నేను రోషంబునం బ్రయోగింపఁగా విడివడి బహుదూరము పోవం జాలునాబాణములబలిమిని దేవతలు చూతురుగాక. నాక్రోధమునంజేసి ముల్లోకములును నాశమునొందఁగా, దేవతలుగాని దైత్యులుగాని, పిశాచములుగాని రాక్షసులుగాని యెవ్వరును దక్కరు; తోడనే రూపుమాయుదురు. నాబాణములచేఁ గృత్తునియాలై దేవలోకములును దానవలోకములును యక్షలోకములును రాక్షసలోకములును ఏ వేవి గలవో యవియన్నియు నిఁక నుండవు. లక్ష్మణా! దేవతలు, సీతను, అపహృతయైనంగాని మృతినొందిననుగాని దెచ్చి నాకొసంగ రేని, నే నిప్పుడు బాణములచే లోకములన్నియుఁ దమతమ మేరలు దప్పునట్లు గావించెదను. నా ప్రియురాలిని, అది అపహృతయై కాని మృతినొందిగాని యుండినను, దేవతలు నాకొసంగరేని, యిప్పుడు ముల్లోకములందు జంగమస్థావరముల గుసమస్తజనములను నాశము చేసెద'నెనెను. ఇట్లు బీరములుపలికి, కోపంబునఁ గన్నులెఱ్ఱఁబాఱ, వింటిని చేతంబట్టి, క్రూరసర్పముంబోలి భయంకరమై తళతళమెఱయుచున్న బాణముఁదీసి, యావింటంగూర్చి పరపురంబులు గెలుచు నా శ్రీమంతుఁడు రాముఁడు ప్రళయకాలాగ్నికైవడి క్రుద్ధుఁడై 'లక్ష్మణా! లోకమున సమస్తభూతములును, ఎట్లు ముదిమినిగాని, మృత్యువునుగాని, కాలమునుగాని, యదృష్టమునుగాని, యెప్పుడును వారింపఁజాలవో, యట్లే క్రుద్ధుండగునన్నును వారింప నెవ్వరికి నలవిగాదు. *మును పుండినట్లే సొగసు గులుకుపలువరుసతోఁగూడి, ఏకందును లేకుండుమిథిల

* ఇందులకు మూలము 'పురేవ మేచారుదతీ మనిందితాం దిశంతి సీతాం యదినాద్య మైథిలీం। సదేవగంధర్వమనుష్యపన్నగం జగత్సశైలం పరివర్తయామ్యహమ్' విశేషార్థము:—(పురేవ) మునుపటివలె, (మే చారుదతీం) మాయామృగమునుగూర్చి నేనుపోకమునుపు నన్నుఁజూచి 'ఈ మృగమునుబట్టి నాకుఁ దెచ్చియిమ్ము' అని యెబ్బున ఏచిఱునవ్వునవ్వినదో ఆనవ్వుతోడనే దానిని నాకొసంగరేని, (అనిందితాం) నింద కలిగింపనిదానిని-దానిని బడయనందున నేను జగమునంతయు దహించినను ఇది నిందితమని యెవ్వరును నాపై నింద మోపరని భావము. కావుననే సర్వజ్ఞుఁడగు హనుమంతుఁడును సుందరకాండమున 'యది రామస్సముద్రాంతాం మేదినీం పరివర్తయేత్ । అస్యాః హేతోర్విశాలాక్ష్యా యుక్తమిత్యేవ మే మతిః' 'రాముఁడు ఈవిశాలాక్షినిమిత్తమై, సముద్రము కడపలగాఁ గలభూమినంతయు తలక్రిందు చేసినను అది తగునేయని నాయభిప్రాయము' అని చెప్పెను; (సీతాం) నాఁగటిచాలునఁబుట్టిన అయోనిజగాన కౌసల్యకడుపునఁ బుట్టిననాకంటెను అతిశయించినదానిని, (మైథిలీం) రాజశ్రేష్ఠుఁడగు జనకచక్రవర్తికడుపునఁ బుట్టుటచేత నాకు సాటియైనదానిని, ఇట్టి సీతను దేవతలొసంగరేని, దేవమనుష్యాదులతోఁ గూడినప్రపంచమునంతయును, (పరివర్తయామి) నాశము నేయుదును లేక మఱియొకవిధము గావింతుననియు నర్థము. సర్వలోకమునకును సంఘాతమరణమునే కావింతునని యర్థము.

రాజనందనను సీతను దేవతలు నాకిప్పు డొసంగరేని దేవగంధర్వ మనుష్యపన్నగుల తోడను పర్వతములతోడనుం గూడ బ్రపంచమునంతయు నాశము గావించెదను' అనెను. ఇది యఱువదినాలవసర్గము.

-

## లక్ష్మణుఁడు రామున కూఱట చెప్పుట.

అటు సీత యపహృతయైనందులకు స్రుక్కి పురపురఁబొక్కుచు రాముఁడు ప్రళయకాలాగ్నియుంబోలె లోకముల నాశముసేయం బ్రవృత్తుండై యెక్కుపెట్టిన వింటిపైఁ జూడ్కులనిగుడ్చుచు, మాటిమాటికి నిట్టూర్పులువిడుచుచు, యుగాంత కాలరుద్రునికైవడి జగమునంతయు దహింపఁజూచుచు, ఇదివఱ కెన్నఁడు దాల్పని భయంకరాకారమునొంది పరమక్రుద్ధుండై యుండం జూచి లక్ష్మణుఁడు లోకనాశము కలుగు ననుభయమున నోరెండ చేమోడ్పుగీలించి 'నీవు ముందింతవఱకు,మృదుస్వభావుండును జితేంద్రియుండును సర్వభూతహితరతుండు నై యుండి యిప్పుడు కోపవశమునం జిక్కి నీయాస్వభావమును వదలుట యుచితముగాదు.చంద్రునియందుఁ గాంతియు, సూర్యునియందు వెలుఁగును, వాయువునందుగతియు, భూమియందు క్షమయును, ఇట్లొక్కొక్కరియం దొక్కొకటి నియతముగానుండును. నీయందు ఇవి యన్నియును, సాటి లేనియశస్సును నియతములై యుండును. (ఒక్కరథమే చూపట్టుచున్నది. ఒక్కనిజాడయే తెలియుచున్నది. కావున నొక్కఁడే నీకపరాధము సేసినవాఁడు) ఒక్కఁడు చేసినయపరాధమునకు నిరపరాధము లగులోకములనన్నింటిని వధించుటయర్హము గాదు. ఆయుధములతోను, ఇతరములయిన యుద్ధపరికరములతోను గూడ విఱిగిపడి యున్నయీయుద్ధరథము ఎవ్వనిదో, ఏ పగతునిచే విఱువఁబడినదో, విఱువఁబడిన దిందులకో మఱి యెందులకుఁగానో నాకేమియుఁ దెలియకున్నది. రాజకుమారా! ఈప్రదేశము గుఱ్ఱములగొరిజలచేతను రథచక్రములచేతను కొట్లుబడి నెత్తురుబొట్లం దడిసి మిక్కిలి బెడిదముగా నున్నది. కాన యిం, దింతకుమునుపు మహాయుద్ధము జరిగినదని కానవచ్చుచున్నది. మేటిమాటకారీ! ఈయుద్ధ మొక్కరథికునిదిగానే యున్నది; ఇద్దఱిదిగాఁగాని పెక్కండ్రదిగాఁగాని కానిపింపలేదు. ఏలయనఁగా, గొప్పసేనయుండినట్లు అడుగులజాడ భూమియందు నగపడలేదు. ఒక్కనికిఁగా, లోకములనన్నింటిని నాశముసేయుట యర్హముకాదు. రాజులు తప్పునకుఁ దగినంతదండమే సేయుచు మృదుస్వభావులును మిక్కిలి శాంతులునై యుందురుగదా. నీవో; ఆరాజులవంటివాఁడవుమాత్రమే గావు, సర్వకాలములందును సమస్తభూతములకును శరణ్యుఁడవు; పరమగతివి. రామా! ఇట్టి నీకు భార్యనశించుట మంచిదని యెవ్వఁడు తలంచును? యజ్ఞానుష్ఠానమునకు దీక్షితుఁడైనవానికి ఋత్విజులు శాపాదులైనయపచారములు సేసినచో అది యాగమునుజెఱిపి తన్నాశమునఁ దమకును సంభవించు ననుభయమున నాతనికా యప్రియములు సేయన

వరు. అట్లే లోకరక్షకుఁడ వగునీకు నదులుగాని సముద్రములుగాని పర్వతములు గాని, దేవగంధర్వదానవులు గాని, తామే చెడుదుమనుభయమున, అప్రియ మెంత మాత్రముఁ జేయఁజాలరు. రాజా! లోకనాశమును విడిచి, నాతోడంగూడి, విలు వట్టి యిందుఁ గలపరమర్షులు తోడ్పడ, సీత నపహరించినపాపాత్ముని వెదకుటయే యుచితము. సముద్రములను,పర్వతములను, వనములను, నానావిధము లయినభయంకరపుగుహలను, నదులను, తామరకొలఁకులను, వెదకుదము. అట్లు ఎచ్చరికమీఱి, దేవగంధర్వలోకములనుగూడ, నీభార్య నపహరించినవాఁడు దొరకునంతవఱకు, వెదకుచుందము. కోసలేంద్రా! దేవతలు సామోపాయంబునకు, నీపత్ని నొసంగరేని, యటుపిమ్మట దండోపాయమునకు యుక్తకాల మగునుగావున దానిని గావింపఁ గలవు. రామా! నీ సుచరిత్రమునను, సామోపాయమునను, వినయమునను, నయమునను సీత దొరకకపోవునేని, యంతమీఁద బంగారుపింజలు గలిగి, మహేంద్రుని వజ్రమునకు సాటి యగుమేటిబాణములచేఁ దలంచినకార్యమును దీర్చుకొనుము' అనెను. ఇది యఱువదియేనవసర్గము.

లక్ష్మణుఁడు రామున కిఁకఁ జేయవలసిన కార్యమును జెప్పుట.

అంత నారీతిని శోకమునఁ బొక్కుచు, అనాథునివలెఁ బలవించుచు మిక్కిలియు మోహము పయికొన రోదనము సేయుచు మనస్సు కుదురుతప్పి యున్న రాముని, ముహూర్తమాత్రమున సుమిత్రాసుతుఁడు లక్ష్మణుఁ డూఱడించి యతనిపాదముల రెంటిం బట్టుకొని యతనితో 'రామా! పెక్కుదేవతలుచేరి మిక్కిలి ప్రయాసపడి యతిభోగ్య మగునమృతమును సంపాదించినట్లు లోకరంజకుఁ డగుదశరథుఁ డొక్కఁడు వ్రతోపవాసాదులచే మిక్కిలి దేహప్రయాసముపడి యశ్వమేధాదులైనగొప్ప కార్యములను గావించి యతిభోగ్యుఁ డగునిన్నుఁ బడసినాఁడు. జనరంజకుం డైనయామహారాజు, నీ యొక్కనిగుణములచే బద్ధుఁ డై, నిన్నెడఁబాసినందులకుఁ దాళఁజాలకయే, దేవత్వమునొందెను. ఇది భరతుని వలన విన్నట్లె నేను జెప్పితిని; కాన యబద్ధముగాదు. నీవు కాకుత్స్థవంశమునఁ బుట్టినవాఁడవు. కాన మహాసత్త్వము గలయప్రాకృతుఁడవు. ఇప్పుడు సంభవించిన యీ దుఃఖమును, సహింపఁజాలవేని, యిఁక నల్పబలుఁ డగుక్షుద్రుఁ డెవ్వఁడు సహింపఁగలఁడు. పురుషసింహమా! నీ విట్లు దుఃఖితుఁడ వైనకారణమున, తేజస్సుచే లోకములనెల్ల దహింతువేని, దానంజేసి పీడితులై ప్రజలు మఱి యెచ్చటికిఁ బోయి యూరట నొందఁ గలరు? ఇట్లు అర్థానర్థములఁ బొందుట లోకములకు స్వభావమే కాని వేఱుగాదు. *నహుషునిపుత్త్రుఁ డగుయయాతి, యింద్రలోకమునొందియు, అనయమువలన స్వర్గ

* ఇంద్రుఁ డనూయవలన యయాతిని 'మీరాజ్యమున నెవ్వఁడు శ్రేష్ఠుఁడని యడుగఁగా నతఁ

మునుండి జాతిపడి దుఃఖముపాలు పడినవాఁడయ్యె. ఎవ్వఁడు మహర్షి యగునో ఎవ్వఁడు మన తండ్రికిఁ బురోహితుఁడో యట్టి వసిష్ఠునికి నూఱుగురు కొడుకులు పుట్టి యొక్కనాఁడే యొక్కమ్మడిగా నూఱుగురును విశ్వామిత్రునిచే హతులైరి. సత్యప్రతిజ్ఞా! ఎవ్వతి జగత్తునకెల్లఁ దల్లియై విష్ణుదేవుని యిల్లాలై లోకముచే నెల్ల మ్రొక్కులు గొనుచుండునో, అట్టియీ భూమికింగూడఁ జలనము కనఁబడుచున్నది. ఇట్లని నీవే నాకుపదేశించితివి. ఎవ్వరు ధర్మప్రవర్తకులో, ఎవరు కాల విభాగాదుల వలన జగమును ప్రవర్తింపఁజేయుదురో, ఎవ్వరు సమస్తపదార్థములను గోచరింపఁజేయుటచే జగమునకు గన్నులగుదురో, *ఎవ్వరియందు జగమంతయు నెలకొనియున్నదో, అట్టి మహాబలవంతులగు చంద్రసూర్యులకుఁ గూడ, గ్రహణము గలుగుచున్నది. వేయేల! పురుషతిలకా! మిక్కిలి గొప్పప్రాణులును, మాంధాత నలుఁడు మొదలైన మహాజనులుగూడ, సమస్తభూతాంతర్యామి యగు దైవము సంకల్పమునతిక్రమింపఁ జాలరు. పురుష సింహమా! దేవేంద్రుఁడు మొదలుగాఁ గలదేవతలయందు సైతము, నయానయమూలకములైన సుఖదుఃఖము లుండునట్లు వినవచ్చుచున్నది. కాఁబట్టి నీవు దుఃఖింపఁ దగదు. నీవు పాపదూరుఁడవు; మఱి వీరుఁడవు; సీత నాశమునొందినను, అపహరింపఁబడినను, నీవు కేవల మొకక్షుద్రునియట్లు దుఃఖించుట యుచితముగాదు. రామా! పదార్థముల నెల్లప్పుడును కలరూపునఁ గనుఁగొనుచు, మిక్కిలి గొప్ప దుఃఖములు సంభవించినను, కృత్యాకృత్య వివేకము చెడకుండు నీయట్టివారలు, ఎట్టి కష్టములయందేని దుఃఖింపరు. పురుషశ్రేష్ఠా! మఱి దేనిచేతను కలంగనిబుద్ధితో, మంచి నెబ్బరలను గలరూపున నాలోచింపుము. అప్పుడు, ఈకష్ట మేలవచ్చెనో తెలియును. మిక్కిలి ప్రాజ్ఞులైనవారు, అప్పటికిఁ దగిన బుద్ధిగలవారై, రాఁగల మంచిచెడుగులను దెలిసికొందురు. పూర్వము చేసిన కర్మముల గుణములుగాని దోషములుగాని ప్రత్యక్షముగాఁ గనుఁగొన శక్యముగాదు. మఱి యా కర్మము లేరీతిని జేసినదియు నిశ్చయింప నలవిగాదు ఫలములనుబట్టియే యూహింపనగును. పూర్వము వానిని జేయకున్నచో, ఇప్పుడు వాని ఫలములు కలుగవు. అప్పుడా కర్మములం గావించి యుండుటంబట్టియే యిప్పుడు తత్ఫలము లనుభవింపవలసి యున్నది. ఇందులకు దుఃఖింపనేల? రామా! నీవే మును నాకీ విషయములన్నియు నిట్లు బహువిధముగా బోధించియున్నావు.

---

డు యథార్థవాదియగుటచే 'నేనె శ్రేష్ఠుఁడ' ననఁగా, అంత నింద్రుఁడు 'నీ వాత్మశ్లాఘివి; స్వర్గమున నుండం దగవు' అని క్రిందఁ ద్రోయించినకథ యిట యూహ్యము.

*ఇందులకు 'యత్ర సర్వం ప్రతిష్ఠితమ్' అని మూలము. సమస్తలోకుల వ్యాపారస్థితిప్రవృత్తులు ఎవ్వరివలన జరుగుచున్నవోయని భావము. అనఁగా 'ఆదిత్యాజ్జాయతే వృష్టి స్తతో౽న్న మథ జాయతే' అన్నట్లు సూర్యుఁడు వర్షహేతువును చంద్రుఁడు ఓషధిహేతువునై జగములను రక్షించుటచే నిట్లు చెప్పఁబడిరని తెలియునది.

బృహస్పతి తానేయైనను, సర్వజ్ఞుఁడగు నీ కెవ్వఁడు బోధింపఁగలఁడు ? మహాప్రాజ్ఞా ! నీ బుద్ధి దేవతలకుఁ గూడఁ గలుగంజాలదు. అయితే నీ యెఱుక యిప్పుడు దుఃఖముచే మ్రాన్పడియున్నది గావున నేను దానిని మేలుకొలుపుచున్నానుగాని వేఱుగాదు. ఇక్ష్వాకుకులతిలకా! స్వర్గమందు సాత్త్వికమగు దేవగంధర్వాది ప్రాణిసమూహమును జూడుము. మనుష్యలోకమందు బ్రాహ్మణాదిప్రాణిజాలమును జూడుము. సర్వలోకములను రూపుమాపం జాలిననీపరాక్రమమును జూడుము. అట్టి వారిపై ఇట్టిపరాక్రమము నెఱపఁదగదని నీకే తెలియును. కావున శత్రువు లెవరో వారిని వధింపఁ బ్రయత్నింపుము. పురుషతిలకా ! సమస్తమును నాశము సేయుటవలన నీకుఁ బ్రయోజనమేమి ? పాపాత్ముఁడు శత్రుఁ డెవ్వఁడో తెలిసికొని వానినే నీవు నాశముసేయుట దగును' అనెను. ఇది యఱువదియాఱవసర్గము.



రాముఁడు జటాయువుం గని దుఃఖించుట.

రాముఁడు తాను పెద్దవాఁడయ్యును, సారగ్రాహి యగుటవలన, చిన్నవాఁడగులక్ష్మణుఁడు మిక్కిలి సారయుక్తం బగుమేలిమాటను జెప్పఁగానే, యతెఁ డంగీకరించెను. మహాబాహుఁ డా రాముఁడు, తనకుఁ గలిగినకోపము నడంచుకొని, చిత్రం బగుధనువు నూని, లక్ష్మణునితో 'నాయనా! లక్ష్మణా! ఏమి సేయుదము? ఎచ్చటికని పోవుదము. సీత నేయుపాయమునఁ బొందఁ గలుగునో యాలోచింపుము ' అనెను. అట్లు పరితాపమునఁ బొక్కుచున్న రామునింజూచి లక్ష్మణుఁడు 'ఈజనస్థానమున రాక్షసులు పెక్కండ్రు తిరుగుచుందురు; పలువిధములైనచెట్లు చేమలును గలవు. కాన యిందే నీవు వెదకవలయును. ఇందుఁ గొండలందలి దుర్గములైనప్రదేశములును పగుళ్లు పాఱినబండలసందులును, పాషాణసంధులును, నానామృగములు నెరసి పెరసి భయంకరములుగా నుండుపలువిధములైనగుహలును, కిన్నరులవాసస్థానములును, గంధర్వమందిరములును గలవు. వానినెల్ల నీవు నాతోఁ గూడ, సన్నద్ధుఁడవై వెదకుట యొప్పును. పురుష తిలకా ! నీయట్టి బుద్ధిసంపన్నులును మహాత్ములునగువారు, వాయువేగమునకుఁ బర్వతములు చలింపనట్లు, ఆపదలకు చంచలచిత్తులుగారు' అనెను. లక్ష్మణుఁ డిట్లు చెప్పఁగా రాముఁడు సీతయగపడమికిఁ గోపంబుగదుర వెడిదంబగుకత్తివాతియమ్మును వింటఁగూర్చి లక్ష్మణునితోడం గూడి యా వనమంతయుఁ దిరిగెను. అంత రాముఁడు, పర్వతశిఖరమువలెఁ జూపట్టుచు నెత్తుటం దోఁగుచు నేలంబడియున్నపక్షితిలకుని మహాభాగుఁడగుజటాయునిఁ గాంచెను. రాముఁడు పర్వతశిఖరాకారుఁ డగునా జటాయువుం జూచి, లక్ష్మణునితో, 'జనకరాజసుతను సీతను వీఁడే భక్షించినవాఁడు. ఇందులకు సందేహములేదు. ఈరాక్షసుఁడు గృధ్రరూపము దాల్చి యీవనమున నున్నాఁడు.ఇది స్పష్టము. వాలుఁగన్నులు గలనావన్నెలాఁడిని సీతను బట్టి తిని హాయిగాఁ గూర్చు

న్నాఁడు. వాతులు తళతళ మెఱయు గుఱి దప్పక దాఁకునట్టి కట్టిదపుబాణముల వీనిని బొరివుచ్చెదను' అనెను. రాముఁ డిట్లు చెప్పి యంతం గుపితుం డై, వింటఁ గత్తి వాలియమ్ముం గూర్చి, సముద్రపర్యంత మైనభూతలమంతయు వడఁకించువానిం బోలె నడుగు లిడుచు నా గద్ద కెదురుగా వేగపోయెను. ఆ పక్షియు దుఃఖితుఁడైన దశరథకుమారుని రామునిం జూచి నురుఁగును నెత్తురును గ్రక్కుచు దీనవాక్యముల 'ఆయుష్మంతుఁడా! నీవు ఎవ్వతిని, మేలిమూలికనుంబోలె మిక్కిలియెచ్చరికతో మహావనమున వెదకెదవో యాసీతను నా ప్రాణములను రెంటిని రావణుఁ డపహరించినాఁడు. రామా! నీవును లక్ష్మణుఁడును లేకుండునపుడు, బలవంతుఁ డగు రావణుఁడు సీత నపహరించుకొని పోవుచుండఁగాఁ జూచితిని. నే నంత అపహృతయై పోవుచున్న సీతం జూచి యాబిడ కభిముఖముగాఁ బోయి రావణుని రణమున మార్కొని, యిచ్చోటనే వానిరథమును నుగ్గునూచ సేసి దానినుండి వానిని క్రింది కుఱుకునట్లు గావించితిని. రామా! నాచే విఱువఁబడినయీవిల్లు రావణునిది; పఱియలైన యీ కవచమును వానిదే. నాచే భగ్నమైన యీ యుద్ధరథమును వానిదే చూడుము. నాతెక్కతాఁకున యుద్ధమునఁ గూలినవీఁడును వానిసారథి యగును. రావణుఁడు, నే నలసియుండఁగా, నా తెక్కలను ఖడ్గముచేఁ జక్కాడి, జనకమహారాజసుతను సీతను దీసికొని యాకాశమున కెగసిపోయెను. నన్ను ముందే రాక్షసుఁ డొకమాఱు చంపియున్నాఁడు. మరల నీవును జంపకుము' అనెను. అప్పుడు రాముఁడు తనకు జటాయువు సీతం గూర్చి చెప్పిన ప్రియవృత్తాంతమును వినఁగానే, మొగమునిండఁ గన్నీళ్లు గాఱ తాపము రెట్టించి తల్లడిల్లినవాఁడయ్యె. అతఁ డంత గద్దలరాజును గౌఁగిలించుకొని చేతనున్న పెనువింటిని దిగవైచి, దుఃఖపరవశుం డై మూర్ఛిలి నేలంబడి లక్ష్మణుండును దానును రోదనము సేసెను. జటాయువు తానొంటిమెయి, మిక్కిలి యిఱుకైనదారిని, ఇంతవఱ కెవ్వరికిని బోనలవిగానిదుర్గ ప్రదేశమున, దయతోఁ దనకుఁ దోడ్పడు తెరువరు లొక్కరును లేక, హతుఁ డై యతికష్టమున నిట్టూర్పులు పుచ్చుచుండఁగాఁ జూచి, రాముఁడు దుఃఖ మినుమడింపఁగా లక్ష్మణుం జూచి *'రాజ్యమును బోఁగొట్టుకొంటిని. వనమందు వాసమైనది. సీతయుఁ గానకపోయినది. జటాయుఁడును హతుఁడయ్యెను. ఇట్టి నా దౌర్భాగ్యము అగ్నిహోత్రునైనను దహించునే.

---

* ఇందులకు 'రాజ్యాద్భ్రంశో వనేవాసః సీతా నష్టా ద్విజో హతః। ఈదృశీయం మమాలక్ష్మీ ర్నిర్దహే దపిపావకమ్' అని మూలము. 'నచాస్యమహతీం లక్ష్మీం రాజ్యనాశో౽పకర్షతి' 'రాజ్యనాశము ఇతని గొప్పశోభను ఎంతమాత్రమును దీసినదిగాదు' 'వనవాసో మహోదయః' 'వనవాసము మిక్కిలి యభ్యుదయకరమైనది' అని రాముఁడు రాజ్యనాశమును వనవాసమును తనకు మిక్కిలి యభిమతములైనవిగా మున్ను చెప్పినను, ఇప్పుడు వానివలన సీతావిశ్లేషమును జటాయువియోగమును గలుగుటంబట్టి యవియే తనకు అనర్థకరములైనవని చెప్పుచున్నాఁడు, (రాజ్యాద్భ్రంశః) అకస్మికముగా లభించిన రాజ్యము తప్పిపోవుట, (వనేవాసః) రాజ్యముపోయినను అందు విచ్చలవృత్తిలోనైనను నిలువ శక్యమగును గదా.

ఇప్పుడు నేను తాపము చల్లారుటకై జలపూర్ణమగుమహాసముద్రములోఁబోయి నోలాడితినేని,ఆ నదీపతిగూడ నాదౌర్భాగ్యమున నెండిపోవును. ఇదినిశ్చయము. ఇట్లొకటిపై నొకటిగా సాఁగివచ్చుచున్న పెనుదుఃఖములవలలోఁ జిక్కియున్నానే!ఇట్టినాకన్నను అధికదౌర్భాగ్యుఁడు జంగమస్థావరసహితమైనయీప్రపంచమునం దెచ్చటను లేఁడు. నా తండ్రిచెలికాఁడైనయీగృధ్రరాజు,నాదౌర్భాగ్యమున,ముదిమికాలమందు,నిహతుఁడై నేలం బడియున్నాఁడు' అనెను, రాముఁడిట్లు పలువిధములం జెప్పి లక్ష్మణుండును దానును, తమ తండ్రియెడలఁ జూపునట్ట స్నేహగౌరవములు చూపుచు, జటాయువును, దేహమంతయుఁ దడవెను. ఱెక్కలు ద్రుంపఁబడి, నెత్తుటఁదోఁగి, పడియున్న యా గృధ్రరాజును,రాముఁడు కౌఁగిలించుకొని 'నాకుఁ బ్రాణములతో సమానురా లయినసీత యెక్కడ?' అని పలుకు చెప్పి దుఃఖపరవశుఁడై నేలంబడెను. ఇది యఱువదియేఁడవ సర్గము.

## రాముఁడు జటాయువున కగ్నిసంస్కారాదులు గావించుట.

రాముఁడు భయంకరుఁ డగురావణునిచే హతుఁడై నేలంబడి యున్నజటాయువుం జూచి తనకు మిక్కిలియు నెయ్యము గూర్పలక్ష్మణునితో 'ఈ పక్షి, నాప్రయోజనమునకై పూని, యుద్ధంబున రాక్షసునిచేత హతుఁడై విడువరానిప్రాణములను నిపుడు విడువనున్నాఁడు. లక్ష్మణా!వీనిదేహమునం దింకను నిదిగో సూక్ష్మముగాఁ బ్రాణమున్నది.కావున నే యితఁడు,ఎలుఁగు సన్నమై నిహ్వాలించుచుఁ గనఁబడుచున్నాఁడు. జటాయూ! నీకు మాటచెప్పుటకు సత్తువ గలదేని,సీతసంగతిని జెప్పుము. శుభం బగుఁగాక. నిన్ను రాక్షసుఁడు వధించినసంగతియుఁ జెప్పుము. రావణుఁ డెందుకుఁగా సీత నపహరించినాఁడు? నాప్రియురాలిని అపహరించుకొనిపోవునంతటియుపకార మేమి నేను వానికిఁ జేసితిని?పక్షిసత్తమా!చంద్రబింబమువలె మనోజ్ఞమై యుండునాసీతమొగము అప్పుడెట్లుండినది?అప్పుడు సీత యేమేమి చెప్పినది?తండ్రీ! ఆరాక్షసుని వీర్యమెట్టిది? వానిరూపమెట్టిది? వానిపను లేమి? వాఁ డుండుగృహ మెచ్చట? నేనడుగుచున్నాను,చెప్పుము'అనెను. అంత,జటాయువు, దీనమనస్కుండై యెడతెగక పలవించుచున్నయారాముం జూచి మిక్కిలియు నురింగిన యెలుఁగున'రాక్షసేశ్వరుఁడగురావణుఁడు మాయచే,పెనుగా

---

అదియును లేకపోయెను, తుదకు వనమందే వాసమయ్యెను, (సీతానష్టా) వనవాసమందును అభిమతి జనుల యెడఁబాటులేకుండ నేను హాయిగా ఉండవచ్చును. అదియును లేక సీతయు మాయమైనది. (హా తో ద్విజః)అభిమతులైనజనులు ఎడఁబాసినను బంధుజనులైనను సమక్షముననుండి రేని దుఃఖమును అడఁచుకొనవచ్చు నన్నచో జటాయువును గతించెను. (ఈదృశీ) ఇటువంటిదుఃఖమునందు పర్యవసించినట్టి,(మమ అలక్ష్మీః) నాదౌర్భాగ్యము, (పావకమపి నిర్దహేత్) సర్వవస్తువులను దహించునట్టివాఁడైనను అగ్నినిగూడ దహించును. ఎప్పటికిని నన్నెడఁబాయు ప్రసక్తియే లేకుండు లక్ష్మణునిఁగూడ ఎడఁబాయునట్లు చేయునని యర్థము.— అనిశ్లోకి

లిని మబ్బులను బుట్టించి చీఁకటి గ్రమ్మఁ జేసి యాకాశమార్గమున సీత నపహరించి కొనిపోయినాఁడు. నాయనా! నేను బడలియుండునపు డా రాక్షసుఁడు నా ఱెక్కలం దెగన ఱికి, జనకరాజసుతను సీతనుదీసికొని దక్షిణదిక్కుగాఁ బోయెను. రామా ! నా ప్రాణములు మరణవేదనచేఁ బీడితములై తత్తఱపడుచున్నవి. దృష్టి సుడివడుచున్నది. వట్టివేళ్లచేత నయిన వెండ్రుకలు గల*బంగారువృక్షములు నాకంటి కగపడుచున్నవి. రావణుఁడేముహూర్తమున సీతను గొనిపోయినాఁడో యా ముహూర్తమున, దారపోసికొన్న సొమ్ము శీఘ్రముగా సొంతగానిని జేరును. రామా! ఈ ముహూర్తమునకు విందమని పేరు. ఇది రావణునకుఁ దెలియదయ్యె. కావున నీవు పోఁగొట్టుకొన్న సీతను మరలఁ బొందుదువు. రాక్షసేశ్వరుఁ డా రావణుఁడు నీ ప్రియురాలిని సీత నపహరించి గాలమును మ్రింగినమత్స్యమువలె తప్పించుకొని పోయినను శీఘ్రముగనే నాశము నొందఁగలఁడు. జనకరాజసుతను సీతంగూర్చి నీ వెంతమాత్రము వ్యథపడవలదు. యుద్ధమున రావణునివధించి శీఘ్రంబున సీతం బొంది యానతితోఁ గ్రీడింపఁగలవు' అనెను. ఇంతవఱకు జటాయువు తెలివిదప్పక రామునితో ప్రత్యుత్తరములు పలుకుచుండెనుగాని యిప్పుడు మరణము మిక్కిలి దాపింపఁగా నతనినోటనుండి నంజుడుతోఁగూడ నెత్తురు దొరిఁగెను. జటాయువు †'రావణుఁడు విశ్రవసునికి ఔరసపుత్త్రుఁడు; కుబేరునకుఁ దమ్ముఁడు' అని యింతమాత్రమే చెప్పి యంతమీఁద రాముఁ డడిగినరావణునివీర్యగృహాదులను చెప్పుటకు మున్నే దొరకరాని ప్రాణములను దొఱంగినవాఁడయ్యె. రాముఁడు చేతులు మోడ్చి 'చెప్పుము చెప్పుము' యని యడుగుచుండఁగానే జటాయువు ప్రాణములు శరీరమును బాసి యాకాశమున కరిగినవి. అప్పుడు జటాయువు మరణవేదనచే శిరసును నేలపైనుంచి కాళ్లు సాఁచి దేహమంతయు విలవిలఁగొట్టుచు ‡ ప్రాణములువిడిచి నేలంబడియుండెను. తల వాల్చుటచే పాటున నలఁగి మెఱ్ఱనైనకన్నులతోఁ జచ్చిపడియున్న పర్వతాకారుని జటాయునింజూచి రాముఁడు పరమదుఃఖితుండై లక్ష్మణునితో 'ఈపక్షి, రాక్షసులయునికి పట్టయిన యీ దండకారణ్యమునఁ, బెక్కుసంవత్సరములు హాయిగా నిర్భయముగానుం

---

* మరణకాలమున బంగారుమయములగు వృక్షములు కనఁబడునని జ్యోతిశ్శాస్త్రప్రసిద్ధి.

† ఇందులకు 'పుత్రో విశ్రవసస్సాక్షా ద్భ్రాతా వైశ్రవణస్యచ' అనిమూలము. ఇది పూర్వార్ధము. ఉత్తరార్ధమున రావణుని వీర్యాదులను జెప్పుటకుమునుపే జటాయువు మృతుఁడయ్యెను. కవి, దీనినే పూర్వార్ధముగాఁగొని సంపాతివచనమున, 'అధ్యాస్తే నగరీం లంకాం రావణో రాక్షసేశ్వరః' అని యుత్తరార్ధము చెప్పినాఁడని లోకాచార్యులు చెప్పియున్నారు.

‡ రావణునిచే హతుఁడైన జటాయువు ఇంతవఱకుఁ బ్రాణములు పెట్టుకొని యుండుటయెట్లన్నచో నిది సీతయనుగ్రహమువలన నని తెలియనది. స్కాందమున 'దేవీ మాం ప్రాహ రాజేంద్ర యావత్సంభాషణంమమ। భవత స్తావ దాస న్తే ప్రాణా ఇ త్యాహ జానకీ' 'రాజేంద్రా ! దేవి నన్నుఁజూచి నీతో మాటాడునంతవఱకు నా ప్రాణములుండునని చెప్పినది' అనియున్నది-మహేశ్వరతీర్థులు.



761 రాముడు జటాయువునకు మోక్షు మిచ్చుట.

డి, యిచటనే మృతుఁడయ్యెను. ఎవ్వఁడు పెక్కువేల సంవత్సరములు వయస్సుగలిగి చిరకాల మభ్యుదయముతోఁ గూడియుండెనో, యట్టి యీ జటాయువుగూడ నిప్పుడు హతుఁడై నేలంబరుండియున్నాఁడు. కాలము నెవ్వరికిని గడవ నలవిగాదు. లక్ష్మణా! ఈజటాయువు నా కుపకారముసేయవలయునని సీతను రక్షింపఁబోయి బలవంతుఁడగు రావణునిచే హతుఁడై యున్నాఁడు చూడుము. ఈపక్షిరాజు, తండ్రితాతలనాఁటినుండి వచ్చినగొప్ప గృధ్రరాజ్యమును విడిచి నానిమిత్తమై ప్రాణములు వదలినాఁడు. లక్ష్మణా ! అంతటను, మృగపక్షిజాతులందుఁగూడ, సాధువులును ధార్మికులును శూరులును శరణ్యులు నగువా రగపడుచున్నారు. పరంతపా ! నాకు సీత యపహృతయై పోవుటచేఁ గలిగిన దుఃఖమును, నాకుఁగా జటాయువు నశించుటచేఁ గలిగిన దుఃఖమువలె నంత మిక్కుటముగా నాకుఁ దోఁపలేదు. నాకు శ్రీమంతుఁడును మహాకీర్తిమంతుఁడు నగు దశరథమహారాజెట్లో యట్లే యీపక్షిరాజునుగూడ, పూజ్యుఁడును, మాన్యుఁడు నగుచున్నాఁడు. లక్ష్మణా ! కట్టెలం దెమ్ము. వానిని మథించి యగ్ని సంపాదించి నానిమిత్తమై మరణమునొందిన గృధ్రరాజునకు దహనసంస్కారము సేయఁగోరెదను. లక్ష్మణా! భయంకరుఁడగురాక్షసునిచే హతుండైనయీపక్షిలోకనాథునిఁ జితిపైనుంచి దహనము సేయఁగోరెదను. మహాబలుఁడ వగుగద్దలరాయా! *యాగములుసేయువారిల కేలోకమో, పంచాగ్నిమధ్యమునఁ దపము సేయువానప్రస్థుల కేలోకముగలుగు

---

* ఇందులకు 'యాగతిర్యజ్ఞశీలానా మాహితాగ్నేశ్చ యా గతిః। అపరావర్తినాం యా చ యా చ భూమిప్రదాయినాం । మయా త్వం సమనుజ్ఞాతో గచ్ఛ లోకా ననుత్తమాన్ । గృధ్రరాజ మహాసత్త్వ సంస్కృతశ్చ మయా వ్రజ' అనియూలము. విశేషార్థము:-(యజ్ఞశీలానాం యజ్ఞాః శీలం స్వభావః యేషాంతే) సదాయజ్ఞానుష్ఠానపరులగు గృహస్థులకు, (యాగతిః గమ్యతే ఇతిగతిః లోకః) ఏలోకమో (ఆహిత+అగ్నేః-ఆహితాః పరితః స్థాపితాః అగ్నయః పంచాగ్నయో యస్యసః) పంచాగ్నుల నడుమ సర్వదా పత్నీలుఁ డగువానప్రస్థునికి ఏలోకమో, అగ్ని ఆధానము పూర్వోక్తమైన గృహస్థశబ్దము చేతనే సిద్ధమైనది గావునను, అగ్నిహోత్రికి ప్రత్యేకఫలములేమిచే ప్రత్యేకలోకముగలుగదు గావునను, 'ఆహితాగ్ని' అనుటకు అగ్నిని ఆధానము సేయువాఁడని యర్థముదగదు, (అపరావర్తినాం)'అరణ్యమేగా తపో నపునరేయాత్' 'అడవికిఁబోవలయును; అచటనుండిమరలిరాఁగూడదు' అని చెప్పఁబడిన సన్న్యాసులకు, ఈశబ్దమునకు 'యుద్ధమునుండి వెనుదీసి మరలనివారికి' అనియర్థముదగదు. అట్లైన అప్పుడు అట్లు వెనుదీయనిజటాయువునకు ఆఫలము తనంతటనే సిద్ధించుచున్నదిగాన రాముని యనుజ్ఞచే గలుగనక్కఱలేదు. కనుక'అనుజ్ఞాతో గచ్ఛ'అనిరాముఁ డనుజ్ఞ సేయుటయొప్పదు. ఆయాధర్మములుసేయువారికి ఆయాలోకములు చెప్పుధర్మప్రకరణమందు ముక్తులు చెప్పఁబడరుగావున ముక్తుల యర్థము చెల్లదు. (భూమిప్రదాయినాం)భూభోగమును త్యజించినవారికి - నైష్ఠికులకనుట, ఏలోక (తాగతిః) ఆలోకములు 'ప్రాజాపత్యం గృహస్థానాం బ్రాహ్మ్యం సన్న్యాసినాం స్మృతమ్' ఇత్యాస్థానములు-వారివారికి శాస్త్రవిహితములైన యాయాగతులు, (మయాసంస్కృతో వ్రజ) నాచేత సంస్కారమునొంది పొందుము,(మయాసమనుజ్ఞాతస్తు) నాచేత ననుజ్ఞపొందినవాఁడవై, (అనుత్త సర్వశ్రేష్ఠములైన, (లోకాన్) 'అథయదతః పరోదివోజ్యోతిర్దీప్యతే విశ్వతః పృష్ఠేషు సర్వతః పృష్ఠే

నో, సన్న్యాసు లేలోకమును బొందుదురో, భూభోగములను త్యజించిననైష్ఠికుల కే లోకముగలుగునో, నాచే సంస్కృతుఁడవై వానిని పొందుము. నాయనుజ్ఞఁబొంది

---

ష్వనూత్తమేషూత్తమేషు' ఇత్యాదిశ్రుతిప్రసిద్ధములైన విష్ణులోకములను - ఇచట బహువచనము విష్ణులోకమునందుఁగలఅవయవములగు పెక్కులోకములంబట్టి కలిగినవని తెలియునది. (గచ్ఛ)పొందుము. నాచే సంస్కృతుఁడవై యజ్ఞశీలాదిలోకములును అనుజ్ఞాతుఁడవై విష్ణులోకములను బొందుమని భావము. భగవంతుని పరస్వరూపమునకే ముక్తిప్రదానము లక్షణముగావున మనుష్యభావము నటించుశ్రీరామునికది యెట్లు చెల్లునన్నచో 'సత్యేన లోకాన్ జయతి' అని రాముఁడు తానార్జించినధర్మవిశేషముచే సర్వలోకములను స్వాధీనములఁజేసికొన్నాఁడు గావున నిది చెల్లునని తెలియునది.

అర్థాంతరము:—(మయాసంస్కృతః) నాచే సంస్కారమునొంది, (తతోఽనుజ్ఞాతః) దానివలన అనుజ్ఞనొందినవాఁడవై, నీవు, యజ్ఞశీలురు మొదలైనవారియొక్క యేయేగతులు గలవో, (తాన్ లోకాన్ గచ్ఛ) ఆలోకములను బొందుము. అన్నిటికి కడపట (మాం వ్రజ) నన్నుఁబొందుము. 'సోఽశ్నుతే సర్వాన్ కామాన్ సహ బ్రహ్మణా విపశ్చితా' అన్నట్లు ముక్తభోగమును బొందుమనుట. ఇట్లుముక్తినిచ్చినచో నిర్హేతుకముగాముక్తిదానము చేయవచ్చుననియు ప్రసక్తిగలుగుచున్నదన్నచో, భగవంతుఁడు, తనకార్యమును గూర్చి జటాయువు ప్రాణత్యాగముచేసినదియే హేతువుగాఁగొని ముక్తినిచ్చినాఁడు గాని నిర్హేతుకముగాఁగాదు. కాఁబట్టియే నృసింహపురాణమున 'మత్కృతే నిధనం యస్మాత్త్వయా ప్రాప్తం ద్విజోత్తమ। తస్మాన్మమ ప్రసాదేన విష్ణులోకమవాప్స్యసి' 'పక్షిశ్రేష్ఠా! నాకుఁగా మరణమునొందితివి గావున నాయనుగ్రహమువలన విష్ణులోకమును బొందుదువు' అని చెప్పఁబడియున్నది. కర్మముచే ముక్తియెట్లువరాదు 'కర్మణైవ హి సంసిద్ధిమాస్థితా జనకాదయః' 'జనకాదులుకర్మముచేతనే సిద్ధినిబొందిరి' అని కర్మమును ముక్తిహేతువగును. 'నాన్యః పన్థా అయనాయ విద్యతే' అని జ్ఞానమే ముక్తిహేతువనఁబడియున్నదే యన్నచో పరమాత్మ తప్పమఱొక్కరు తనంతట ముక్తిహేతువగుటను ఈశ్రుతి నిషేధించుచున్నది. ఆపరమాత్మయే ప్రధానముగా నిట ప్రకృతుఁడు గాన దోషములేదని తెలియునది.

అర్థాంతరము:—మహాసత్త్వముగల ఓగృధ్రరాజా! నాచేతసంస్కృతుఁడవైననీవు నాచే ననుజ్ఞాతుఁడవై, (అనుత్తమాన్ లోకాన్) మిక్కిలిశ్రేష్ఠములైన నాలోకములను, (గచ్ఛ) పొందుము. ఆనుషంగికముగా, (యజ్ఞశీలానాం యా గతిః) యాగశీలులైనవారి కేలోకమో, (ఆహితాగ్నేః) గార్హపత్యాహవనీయదక్షిణాగ్నినిరతుఁడైనవానికి, ఏలోకమో—శ్రుతి 'అగ్నయో వై త్రయీ విద్యా' అని యారంభించి 'తస్మాదగ్నీన్ పరమం వదన్తి' అని ఆహితాగ్నిత్వమునుగూడ ప్రత్యేకధర్మముగా ప్రతిపాదించుటచే దీనికిని ప్రత్యేకలోకము ఫలముగాఁ గలదని తెలియునది. (అపరావర్తినాం) యుద్ధమునుండి మరలనివారికి ఏలోకమో-జటాయువు అపరావర్తుఁడైనందులకు ఫలము అప్పుడేసిద్ధించియున్నదిగాన ఇప్పుడియ్యవలసినది లేదు. కనుక నిచట అపరావర్తులగతి చెప్పుట దృష్టాంతముకొఱకే. మఱియు, తిర్యక్కులకు యజ్ఞాదులం దధికారములేనందున తత్ఫలమాత్రమే యియ్యఁదగినవి. కనుక ఎట్లు అపరావర్తులగతిని బొందుదువో అట్లె యజ్ఞశీలాదులలోకములనుగూడ, బ్రహ్మప్రాప్తికి వసుత్వాదులను బొందునట్లు, పొందుమనుట. ఈపక్షమున, (భూమిప్రదాయినాం) అనుటకు, భూదానముచేసినవారికి ఏలోకమో అని యర్థము. ఈలోకములనెల్ల ఆనుషంగికములుగాఁ బొందుమని యర్థము.

తనిశ్లోకి:— గతి యనఁగాలోకము. తిర్యక్కులకు కర్మమునం దధికారములేకపోయినను, సంస్కారమును బొందనివారికి పరలోకములేనందున నీవు, (మయాసంస్కృతః సన్) నాచే సంస్కారము

యుత్తమంబులగు విష్ణులోకంబులఁ బొందుము' అనెను. ధర్మాత్ముఁ డారాముఁ డిట్లు చెప్పి, యాపక్షిరాజును, దీపనార్హం బగుచితిపై నెత్తిపెట్టి, దుఃఖితుఁడై తనబంధువునుంబోలె మంత్రపూర్వకముగా దహించెను. అంత వీర్యవంతుఁ డగురాముఁడును లక్ష్మణునితోడ నడవికిఁ బోయి పెద్దకేసరిమృగములను జటాయువునకుఁగా జంపి, పిండప్రదానముకొఱకు దర్భలుపఱిచెను. మహాయశుం డారాముఁడు, ఆ కేసరిమాంసములఁ దీసి ముద్దలుగాఁజేసి మెచ్చులుగులుకు పచ్చనిపచ్చికనేలపయిని జటాయువున కొసఁ

---

బొందినవాఁడవగుచు, నాయనుజ్ఞచేతనే (అనుత్తమాన్ లోకాన్ గచ్ఛ) అనుత్తమములైన లోకములను బొందుము. (అపరావర్తినాం) 'న స పునరావర్తతే' అనిశ్రుతిచెప్పిన పునరావృత్తిరహితు లగుముక్తులయొక్క, (లోకాన్) అని పూజార్థము బహువచనము; లేక పరమవ్యోమమందు అవాంతరలోకములు పెక్కులుండుటంబట్టి 'విశ్వతః పృష్ఠేషుసర్వతః పృష్ఠేష్వనుత్తమేషూత్తమేషు' అనియిందు బహువచనము నిర్దేశింపఁబడినట్లు ఇచటను బహువచననిర్దేశమని తెలియునది, (యజ్ఞశీలానాం) యజ్ఞశీలాదులలోకములమార్గముగా అపరావర్తులలోకమును బొందుమనియర్థము. అపరావర్తిలోకమును బొందుట నృసింహపురాణమునను'మత్కృతేమరణం యస్మాత్'ఇత్యాదులచేఁ జెప్పఁబడినది. భగవంతుఁడగురాముఁడు తిర్యక్కగుజటాయువునకు సంస్కారము సేయుటయెట్లు? అన్నచో 'నశూద్రా భగవద్భక్తాః''భగవద్భక్తులు శూద్రులుగారు' అనుచో శూద్రశబ్దము పశుపక్ష్యాదులకుఁగూడ ఉపలక్షకము. భగవద్భక్తులగుసర్వప్రాణులకును మోక్షాధికారము తెలియుచుండుటచే నిది యుక్తమేయని తెలియునది ఇట్లుండగా, జటాయువునకు మోక్షమొసఁగుటవలన రాముఁడు పరమాత్ముఁడగుట ప్రతీతమగుచున్నది. 'త్వంగతిః పరమాదేవ' ఇత్యాదులచే బాలకాండమందును 'సహిదేవైరుదీర్ణస్య' ఇత్యాదులచే యుద్ధకాండమునను 'సీతాలక్ష్మీర్భవాన్ విష్ణుః' ఇత్యాదులచే శ్రీమహాభాగవతమునను శ్రీరాముఁడు పరమాత్ముఁడగుట స్పష్టముగా చెప్పఁబడియున్నది. ఇట్లుసమస్తకల్యాణగుణాకరుఁడై రావణాదివధముచే లోకహితముసేయుటకై తానే దశరథుంగృహమున నవతరించిన శ్రీమన్నారాయణునికి సీతంగూర్చి విలపించుటయెట్లు? అన్నచో ఇదిసత్యమే, కాని దోషముకాదు. 'వ్యసనేషు మనుష్యాణాం భృశంభవతి దుఃఖితః' 'మనుష్యులకు వ్యసనములు కలిగినప్పుడు తాను మిక్కిలియు దుఃఖితుఁడగును''నిశ్చితాపి హిమే బుద్ధిర్వనవాసే దృఢవ్రతా। భరతస్నేహ సంతప్తా బాలిశీక్రియతేపునః'నాబుద్ధి నిశ్చితమై వనవాసమందు దృఢముగా నెలకొనియుండినను భరతునియందలి స్నేహముచే తపించుచున్నదై మరల బాలిశము - అనఁగా వనవాసమువిడిచి భరతునియొద్దకుఁరాఁజూచునట్టిది-అగుచున్నది''సీతాహరణజ దుఃఖంన మే సౌమ్య తథాగతం। యథా వినాశో గృధ్రస్య మత్కృతేచ పరంతప' 'పరంతపా! సీత యపహృతయగుటచేఁ గలిగినదుఃఖము జటాయువునాకై,నశించుటవలనఁగలిగిన దుఃఖమువలె నంతమిక్కుటముగా నాకుఁ దోఁచలేదు.అని యీప్రకారమున సర్వేశ్వరుఁడుగూడ ఆశ్రితులవలని వాత్సల్యమువలన వారిదుఃఖమున తానును దుఃఖితుఁడుగా కనఁబడుచున్నాఁడు; వారి దుఃఖములను బోఁగొట్టుచున్నాఁడు;అని ఋషియభిప్రాయముగాఁదెలియునది. శుకాదులన్నచో 'మర్త్యావతారస్త్విహ మర్త్యశిక్షణం । రక్షోవధాయైవ న కేవలం విభోః' 'భగవంతుని మనుష్యావతారము కేవలము రాక్షసవధముకొఱకేకాదు; మనుష్యులకు ధించుటకుఁ గూడ నగును' అని యిట్లు శ్రీరామునికి దుఃఖమే లేదని చెప్పుదురు. ఇట్లితక్కిన నిట్టిచోటుల పరిహార మెఱుఁగునది.

గెను. బ్రాహ్మణులు మరణమునొందినవానికి స్వర్గప్రదమని జపించునట్టి పితృదేవతాకమైన యామ్యసూక్తాదిమంత్రమును జటాయువునకుఁగా రాముఁడు జపించెను. అంతనా రాచకుమారులిరువురును గోదావరీనదికింబోయి యాగృధ్రరాజునకు జలతర్పణము గావించిరి. *అప్పుడు రామలక్ష్మణులు శాస్త్రోక్తవిధానమున జటాయువు నుద్దేశించి గోదావరీజలముల స్నానముగావించి యాగృధ్రరాజునకు జలతర్పణములు విడిచిరి. సీతానిమిత్తమై యా జటాయువు యుద్ధముసేసి రావణునిచేఁ గూలెనుగాన నెవ్వరికిని జేయ నలవిగాని కార్యమును జేసి మిక్కిలి శూరుఁడని కీర్తిగాంచెను. మహర్షితుల్యుండగురామునిచే సంస్కారము నొందుటంజేసి జటాయువు వుత్తరక్షణమే పుణ్యఫలమై తనకు సుఖావహమైన పుణ్యలోకమును బొందినవాఁడయ్యె. దేవతాధిపతు లగువిష్ణువును దేవేంద్రుండునుంబోలె నున్న యా రామలక్ష్మణులు జటాయువునకుఁ బిండోదకములు గావించి యాపక్షిరాజు చెప్పినమాటను గట్టిగానమ్మి, యంత సీతను వెదకుటకై యందు మనస్సు నిలిపి వనమునకుంబోయిరి. ఇది యఱువదియెనిమిదవసర్గము.

* ఇచ్చట జటాయువును దహించి స్వర్గగమనమగు సూక్తమును జపించి గోదావరికిఁ బోయి స్నానముచేసి జలతర్పణమిచ్చి కేసరిమాంసపిండము నొసఁగిరని క్రమము తెలియునది. వైదికోత్తముఁడగు రాముఁడు హీనజాతి యగుతిర్యక్కునకు వైదికకర్మముచే సంస్కార మెట్లుచేసె ననరాదు. జటాయువు అత్యంతభక్తుఁడు గావున నతనికి జాతిదోషము తొలఁగినదయ్యె. 'నశూద్రా భగవద్భక్తా విప్రాభాగవతాః స్మృతాః। సర్వవర్ణేషు తే శూద్రా యేహ్యభక్తా జనార్దనే' అనియుఁ జెప్పఁబడియున్నది. ఈవచనము. 'అపశవోవాఅన్యే గోఅశ్వేభ్యః' ఇత్యాదులవలె ప్రశంసాపరమనరాదు. ఏలననట్లు చెప్పకున్న బాధకములేదు. మఱియు బ్రాహ్మణత్వము మొదలైనజాతులు శాస్త్రములవలననే తెలియఁగూడినవిగాని గోత్వాదిజాతులవలె ఆకృతిచేఁ దెలియఁదగినవిగావు గోత్వాదులవలె తెలియవలసినవేని వానిలో తుల్యముగా సంకేతింపవచ్చునుగాని యట్లు లేదు. కాఁబట్టియే విశ్వామిత్రునికిఁగూడ క్షత్రియత్వజాతి తొలఁగింపఁబడి బ్రాహ్మణత్వజాతి కలిగింపఁబడినదని బాలకాండమునను ప్రతిపాదితమైయున్నది. ఈయర్థమే శబరివృత్తాంతమునను ఉపపాదితమయ్యెడిని- మఱియుద్రౌపదీవివాహాదులవలె ఇతిహాససంబంధములైన యొకానొకవ్యక్తివిశేషములకుమాత్రమే యిట్టివి చెల్లునని యుచెప్పుట కవకాశములేదు-గోవిందరాజులు.

తిర్యక్కులకు కర్మమునందధికారము లేమిచేతను అగ్నిసంస్కారమునకు అర్హతలేమిచేతను నీకు ఉత్తమలోకములు లేకపోయినను, క్రమముగ యజ్ఞశీలాదిలోకముల నొంది నాయనుజ్ఞవలన(అనుత్తమాః లోకాః)తమకంటె నుత్తమమైనవి లేనట్టియు క్రమముక్తి నొసఁగునట్టియు బ్రహ్మలోకములను బొందుమని యర్థము. ఇట భగవంతుఁడగు రాముఁడు కర్మమందధికారములేనిదై సాధనహీనమైయున్న తిర్యక్కునకుఁగూడ సంకల్పమాత్రమున ఉత్తమలోకదానము సేయుటచే తనస్వరూపాంశమున మాయచే జ్ఞానమావృతమైనవాఁడని ప్రలాపించువారిముఖము వాడిచినట్టయినది. శోకాదులు నటనమేయని పలుమాఱును చెప్పఁబడియున్నది. ఇదియే పాద్మపురాణమున 'సంస్కార మకరోత్తస్య రామో బ్రహ్మవిధానతః। స్వపదంచ దదౌ తస్మై సోఽపి రామప్రసాదతః। వారే స్సామాన్యరూపేణ ప్రయయౌ పరమం పదం' అని జటాయువుంగూర్చి ముక్తినొసఁగుట చెప్పఁబడియున్నది.

## అయోముఖిని విరూపం గావించుట. కబంధదర్శనము.

రామలక్ష్మణు లట్లు జటాయువునకు జలతర్పణాదులు గావించి పయనమై వనమున సీతను వెదకుచు, నిరృతిదిక్కుం బట్టిపోయిరి. ఆయిక్ష్వాకుకులులు విల్లును బాణంబులును ఖడ్గములును దాల్చి నిరృతిమూలగాఁబోయి, క్షుణ్ణము గానియొక మార్గమును బట్టిరి. ఆ మహాబలులు, గుల్మములును వృక్షములును నలుగడలఁ బరివేష్టించియు లతలావరించియు నున్నయాదండకారణ్యమును గడచిపోయిరి. ఆ మహారణ్యము, అంతటను మిట్టపల్లములుగలిగి చొరరాక ఘోరముగా కనుపట్టుచుండును, అందు మిక్కిలియు భయావహమైన దుష్టగజములును సింహములును దిరుగుచుండెను. దానిని గడచి నపిమ్మట నా మహాతేజులు జనస్థానమునుదాఁటి మూఁడుక్రోసులదూరము పోయి క్రౌంచారణ్య మను నొకవనమును బ్రవేశించిరి సీత యపహృతయగుటకు స్రుక్కుచు రామలక్ష్మణులు పలువన్నెలు గలమబ్బులగుంపులవలె నొప్పుచున్నదై పూమొగ్గలుగలుగుచున్న గువానిచే సంతుష్టమయినట్లు చూపట్టుచు, నానావిధ పక్షిసమూహములుగలిగి, బహువిధసర్పమృగములతోఁ గూడియున్న యా క్రౌంచవనమంతయు, విశ్రాంతికై యచ్చటచ్చట నిలుచుచు, సీతంజూడ నువ్విళులూరుచుఁ, గలయ వెదకిరి. దశరథకుమారు లాయన్నదమ్ములు క్రౌంచారణ్యమును దాఁటి మతంగాశ్రమమునకుఁ దూర్పుభాగమున మూఁడుక్రోసులు పోయి క్రౌంచారణ్యమునకును ఆ యాశ్రమమునకును నడుమ. ఘోరముగానున్న యొకానొకవనమునంతయుఁ జూచిరి. ఆ మహాభయంకరము లగుమృగపక్షులతోఁ గూడి నానావిధములైనజంతువులు నెరసి బొరసియుండఁగా వృక్షములచే క్రిక్కిఱిసి చొరరాకుండెను వారచ్చట పాతాళమువలె మిక్కిలియు లోఁతైన యొకగుహను గాంచిరి. అది యెప్పుడును జీఁకట్లు గ్రమ్మియుండును. ఆపురుషతిలకు లాగుహకుఁబోయి, దానిదాపున పెద్దకాయమును వికృతమయిన నోరును గల యొకరాక్షసిని జూచిరి. అంత, ఆరాక్షసి అల్పబుద్ధుల కతి భయమును కలిగించునదై యేన పుట్టించురూపముతో, బెడిదములయిన కన్నులు మీఱ, వ్రేలుకడుపును వాఁడి కోఱలును పొడవయిన రూపును, బిఱుసువాఱిన చర్మమును గలిగి, భయంకరములైనసింహాదిమృగములను భక్షించుచు, వికటాకృతితో వెండ్రుకలు విరియఁబోసికొన్నదై యన్నదమ్ము లా రామలక్ష్మణుల కచ్చటఁ గనుపట్టెను. అది యా వీరుల చెంతకు వచ్చి, యన్నముందట నడచుచున్న లక్ష్మణుని జూచి, 'రమ్ము; మనమిద్దఱము రమింతము' అని యతనిం బట్టుకొనెను. మఱియు నది లక్ష్మణుని బిగియఁ గవుఁగలించుకొని 'నేను అయోముఖ యను పేరు గలదానను. నీకు దొరకితిని. నీవు నాకుఁ బ్రియుఁడవు దొరకితివి. నాథా! వీరా! కావున నీవింక బ్రతికియుండువఱకుఁ బర్వతశిఖరములయందును, నదీపులినములయందును, నన్నుఁగూడి రమించుచుండుము' అనెను. అది యిట్లు చెప్పఁగా పగవారి పీఁచమడఁచు నాలక్ష్మణుఁడు కుపితుండై ఖడ్గమెత్తి, దాని చెవులును ముక్కును స్తనములనును తుండించెను.

ముక్కు చెవులు తుంచింపఁబడఁగానే,బెడిదపుఱాపు గలయా రాక్షసి వికృతస్వరమున బిగ్గఱ నఱచి వచ్చిన దారింబట్టి పరుగిడెను. అది పోఁగానే, శత్రుహంత లగునా యన్నదమ్ములు రామలక్ష్మణులు పరాక్రమంబు నూని గహనం బగువనంబునఁబోవఁగా,వారికీదుర్నిమిత్తములగపడెను.మహాతేజుండు గాన యదీనుండై నిర్మలమనంబుగలిగి, సద్వృత్తమునను కాయశుద్ధిని రాజిలులక్ష్మణుఁడు తేజము తుఱఁగలించుచున్న యన్నం జూచి చేతులుమోడ్చి 'నాయెడమబుజము మిక్కిలి యదురుచున్నవి. నామనస్సు వడఁకునట్లున్నది.బహుతరముగా దుర్నిమిత్తములు నాకగపడుచున్నవి. ఆర్యా! కాఁబట్టి నీ వాయితపడియుండుము. హితమగు నా వచనముచొప్పునఁ జేయుము. ఈ దుర్నిమిత్తములు నాకే తత్క్షణము భయము కలుగునని తెలుపుచున్నవి. మిక్కిలి భయంకరమై యీవంచులకమనుపక్షి యఱచుటఁ జూడఁగా మనకు యుద్ధమున జయముగలుగునని తెలుపుచున్నట్లున్నది'అనెను. అట్లు వా రిరువురు పరాక్రమంబున నావనమునంతయు సీతకై వెదకుచుండఁగా, అచ్చట నావనమునంతయు విఱుచునట్లు, గొప్పధ్వనియొకటి పుట్టెను. పెనువాయువు ఆకాశమునంతయు మిక్కిలియుఁ బూరించినట్లు, ఆవనమునందలి ధ్వనియు నాకాశమునంతయు నిండుచున్నదియుంబోలె చెలంగినది.రాముఁ డా శబ్ద మెచ్చటఁ బుట్టెనని తెలియఁగోరువాఁడై తమ్ముండును దానును బోయి యొకపొదయందు మిక్కిలి పెద్దకాయమును, విశాలమైనవక్షమును గల యొకరాక్షసునిం జూచెను.వా రిరువురును నచ్చట తమముందఱ నున్నవాని కడకుం బోయిరి. వాఁడు పొడవై, తలయును మెడయును లేక, నోరు కడుపునందుఁగలిగి యొకమొండెముగా నుండెను. వానికి దట్టములైన కఱుకువెంట్రుకలుగలిగి, పెనుకొండవలె మిక్కిలిపొడవై, నల్లనిమేఘమువలెఁజూపట్టుచు, భయంకరుఁడై యుఱుమువంటి స్వరముగలిగియుండెను. వానికి వక్షమునందుఁ గలనొసటిలో, కన్నొక్కటియుండెను. అది యగ్నిజ్వాలవలె మండుచు,పెద్ద ఱెప్పగలిగి గోరోచనపువన్నెతోఁగూడి, విఱివియు నిడుపునై, వడి గలచూడ్కులు నిగుడ్చుచు బెడిదముగానుండెను. వాఁడు పెద్దకోఱలుగలిగి పెలవులు నాకుచుండెను.వానినోరును మిక్కిలియు పెద్దదిగానుండెను.వాఁడుమిక్కిలి భయంకరములైనయెలుఁగుబంట్లను, సింగములను,మృగములను, ఏనుంగులనుబట్టి భక్షించుచుండెను. భయంకరములై యొక్కొకయామడ నిడివిగల చేతులను రెంటిని ఇటునటు విదుర్చుచు నానావిధము లగునెలుఁగుబంట్లను,పక్షిసమూహములను మృగముల గమికాండ్రను గొప్పమృగములను పెక్కింటినిబట్టి యిష్టములైనవాని దగ్గఱకి లాగికొనుచును అనిష్టములైనవానిని విడిచిపెట్టుచును (లేక తనయొద్దకు లాగికొనుచును విశేషించి యీడ్చికొనుచును) నుండి, దారసించి వచ్చిన యాయన్నదమ్ములదారి నడ్డగించియుండెను. రామలక్ష్మణులు వానినిసమీపించి యంత క్రోశమాత్రము దాపునకుఁ బోయిరి. వాఁడు మహాకాయుండును, మిక్కిలియు భయంకరుండునై, భుజములచే మృగాదులను బెనఁచుచు, దేహస్థితినిజూడ నెప్పుడును

తలలేని పట్టిమొండెమువలె మిక్కిలియు ఘోరముగా వారికిఁ జూపట్టుచుండెను. ఆ కబంధునిబాహువు లతి దీర్ఘములుగావున నాఁ డానిదుదబాహువులను జాఁచి రామ లక్ష్మణుల నిద్దఱిని బలిమితో నొక్కటిగా నదుముచుఁ బట్టికొనెను. కత్తులును, దృఢమైన విండ్లును దాల్చి, మిక్కుటపుఁదేజమున మేనులు రాజిల్ల నుల్లసిల్లుమహాబలవంతు లా యన్నదమ్ము లిర్వురును, కబంధుఁడు తనబాహువులచేఁ బట్టి యాకర్షించుచుండఁగా, పరవశులైరి. ఆ యవస్థయందు శూరుఁ డగురాముఁడు ధైర్యమునూని కొంచెమేనియు వ్యథనొందకుండెను. లక్ష్మణుఁడు మాత్రము బాలుఁ డగుటచేతను, ధైర్యమునఁ బూనకుండుటవలనను, మిక్కిలియు వ్యథ నొందెను. రాముని తమ్ముఁడు లక్ష్మణుఁడు విషణ్ణుఁడై రామునింజూచి 'వీరోత్తమా! నేను రాక్షసునిచేతంజిక్కి పరవశుఁడై యున్నాను జూడుము. న న్నొకనిని వదలి(వినియోగించి)నీవు విడిపించుకొనుము(నన్ను విడువుము).నీవు నన్ను ఈభూతమునకు బలియిచ్చి సుఖముగా పరుగెత్తిపొమ్ము.నీవు సీతనుశీఘ్రముగానే పొందఁగలవని నాయభిప్రాయము. కాకుత్స్థా!నీవు పోయి పిత్రుపైతామహ మగుభూమండలమును బొంది యందు రాజ్యపరిపాలనంబు సేయుచు దివ్యసుఖము లనుభవించుచు న న్నెల్లప్పుడుఁ దలఁచుకొనుచుండవలయును' అనెను. లక్ష్మణుఁ డిట్లుచెప్పఁగా రాముఁ డతనితో 'వీరా! భయపడకు. నీయట్టివాఁ డిట్లు విషాదము నొందఁడే'యనెను. ఇంతలో క్రూరుఁ డగునామేటిరాక్షసుఁడు కబంధుఁడు అన్నదమ్ములను రామలక్ష్మణులంజూచి, యెఱుపువంటి వేరెలుంగున 'మీరిద్దఱెవరు?ఆఁబోతుమూఁపులవంటి మూఁపులును, పెనుఖడ్గములును విండ్లను దాల్చియున్నారే! భయంకరమైన యీ ప్రదేశమునకువచ్చి నా కాహారమయితిరి. ఇచ్చట మీ కేమికార్యమున్నదిచెప్పుఁడు. ఎందులకని మీరిక్కడికి వచ్చితిరి?మీ కేమిప్రయోజనము లేదుగాని నాకుఁజూడఁగా నే నాఁకట నకనకలాడుచున్నయిచ్చోటికిమీరు నాయాఁకలి దీఱుటకే వచ్చినట్లున్నది. విండ్లును బాణములును ఖడ్గములును దాల్చి వాఁడికొమ్ములు గలయాఁబోతులవలె మీ రున్నారు. అయినను నావాతం బడితిరిగాన యిఁక మరల మీకుఁబ్రాణములు దక్కుట యరిది' అనెను. దురాత్ముం డగునాకబంధుఁ డాడినమాట విని, రాముఁడు నోరెండ లక్ష్మణునిఁజూచి'సత్యపరాక్రమా! మొదటరాజ్యభ్రంశము,అవ్వలవనవాసము,పిదప సీతాహరణము,అని యిట్లుకష్టముమీఁద మఱిమఱి యినుమడి కష్టము పడుచును,ఇంతవఱకు నా ప్రియురాలిని సీతను బొందనే పొందమైతిమి. ఇంతటిలోఁదీరక మన కిద్దఱకును చిక్కియున్నప్రాణములనుగూడ తుదముట్టించుటకే యీభయంకరమైన వ్యసనము దాపరించినది. పురుషతిలకా! సమస్తభూతముల విషయమందును కాలము మిక్కిలియు బలవంతమైయున్నది.దానిబలిమి కెదురులేదు. ఇంతేల?చూడు.నీవును నేనును మహాబలపరాక్రమశాలురయ్యును, మనల నది వ్యసనములచే మోహపెట్టుచున్నదే!లక్ష్మణా! సమస్తభూతముల విషయమందును కాలమునకు మిక్కిలి ప్రేఁగైన

దేదియు లేదు. రణాంగణమునందును శూరులును బలవంతులును అస్త్రములం దాఱి తేఱినవా రగువారును, కాలము రాఁగా, ఇసుకతోఁ గట్టఁబడిన యనకట్టలవలె నశించెదరు' అని చెప్పెను. దృఢంబును నమోఘమునైన పరాక్రమున నొప్పి మిక్కిలి యుఁ గీర్తిగాంచి యతిప్రతాపమున వెలుఁగు దశరథకుమారుఁడు రాముఁడు మహాపౌరుషశాలి యగు లక్ష్మణుఁడు దీనుఁ డగుటఁ జూచి, ధైర్యమున తనబుద్ధిని తానే స్థిరము గావించికొనెను. ఇది యఱువదితొమ్మిదవసర్గము.

---

రామలక్ష్మణులు కబంధుని బాహువులు దెగనఱుకఁగా వానికిఁ బూర్వజన్మస్మృతి కలుగుట.

కబంధుఁడు బాహుపాశంబులఁ జెనఁచిపట్టఁగాఁ బట్టువడి యన్నదమ్ములు రామలక్ష్మణు లచ్చట నూరక నిలుచుండుటం జూచి, వాఁడు 'క్షత్రియతిలకులారా! దైవము మిమ్ము నా కాహారముగఁ జూపియున్నదే. ఆఁకట నకనకలాఁడుచున్న నన్నుఁ జూచి మతిదప్పి భయపడినట్లు ఊరక యేల నిలుచున్నారు? మీకుఁ బ్రాణములు దక్కు టెక్కడిది?' అనెను. లక్ష్మణుఁ డామాట విని యార్తింబొంది యెట్టకేలకు పరాక్రమంబున కుద్యమించి యప్పటికిఁ దగిన హితవాక్యమున 'ఈ రాక్షసాధముఁడు, నిన్నును నన్నును ఇఁక ముందు శీఘ్రముగా మ్రింగును. కావున వీని పెనుబాహువులను రెంటిని ఖడ్గములచే నఱకుదము. భయంకరాకారుఁడై పెద్దకాయము దాల్చియున్న యీ రాక్షసుఁడు, తనబుజములచేతనే పరాక్రమము నెఱపుచు లోకమునంతయు లోఁకువఁ జేసినది కాక మనలనుగూడఁ జంపఁగోరుచున్నాఁడు. రాజా! *అశ్వమేధయాగమధ్యమునకు తేఁబడిన యారణ్యపశువులను వధింపఁగూడని యట్లు, ఏదులేమియుఁ జేయలేని వారలను రాజు వధింపరాదు' అనెను. రౌద్రాకారుఁ డగు నా రాక్షసుఁడు వారిద్దఱు గుజగుజలాడుకొన్నది విని, కుపితుఁడై యంత నోరువిచ్చి వారలను మ్రింగ మొదలుపెట్టి చేతులతో లాగెను. అంత రామలక్ష్మణులు అయ్యై దేశకాలములందు అయ్యై కార్యములు చేయవలయునని చక్కఁగాఁ దెలిసినవారు గావున, ఖడ్గములం గొని, సులువుగా నఱుకంగూడుటచే †మిక్కిలియు నుబ్బున, వాని చేతుల రెంటిని మూఁపుల వఱకును ఖండించిరి. అంత సమర్థుఁ డగు రాముఁడు వేగమున నొక్కింతయు నడ్డిగాకుండునట్లు కబంధుని కుడిబుజమును ఖండించెను; వీరుఁ డగు లక్ష్మణుఁడు‡ ఎడమచేతిని తుండించెను. మహాబాహుఁ డగు నా కబంధుఁడు చేతులు దెగి పెద్దయెలుఁగున

---

* ఇందులకు 'క్రతుమధ్యోపనీతానాం పశూనామివ రాఘవ' అని మూలము 'క్రతుమధ్యోపనీతానాం' అని మహేశ్వరతీర్థపాఠము-క్రతువునడుమనుండి యవ్వలికిఁ గొనిపోఁబడినట్టి—అనఁగా క్రతువునకు బాహ్యమైనట్టి పశువులను జంపుట పాపమని యర్థము. ఇది సరసముగా నున్నది.

† దీనిచే రాక్షసుని నడివైపువనే లక్ష్మణుఁడు పోవుటఁ దెలియునది.

‡ ఇందులకు 'సుసంభ్రాంతౌ' అని గోవిందరాజీయము. 'సుసంవిగ్నౌ' అని తీర్థీయ పాఠము. రెండ పదానికి 'మిక్కిలిభీతులై' అని రామలక్ష్మణులకు విశేషణముగా నర్థము గ్రాహ్యము.



708 రామలక్ష్మణులు కబంధుని బాహువులను దెగనఱుకుట.

నఱచుచు, మేఘమువలె, భూమిని ఆకాశమునను [illegible] మాఱు మ్రోగునట్లు గర్జిల్లుచు, [illegible]. ఆ రాముఁడు [illegible] చేతులను [illegible] 'మీ రెవ్వరు?' అని యడిగెను. [illegible] లక్ష్మణుఁడు [illegible] రాముని వృత్తాంతము నిట్లని చెప్పెను 'ఇతఁడు ఇక్ష్వాకు వంశ్యుఁడు [illegible] కుమారుఁడు. ఇతని రాముఁడని పిలుతురు. నే నితని తమ్ముఁడను. నా పేరు లక్ష్మణుఁడని తెలియుము. దేవ ప్రకాశుఁడగు రాముఁడు, విజన మగువనమున వాసము చేయుచుండఁగా, ఇతని భార్యను రాక్షసుఁ డొకఁడు అపహరించి కొనిపోయినాఁడు. మే మామెను వెదకు కొనుచు నిచటికి వచ్చితిమి. నీ వెవ్వఁడవు? కబంధమువలె తలలేక కాళ్ళులును లేక, రొమ్మునందుఁ బ్రకాశమానంబగు నోరు గలిగి, యుదరమునందుఁ బొరలుచున్నా వేల?' అని యడిగెను. లక్ష్మణుఁ డిట్లడుగగా కబంధుఁడు తొల్లి తన కింద్రుఁడు చెప్పిన మాటలం దలఁచుకొని, శాపము తీరుకాలము వచ్చినదని మిక్కిలి సంతుష్టుఁడై "పురుషశ్రేష్ఠులారా! మీకు స్వాగతము. నా భాగ్యవశమున మీ దర్శనము నాకుఁ గలిగినది. నాభాగ్యవశముననే మీరు నా మూఁపులు రెంటిని ఖండించుటయు నాకుఁ బ్రాప్తించినది. పురుషతిలకా! నాయవినయదోషమున నా కీ వికృతరూపము గలిగిన విధమంతయు నీకు యథార్థముగాఁ జెప్పెదను వినుము" ఇది డెబ్బదియవసర్గము.

---

కబంధుఁడు తన వృత్తాంతమును జెప్పి శాపమోచనమునకై తన శరీరమును దహించునట్లు చేయుట.

"రామా! మహాబాహూ! మహాబలపరాక్రమా! తొల్లి, నాకు, చంద్రునికిని ఇంద్రునకును సూర్యునికినిం బోలె అచింత్యవిభవమై ముల్లోకములఁ బ్రసిద్ధిగాంచిన దివ్యరూపము గలిగియుండెను. రామా! అట్టి సుందరాకారుఁ డగు నేను, లోకమునకు దిగులు గొలుపునట్టి యీ వికృతరూపమును దాల్చి వనములనుండు ఋషులను భయపెట్టుచుంటిని. అంత నొకప్పుడు పలువిధములైన కంజమూలాది వన్యములను సేకరించుకొనుటకై స్థూలశిరుఁ డనునొకముని రాఁగా నే నీరూపముతో నతఁడు సంతరించిన వన్యపదార్థముల నపహరించి యుండఁగా, అతనికిఁ గోపము పుట్టెను. ఆ స్థూలశిరుఁడు ఘోరశాపము నా కిచ్చువాఁడై నన్ను జూచి 'క్రూరంబును నిందితమునైన యీ రూపమే నీ కెల్లప్పుడు నుండుఁగాక'యని చెప్పెను. నేను కుపితుఁ డగునమ్మహర్షిని జూచి 'మీ మవమానించినందులకై నాకుఁ గలిగినయీ శాపమునకు అంతము నను గ్రహింపుఁ'డని ప్రార్థింపఁగా నతఁడు 'ఎప్పుడు రాముఁడు విజనం బగువనమునకు వచ్చి నీ చేతులు తుండించి నిన్ను దహించునో యప్పుడు నీవు

శాపము వీడి, సుందరమును గొప్పదియు నయిననీ సొంతరూపమును బొందఁగలవు’ అనెను. ‘ఘోరరూపముగలిగినను ఈ కబంధరూపమెట్లువచ్చె’ నందువా? లక్ష్మణా! నేను దనువంశజుఁ *డైనశ్రీ యనువానిపుత్త్రుఁడ నని యెఱుంగుము. మునిశాపమునఁ గలిగిన ఘోరరూపమే కాక, యుద్ధభూమియందు, ఇంద్రునికోపంబున, ఈ కబంధరూపమును ప్రాప్తించినది. ‘ఇంద్రునితో పోరునంతసామర్థ్యము నీ కెక్కడిది?’ యందువా? నేను ఋషిశాపమున ఘోరాకారము నొందినపిదప నా కులశత్రుఁడైనయింద్రుని జయించుటకై యుగ్రమగుతపము గావించి బ్రహ్మదేవుని సంతోషపెట్టితిని. అతఁడు నాకు దీర్ఘాయువు నొసంగెను. అంత నాకు అజ్ఞానమును తలబిరుసుతనమును గలిగినది. దీర్ఘాయువును బొందితిని. ‘ఇంక నన్ను దేవేంద్రుఁ డేమి చేయఁగలఁడు’ అను తలంపు నూని నేను యుద్ధమున దేవేంద్రునిఁ దాఁకొంటిని. ఆ యింద్రుఁడు నూఱంచులవా లగువజ్రాయుధమును బ్రయోగింపఁగా, దానిచే నా తొడలు కడుపులోనికిని తల ఱొమ్ములోనికిని జొనుపఁబడినవి. నే నిట్లు వట్టి మొండెమువలె నయితిని. ఇందులకుఁ దాళక నన్నుఁ జంపివైవుమని నే నెంత బతిమాలుకొన్నను, ఇంద్రుఁడు ‘నిన్ను యమపురికిఁ బంపను. బ్రహ్మ నాఁడు నీకుఁ జెప్పినమాట సత్యమై యుండుఁగాక’ యనెను. అంత నేను దేవేంద్రునితో ‘వజ్రాయుధముచే, గొట్టువడితిని; దానిచే తొడలును తలయును నోరును భగ్నములైనవి. తినుటకును నోరును లేకుండఁగా నాకాహార మెట్లు? నిరాహారుఁడనై, కొంతకాలమా! మిక్కిలియు దీర్ఘకాల మెట్లు బ్రతుక నేర్తును?’ అని చెప్పితిని. నే నిట్లు చెప్పఁగా, ఇంద్రుఁడు ఒకయోజనమునిడివి గలబాహువుల రెంటి నొసఁగెను. మఱియు నాకడుపు నందు కఱకు కోఱలతోఁగూడిననో రొకటిని గల్పించెను. అట్లున్న నేను, ఇవ్వనమునకు వచ్చు సింగములను ఏనుంగులను మృగములను వ్యాఘ్రములను నలుగడల దీర్ఘములైన భుజములను బఱపి పట్టి లాగికొని భక్షించుచున్నాను. ఇంద్రుఁడు నాతో ‘ఎప్పుడు రాముఁడును లక్ష్మణుఁడును వచ్చి యుద్ధమున నీ బాహువులను ఛేదింతురో యప్పుడు స్వర్గమును బొందుదువు’ అని చెప్పెను. రామా! రాజసత్తమా! నే నిట్టిశరీరమును బొందినవాఁడనై యీ వనమునం దేదేది నాకంటఁబడునో దానినంతయుఁ బట్టికొని తినవలయుననియే మిక్కిలి యిష్టపడుచుందును గాని యొక్కటినైనను అభక్ష్యమని విడుచుటలేదు. ఋషిమాటను నమ్మి యవశ్యము రాముఁడు నాపట్టునకు వచ్చి చిక్కఁగలఁడు అని తలఁచుచుందును. ఈ తలంపునే మున్నిడుకొని నావికారదేహమును త్యజించుటకై పాటుపడుచు నం

---

*ఇందులకు ‘శ్రియావిరాజితంపుత్రం దనోస్త్వం విద్ధిలక్ష్మణ’ అనిమూలము. సంపదచేత వెలుఁగుచున్న వాఁడగు దనువుకుమారుఁడు’ అనియర్థము. అయినను కిష్కింధాకాండమున ‘దనుర్నామ శ్రియః పుత్రః శాపాద్రాక్షసతాం గతః’ ‘శ్రీయనువాని పుత్రుఁడు దనువు అనువాఁడు’ అనియుండుటచే ఇచట ‘శ్రియోవిరాజితం పుత్రం’ అనుపాఠమే యుచితమని తోఁచుచున్నది.

దులకై రాముఁడును నాభార్యఁ జిక్కునాయని దొరకినవానినన్నిటిని బట్టికొనుటకు నా కెంతయు నిష్టముగానుండును. రామా! నీ వా రాముఁడే యగుదువు. నీకు శుభంబగుఁ గాక. ఏలన నన్ను వధించుట మఱియొకని కెంతమాత్రము నలవిగాదు. ఇట్లని యథార్థమునే యా ఋషి చెప్పెను. పురుషతిలకా! మీరలిద్దఱు నాకగ్ని సంస్కారముసేసితిరేని పిదప నేను యోచనచెప్పి మీకు బుద్ధిసాహాయ్యము చేయుదును. అంతేకాక మీకుఁ దగినమిత్త్రునిఁగూడ నుపదేశించెదను'' అనెను. దనువంశ్యుఁ డాకబంధుఁ డిట్లు చెప్పఁగా ధర్మాత్ముఁ డగురాముఁడు, లక్ష్మణుఁడు దగ్గఱ నుండి వినుచుండఁగా వానితో 'నేను నా తమ్ముఁడును జనస్థానమునుండి వెడలి యొకచోటికిఁబోయి యుండఁగా, అప్పుడు రావణుఁడు మే మెవ్వరును లేకుండుటఁ జేసి కీర్తిమతి యగునా సతిని సీతను సుఖముగా నపహరించికొనిపోయెను. ఆ రాక్షసుని పేరుమాత్రము ఆ పుం డగుజటాయువునివలన నాకుఁ దెలియునుగాని వాని రూపుగాని యునికిపట్టుగాని ప్రభావముగాని మాకును మాపురజనులకును ఎంతమాత్రము దెలియవు. మేము దుఃఖమునఁ బొక్కుచు దిక్కుమాలి యి ట్లల్లాడుచున్న వారము. మఱియు పరోపకారము చేయుచుండువారము. మావంటివారల విషయమై దయయుంచుట యొప్పిదమైనది. వీరా! మేము, ఏనుంగులు విఱిచి బహుకాల మగుటచే చక్కఁగా నెండియుండు కట్టెలఁ దెచ్చి పెద్దపల్లము సిద్ధముచేసి, యందు నిన్ను దహించెదము. నీవు నిజముగాఁ దెలియుదువేని, సీతను, ఎవ్వఁడు, ఎచ్చటికిఁ గొంపోయెనో నాకుఁ దెలియఁజెప్పుము. ఇట్లు కలరూపునఁ జెప్పుట నా కెంతయు కల్యాణము సుమీ. ఈపాటి శుభము గావింపుము' అనెను. రాముఁ డిట్లు చెప్పఁగా యాదనువంశ్యుఁడు కబంధుఁ డా మాటనేర్పరితో సైతము మాటాడ నిపుణుఁడు గావున మిక్కిలి యెన లేనివాక్యమున నతనింజూచి 'నాకు దివ్యజ్ఞానము లేదు. కాన సీతజాడ నే నెఱుఁగను. నన్ను దహించిన యైనపిదప నా నిజరూపమునుబొంది, సీతను, నేనై చెప్ప లేకపోయినను సీత నెఱుఁగఁగలవానిని జెప్పెదను. ప్రభూ! దహింపఁబడక మున్ను, నాకు నీభార్య నపహరించినమహావీర్యశాలి యగురాక్షసుని దెలిసికొనఁ దరముకాదు. రామా! శాపదోషముచే నాదివ్యజ్ఞానము నశించినది. అట్లు నేను జేసికొన్న దుష్కృతమువలననే లోకనిందితమైనయీ రూపము దాపురమైనది. రామా! సూర్యుఁడు తనగుఱ్ఱములు బడలఁగా అస్తమయము నొందుటకు మునుపే నన్నుఁ బల్లమునందుంచి చక్కఁగాఁ గాలునట్లు దహింపుము. వీరా! రఘునందనా! నీవు నన్నుఁ బల్లంబునందుంచి చక్కఁగా దహించిన పిదప, నేను సీత నపహరించిన రాక్షసుని ఎవఁడెఱుంగునో వానిని నీకుఁ జెప్పెదను. రామా! అతఁడు నీతియుక్తమైన నడవడిగలవాఁడు; కాన నతనితో నీవు చెలిమిచేయవలయును. అతఁడు తీవ్రపరాక్రమ శాలి; కావున నీకుఁ బ్రీతితో సాహాయ్యముగావించును. రామా! * అతనికిఁ దెలి

---

* ఈకబంధుఁడు రావణుని ఎఱుఁగఁడుగాని సుగ్రీవుని ఎఱుఁగును. కావున 'ఒక కారణమును

యని చోటు ముల్లోకములందును లేదు. అతఁడు వే ఱొక కారణమునుబట్టి మున్ను సమస్త లోకములను దిరిగియున్నవాఁడు' అనెను. ఇది డెబ్బదియొకఁడవసర్గము.

---

{కబంధుఁడు సంస్కారమునొంది నిజరూపముఁ బొంది తగినమిత్రుని రామునకుఁ దెలుపుట.}

వీరులైనయా నరపతులు కబంధుఁడు చెప్పినది విని, వాని కళేబరమును పర్వతములోని యొకపల్లముంజేర్చి యందు నిప్పంటించిరి. లక్ష్మణుఁడు చక్కఁగా మండిన పెద్దకొఱవులను నలుప్రక్కలం బెట్టి చితిని లెస్సగా రగులుకొల్పఁగా అది యంతటను చక్కఁగా మండెను. ఆ కబంధుని పెనుకళేబరము నేతిముద్దవలె నున్నను మెదడు మిక్కిలి పెరిఁగియుండుటవలన, దానిని అగ్ని మెల్ల మెల్లఁగా దహించెను. మహాబలుఁ డగునాకబంధుఁ డంత శీఘ్రముగా చితిని ద్రోసిపుచ్చి నిర్మలము లయిన వస్త్రములను దివ్యం బగుమాలయును దాల్చి, పొగలేని యగ్నివలెఁ బ్రకాశించుచు, అందుండి లేచెను. అంత నతఁడు మిక్కిలి వెలుఁగుచు, మేలయినయచ్చంపువస్త్రములనుగట్టి, అంగప్రత్యంగములయం దన్నిటను భూషణములు దాల్చి, మిక్కిలి సంతుష్టుఁడై వేగమున నాచితినుండి పయికి నెగసెను. అమ్మహాతేజుఁడు *హంసలు పూన్పంబడి ధగధగ మెఱయుచు మిక్కిలి కీర్తి గాంచినవిమానమున నెలకొని తన ప్రభచే దశదిశల వెలిఁగించు చుండెను. ఆ కబంధుఁ డంతరిక్షముననుండి రాముం జూచి "రామా! నీకు సీత యెట్లు దొరకునో కలరూపునఁ జెప్పెదను వినుము. రామా! లోకమున (సంధి, విగ్రహము, యానము, ఆసనము, ద్వైధీభావము, సమాశ్రయము) అని యుపాయము లాఱు గలవు. వానింబట్టియే రాజులు తాము చేయు కార్యముల నెల్ల విమర్శించు కొందురు. 'ఉపాయములవలన నేమి' యందువా? దురవస్థ నొందినవాఁడు తనవలెనే దురవస్థ నొందినవానితోఁ గూడికొని కార్యము సాధించుకొనును. రామా! నీవు, భార్య యపహృతయై మహా వ్యసనము నొంది యున్నవాఁడవు గావున, నీవును లక్ష్మణుఁడును దురవస్థనొంది కీడ్పడియున్నారు. సుహృద్రత్నమా! అట్లు కావున, దురవస్థాపీడితుఁడ వగునీవు నీయట్లు దురవస్థపడి యున్నవాని నొకనిని అవశ్యము నీకు స్నేహితునిగాఁ జేసికొనవలయును. అట్లు చేయని యెడల నీకుఁ గార్యసిద్ధి యగునని యెంత యాలోచించినను నాకుఁ దోఁపలేదు. రామా! అట్టివానిం జెప్పెదను వినుము. సుగ్రీవుం డనువానరుఁ డొక్కఁడుగలఁడు. అతనిని, అతని యన్నయు నింద్రపుత్త్రుఁడు నగువాలి కోపించి రాజ్యము వెడలఁగొట్టినాఁడు.

---

బట్టి' అనఁగా, అన్నతోడి విరోధమునుబట్టి సమస్తలోకములను దిరిగినాఁడని చెప్పినాఁడు. ఇట్లు సుగ్రీవు నెఱిఁగియుం డిన్న రాముఁడు దహించుటకుఁ బూర్వమే యతని పేరు చెప్పివైచినచో పిదప తనకుత్సితశరీరమును దహించుటకు రామునికి మనస్సుపుట్టక పోవునోయని ముందుగా చెప్పఁడయ్యెనని తెలియునది.

*హంసలు పూన్పఁబడినదనుటచే రాముని చేదగ్ధుండగుటంబట్టి బ్రహ్మలోకప్రాప్తిసూచితమగుచున్నది.

బలవంతుఁడగు నా వీరుఁడు సుగ్రీవుఁడు, పంపాసరః ప్రదేశమున రాజిలుచున్న ఋశ్యమూక మనుపర్వతమునందు నలువురు వానరులతోఁగూడ నివసించుచున్నాఁడు. ఆవానరేంద్రుఁడు మహావీర్యశాలి, తేజస్వి, అత్యంత కాంతిమంతుఁడు, సత్యసంధుఁడు, వినయసంపన్నుఁడు, ధైర్యవంతుఁడు, బుద్ధిమంతుఁడు, మిక్కిలియు గొప్పవాఁడు. మఱియు నతండు సమర్థుఁడు, ప్రౌఢుఁడు, కాంతిసంపన్నుఁడు, మహాబల పరాక్రముఁడు. ఇట్లు నీవంటిగుణసంపన్నుఁడు గావున నీకుఁ దగినమిత్రము. రామా! అతనియన్న వాలి, రాజ్యమునిమిత్తమై మహాబలుఁ డగునతనిని ఊరువెడలఁగొట్టినాఁడు. ఇట్లు నిన్నుఁబోలి దురవస్థయుఁ గలవాఁడుగావున నీకుఁ దగినమిత్రుఁడు. రామా! అతఁడు సీతను వెదకుటయందును, నీకు హితముగూర్చుటయందును, నీకుఁ దోడును స్నేహితుఁడునుగా నుండఁగలఁడు. నీవు మనమున దుఃఖింపకుము. ఇక్ష్వాకుకులతిలకా! మఱియును, ఏది యెట్లుకావలయునో అది యట్లే యగునుగాని దానిని వేఱువిధముగాఁ జేయనెవ్వరికి నలవిగాదు. కాలము నెవ్వరు గడవనేరరుగదా. రామా! నీ విచ్చటనుండి బయలుదేఱి శీఘ్రమున మహాబలవంతుఁడైన యాసుగ్రీవునొద్దకుఁ బొమ్ము. రామా! నీ విప్పుడు వేగముగా నిచ్చటనుండి పోయి సుగ్రీవునిం జేరి, మీయిరువురలో నొండొరులకు మరల ద్రోహబుద్ధి గలుగకుండుటకై మండుచున్నయగ్నిని సాక్షిగా నుంచుకొని యతనితోఁ జెలిమిచేసికొనుము. ఆసుగ్రీవుని కేవల మొకవానరుఁడని అవమానింపరాదుచుమీ. అతఁడు వానరప్రభుఁడు, నెనరుగలవాఁడు, కామరూపి. తానును ఆపన్నుఁడై సహాయము గావలసియున్నవాఁడు గావున నీతోడి చెలిమి నక్కఱతోఁ గయికొనును. మఱియుఁ బరాక్రమశాలి. కావున నతనిని చుల్కఁగాఁ దలఁపవలదు. మీ రిరువురును, ఇప్పు డాసుగ్రీవుఁడు గావింపఁగోరిన కార్యమును సాధించుటకు సమర్థులరుగదా. అతఁడును, తనకార్యము నెఱవేఱినను, ఇఁక మీఁద నెఱవేఱనున్నను, మీకార్యమును చేసిపుచ్చును. అతఁడు ఋక్షరజుని క్షేత్రజుఁడు; సూర్యుని ఔరసపుత్రుఁడు; వాలితో వైరముచేసికొని యతనివలని భయమున పంపాతీరమున సంచరించుచున్నాఁడు. రామా! ఆ వానరోత్తముఁడు ఋశ్యమూకమునఁ గాఁపున్నాఁడు. అచటివనంబులఁ దిరుగుచుండును. నీవు పోయి శీఘ్రమున, అగ్నిసాక్షికముగానే కాక, ఆయుధసాక్షికముగాను, శపథముచేసికొని యతనితోఁ జెలిమిగావింపుము. ఆవానరోత్తముఁడు లోకమున నరమాంసాహారులు రాక్షసు లుండు స్థానములన్నిటిని తనకౌశలమున నెఱింగియున్నాఁడుచుమీ. అరిందమా! సహస్రకిరణుఁ డగుసూర్యుఁ డెంతవఱకు నెండగాయునో యంతవఱకు ఈలోకమునం దాసుగ్రీవునికిఁ దెలియనిప్రదేశ మేదియుఁ లేదు. అతఁడు వానరులంగూడి, నదులను విశాలము లగుపర్వతములను, దుర్గమము లగుపర్వతప్రదేశములను గుహలను వెదకి,నీపత్ని యున్నస్థలమును కనుఁగొనఁగలఁడు. నిన్నెడఁబాసి పరితపించుచున్న సీతను వెదకుటకై, యతఁడు మహాకాయు లగువానరులను, నలుదిక్కులకుఁ బంపును. అతఁడు రా

వణునింట పాతివ్రత్యంబు సెడక యున్నవరారోహను సీతను కనుఁగొనఁగలఁడు. ఆ వానరశ్రేష్ఠుడు నీప్రియురా లగుసీత, మేరుశిఖరాగ్రముననున్నను, పాతాళతలమును బ్రవేశించియున్నను అచ్చటికిఁబోయి రాక్షసులనెల్ల వధించి నీకు మరలఁ దెచ్చి యొసంగఁగలఁడు' అనెను. ఇదిడెబ్బదిరెండవసర్గము.

{ కబంధుఁడు రామునికి సుగ్రీవుఁ డుండుస్థానమునకు
మార్గమును జెప్పి యంతర్హితుఁ డగుట.

కార్యజ్ఞుఁ డగునాకబంధుఁడు ఇట్లు రామునకు సీతను బొందునుపాయమును దెలిపి, మరల అర్థయుక్తం బగువాక్యమున నతనింజూచి, 'రామా! ఇదె పడమటి దిక్కున నేరేడుచెట్లు, మోరటచెట్లు, పనసచెట్లు, జువ్విచెట్లు, మఱ్ఱిచెట్లు, తుమ్మికిచెట్లును, రావిచెట్లు, కొండగోఁగుచెట్లు, మామిడిచెట్లు, మఱియు నితరము లైనవె క్కువృక్షములును, చంద్రచెట్లును పొన్నలు బొట్టుగులు, కానుగుచెట్లు, నల్లయశోకపుఁజెట్లు, కడపచెట్లు, పూచినగన్నేరుచెట్లును, జీడిచెట్లు, అశోకపుచెట్లు, రక్తచందనపుచెట్లు, వేఁపచెట్లు, అన్నియును పుష్పితములై మనోహరముగాఁ బ్రకాశించుచున్నవే! ఇదియే శుభమైనమార్గము. మీ రావృక్షముల నెక్కిగాని లేక బలంబున వానిఁ బడఁద్రోచికాని. అమృతప్రాయములగు వానిఫలములను భక్షించుచుఁ బోవఁగలరు. రామా! ఆ వనమును దాఁటఁగానే వృక్షములు పుష్పించినవై నందనవనముంబోలుచు నుత్తరకురుదేశమువలె సర్వకామసమృద్ధమై మఱియొక వనమున్నది. అందలివృక్షములు ఒక్కొక్కటియును గోరుఫలము లన్నియుఁ గలిగి, తేనియ దొరఁగుచుండును. కుబేరుని చైత్రరథవనమునందుఁబోలె ఆవనమున నెప్పుడును సర్వ ఋతువులును సన్నిహితములై యుండును. ఆవనమునం దంతటను వృక్షములు మిక్కిలి పెద్దశాఖలుగలిగి ఫలంబులబరువున వంగి యచ్చట నున్న మేఘములవలెను పర్వతములవలెను ప్రకాశించుచుండును. లక్ష్మణుఁ డావృక్షముల నెక్కిగాని లేక వానిని సులువుగా నేలం బడఁద్రోసికాని, యమృతప్రాయము లగుఫలములం గోసి నీ కొసంగఁగలఁడు. రామా! అంత,మీరు లగుమీరు కొండనుండి కొండకును వనమున నుండి వనమునకు నిట్లు త్తమము లైనప్రదేశములకు బయిం బయి పోయిపోయి యంత పంప యనుపుష్కరిణిని జేరఁగలరు. దానియందు మొరపరాలు గలుగవు. దానిదరులు చెడక గుత్తముగా నుండును. దాని రేవులు మిక్కిలి మిట్టయు లోఁతును గాక సమముగానుండును. అందు, పాఁచియుఁ గలుగదు; బురద లేమిచే మంచి యిసుక గట్టుచుండును. అందు తామరలును నల్లగలువలును జెలువు గులుకుచుండును. రామా! ఆ పంపాసరస్సునందు హంసలును మరగాళ్లకొంగలును కొంచపిట్టలును కురరములును (బెగ్గురులును) దానిజలముల విహరించుచు మధురరుతంబులు గూయు

చుండును. మే లయినయా పిట్టలు వధ మెట్టిదో యెఱుంగవుగావున మనుష్యులం జూచి భయపడవు. అవి కండబలుపుగలిగి నేతిముద్దలవలె నుండునుగావున మీరు భక్షింపఁగలరు. రామా! ఆ సరస్సునందు లక్ష్మణుఁడు, మంచి బలుపుగలిగి మిక్కిలి ముండ్లు లేక మేలయినవిగా నున్న గండుమీలు చొఱమీలు, రొయ్యమీలు మొదలుగాఁగల చేఁపలను బాణములచేఁ జంపి పయిపొలసులను ఱెక్కలను బుచ్చి, యినుపసలాకం గ్రుచ్చి పక్వము గావించి భక్తితో నీకుఁ బెట్టఁగలఁడు. నీ వట్లు యథేచ్ఛముగా మత్స్యములను భక్షించుచుండఁగా, ఈలక్ష్మణుఁడు, పువ్వుతంపరలపయిఁ బొలయుచుండుటచే తామరవాసనలు గుబాళించుచు, పాపహరమై మిక్కిలి చలువగాక యారోగ్యకరమై యెప్పుడు నచ్ఛమై వెండివలెను బటికమువలెను తిలతిలలాడు నిండయిన నీటిని పంపాసరస్సునుండి తామరాకుదొప్పలఁగొని తెచ్చి నీకొసంగఁగలఁడు. పురుషతిలకా! మిక్కిలి స్థూలములై వనములం గ్రుమ్మరుచుఁ గొండగుహలం బఱుండుచు, ఆఁబోతులవలె గర్జిలుచుండు సుందరములైన పందులును నీళ్లు ద్రావుటకై పంపకు రాఁగాఁ జూడఁగలవు. రామా! నీవు, సాయంకాలమున విహరించుచు, విరిసిన పువ్వుగుసలను దాల్చియుండు వృక్షములను, పంపాసరస్సునందలి చల్లని నీళ్లనుం జూడఁగా, దుఃఖము మాని నీమనస్సునకుఁ గొంతయూఱటగానుండును. రామా! నీ వచ్చట పువ్వులు నెరసి క్రిక్కిఱిసియుండు బొట్టుగుచెట్లను, కానుఁగుచెట్లను, వికసిల్లిన కలువలను, తామరలను జూచి దుఃఖము శమించి కొంత యూఱటగందువు. రామా! అచ్చట నాపువ్వులను గోసి గ్రుచ్చి దాల్చువాఁ డెవ్వఁడును లేఁడు. అవి వాఁడిపోవవు; మఱి రాలవు; క్రొత్తపువ్వులవలనే యెల్లపుడుఁ జూపట్టుచుండును. అచ్చట మతంగమహామునిశిష్యులగుమహర్షులు ఉత్తమసమాధిగలవా రుండిరి. ఆ మునులు తమ గురువునకై, వన్యపదార్థములఁ గొనిపోవునపుడు, వాని బరువుచే పీడితులు కాఁగా, వారి దేహమునుండి నేలంబడిన చెమటబిందువులన్నియు వారి తపోబలాతిశయమునం జేసి యపుడు పువ్వులయినవి. రామా! ఆ చెమటబిందువులు వాయువశమున చెట్లమీఁదఁ బడి పువ్వులై వారి తపోమహిమమున నాశము నొందకున్నవి. రామా! ఆ మతంగశిష్యులందఱును స్వర్గస్థులైరి. వారల పరిచారిక చిరజీవిని యగుసన్న్యాసిని శబరి యనుపేరుగలది మాత్ర మిప్పటికి నున్నది. రామా! ఎల్లప్పుడును గురుపరిచరణధర్మమందే నెలకొనియున్నట్టి యా శబరి, సర్వభూతనమస్కృతుఁడును దేవేంద్రసమానుఁడు నగు నీ దర్శనము నొంది, దివ్యలోకమునకుఁ బోఁగలదు. రామా! అంత నీ వా పంపాసరస్సు పశ్చిమతీరమునకుఁ బోదువేని, యచ్చట ఉత్తమంబై యితరులకుఁ గానరాక రహస్యమైయుండు శబర్యావాస మగు నాశ్రమపదమును జూడఁగలవు. ఆవనమునను, ఇఁకఁ జెప్పంబడు ఋశ్యమూకపర్వతమునందును, నానావిధములైన యేనుంగులు వలయునన్ని గలవు. అయినను, అయ్యాశ్రమమును, అచ్చటియేనుఁగులు ఎంతమాత్రమును జొరఁజాలవు. ఏలనఁగా నాయాశ్రమవనము మతంగమహర్షినిర్మాణముచేఁ గలిగినది. (అప్రభావ

మున సద్యోనుంగులు చొరనేరవు.) రామా! నందనవనమునకు సాటియై చైత్రరథము మొదలయిన దేవవనములతో సమానమై, పలువిధములైన పక్షులు నెరసిజెరసియుండు నావనమునందు నీవు దుఃఖమువీడి విహరింపఁగలవు. ఆ పంపాసరస్సునకు ముందటనే ఋశ్యమూకపర్వతమున్నది. అం దేనుఁగుఁబిల్లలు గాపుదలగా నలుగడల నుండుటంజేసి యెక్కుటకు మిక్కిలియుఁ గష్టమైయుండును. మఱియుఁ బూర్వకాలమున బ్రహ్మ 'ఇది యొకానొకనిమిత్తమునఁ బ్రశస్తినొందును' అని యనుగ్రహించియున్నవాఁడు. ఆప్రశస్తి యేమనుందువా? రామా! ఆ ఋశ్యమూకపర్వతశిఖరంబునఁ బరుండినపురుషుఁడు ఏధనమునుబొందినట్లు కలగనునో మేలుకొన్నపిమ్మట, ఆధనమును దప్పకపొందును. మఱియొక యతిశయమునుగలదు. పాపిష్ఠుఁడును దురాచారుఁడునగువాఁడుమాత్రము, ఆ పర్వతను నారోహింపఁజాలఁడు. ఎవ్వఁడైన దురాచారుఁడు పాపకర్ముఁడు దాని నారోహించునేని, రాక్షసులు, వానిని అచ్చటనే నిదురపోయినపుడు పట్టి వధింతురు. రామా! మతంగవనమునందలి యేనుంగులు పంపాసరస్సునందుఁ గ్రీడించుచుండఁగా, ఆధ్వని సమీపంబగుటవలన ఆఋశ్యమూకపర్వతంబుననుగూడ వినఁబడుచుండును. మేఘములవలె నల్లనై మిగుల బలవంతములగునందలి మేటియేనుంగులు, ఒక్కొకప్పుడు, పరస్పరము గొట్టుకొని నెత్తురు ధారలందోఁగి యంత వేఱువేఱుచెదరి విహరించుచుండును. వనములం గ్రుమ్మరుచుండు సద్యోనుంగులు పంపాసరస్సున నిర్మలంబై సుఖశీతంబునై యారోగ్యం బొసఁగుజలంబుద్రావి సుఖతంబులై వనములు ప్రవేశించును. నీవచ్చట నుండునెలుఁగుబంట్లను వ్యాఘ్రములను నీలమణులంబోలి కాంతిం దళ్కొత్తుచు జయశీలములైయొప్పు నల్లచాఱలదుప్పలను జూచి దుఃఖమువిడిగి సుఖము నొందుదువు. రామా! ఆపర్వతమునందు పెనురాయిచే మూయఁబడియుండు నొక గొప్పగుహ ప్రకాశించుచున్నది. దానిలోనికిఁ బోవుట మిక్కిలియుఁగష్టము. ఆ గుహ తూర్పుద్వారమున, తీరంబులందు ఫలమూలములతోఁ గూడినదై నానామృగసమన్వితమై చెలువుగులుకుచు చల్లనినీళ్లు నులసిల్లుచున్న యొక గొప్పమడుఁగున్నది. సుగ్రీవుండు నలువురు వానరులతోఁగూడి యా గుహయందున్నాఁడు. ఒకానొకప్పు డతఁడు విహారార్థము ఆ పర్వతపు శిఖరముపయినిం దిరుగును. ఒకప్పుడు భూమినిఁదిరుగును' అనెను. వీర్యశాలియగు నా కబంధుండు, ఇట్లు రామలక్ష్మణుల కిద్దఱికినిం జెప్పి, పుష్పమాలికావిలసితుఁడై సూర్యునింబోలె వెలుంగుచు రాముని యనుజ్ఞకై యాకాశంబునఁ గొంత నిలిచి ప్రకాశించెను. రామలక్ష్మణు లంత బయలుదేఱినవారై, యాకాశంబుననున్న మహాభాగుని కబంధుని సమీపించి 'నీవింకఁబోవచ్చును' అనిరి. అప్పుడు కబంధుండును వారిరువురం జూచి 'కార్యసిద్ధికొఱకు మీరలు పొండు'. అనిచెప్పి వారు మిక్కిలిప్రీతులై యనుమతి యొసఁగఁగా, పోయెను. అప్పు డాకబంధుండు, అట్లు దివ్యరూపమునొంది మహాతేజంబున సూర్యునివలె వెలుంగుచు ఆకాశంబునఁ గొంతదూరము పోయి మరల రామునింజూచి యాకాశముననిలిచి

(పునరావృత్తిరహిత మైనపరమపదమును) బొందెదను. 'నీయాచార్యులతోడఁ గూడనేయేల పోరా? దందువా? నేను పరిచరించుచుండిన మతంగశిష్యులు మా యాచార్యులు, నీవు చిత్రకూటమును చేరినప్పుడే, సాటి లేక వెలుంగుచున్న మేటి విమానముల నారోహించి యిచటనుండి దివ్యలోకమున కుద్గమించిరి. వారు ధర్మములను దెలిసినవారు; మఱియు రాఁగల వృత్తాంతమును దెలిసికొనుటకుం దగినట్టి పరమ భాగ్యమును బడసినవారు. కాఁబట్టి నాకుఁ బోఁటికి భగవత్ప్రాప్తి కుపాయమైన యోగము లేకపోయినను, ఆచార్య ప్రసాదమువలన భగవత్ప్రసాదము లభించి దానివలన సద్గతిని బొందుదువని యెఱిఁగి యా మహర్షులు నన్నుఁ జూచి * 'రాముఁడు నిన్నుఁ జూచుటకై యతిపవిత్ర మగునీయాశ్రమమునకు రాఁగలఁడు. అప్పుడు నీవు రాముని లక్ష్మణునిని, ఆతిథ్యసత్కారములతో రాఁబట్టుకొనవలయును. నీ వా రాముని దర్శించి, యా నిమిత్తమున, పునరావృత్తి లేని యుత్తమంబు లగుపుణ్యలోకంబుల నొందఁగలవు' అని చెప్పిరి. పురుషతిలకా! పురుషసింహమా! నేను నాయంతకు, నీ నిమిత్తమై, పంపాసరస్సు తీరములం బుట్టిన నానావిధము లైన ఫలమూలాది వన్యపదార్థములను, † వాని వాని జాతుల మాధుర్యమును బరీక్షించి మిక్కిలి తీయనివానిని, నీవు చిత్రకూటమునకు వచ్చినప్పటినుండి, సంతరించి పదిలముగా పెట్టుకొని యున్నాను" అనెను. శబరి యిట్లు చెప్పఁగా, ధర్మాత్ముఁడా రాముఁడు హీనజాతియయ్యు ఆచార్యప్రసాదమువలన నెప్పుడును బ్రహ్మజ్ఞానమునకు వెలిగాక తదనుసంధానపరాయణ యైనదానిం జూచి 'కబంధుని వలన, మహాత్ముం డగు నీ గురుని మతంగుని ప్రభావమును గలరూపున విన్నాను. ఆ ప్రభావమును, నీకుఁ జూప నిష్టముండు నేని, ప్రత్యక్షముగాఁ జూడఁగోరుచున్నాను' అనెను. రాముని నోట నుండి వెడలిన యావాక్యమును విన్నంతనే, శబరి వారిద్దఱికిని ఆ మహావనము నంతయును జూపెను. అది రామునితో 'రఘునందనా! గొప్ప మేఘమువలెఁ గారు

---

* దీనింబట్టి ఆచార్యశుశ్రూషణము భగవత్ప్రసాదమును గలిగించి తన్మూలముగా మోక్షమునొసంగునని చెప్పఁబడినదయ్యె. —గోవిందరాజులు.

† పాద్మపురాణమున శబరీప్రస్తావమున 'ప్రత్యుద్గమ్య ప్రణమ్యాథ నివేశ్య కుశవిష్టరే। పాదప్రక్షాళనం కృత్వా తత్తోయం పాపనాశనమ్। శిరసాధార్య పీత్వాచ వన్యైః పుష్పైరథార్చయత్। ఫలానిచ సుపక్వాని మూలాని మధురాణిచ। స్వయమాస్వాద్య మాధుర్యం పరీక్ష్య పరిభక్ష్యచ। పశ్చాన్నివేదయామాస రాఘవాభ్యాం దృఢవ్రతా। ఫలాన్యాస్వాద్యకాకుత్స్థ స్తస్యై ముక్తిం పరాందదౌ' 'రాముని కెదురొడ్డి మ్రొక్కి దర్భాసనమునఁగూర్చుండఁజేసి, పాదములు గడిగి పాపహరమైన యాజలమును శిరసునఁదాల్చి పానముచేసి యంత వన్యపుష్పములచే అర్చించినది. మిక్కిలి పక్వములైన ఫలములను తీయని మూలములను తానే పోయిచూచి వానిమాధుర్యమును బరీక్షించుటకై భక్షించి పిమ్మట రామలక్ష్మణులకు నివేదించెను. రాముఁడాఫలములనుభుజించి దానికి సుత్కృష్టమైన ముక్తినొసంగెను' అని యున్నది. కావున ఫలాదులను మాధుర్యము పరీక్షించి సేకరించిపెట్టియుండె నని తెలియునది.



778 శబరి రామునకు అతిథిసత్కారము సేయుట.

కొని కనుపట్టుచు మృగములను పక్షులును చెరసి బెరసియున్న యీ వనమును జూడుము. దీనినే మతంగవన మందురు. మహాద్యుతీ ! పరమాత్మవేత్తలగునాగురువులు * మంత్రవిదుల మంత్రములం బూజితం బగుగంగాదిపుణ్యజలములను నిచటికి రప్పించియున్నారు. ఇవిగో! దేవపూజా స్థానము లగువేదికలు పడమటితట్టు మిట్టగానున్నవి చూడుము. నేను జక్కఁగాఁ బరిచర్యలు సేయుచుండిననాగురువులు ముసలితనమువలన నలసి చేతులువడఁక వీనిని బువ్వులఁ బూజలుసేయుచుండిరి. † రామా ! వారల తపఃప్రభావమువలన, వేదులు,వారు సన్నిహితులుగాని యిప్పటికిఁగూడ, ఎనలేని కాంతిం దళుకొత్తుచు, దిక్కుల నెల్ల వెలిఁగించుచున్నవి చూడుము. మా గురువులు ఉపవాసముల నలసి సొలసి, యలసులై, పోవుటకు శక్తిలేక, మనస్సునఁ దలఁచుకొన్నంతమాత్రనే సప్తసముద్రములును వారి యాశ్రమమునకే వచ్చియున్నవి చూడుము. రఘునందనా ! వారీసప్తసముద్రముల స్నానముసేసి వృక్షములం దాఱవైచిన వల్కలములు, వారి యవయవస్పర్శమువలని ప్రభావమున, ఇప్పటికిని ఎండకున్నవి చూడుము. వారు దేవార్చనములు గావించుటకై కలువలను తక్కినపువ్వులను గూర్చి కట్టిన యీపూవుదండలును, భక్త్యతిశయముతో నర్పింపఁబడినవిగావున, ఇప్పటికిని వాడకున్నవి. ‡ నీవు, ఈవనమునంతయుఁ జూచితివి; వినవలసినదెల్లను వింటివి. ఇఁక నీయనుజ్ఞగొని యీ కళేబరమును విడువఁగోరెదను. ఈయాశ్రమ మెవ్వరిదో నే నెవ్వరి పరిచారికనో, ఆత్మవేత్తలైనయామునుల పాదమూలములనొందఁగోరుచున్నాను'' అనెను. రాముఁడును లక్ష్మణుఁడును, ఆశబరి మిక్కిలి ధర్మయుక్తముగా ఆచార్యవైభవమును బ్రదర్శించినవాక్యమును విని అది యేమాయయునులేక యథార్థముగా నుండుట యాశ్చర్యమని యెంచి మిక్కిలియు సంతోషమునొందిరి. అంత రాముఁడు ఆచార్యపరిచర్య దృఢవ్రతము గాఁ గలయా శబరింజూచి 'నీవు నన్ను భక్తితోఁ బూజించితివి. ఇఁక నీకోరినలోకమునకు యథేచ్ఛముగాఁ బొమ్ము' అనెను. రాముఁ డిట్లు చెప్పఁగా, జటలుదాల్చి వల్కలములను గృష్ణాజినమును ధరించి యున్నయాముసలిది, ఆశబరి యట్లు రాముని యనుజ్ఞనొందినదై, యా ముహూర్తముననే జీర్ణమై యున్నతనశరీరమును విడువఁగోరి, దానిని అగ్నిహోత్రమున వేల్చి, జ్వలించుచున్నయగ్నింబోని దివ్యదేహముం

* ఇందులకు 'జుహావాంచక్రిరే తీర్థం మంత్రవన్మంత్రపూజితమ్' అని మూలము. 'దీనికి మంత్రవంతులగు మునుల మంత్రములచే పాలితమగు తీర్థమును (యజ్ఞమును) గావించిరి. అనఁగా మంత్రవిదులను మున్నిడుకొని మంత్రయుక్తముగా యాగములను గావించిరి' అని మహేశ్వరతీర్థులు.

† దీనివలన ఆచార్యుల కథితమైనప్రదేశము వారిసన్నిధానము లేకుండినపుడును ఉద్దేశ్యమగునని తెలుపఁబడినది.

‡ ఇంతవఱకును 'గుణం ప్రకాశయేద్ధీమాన్' అన్నట్లు ఆచార్యవైభవప్రకటనము కర్తవ్యమనుట సూచితము.

దాల్చి దివ్యలోకము నొందెను. ఆ శబరి, దివ్యాభరణములను దివ్యమాల్యగంధములను, దివ్యాంబరములను దాల్చి మిక్కిలియు ధళధళలాడు మెఱపుఁదీఁగవలె నచ్చటి ప్రదేశమును వెలిఁగించుచు చూచువారి కెంతయుఁ బ్రియముగా చూపట్టుచుండెను. సుకృతాత్ములైనయామహర్షులు మతంగమునిశిష్యులు విహరించుచున్న పుణ్యస్థానమునకు, శబరి యాత్మస్వరూపవిషయ మగు*సమాధి యోగబలంబునం బోయినదయ్యె. ఇది డెబ్బదినాలుగవసర్గము.

✣

రామలక్ష్మణులు పంపాసరస్సునకుఁ బోవుట.

ఆశబరి, నిజతేజమున రాజిలుచు, దివ్యలోకము నొందినంతనే, రాముఁడు తమ్ముం డగులక్ష్మణునితోఁగూడ నాలోచించెను. ధర్మాత్ముఁ డా రాముఁడు మహాత్ములగునమ్మునులప్రభావములను తలఁచి తలఁచి తనకు హితకారియు నేకచిత్తుండు నగులక్ష్మణునిం జూచి 'సౌమ్యా! అద్భుతము లైనపుష్పఫలాదులు అఖిలతీర్థసమాగమము మొదలైనవానిచే మిక్కిలి యాశ్చర్యముగొలుపుచున్నయీ పరమాత్మవిదులయాశ్రమమును జూచితిమి. ఇందు మృగములును పులులును పరస్పరహింసలుమాని యొకటితో నొకటి మచ్చికపడియున్నవి. పలువిధము లయినపులుఁగులును నిందు వెలయుచున్నవి. లక్ష్మణా! ఈ సముద్రము లేడింటితీర్థములందును శాస్త్రోక్తప్రకారమున స్నానము చేసితిమి. పితృతర్పణముగూడఁ గావించితిమి. లక్ష్మణా! అయ్యయశుభములన్నియు నశించినవి. ఇఁక శుభము వాపించినది. అందుచేత, నా హృదయము యథార్థముగ సంతోషము నొందినది. పురుషతిలకా! † శుభమువచ్చునేని యది ముందే మనస్సునందుఁ దోఁచును. అట్లు మిత్రలాభాది శుభములు మనస్సునఁ దోఁచుచున్నది. కావున శీఘ్రమున రమ్ము. కన్నుల కింపుగాఁ జూపట్టుచున్న యాపంపాసరస్సునకుఁ బోవుదము. దానికిసమీపమున ఋశ్యమూకపర్వతము ప్రకాశించుచున్నది. ఆపర్వతమునందే ధర్మాత్ముఁ డగుసూర్యకుమారుఁడు సుగ్రీవుఁడు, వాలిభయమున, వానరవీరులు నలువురతోడుగా, నిత్యము వాసము సేయుచుండును. సౌమ్యా! వానరతిలకుఁ డగుసుగ్రీవునిఁ జూడ వేగిరపడుచున్నాను. నాసీతను వెదకుటయంతయు నా కతనివలననే కదా కావలసియున్నద' అనెను. ధీరుఁ డా రాముఁ డిట్లు చెప్పుచుండఁగా లక్ష్మణుఁ డతనితో 'శీఘ్రముగా నీవురమును బంపాసరస్సు

* ఈ సర్గవృత్తాంతమున, శబరి మతంగశిష్యులచే సమాధి యుక్తశరీరమునొంది గురువు లనుజ్ఞచే త, రాముఁడు వచ్చువఱకుండి, అంతి రాముని యనుజ్ఞ చేతను, తన సమాధిబలము చేతను, తన గురువులు పొందినలోకమును బొందినదని తెలియుచున్నది. స్త్రీలకుఁగూడ విదురాదులకుంబోలె యోగమున కధికారమున్నది. అయితే దాని అంగము లైనయజ్ఞాదికర్మములకు బదులుగా వీరికి గురుశుశ్రూష యున్నదని తెలియునది.

† శుభమగుస్మరణము నాహృదయమందుఁ గలుగుచున్నదని యర్థాంతరము.

నకుఁ బోవుదము. నామనస్సుగూడ పోవలయునని తొందరపడుచున్నది' యనెను. పగవారి నడంచునాభూవిభుఁడు రాముఁడు, అంతలక్ష్మణునితోఁగూడ,ఆయాశ్రమము నుండి వెడలి పంపాసరస్సునకుఁ బోయెను. అంత రామునకు ఆ పుణ్యాసరస్సును, దూరమునఁ గనుపట్టెను. మునులు మొదలైన గొప్పవా రందు వసించుచుండిరి. అందు, నానావిధములైన చెట్లుచేమలు నెరసిబెరసి త్రావందగునట్లు మిక్కిలిచల్లని జలము పాఱుచుండును. మఱియు నది యెఱ్ఱదామరలచేతను ఎఱ్ఱగలువలచేతను ఎఱ్ఱనై, తెల్లకలువతంపరలచే తెల్లనై, నల్లకలువలగుంపులచే నల్లనై, యిట్లు చిత్రకంబళమువలె నానావర్ణములుగలిగి వెలుఁగుచుండును. రాముఁడట్లు పంపాసరస్సును దూరమునఁ దఱిసి, దానిసమీపమున మతంగసరస్సు అని ప్రసిద్ధిగాంచిన యొక మడుఁగునందు స్నానముగావించెను. ఎఱ్ఱదామరలును,కలువలును, తెల్లదామరలును, ఎఱ్ఱగలువలును గలిగి, పూచినమామిడితోఁపులతోఁగూడినదై, నెమిళ్ల కేకలచే బోరుకొనుచున్న పంపాసరస్సు, బొట్టుగుచెట్లు, దానిమ్మచెట్లు, చంద్రచెట్లు, ఏఱుమద్దిచెట్లు, పూచిన గన్నేరుచెట్లు, కమియఁబూచిన సురపొన్నచెట్లు, జాజిపొదరులు, మల్లెతీఁగె గుబురులు, మఱ్ఱిచెట్లు, తినాసపుఁజెట్లు, అశోకపుఁజెట్లు, ఏడాకులయరటులు, మొగలిచెట్లు, పువ్వుగురివెందచెట్లు, మఱియుఁ దక్కినచెట్లచేత, ఆవృతమై నానావిధ భూషణాలంకృతయైననారీమణికైవడి చూపట్టుచుండెను. రామలక్ష్మణు లిట్టు పంపాసరస్సును దవ్వుల చుట్టుఁబట్లనంతయుఁ జూచుచు, అంత దానిని సంబంధించిన యొకవనమును గాంచిరి. అందు పువ్వులువెల్లిగొని నివ్వటిలుచుండెను. అంతటను పెద్దపెద్ద వృక్షములు తద్దయుఁ జూపట్టుచుండెను. అందు చీకుఁగొక్కెరలును, నెమిళ్లును, బెగ్గురులును, చిలుకలు మఱియు నితరములైనపక్షులును కొలకొలగూయుచుండెను. ఇట్లువారల లామహావనమును జూచుచునే వ్యాకులపడక మిక్కిలి యెచ్చరికతో దానిందార్చిపోయిరి. అంతరాముఁడు చల్లనిజలముల కుంకియై తీవి గులుకుచున్న పంపాసరస్సును సమీపించి,యందుతిలకవృక్షములు,అశోకవృక్షములు,పొగడలు, విరిగిచెట్లును మురువుగులుకుచుండఁ గాంచెను. రాముఁడు నానావిధములైనవృక్షములను, వివిధములైనసరస్సులను జూచుచు మదనాగ్నిం బరితపించుచు, పంపాసరస్సును జేరెను. అది, పుష్పితములైనవనములతోఁగూడి,మద్దిచెట్లతోను సంపెంగచెట్లతోనునొప్పుచుండెను. అందు,తుమ్మెదకదుపులు ఎమ్మెలు గులుకుచుఁ దిరుగాడుచుండెను. అది మిక్కిలి సిరిగులుకుచు సాటిలేనికాంతిం దళుకొత్తుచుఁ, బటికముపలె నచ్ఛమై తేటగులుకు నీటితోఁగూడి, మెత్తనియిసుక నెసిసియుండెను ఇట్లు తామరలను ఎఱ్ఱగలువలను చెలువు గులుకుచున్న యాపంపాసరస్సును రాముఁడు చూచి యప్పుడు లక్ష్మణునితో 'ఈసరస్సుతీరమునందే గైరికధాతువులచే నలంకృతమును పవిత్రమునునై వృక్షములు పుష్పించియుండు ఋశ్యమూకపర్వత మున్నదని మున్ను కబంధుఁడు చెప్పినాఁడు. మహాత్ముఁడైనయాఋక్షరజుఁ డనువానరవరుని కుమా

రుఁడును మహావీర్యుఁడు నగుసుగ్రీవుఁడు, ఆ ఋశ్యమూకపర్వతముగం దున్నవాఁడు. పురుషతిలకా! నీవు వానరప్రభుం డగుసుగ్రీవునొద్దకుఁ బొమ్ము' అని చెప్పి మరల సత్యపరాక్రముఁ డగు నాసౌమిత్రితో 'రాజ్యముపోఁగొట్టుకొంటిని. దానిచే దుఃఖముల పాలంబడితిని. ఆ దుఃఖముల నన్నిటిని సీతయందు మనస్సు తగిలియుండుటచే మరపుకొనియుంటిని. ఇఁక నట్టిసీతనువిడిచి, లక్ష్మణా! యెట్లు ప్రాణములు పెట్టుకొనియుండఁగలను?'అనెను. రాముఁడు, మన్మథపీడం జెంది దుఃఖమున నవయవము లెల్ల విరవిర వ్రాలఁ జిక్కువడి స్రుక్కుచు, తానాడుమాటలఁ బాటించి వినుచున్నలక్ష్మణునిం జూచి యిట్లు చెప్పి,యంత మనోహరం బైనపంపాసరోవరంబునకు జలకమాడంబోయెను. అంత నారాముఁడు,బహుదూరమునుండి వచ్చి, దీర్ఘ మైనమార్గముగలదియు తెరువరులకుఁ బ్రతికూలము నగుమరుకాంతార మైనకబంధవనమును,అనేకవిఘ్నముల నుత్తరించుచుఁ గ్రమమునఁ గడచి, చూచుట కింపైన యడవులును, పలువిధము లైనపెక్కు పక్షిసమూహములును గలిగి వెలుఁగుచున్నపంపాసరస్సుం గాంచినవాఁడయ్యె. ఇది డెబ్బదియేనవసర్గము.

ఆ ర ణ్య కాం డ ము

స మా ప్త ము.

శ్రీరామార్పణమస్తు.

